ఆంధ్ర వాఙ్మయమున

# చారిత్రక కావ్యములు

(17 వ శతాబ్దం వరకు)

డాక్టర్ బి. అరుణకుమారి, ఎం.ఏ., పిహెచ్.డి.






ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్
వాల్తేరు
విశాఖపట్టణం 530 003

# అంకితం

అమ్మకు, జన్మనిచ్చి
పెంచిన పట్టుగొమ్మ
శ్రీమతి వెంకటరత్నమ్మకు—

నాన్నకు, అక్షరములు
నేర్పి తీర్చి దిద్దిన
శ్రీ బాల సుబ్బారావునకు—

ఈ చారిత్రక కావ్య రసా
స్వాదనా జనిత సుమాన్ని
భక్తితో సమర్పిస్తున్నా.

# తొలిపలుకులు

ఆంధ్ర వాఙ్మయము చరిత్ర రచనకు ఉపయుక్తము. కీర్తిశేషులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేలటూరి వేంకటరమణయ్యగారు వారి రచనలతో తెలుగు వాఙ్మయమున చరిత్ర రచనను బహుళముగా ప్రచారములోనికి తీసుకొనివచ్చిరి. డాక్టర్ అరుణకుమారి వ్రాసిన చారిత్రక కావ్యముల సమీక్షా గ్రంథము ప్రశంసనీయ మైన కృషి.

ప్రారంభమున గ్రంథకర్త చరిత్రస్వరూపమును గూర్చి చర్చించి, చారిత్రక కావ్య ప్రయోజనమును స్పష్టముచేసిరి. చరిత్రస్వరూపము, కావ్యస్వరూపము వేరైనను చారిత్రక కావ్యములలో కవి ప్రామాణిక చారిత్రక విషయములను ఆధా రముగా చేసికొని కావ్యరచన చేయును. ప్రాచీన భారతదేశ చరిత్ర వ్రాయుటకు బాణ భట్టుని హర్ష చరిత్ర, కల్హణుని కాశ్మీరదేశ చరిత్ర ఉపయోగపడును. బాణ భట్టుని హర్ష చరిత్రలో చాల కట్టు కథలున్నను హర్షుని జీవిత చరిత్ర వ్రాయుటకు అది మిక్కిలి ఉపయోగపడు గ్రంథము. ఫణిక్కర్ మహాశయుడు తన భారతదేశ చరిత్ర సమీక్ష అను గ్రంథములో కావ్యరూపమైన ఆధారముల విశిష్టతను ప్రస్ఫుట ముగ చూపినాడు. ఈ విధముగనే చారిత్రకాంశములున్న కావ్యములను పరిశో ధించిన ఈ పుస్తకము ఆంధ్రదేశ చరిత్ర రచనకు ఉపయోగపడును.

ప్రప్రథమమున గ్రంథకర్త 'వల్లభాభ్యుదయము' అను కావ్యమును ఉదహ రించినారు. ఈ కావ్యము శ్రీకాకుళక్షేత్ర ప్రాశస్త్యమునేకాక పెక్కు చారిత్రకాంశము లను గూడ వెల్లడి చేయుచున్నది. అటులనే పోశెట్టి లింగనకవి వ్రాసిన 'నవచోళ చరిత్ర' పదకొండవ శతాబ్దములోని కాలపరిస్థితులను, చోళుల చరిత్రను తెలియ చేయుచున్నది. 'ప్రతాప చరిత్ర,' 'శ్రీ సిద్ధేశ్వర చరిత్రము'లు ప్రతాపరుద్రుని జీవిత విశేషములతోపాటు కాకతీయ రాజుల చరిత్రను తెలుపుచున్నవి. ఈ రెండు గ్రంథ ములలోను ప్రతాపరుద్రుని ఆస్థానములోని నానావర్ణములవారి సంఖ్య, ఆదాయ వ్యయములు, ఆస్థానమునందలి కవిపండితుల సంఖ్య, రాజోద్యోగుల వివరములు మొదలగు అంశములుకూడ ప్రస్తావింపబడినవి. ఇవి చరిత్ర రచనకు ఎంతో ఉప యోగించును.

'పలనాటి వీర చరిత్ర' ఆంధ్రులకు సుపరిచితమైనది. ఈ గ్రంథము మాండ

లిక రాజులమధ్య చెలరేగిన ముసలమును వర్ణించుటయేకాక ఆనాటి సాంఘిక పరిస్థితులను తెలుపుచున్నది. పన్నెండవ శతాబ్దములోని స్త్రీ పురుష వేషభూషణాలంకృత పద్ధతి, యుద్ధసంరంభ పద్ధతి, వినోదములు మొదలగునవి ప్రస్తావింపబడినవి. 13 వ శతాబ్దమునకు చెందిన 'కాటమరాజు కథ' అనెడు గ్రంథము; 15 వ శతాబ్దమునకు చెందిన వల్లభరాయని 'క్రీడాభిరామము' అయాకాలములనాటి రాజకీయ సాంఘిక స్థితిగతులకు అద్దము పట్టుచున్నవి.

విజయనగరాధీశుడైన శ్రీకృష్ణదేవరాయల కాలములో ఆంధ్ర వాఙ్మయము బహురీతుల పరిఢవిల్లినది. 'రాయవాచకము' లోను, 'కృష్ణరాయవిజయము'లోను, విజయనగర చరిత్ర రాజకీయ పరిస్థితులు ప్రస్ఫుటింపబడినవి. 'రామరాజీయము' నందు అరవీటి వంశజుల చరిత్ర, 'రఘునాథాభ్యుదయము'లో నాయక రాజుల చరిత్ర పరిశీలింపబడినవి.

ఈ గ్రంథములో డాక్టర్ అరుణకుమారి కడుంగడు ప్రశంసనీయములగు ఎన్నియో విషయములను చర్చించిరి. ఈ గ్రంథము ఇటు చరిత్రకు, అటు వాఙ్మయమునకు మిక్కిలి ఉపయోగపడుననుటకు సందియములేదు.

వాల్తేరు
రిపబ్లిక్ డే, 78

యం. ఆర్. అప్పారావు
వైస్-ఛాన్సలర్
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు

# కృతజ్ఞతలు

ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములన్న అంశముపై పరిశోధనచేయ నాకు అవకాశము కల్పించి, ప్రోత్సహించి, పర్యవేక్షించి ఆశీస్సులందించిన పూజ్యులు ప్రొఫెసర్ కె.వి.ఆర్. నరసింహము గారికి హృదయపూర్వక నమోవాకములు —

అడిగినంతనే అత్యాదరముతో పసిడిపలుకుల తొలిపలుకులు పలికిన సహృదయులు, మాన్యులు, ఆంధ్రవిశ్వవిద్యాలయ కులపతులు శ్రీ యం.ఆర్. అప్పారావుగారికి కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలులు —

పరిశోధనా వ్యాసంగములో విషయ సేకరణమునకు తోడ్పడిన హైదరాబాదు నందలి ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయమువారికి, సిటీసెంట్రల్ లైబ్రరీ, స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము వారికి; మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ వారికి; ప్రత్యేకించి వి.యస్. కృష్ణ మెమోరియల్ లైబ్రరీ (వాల్తేరు) వారికి కృతజ్ఞతలు—

ఈ సిద్ధాంత వ్యాసమును పరీక్షించి పిహెచ్.డి. పట్టముతోపాటు ముద్రణ కాలమున చేయవలసిన సవరణలకు సలహాలనిచ్చిన ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య బి. రామరాజు గారికి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య జి.ఎన్. రెడ్డిగారికి, ప్రపంచ తెలుగు సంస్థాధిపతులు డాక్టర్ పి.ఎస్.ఆర్. అప్పారావుగారికి నమస్కారములు —

ముద్రణమునకు ముందు ఈ గ్రంథమును ఆమూలాగ్రముగ చదివి అక్కడక్కడ సవరణలు చేసిన డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి నమస్సులు—

గ్రంథ ప్రచురణార్థము వలసిన ధనమును యు.జి.సి. ఫండ్స్ నుండి సమకూర్చిన నాటి బోర్డ్ ఆఫ్ రీసెర్చ్ స్టడీస్ అధ్యక్షులు, నేటి విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘ ఉపాధ్యక్షులునగు ప్రొఫెసర్ బి. రామచంద్రరావుగారికి, గ్రంథమును ప్రచురింప వలసినదిగా సిఫారసు చేసిన డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారికి, కళాప్రపూర్ణ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి, ప్రొఫెసర్ కె. రామకృష్ణరావుగారికి అభివాదములు—

గ్రంథ ముద్రణమున తగు సలహాల నిచ్చి తోడ్పడిన ఆంధ్ర విశ్వవిద్యాలయ ముద్రణాలయాధిపతులు డాక్టర్. సి. బొర్రేశ్వర రావుగారికి అభినందనలు —

ఈ గ్రంథ ముద్రణమున తొలినుండి తుదివరకు బరువు బాధ్యతలను సహృదయముతో స్వీకరించి, ఎడనెడ వలయు సలహాలనిచ్చి, చక్కని సవరణలు చేసి ఓపికతో తుదిమెరుగులు దిద్ది తీర్చిన డాక్టర్ వి. ఆర్. రావుగారికి కృతజ్ఞతాభివాదములు —

సవినయంగా సమర్పిస్తున్నాను.

వాల్తేరు
**26–1–1978**

అరుణకుమారి

# సూచిక

# ఆముఖము

ఆంధ్ర వాఙ్మయమున వివిధములైన ప్రక్రియలున్నవి. అందు చారిత్రక కావ్య రచన మొకటి. ఏదేని జాతి వికాసమును తెలిసికొనుటకు ఆ జాతి చరిత్ర ప్రధాన సాధనము. కాని చరిత్ర రచన కుపకరించు శాసనములు, నాణెములు, పురాతన వస్తు సంచయము మున్నగు వానియందు అగ్రగణ్యమైనది సాహిత్యము.

యథార్థ సంఘటనలు చరిత్రకు అలంబనములు. సాహిత్య వ్యాసంగమునకు అలంబనము ఊహ. చరిత్ర కాలగత జీవనమును వ్యక్తీకరించును. సాహిత్యము జీవిత ప్రతిబింబమును చిత్రీకరించును. గతించిన వాస్తవములను ఆధారసహిత ముగ పేర్కొనుటయే చరిత్ర పరమార్థము. జరిగిపోయినదానినేగాక, ఏది జరుగు టకు అవకాశము కలదో దానిని సైతము ఊహించి, ఆధారరహితముగ అలంకార సుందరముగ చెప్పునది సాహిత్యము.

ఒకజాతియొక్కగాని, సంఘముయొక్కగాని సామూహికానుభవముతో లేదా ప్రఖ్యాతుడైన వ్యక్తియొక్క స్వీయానుభవముతో సమన్వయముగలది చారిత్రక సత్యము. అది వస్తుగతమైనట్టిది. కాగా సాహిత్యానుభవము రసాత్మకమైనది. అది ఊహాజనిత సౌందర్యము – కేవలము ఊహయనుటకును వీలులేదు. అట్టి ఊహ యందును సాంఘిక జీవనము ప్రతిఫలించుచునేయుండును. ఒకవిధముగ చరి త్రయు ఊహాజనితమే. కాని భౌతికాధార సహితమైనదగుటచే యదార్థమును గోచ రింప చేయును. కొంత పరస్పర విరుద్ధములుగ కన్పట్టినప్పటికిని, యథార్థ విషయ ముల చెప్పుతరి, భౌతికాధారములు లేని పట్టున, చరిత్రకు సాహిత్యమునకు అవినా భావ సంబంధము కన్పట్టును. ఊహ ప్రధానాంశమైనను సత్యమైన జీవన విధాన స్ఫురణయే సాహిత్యమునకు నేపథ్యరంగము. కనుక సమకాలీన జనజీవన విధా నమును, స్థితిగతులను తెలిసికొనుటకు సాహిత్యము తోడ్పడుననుట నిర్వివాదాం శము. చరిత్ర ప్రయోజన మిదియేకదా!

ఆయాకాలములందలి ప్రజాజీవన విధానములను ఎత్తి చెప్పుటయందు చరిత్ర కు, సాహిత్యమునకు ఉమ్మడి భూమిక ఉన్నది. చారిత్రక కావ్యములందుగల విశేష మిదియే. తెలుగుల సంస్కృతి మిక్కిలి ఉత్తమమైనదే కాక, కడు ప్రాచీనమైనది. కాలానుసారముగ వెలువడిన సాహిత్యమున్నదిగాని చరిత్రలు చెప్పుకొనదగినంతగ

లేవు. అందువలన చారిత్రక కావ్యములకొక విశిష్టత అబ్బినది. చారిత్రక కావ్య రచన మొక ప్రక్రియయై భాసించినది.

ఆంధ్ర వాఙ్మయమున నేటివరకు చారిత్రక కావ్యములు లెక్కకు మిక్కిలిగ నున్నవి. పద్యము, గద్యము, ద్విపద, యక్షగానము, ఖండకావ్యము మున్నగు ప్రక్రియలందు పెక్కు చారిత్రక కావ్యములు కలవు. కనుక ఈ సిద్ధాంత వ్యాసమున క్రీ.శ. 17 వ శతాబ్దము వరకు గల చారిత్రక కావ్యములను మాత్రమే పరిశీలించుట జరిగినది. ఇందు గద్యాత్మకములు, గద్యపద్యాత్మకములు, ద్విపదలు, యక్షగానములు కలవు. వీనిలో ఖ్యాతి గాంచిన రాజుల, వీరుల, మతప్రవక్తల, భగవద్భక్తుల, రచయితల, మహాపురుషుల చరిత్రములేకాక ఆయాకాలము లందలి సాంఘిక జీవనమును తెలుపు కావ్యములున్నవి.

పరిశోధనా సౌలభ్యము కొరకు గ్రంథములన్నింటిని పన్నెండు ప్రకరణములుగ విభజించుట జరిగినది. ప్రథమ ప్రకరణమున చారిత్రక కావ్య స్వరూప స్వభావములు, దాని ప్రయోజనము, సంస్కృత వాఙ్మయమున గల చారిత్రక కావ్యములు మొదలగు అంశములు చర్చింపబడినవి. తరువాత ప్రకరణములు : 2. ఆంధ్ర మహావిష్ణువు అభ్యుదయమును వర్ణించు గాథలు. 3. శివభక్తులు, పెక్కు దేవాలయ నిర్మాతలునైన చోళుల కథలు. 4. ప్రథమాంధ్ర సామ్రాజ్య నిర్మాతలైన కాకతీయుల వంశ చరిత్ర. 5. కాకతీయుల కాలముననే రాజ్యపాలనమునకై కలహించుకొనిన పలనాటివీరుల వీరగాథ. 6. పుల్లరి కొరకు చోళరాజు నెదిరించిపోరిన కాటమరాజు కథ. 7. సాహితీ సమరాంగణ చక్రవర్తి, విజయనగర సామ్రాజ్య సార్వభౌముడునైన శ్రీకృష్ణదేవరాయలు. 8. ఆ తదుపరి విజయనగర వైభవమునకు తోడ్పడిన అరవీటి రాజుల వంశ చరిత్ర. 9. విజయనగర సామ్రాజ్య ప్రాభవ పతనానంతరము ఆంధ్ర సాహిత్య సరస్వతీ మంజుల మంజీర రవములను వినిపించిన తంజావుర ఆంధ్రనాయక రాజుల గాథలు. 10. శివభక్తులై ఆంధ్రదేశమున వీరశైవమును నెలకొల్పిన మతప్రవక్తల కథలు. 11. పదకవితా పితామహుడగు అన్నమాచార్యుని జీవిత చరిత్ర. 12. క్రీ.శ. 15 వ శతాబ్దమునాటి ఓరుగంటి ప్రజాజీవనమునకు అద్దము పట్టిన సాంఘిక చరిత్ర.

చరిత్ర గ్రంథముల తోడ్పాటున చారిత్రకాంశములు చర్చింపబడినవి. చారిత్రక కావ్యములందు ముఖ్యముగ పరిశీలింపదగినది చారిత్రక ప్రామాణికత్వము, కావ్య ప్రామాణికత్వమునూ పరిశీలింపదగినదియే. రెండింటి మేలుకలయికయే చారిత్రక కావ్యమగుటచే, చారిత్రక ప్రామాణికత్వముతోపాటు కావ్య ప్రామాణికత్వమును పరిశీలింపవలయును. కాని ఆంధ్ర వాఙ్మయమునగల చారిత్రక కావ్యములు, ఇటు శాస్త్రీయముగ చరిత్రను తెలుపలేదు, అటు సంపూర్ణమగు కావ్యలక్షణములను కల్గి ఉండలేదు. కొంతవరకు ప్రబంధలక్షణములతో విరాజిల్లుచున్నదొక్క కృష్ణరాయ విజయమే. కనుక యిందు చారిత్రకాంశములకే ప్రాముఖ్యమునిచ్చి, ఆయా

కావ్యములందలి రచనా విశేషములను తెలుపుట జరిగినది.

ఇంక ఆయా గ్రంథకర్తల జీవితములను గూర్చి మనకు పెక్కు సమగ్రమైన చరిత్రలు ఉండుటచే, వారినిగూర్చి రేఖామాత్రముగ మాత్రమే తెలిపితిని.

క్రీ.శ. 17 వ శతాబ్దమువరకు గల చారిత్రక కావ్యములలో శ్రీనాథుని కాటమ రాజు కథ, రఘునాథనాయకుని అచ్యుతాభ్యుదయము, రంగాజమ్మ వ్రాసిన రఘు నాథాభ్యుదయ, విజయరాఘవాభ్యుదయములు అలభ్యములు కావున ఈ గ్రంథ మున వానిని పరిశీలించుట సాధ్యముకాలేదు.

చారిత్రక కావ్యములపై ఇంతవరకు సమగ్రమైన పరిశోధన జరుగలేదనుట సాహసము కానేరదు. అటు చరిత్రాభిలాషులకు, ఇటు సాహిత్య ప్రియులకు ఉపకరించెడు ఈ కావ్యముల పరిశోధనలో లబ్ధమైన సామగ్రియొక్క విశ్లేషణా ఫలితముగ కొన్ని అభిప్రాయములను ప్రకటించితిని. ఆయా సందర్భముల నేను చేసిన నిర్ణయములు ఖరాఖండీ కాకపోవచ్చును. కాని అవి భావిపరిశోధకులకు ఉపయుక్తములగునని ఆశ.

ఇంక రచనాపద్ధతిలో, పాఠకునికి సుబోధకమగుటయే లక్ష్యముగ విసంధు లను పాటించితిని అరసున్నలను వదలితిని. గ్రాంథికముకాదు. కేవలం వ్యావహారి కమూ కాదు. మధ్యస్థముగ వాక్య నిర్మాణము సాగినది. ఎడనెడ దొరలిన తప్పు లను సహృదయులు మన్నింతురుగాక.

**అరుణకుమారి**

# 1. చరిత్ర—చారిత్రక కావ్యము

చారిత్రక కావ్యమనగానేమి? అందెట్టి ఇతివృత్తముండవలెను అను ప్రశ్నలకు సమాధానము చెప్పుకొనుటకు ముందుగ 'చరిత్ర' అనగా నేమియో చారిత్రక పరిజ్ఞానమునకు అవసరమగు సాధనసామగ్రి ఏదియో, భారతదేశమున చరిత్రకు గల ప్రాధాన్యత ఎట్టిదో, చరిత్ర యొక్క ప్రాముఖ్యమేమియో తెలిసికొనుట యుక్తము.

'చరిత్ర' అను పదమునకు ప్రాచ్యులు పాశ్చాత్యులు పలురకములైన అభిప్రాయములను, అర్థములను తెలిపిరి.

మనము 'చరిత్ర' అను దానిని ఆంగ్లమున హిస్టరి (History) అందురు (చరిత్రనే ఇతిహాసమని ప్రాచీనులనెడి వారు). ఈ 'హిస్టరి' అనుపదము గ్రీకు పదమైన 'historia' (a searching to find out) అను పదమునుండి వచ్చినది.

History అను పదమునకు "A narrative consisting of a continuous methodical record in order of time, of important or public events especially those connected with a particular country, people, individual, etc., the formal record of the past."[1] అని Oxford English Dictionary, మరియు,

"The term History, in popular usage has been applied to two somewhat different concepts. It is often used to designate the sum total of human activities and it is when used in this sense that one often hears the mark at a particular active or critical period in human events that "now history is being made." A more common usage is that which regards history as the record of events rather than as the events themselves. In this latter generally accepted connotation given to the term history, two definitions may be offered. In an objective sense

1. Oxford English Dictionary, Vol. I.

history is to use the word of Professor Robinson "all we know about everything man has ever done or thought or hoped or felt." Subjectively or Psychologically expressed, history may be regarded as a record of all that has occurred within the realm of human consciouness."[2] అని the Encyclopaedia Americana, పలురకములైన అభిప్రాయములను తెలుపుచున్నవి.

"History means a written record of significant past events and happenings" అని కొందరు చరిత్రకారుల అభిప్రాయము.

పదునెనిమిదవ శతాబ్దపు చివరి భాగమునకు చెందిన Freeman అను చరిత్రకారుడు "History is past politics and politics is present history" అని తెలిపెను.

"It is a continuous process of interaction between the historian and his facts and unending dialogue between the present and past."[3] అని చరిత్రను గూర్చి C. H. Carr అభిప్రాయము. అంతేకాక చరిత్ర అనగా మానవునిచే వ్రాయబడిన మానవ చరిత్ర అని తెలిపెను. "History is a great moral teacher" అని Lord Acton అభిప్రాయము. ఇవి కొందరు పాశ్చాత్య చరిత్రకారులు వెలిబుచ్చిన అభిప్రాయములు.

చరిత్ర రచనమునకు భారతదేశమునందు ఎట్టి స్థానముకలదో పరిశీలింతము.

## భారత దేశము—చరిత్ర

పూర్వము మన దేశమున చరిత్రను ఇతిహాసమనెడి వారు. 'ఇతి-హా-అస' అనగా 'ఇట్లుండెనట' అని అర్థము. "ఇతిహైవమాసీదితియ ఉచ్యతే ఇతిహాసః" అనగా ఇట్లు జరిగినది అని చెప్పునది ఇతిహాసము అని అర్థము. "ఇట్లు జరిగినదట యనుచు వృద్ధ పరంపరలో ఒకరికొకరు ఉపదేశించుట, 'ఇతిహ, ఐతిహ్యము' అని చెప్పబడును. ఆ ఉపదేశము ననుసరించి చెప్పబడిన కథయే ఇతిహాసము"[4] అని తెలియుచున్నది. ఇతిహాస లక్షణమును

"ధర్మార్థకామమోక్షాణాముపదేశ సమన్వితమ్ పూర్వ వృత్తకథాయుక్తమితిహాసం ప్రచక్షత్"[5] అని వివరించిరి. అనగా ధర్మార్థకామమోక్షముల ఉపదేశముతోను, పూర్వము జరిగిన చరిత్రతోను కూడుకొని యున్నది ఇతిహాసమని అర్థము. "ఇతిహాసములు మానవుల అంతర జీవితమునకు సంబంధించిన హృదయ

2. The Encyclopaedia Americana, Vol. XIV, p. 205.
3. E.H. Carr, What is History, p. 37.
4. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, p. 92.
5. రాజశేఖరుడు, కావ్యమీమాంస, ద్వితీయాధ్యాయము, శ్లో. 3.

భావములను కాక బాహ్య జీవితమును ఎక్కువగా వర్ణించును. ఇందు ప్రాచీన జాతీయ జీవనము సువ్యక్తమగు చుండును"[6] అని మోలియర్ విలియమ్స్ ఇతిహాస లక్షణములను తెలిపెను. కాని "శాస్త్రేశబ్దప్రధానత్వం ఇతిహాసే యనిష్ఠతా అభిదాయా ప్రధానత్వాత్ కావ్యంతాభ్యావిబధ్యతే"[7] అని అగ్నిపురాణము ఇతిహాసము అర్థప్రధానమైనదని తెలుపుచున్నది.

వంశాను చరితము యొక్క కాలక్రమానుసారి కథనమే ఇతిహాసమని మన పూర్వుల అభిప్రాయము.

"పరిక్రియాపురాకల్ప ఇతిహాసగతిర్ద్విధాస్యాద్యేకనాయకా పుర్వాద్వితీయా బహు నాయకా"[8]

అని ఇతిహాసము, 'ఇతిహాసము,' 'పరిక్రియ' అని రెండు విధములని; 'ఇతిహాసము' ఏకనాయకాశ్రయము, 'పరిక్రియ' బహు నాయకాశ్రయమని, రాజశేఖరుడు 'కావ్యమీమాంస' యందు వివరించెను.

ఉదహరింపబడిన ప్రాచ్య, పాశ్చాత్య నిర్వచనముల వలన ఒక దేశమునకో, ఒక జాతికో, సంఘమునకో, రాజవంశమునకో, వ్యక్తికో, సంఘటనకో సంబంధించిన యథార్థ విషయ సంగ్రహమే చరిత్ర అని స్పష్టమగుచున్నది. మానవుని జీవితమున జరిగెడు ప్రతి అంశము చరిత్రయని స్పష్టపడుచున్నది. ఈ సిద్ధాంతము ప్రకారము మనము ప్రతిక్షణము చేయు ప్రతి పని చరిత్రయగును. ఇట్టి ప్రతి సంఘటన గూర్చి వ్రాసికొనుచుపోయినచో ఒక వ్యక్తి చరిత్రయే కొన్నివేల పుటల గ్రంథమగును. నిజమునకు ప్రతి సంఘటన చరిత్రకు ఇతివృత్తమే. ఇందసత్యమేమియు లేదు. కాని చరిత్రకారులెవ్వరు ప్రపంచమునందలి ప్రతివ్యక్తి జీవితములోని ప్రతి నిముషము జరుగు ప్రతి సంఘటనను చరిత్రగ గ్రహించుచున్నటులలేదు. ముఖ్యమైన సంఘటనకు మాత్రమే ప్రాధాన్యత నిచ్చుచున్నారు. "To Preserve the memory and propagate the knowledge of glorious deeds, or of events, which were of importance to a man, a family, or a people; such as was the aim of history in the time of Thucydides and Livy."[9] అను అంశము వలన ప్రధానమైన సంఘటనలే చరిత్రకు ప్రాణము వంటివని స్పష్టమగుచున్నది.

కాని క్రమక్రమముగా 'చరిత్ర' అనగా, రాజులకు, రాణులకు, రాజ్యములకు సంబంధించిన అంశముగా మారినది. పెక్కు చరిత్ర గ్రంథములు రాజులకు వారి నడుమ జరిగిన యుద్ధములకు సంబంధించిన విషయములే ఇతివృత్త

6. విజ్ఞాన సర్వస్వము, p. 205.
7. అగ్ని పురాణము, శ్లో. 2, p. 469.
8. రాజశేఖరుడు, కావ్యమీమాంస, ద్వి. ఆ., శ్లో. 3.
9. Galbraith V.H., An Introduction to the Study of History, p. 292.

ముగా నున్నవి. కేవలము ఈ అంశములతోనే చరిత్ర ఆగిపోవుటకు వీలులేదు. అటులైన అది సమగ్రమగు చరిత్ర కానేరదు. చరిత్ర యందు చేర్చు విషయములకు పరిమితి ఉండరాదు. "మానవ సాంఘిక జీవితమునకు సంబంధించిన అన్ని విషయములను కథగా కూర్చి సాగించిన రచనయే చరిత్ర" అని అరిస్టాటిల్ అభిప్రాయము. మానవుల జీవితవిధానము, సాధించిన ఘనకార్యములు, విజయములు, ఆశయములు, సంస్కృతి, మతము మొదలగు అన్ని విషయములు చరిత్రలో చేర్చవలసిన అంశములే. కాని వీటికి ఒక ప్రామాణిక స్థితి ఉండవలెను. యథార్థములని నిరూపింపబడవలెను. కల్పిత కథలు, సంఘటనలు చరిత్రకావు. కాని పెక్కు చరిత్ర గ్రంథములందు రాజులు, రాణులు, నాయికా నాయకులుగా కానిపించుచున్నారు. వారి జీవితములందలి సంఘటనలే చరిత్ర గ్రంథములందు కన్పడుచున్నవి. కాని రాజకీయ సంఘటనలతోపాటు, ప్రజల జీవిత విధానము, సాంఘిక చరిత్రకూడ సమగ్రముగ రచించినపుడే పరిపూర్ణమగు చరిత్ర గ్రంథమగును.

చరిత్ర ప్రాముఖ్యము :

ప్రతి వ్యక్తికి తనకు పూర్వమేమి జరిగినదో తెలిసికొనవలెనను కుతూహలముండుట సహజము. తన పూర్వు లెట్టివారో, వారెట్టి ఘనకార్యములను చేసిరో, తెలిసికొనుటకు ప్రతివ్యక్తి కోరుకొనును. మానవుని అభివృద్ధికి విజ్ఞానము ముఖ్యాధారము. ఈ విజ్ఞానమును కాపాడు కొనుటకు మానవునకు రెండు సాధనములున్నవి. మొదటిది మనస్సు. రెండవది భాష. ప్రతి విషయమును మనస్సున పదిలపరచుకొని, వివేచనచేసి మానవుడు ముందడుగు వేయుచున్నాడు. తాను తెలిసికొనిన విషయములను తన సంతతికి తెలియచేసి, వారిని వివేక వంతులను చేయుచున్నాడు. ఇది యుగయుగముల నుండి క్రమముగ జరుగుచున్న విషయము. ఈ విజ్ఞతలోనే మానవుడు ప్రకృతితో పోరాడి, తనకు అనుకూలముగ మార్చుకొని, తన మనుగడకు మార్గము నేర్పరచుకొనుచున్నాడు. ఫలితమును పొందుచున్నాడు. ప్రకృతితో పోరాడి సాధించిన తరువాత మానవునితో పోరాడుచున్నాడు. సాటి మానవునితో కలహించుట వింతయనిపించును. కాని అది సత్యము. మానవునందలి అహము, స్వార్థము, సుఖసంపాదనేచ్ఛ, ధనకాంక్ష, రాజ్యకాంక్ష, పదవీవ్యామోహమీ కలహమునకు కారణము. ఇదంతయు చరిత్ర. ఈ విషయములను చూచిన మానవ సంఘ మెప్పుడు యుద్ధరంగమేనా అనిపించును. కాని మానవుడు పోరాడనుగలడు. శాంతియుతముగ సాటిమానవునితో సహజీవనము చేయనుగలడు. అభ్యుదయమును సాధించి నాగరకతా శిఖరారోహణమును చేయగలడు. ఇదియే మానవుని ప్రతిభ. ప్రత్యేకత. ఇట్టి పరంపరాగత విషయములను తెలియజేసి మనలను విజ్ఞానవంతులను చేయుటయే చరిత్రయొక్క ముఖ్యోద్దేశము. ఈ పరంపరాగత విజ్ఞానమే మానవుని యొక్క సంస్కృతి చరిత్రయందలి మొదటి మెట్టు. ఈ విషయములను తెలిసి

కొనిన మనకు చరిత్ర యొక్క ప్రాముఖ్యమర్థమగును.

చరిత్రయొక్క ప్రాముఖ్యమును "The truth about the past if taught and read with broad human sympathy can give a noble education to the mind of the student not only in politics, but in all kinds of civic and social relationships; and even in the domain of personal, religious, and ethical ideals."[10]

తన పూర్వుల జీవిత విధానమును అవగాహన చేసికొని. అందలి లోపాది కములను సరిదిద్దుకొని తన భావి జీవితపథమును సరిదిద్దుకొని అభివృద్ధిపథము నందు ముందంజ వేయుటకు చరిత్ర సాధన మగుచున్నది. మానవుడు ప్రగతి పథమునందు ముందడుగువేసి నాగరికతా శిఖరములను అధిరోహించుటకు తోడ్పడు కరదీపిక చరిత్ర.

క్రీ.శ. 17వ శతాబ్దమునకు చెందిన ఒక జర్మన్ చరిత్రకారుడు "History is that which teaches the reader what things in life are useful and be followed and to be avoided" అని చరిత్ర వలన కలుగు లాభము లను తెలియచేసెను.

"Histories make man wise"[11] అని Baccon, "Let a country lose its freedom and not lose its history for the consciousness of the past greatness will encourage a nation to win back its freedom" అని గాంధి, "Let my son read history, it is the only Philosophy in the World" అని Nepolean, చరిత్రను గూర్చిన అమూల్య మైన అభిప్రాయములను వెలిబుచ్చిరి.

## భారతదేశము—చరిత్ర రచన

పాశ్చాత్యదేశములకును, ప్రాచ్యదేశములకును తక్కిన అన్ని విషయములందు వలెనే చరిత్రరచనా విషయము నందును భిన్నాభిప్రాయము కలదు. పాశ్చాత్యులకు చరిత్ర రచనమనగా – జననవయః ప్రాదుర్భావ మరణాది కాలములను తిథివారాది సంఖ్యానిర్దేశములతోను, ప్రణాళికా ప్రకారముగా, రాజకీయ, సాంఘిక మత విజ్ఞాన విషయములను వివరించుట. కాని ప్రాచ్యహృదయ మాముష్మిక వ్యగ్రమగుటచే ఐహిక విషయములు ప్రాముఖ్యమును పొందలేక పోయినవి. అయినప్పటికీ మనకు ప్రాచీనకాలమునుండి చరిత్ర రచన జరుగుచునేయున్నది.

మన దేశమున చరిత్ర రచన విషయమున భిన్నమైన అభిప్రాయములు గలవు.

10. G.M. Trevelyan, Present Position of History, p. 148.
11. Advanced English Essays, p. 104.

ప్రాచీన కాలమున భారతీయులకు చరిత్రయందాసక్తి లేదనియు, అర్వాచీన కాలమునసే అసక్తి జనించినదనియు కొందరి అభిప్రాయము: "భరత ఖండమున చరిత్ర రచన గడునర్వాచీన కాలమున నారంభమైనది. సకలశాస్త్రములను, విద్యలను, పరిశోధించి గ్రంథములను, రచించిన మన పూర్వీకు లేలనో చరిత్ర రచన దలపెట్టరైరి. సంస్కృత వాఙ్మయమును గాలించి వెదకినను కల్హణ విరచిత రాజతరంగిణి తప్ప చరిత్ర గ్రంథ మొక్కటియేనియు గానరాదు" అన్నది నేలటూరి వెంకట రమణయ్యగారి అభిప్రాయము. మన ప్రాచీనులకు చరిత్ర రచన యందాసక్తి లేదని తెల్పుచు మరల చరిత్ర గ్రంథములు లేకపోయినంత మాత్రమున భరత ఖండమున జరిత్రయేలేదని చెప్పట తగదు"[12] అని మరల చెప్పిరి.

ఆంధ్రుల చరిత్ర—సంస్కృతి అను గ్రంథము "చరిత్ర వ్రాయవలెనను ఉద్దేశము ఈనాడు క్రొత్తగా పుట్టినదికాదు. భారతదేశములోకూడ అనాది నుండియు చరిత్ర ప్రాముఖ్యము గుర్తింపబడియేయున్నది"[13] అని ప్రాచీన భారతీయులకు చరిత్ర యందాసక్తి కలదను అంశమును విశదీకరించుచున్నది.

"నేడు కేవల చరిత్ర గ్రంథములు సంస్కృతమున స్వల్ప సంఖ్యాకములుగ నున్నంత మాత్రమున మన పూర్వులు చరిత్ర పట్ల నశ్రద్ధతో నుండిరనుటకు వీలులేదు. ఏలన, పూర్వము మన దేశమున ననేకములగు చరిత్ర గ్రంథములు బయలు దేరినవనియు నవి యిప్పుడు నశించిన వనియు నమ్మటకు మనకు పెక్కు ఆధారములున్నవి"[14] అని ఒక రచయిత అభిప్రాయము. ఈ విషయ స్పష్టీకరణ కొరకు, క్రీ.శ. 400 ప్రాంతీయుడయిన కాళిదాసు (క్రీ.పూ. 2వ శతాబ్దము) శృంగవంశీయుడయిన అగ్నిమిత్రుని నాయకుని జేసి మాళవికాగ్ని మిత్రమును రచించుటచే, కాళిదాసు కాలమునకు చరిత్ర గ్రంథములు తప్పక యుండి యుండునని ఈ రచయిత నిర్ధారించెను.

కొందరు మన పూర్వీకులకు చరిత్ర యందాసక్తి లేక పోవుటకు కారణము వారికి లౌకిక విషయముల యందాసక్తి లేకపోవుటయే యని తెల్పిరి. అందువలననే ప్రత్యేకముగ చరిత్ర వ్రాయుట జరుగలేదని నిశ్చయించిరి.

"మన పూర్వీకులకు కేవలము లౌకిక విషయములపై గల నిరాదరణయే యిందులకు కారణము. ఆముష్మిక సంబంధము లేనిది వారికి వర్జ్యమే. కావుననే ఆదిలో సామాన్య చరిత్ర వాచకముగ నుండిన ఇతిహాస శబ్దము కాలక్రమమున నాముష్మిక విషయములకు సంబంధించిన చరిత్ర తెల్పునదిగ మారెను. సామాన్య చరిత్రకు ఇతిహాస నామము తగదని మన పూర్వులు భావింప దొడగిరి"[15]

12. నేలటూరు వెంకటరమణయ్య, చరిత్ర రచన, అవతారిక, p. 1.
13. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, p. 4.
14. ఆంధ్రపత్రిక, ధాతనామ సం. 1936—37, p. 104.
15. ఆంధ్రపత్రిక, ధాతనామ సం. 1936—37, p. 104.

అని తెలియుచున్నది.

ఈ విషయమును రవీంద్రనాథఠాకూరు—

"In fact our history has not been of the rise and fall of kingdoms, of fights for political supremacy. In our country records of these days have been despised and forgotten for they in no way represent the true history of our people. Our history is that of our Social life and attainment of spiritual ideals."[16] అని తెల్పెను.

భారతీయులకు లౌకిక విషయములనిన నిరాదరణము అనియు, చరిత్ర యనిన శ్రద్ధ లేదనియు, పెక్కుమంది అభిప్రాయ పడిరి.

"No wonder that a nation like the India cares so little for history; no wonder that social and political virtues were little cultivated, and the ideas of the useful and the beautiful scarcely known to them. With all this, however they had what the Greek was as little capable of imagining as they were of realising the elements of Grecian life. They shut their eyes, to this world of outward seeming and activity, to open them full on the world of thought and rest. Their life was a a yearning after eternity. Their activity was a struggle to return into that divine essence from which this life seemed to have served them. Believing as they did in a divine and really existing eternal being, they could not believe in the existence of this passing world"[17] అని Max Mueller తెలిపెను.

ఈ విధముగా పెక్కుమంది ప్రాచీన భారతీయులకు చరిత్ర యందభిలాష కలదని, లేదని పలువిధములయిన అభిప్రాయములను వెలిబుచ్చిరి.

డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారు "మన దేశమునకు మహమ్మదీయులు వచ్చిన తరువాతనే చరిత్ర రచన పారశీ భాషయందు ప్రారంభమైనదనియు వారు వెళ్లిపోయిన తరువాత నివి మృత ప్రాయమైనవనియు, ఇప్పటి వారికి ఆ భాషలు అపరిచితమనియు, హిందువులును, మహమ్మదీయుల చరిత్రలను వ్రాసిరే తప్ప హిందువుల చరిత్రలను వ్రాయలేదనియు, దీనికి తార్కాణముగ హిందూ చరిత్ర రచయితలయిన, లక్ష్మీనారాయణ, చంద్రభాను మున్నగువారు వ్రాసిన గ్రంథములందు హిందూ రాజ్యముల చరిత్రలు లేవనియు తెల్పుచు

16. Rabindranath Tagore, Nationalism, p. 6.
17. Max Mueller, Ancient Sanskrit Literature, p. 16.

అంతమాత్రమున చరిత్ర లేదనుట తగదని తెల్పిరి."[18]

మనకు చరిత్ర గ్రంథములు ప్రత్యేకముగ లేకపోయినప్పటికిని, కాల గర్భమున కలసిపోయిన చరిత్రను ఉద్ధరించుటకు పెక్కు మార్గములున్నవి, సాధనములున్నవి. ఈ సాధనములను సేకరించి పరిశీలించి చూచిన ప్రాచీన చరిత్ర తెలసికొనవచ్చునని వీరు తమ అభిప్రాయమును వ్యక్తపరచిరి.[19]

ప్రాచీనులయిన భారతీయుల జీవిత దృక్పథము, నేటి భారతీయుల జీవిత దృక్పథము కంటెను భిన్నమయినది. నేటి దృష్టితో అనాటి వారి సమస్యలను, ఆచార వ్యవహారములను, జీవన దృక్పథమును పరిశీలించినచో మనకు సరియగు పరిష్కారములభింపదు. మనకు లభించిన ఆధారముల బట్టి వారి జీవిత దృక్పథమెటుల భిన్నమైనదో అటులనే చారిత్రక రచన యందును వారివైఖరి భిన్నమైనటులనే కన్పట్టు చున్నది. వారు, చారిత్రక విషయములను ప్రత్యేకముగ చరిత్ర అను నామమున తెలుపక వేద, పురాణ, శాస్త్రాదులతో కలిపి చెప్పిరి. మానవుల చర్యలతో పాటు దేవతల చర్యలను చేర్చి కథలను మలచిరి. మానవు లొనరించిన ప్రతి కార్యము, సాధించిన ఘనవిజయములు, దేవతలతోడ్పాటుననే జరుగుచున్నటుల తెలిపిరి. ఇట్టి దృక్పథ ముండుటచేతనే రాజుల యొక్క రాజవంశముల యొక్క చరిత్రలు వ్రాయునపుడు, చంద్రునకో, సూర్యునకో, ముడిపెట్టుట జరిగినది. మన వేద పురాణ వాఙ్మయమంతయు, ఈ తీరుననే మలచబడినది. భారతీయుల పరలోక చింతనయే దీనికి కారణమై యుండి యుండును. వీరు పారమార్థిక విజ్ఞానమును బోధించుటకే పూనుకొనిరి. వేద రచనా కాలమునాటి భారతీయల దృక్పథమిదియే యని వేదములు పరిశీలించిన స్పష్ట మగును. అయినప్పటికిని వారికి చరిత్ర యందాసక్తి లేదనుటకు వీలులేదు. పాశ్చాత్యులవలె జనన మరణాది కాలములను సంఘటనలను, తిథివారాది సంఖ్యా నిర్దేశములతో ప్రణాళికా పద్ధతిగ వివరింపకపోయినప్పటికి మన వేదములు, పురాణములు చరిత్రకాటపట్టులు. ఋగ్వేదమునందు అత్రిగౌతమ దీర్ఘతమో వామదేవాది బ్రహ్మర్షుల కథలనేకములున్నవి. అందు సంగ్రహముగ నున్న ఇతిహాసములే భారతాదులలో విస్తరిల్లినవి. ఋక్సంహితలో సంగ్రహముగ నున్న 'ఊర్వశీ పురూరవుల కథ' శతపథ బ్రాహ్మణమున ఇంచుక పెరిగినది. అదే పురాణ కావ్యాదులందు వర్ధిల్లినది. మన పురాణములు పంచలక్షణ సమన్వితములు.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణిచ
వంశాను చరితం చేతిపురాణం పంచలక్షణమ్"[20]

సర్గమన మొదట జరిగిన సృష్టి లక్షణము. ప్రతిసర్గము ప్రళయానంతర సృష్టి.

18. నేలటూరు వెంకటరమణయ్య, చరిత్ర రచన, p. 1.

19. నేలటూరు వెంకటరమణయ్య, చరిత్ర రచన, pp. 1–2.

20. అమరకోశం, ప్రథమ కాండవాగ్వర్గము, శ్లో. 5.

మన్వంతరము – యుగముల యొక్క వర్ణన. అనగా నాలుగు యుగములు కలసిన ఒక మహాయుగము. ఇట్టి యుగములు డెబ్బదిఒకటి జరిగినచో ఒక మన్వంతరము. రాజవంశము – సృష్టి జరిగినప్పుడు ఏర్పడిన సూర్యచంద్రవంశపు రాజుల చరిత్ర. అనువంశమన ఈ సూర్యచంద్రవంశజులయిన రాజులనుండి కలియుగమునకు వచ్చిన రాజవంశముల చరిత్ర.

పురాణములందలి ఈ చివరిభాగము చరిత్రకు ఉపయోగపడును. ఇవన్నియు కాలక్రమానుసారముగ లేకపోయినప్పటికీ, మనము వానియందలి చారిత్రక విషయములను గుర్తించినచో భారతీయులకు చరిత్ర జ్ఞానము లేదను అభిప్రాయము కొంత తొలగును.

ఈ విషయమునే చర్చించుచు

Max Mueller—

"In the following sketch of the history of the vedic literature, I cannot promise to give dates such as we are accustomed to find in the literary histories of other nations; but I hope I shall be able to prove that these exist in the large mass of literature which belongs to the vedic age, clear trace of an original historical articulations; and that it is possible to restore something like chronological continuity in the four periods of the vedic literature"[21] అని వైదిక వాఙ్మయమునందలి చరిత్రాంశముల గూర్చి తన అభిప్రాయమును వ్యక్తపరచెను.

"మన పురాణములు చరిత్రయే మన ఋషులకు చరిత్రజ్ఞానము లేదనుట మన పూర్వనాగరికతను ఎంత తక్కువ పరచినచో వారి విలువబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన పన్నుగడ. మనవాంధ్రకు పురాణములందు చెప్ప బడిన సర్గప్రతిసర్గములయందు విశ్వాసము లేదు. అని విశ్వనాథ సత్యనారాయణ గారు చరిత్ర విషయమున తమ అభిప్రాయమును వెలిబుచ్చిరి.[22]

పై విషయముల సారాంశము వలన, మన ప్రాచీన భారతీయులకు చారిత్రక దృష్టి కలదని స్పష్టపడుచున్నది.

## చరిత్ర రచన—సాధనములు

చరిత్ర రచనకు తోడ్పడు మనకుగల సాధనములను చరిత్ర రచయితలు నాలుగు తరగతులుగ విభజించిరి :

1. పురాతన వాస్తు నిచయము.

21. Max Mueller, Ancient Sanskrit Literature, p. 57.
22. విశ్వనాథ సత్యనారాయణ, పీఠిక – పురాణవైర గ్రంథమాల.

2. శాసనములు.
3. వాఙ్మయము.
4. నాణెములు.

పురాతన వాస్తు నిచయము :

స్తూపములు, చైత్యములు, సంఘారామములు, దేవాలయములు, కోటలు, శిలాప్రతిమలు మొదలగునవి పురాతన వాస్తునిచయములు. వీటిని పూర్వచారిత్రక, చారిత్రక యుగవాస్తువులని రెండు తరగతులుగ విభజించిరి. లిపి ఉత్పత్తి కాకముందు కాలమునకు పూర్వచారిత్రక యుగమని పేరు. ఈ యుగమునకు చెందిన కట్టడములు ఆంధ్రదేశమున రాక్షస గుళ్లని పిలువబడుచున్నవి. ఇవి ఆర్యులు మన దేశమున అడుగుపెట్టకమునుపు, మన దేశమునందలి ఆదిమవాసుల సమాధులని నిర్ణయించిరి. ఈజిప్టునందలి పిరమిడ్‌లు ఇట్టివే. వీటియందు ఆయుధ, ఆహారపదార్థ, వస్తువాహన భూషణాదులను పూడ్చిపెట్టెడివారు. వీటి ఆధారమున ఆనాటి జనుల నాగరకత సంస్కృతి మత సాంఘిక పరిస్థితులు తెలిసికొన వచ్చును.

చారిత్రకయుగ వాస్తువులు, జనులు వ్రాయుట, చదువుట నేర్చుకొనిన తరువాతి యుగమునకు చెందినవి. ఇవి స్థూపములు, చైత్యములు, గుహలు, దేవాలయములు, కోటలు, ప్రాసాదములు, గృహములు, విహారములు, ప్రతిమలు మొదలగునవి. ఇవి అన్నియు చరిత్ర తెలుసుకొనుటకు ముఖ్యసాధనములు. వీటి యందలి చిత్రప్రతిమాదులవలన ఆ కాలపు చరిత్రయందలి ముఖ్యాంశములను తెలిసికొనవచ్చును.

శిల్పి, ప్రతిమాదులయందు తన కాలపు వస్త్రధారణ, ఆభరణ కేశాది అలంకారములను, నాట్యకళాది విశేషములను, విద్యావిశేషములను ప్రజాజీవన విధానమును, మత సాంఘిక పరిస్థితులను, వ్యాపారాది విషయములను, యుద్ధ విషయములను తీర్చిదిద్దుటచే ఆ విషయములన్నియు మనకు విశదమగుచున్నవి. ఇవి అన్నియు చరిత్రకారులకు చరిత్రను నిర్మించుటయందు మిక్కిలి తోడ్పడును.

శాసనములు :

రాజులు, రాణులు, పెద్దపెద్ద రాజోద్యోగులు, ధనవంతులు, తామిచ్చిన దానముల విషయముగాని, చేయు ఘనకార్యముల గూర్చిగాని వ్రాయించినవి. ఇవి రెండు రకములు. లౌహికములు, శైలికములు.

బంగారము, వెండి, రాగి మొదలగు లోహముల పట్టికలపై వ్రాయునవి లౌహికములు. ముఖ్యముగ దానశాసనములన్నియు తామ్రపట్టికలపై వ్రాసినవే. అక్కడక్కడ బంగారు, వెండి పట్టికలపై చెక్కినవి గలవట. పల్లవ, గాంగ, చాళుక్యాది రాజవంశముల చరిత్రలు లౌహిక శాసనములందే గలవు. ఇవి అల్ప సంఖ్యాకములు.

శిలలపై చెక్కబడినవి శైలికములు. ఇవి దేశమంతటను బహుసంఖ్యాకముగ నున్నవి. దక్షిణ భారతదేశమున ఒక్క శాసనమయినను లేనట్టి పల్లెగాని గ్రామముగాని లేదనియే చెప్పవచ్చును. ప్రసిద్ధ దేవాలయములు గల ప్రదేశములందు వేలకొలది శిలాశాసనములు కన్పడుచున్నవి. ఈ శాసనముల ద్వార కొన్నివందల యేండ్ల చరిత్రను తెలిసికొనవచ్చును వ్రాయవచ్చును. ఇవి చరిత్రకారులకు చాలా ముఖ్యమయిన ఆధారములు. ఈ శాసనములను క్షుణ్ణముగ పరిశీలించిన, రాజ వంశముల చరిత్ర, రాజులు గావించిన ఘనకార్యములు, యుద్ధ విషయములు, దేవాలయాది నిర్మాణాది కార్యములు, సాహిత్యాభిమానము, కళాభిమానము మొదలగు అంశములు తెలియును.

నాణెములు :

చరిత్రను తెలిసికొనుటకు నాణెములును ఒక సాధనమే. వీటిపై ముద్రింప బడిన చిత్రములను బట్టి ఆకాలపు చరిత్ర కొంత తెలిసికొనవచ్చును.[23]

వాఙ్మయము :

వాఙ్మయము చరిత్ర తెలిసికొనుటకు అన్ని ఆధారముల కంటెను ముఖ్య మయినది. మనదేశమున వాఙ్మయము మొదట సంస్కృతమున ఉద్భవించి నది. అనాడు సంస్కృతము రాజభాష. దేశభాషలు క్రమక్రమముగా ఏర్పడినవి. ఆ ఆ భాషలలో వాఙ్మయము ఏర్పడినది.

ప్రాచీన భారతీయులకు చరిత్రయనినగల అభిప్రాయములను ముందుగనే తెలిపితిని. చరిత్రను ప్రత్యేకముగ గ్రంథములుగ వ్రాయకపోయినప్పటికి, చరిత్ర యనిన ప్రాచీన భారతీయులకు గల భావమును; పురాణములనుండి, చారిత్రకగ్రంథ ములనుండి గ్రహింపవచ్చును. వేదములు, సంహితలు, బ్రాహ్మణములు, వేదాంగ ములు, స్మృతులు, సూత్రములు, పురాణములు, కావ్యములు మన సాహిత్యసంపద. వేదాదులు ప్రాచీన భారతీయుల పరంపరాగత చరిత్ర యనియేచెప్పవచ్చును. ఆ విషయములు గ్రహించుటకు మనము ఆకవి నాటి దేశకాల పరిస్థితులను, స్థితి గతులను బాగుగా అర్థము చేసికొనవలెను. ప్రతి గ్రంథమునందు, కవికాలము నాటి సాంఘిక పరిస్థితులు ప్రతిబింబించును. కనుక మట్టిలోగలమాణిక్యమును వెలికి తీయునటుల అతి జాగరూకతతో పరిశీలించిన ఆనాటి చారిత్రక విషయములు తెలియును. ఆమోదషట్పద న్యాయానుసారముగ మనము చరిత్రాంశములను తెలునుకొనవలెను.

ఈ వేదములు, పురాణములు తప్ప మనకు చరిత్ర గ్రంథములు లేవా యనిన గలవు. అన్ని భాషలయందును, చరిత్రకాంశములను ఇతివృత్తముగ చేసి

23. నేలటూరి వేంకటరమణయ్య, చరిత్రరచన.

కొని వ్రాసిన కావ్యములు, పెక్కుగలవు. కాని వాటియందు కావ్యలక్షణము లధికము. చరిత్ర అల్పము.

## చారిత్రక కావ్యములు

ఇంతవరకు, చరిత్ర అననేమియో, మన ప్రాచీనులకు చరిత్రదృష్టి కలదో లేదో, చరిత్రను తెలసికొనుటకు ఆధారము లేవియో, మన పురాణాదులందు చరిత్ర గలదో లేదో తెలుపుట జరిగినది. ఇక చారిత్రక కావ్యములన నేవియో పరిశీలింతము. మన సాహిత్యమున వివిధప్రక్రియలు గలవు. అందు చారిత్రక కావ్యము లొకప్రక్రియ.

చారిత్రకకావ్యము అన, రెండు విరుద్ధ విషయములు కలయికగాతోచును. చరిత్రయన, ప్రామాణికస్థితిగల సత్యమైన విషయము అనితెలుసుకొంటిమి. ప్రామాణికము కానిదేదియు చరిత్రకానేరదు. కల్పనఉండరాదు. మరి కావ్యము నకు ముఖ్యమయినది కల్పన. దీనికి సత్యాసత్యములతో నిమిత్తములేదు. కాల్పనిక పతిభయే కావ్యమునకు ప్రాణము. కల్పన హృదయంగమముగ నుండవలెను.

కావ్యమననేమియో కావ్యలక్షణములు, కావ్యప్రయోజనములేవియో మన అలంకారికులు, పాశ్చాత్యులు కూడా పలువిధములుగ తెలిపిరి.

కావ్యమున భావము, వస్తువు, రచనా పద్ధతి ముఖ్యమయినది. వస్తువుయొక్క ఉనికియే కాక కావ్యమునకు సౌందర్యమును సమకూర్చు ఇతర సాధన సామగ్రియు నుండవలెను. అష్టాదశ వర్ణనలు, పాత్రచిత్రణము, రసము మొదలగునవి కావ్యమునకు ముఖ్యములయిన అంగములు. ఇందు రసము ప్రధానమైనది. వస్తువు రమణీయముగ నుండవలయును. ఘట్టములును రసవంతముగ నుండవలెను. ఉత్తమ పురుషుని చరిత్రముండవలెను. ఈ లక్షణములతో పాటు, కావ్యము పాఠకుల కానందమును కలిగించునదిగను, నీతిని, ధర్మోపదేశమును చేయునదిగా నుండవలయును.[24] ఇది మన అలంకారికుల నిర్ణయము. ఇంచుమించు పాశ్చాత్యుల కావ్యనిర్వచనమును, ఇట్టిదే.

మనకావ్యములు, పద్యాత్మకములు, గద్యాత్మకములు, గద్యపద్యాత్మకములు అని మూడు విధములు. కావ్యమునందలి వస్తువునుబట్టి పౌరాణికము, కల్పితము, చారిత్రకము అని మరల విభజింపవచ్చును.

భారత భాగవతాది పురాణములనుండి లేదా వేదాదులనుండి ఇతివృత్తమును గ్రహించి కావ్యముగా మలచినవి పౌరాణికములు. మనుచరిత్ర, వసుచరిత్ర మొద లగునవీకోవకు చెందినవి.

కల్పితములు, ప్రాచీనమూలములేవియులేక కేవలము ఊహాశక్తిచే కథా

24. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, కావ్యాలంకార సంగ్రహము, ద్వి. ఆ., pp. 233–237.

వస్తువు నూహించి వ్రాసినవి. ఉ. కళాపూర్ణోదయము. ఇట్టికావ్యములు ఆంధ్ర వాఙ్మయమున అరుదు.

చారిత్రకములు :

ఇవి అటు పౌరాణికములునుకావు. ఇటు కల్పితములునుకావు. వీటి ఇతి వృత్తము పురాణములందుండదు. ఇవి ఒక విధముగా యథార్థములు. ఈ కావ్యము లందలి వస్తువు ఒకనాడు ఒక నిజస్థితి కలది. ఇవి ఒకనాడు మౌలికమైన స్థితిఉండి యథార్థమనుటకు తగిన ఆధారములుగల వస్తువుగల కావ్యములు.

మనకు పెక్కు చారిత్రక కావ్యములు కలవు. సంస్కృతవాఙ్మయము మొదలు అన్ని భారతీయ భాషలందును చారిత్రక కావ్యములు కలవు.[25]

## చారిత్రక కావ్యము—స్వరూప స్వభావము

కావ్యమునకు, చరిత్రకు, స్వరూప స్వభావములందు భేదము కలదు. చరిత్ర – కావ్యము – రెండు విరుద్ధ విషయముల కలయిక "చరిత్ర రచయిత గద్యములో వ్రాయును. కవి పద్యమున వ్రాయును"[26] అని కావ్యాలంకార సంగ్రహమున గలదు. చరిత్ర గద్యమున వ్రాయవలెనని నిబంధన నెవరును ఏర్పరచినట్లుల లేదు. పాఠకుల సౌలభ్యము కొరకు చరిత్రను గద్యమున వ్రాయుట జరుగుచున్నది. చరిత్రకు అత్యవసరమయినది ప్రామాణికత. విషయమును ఉన్న దున్నట్లుగా తెలుపును చరిత్ర. అందుగల ప్రతి అంశమునకు మౌలికమయిన ప్రామాణిక స్థితి యుండవలెను. కల్పనకు తావు లేదు.

కావ్యమునకు కావలసినది కల్పన. దీనికి నిజస్థితి గలదా? సంఘటన ప్రఖ్యాతమయినదా? నాయకుడు ప్రముఖ వ్యక్తియా అను విషయములతో నిమిత్తము లేదు. హృద్యమమైన కల్పనతోనుండిన చాలును. కావ్య సృష్టికర్తయైన కవి, తన యిష్టానుసారముగ కావ్యమును మలచ వచ్చును. మార్చవచ్చును. కవికి కావ్య రచనయందు స్వాతంత్ర్యము హెచ్చు. భావగర్భితముగ చమత్కార ముగ ఎట్టి విషయములైనను చెప్పవచ్చును. చరిత్ర రచన యందు అట్టి స్వాతంత్ర్యము వహించుటకు వీలులేదు. చరిత్ర యందు విషయమునకు ప్రాధాన్యము హెచ్చు. కావ్యములందు రసవంతముగ చెప్పెడి విధానమునకు ప్రాధాన్యమెక్కువ.

---

25. ఈ కావ్యము వస్తువునుబట్టి ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మువ్విధములు. ప్రఖ్యాతమన బురాణప్రసిద్ధము—రామాయణాదులు. ఉత్పాద్యమన కేవల కల్పితములు—కళాపూర్ణోదయాదులూ మిశ్రమన గొంత ప్రఖ్యాతవస్తువును గొంత యుత్పాద్య వస్తువును మిళితమైనది. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, కావ్యాలంకార సంగ్రహము, p. 242.

26. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, కావ్యాలంకార సంగ్రహము, p. 241.

ఈ విధముగ చరిత్రకును కావ్యమునకును స్వరూపము నందు స్వభావము నందు వ్యత్యాసము కలదు. మరి ఇట్టి పరస్పర విరుద్ధములయిన రెండు విషయముల కలయిక సాధ్యమా ? అను అనుమానము మనకు కలుగును. ఇట్టి రచన కష్టమే అయినప్పటికిని అసాధ్యము కాదను విషయము మనకు గల చారిత్రక కావ్యములు స్పష్టపరచు చున్నవి. ఈ రెండు విరుద్ధాంశములను చేర్చి కూర్చి కావ్యముగ తీర్చి దిద్దుట కవియొక్క ప్రతిభా విశేషమే అగును.

నిజమునకు చరిత్రకును కావ్యమునకును అవినాభావ సంబంధముగలదు. ఒకదానిని విడిచి మరియొకటి ఉండనేరదనియే చెప్పవచ్చును. కవి ఎంతగా భావనా ప్రపంచమున విహరించినను అభూత కల్పనలతో తన రచన సాగించినను, అతని రచనయందు అజ్ఞాతముగ నయినను కవి కాలము యొక్క సంఘ పరిస్థితులు మత సంబంధ విషయములు జనుల యొక్క జీవిత విధానము, వేష భాషలు, సంప్రదాయములు, ఆచార వ్యవహారములు ప్రతిఫలించుచునే ఉండును. కవి, కవి సంచరించు సంఘము, పరిసరములు, సత్యములయినపుడు అతడు వ్రాయు కావ్యము నందంతయు అసత్యమే ఉండుట అసాధ్యము. బాగుగా పరిశీలించిన, కవియొక్క సమకాలీన సాంఘిక స్థితిగతులు, గ్రంథము నుండి గ్రహింపవచ్చును. ఆంధ్ర వాఙ్మయమునంతటిని బాగుగా పరిశీలించిన మనకు పెక్కు చారిత్రకాంశములు తెలియును. చరిత్ర నిర్మాణమునకు వాఙ్మయమెంత అవసరమో వాఙ్మయమును సమగ్రముగ అవగాహన చేసికొనుటకు చరిత్రయు అంతగనే తోడ్పడును, ఇవి రెండును జీవితమున అవసరమైనవే. ఒకటి, జీవిత సత్యమును తెలుపును. మరియొకటి జీవిత దృశ్యమును చిత్రించును. ఈ విధముగా ఈ రెండును అన్యోన్యాశ్రయత్వమును కలిగి యున్నవి. అన్యోన్యాశ్రయత్వము వలన రెంటికిని అవినాభావ సంబంధమేర్పడు చున్నది. ఈ రెండింటి కలయికయే చారిత్రక కావ్యమగు చున్నది. చరిత్రచే ప్రభావితమగుచున్న సాహిత్యము మరల సృష్టించుచున్న చరిత్రయే చారిత్రక కావ్యమగుచున్నది. అనగా చారిత్రకాంశములను కవిత్వధోరణిలో సృష్టించినది చారిత్రక కావ్యము.

చారిత్రక ఇతి వృత్తమనగా నేమి? అను అనుమానము మనకు కలుగును. ఈ కావ్యములయందు పూర్వ రాజులకు, రాజ కుటుంబములకు సంబంధించిన గాథలే ఉండవలయునా, లేక ఇతర సంఘటనలు ఉండవలయునా అని మరి యొక సంశయము కలుగును. అసలు మనకు చరిత్ర అనగానే ముఖ్యముగ రాజులకు రాజవంశీయులకు సంబంధించిన గాథలే స్ఫురించును. ఈ విషయము లేనా చారిత్రక కావ్యముల కితివృత్తమనిన కాదు. నిజమునకు చారిత్రికేతి వృత్తమునకు పరిమితి లేదు. భూత, వర్తమానకాలములందు, జరిగిపోయిన జరుగుచున్న ప్రతి సంఘటన చారిత్రక కావ్యమునకు ఇతి వృత్తమే అగును. జీవిత చిత్రణమే చరిత్ర పరమార్థము. ఈ జీవిత చిత్రణమునకు సాహిత్యమే

సరియగు మార్గమని G. M. Trevelyan అభిప్రాయము.[27]

రాజులు రాజవంశములు, మతము, సంఘము, రాజకీయములు, కొన్ని ముఖ్యమగు సంఘటనలు, ప్రముఖవ్యక్తులు, వారి చరిత్రలు మున్నగు అంశములన్నియు చారిత్రక కావ్యములకు ఇతి వృత్తములే. ఈ అంశములన్నియు వేటికవి వేరువేరుగా గ్రహించి కావ్యములుగ రచింప వచ్చును. మనకు నేడుగల గ్రంథములన్నియు ఏ అంశమున కాఅంశము వేరువేరుగ గ్రహించి రచించినవి. కాని అటుల కాక ఒక కాలమునందలి ఏదేని ఒక విషయమును కావ్యముగ వ్రాయునపుడు, అనాటి మత సాంఘిక రాజకీయ ఆర్థికాది పరిస్థితులు ప్రజాజీవనము, ఆచార వ్యవహారములు మొదలగు సర్వ విషయములను గ్రహించి వర్ణించిన యెడల మనకు అనాటి వ్యవస్థ, చరిత్ర సంపూర్ణముగ తెలియును. ఇట్టి రచనలు, మనకు అరుదనియే చెప్పవచ్చును. ఏదో ఒక అంశమును గ్రహించి, దానిని ఇతివృత్తముగ చేసికొని వ్రాసిన కావ్యములే మనకు కనబడుచున్నవి.

చారిత్రక కావ్యములన్నియు సత్యమగు చరిత్రనే కలిగియున్నవా ? అను విషయము ఆలోచింప దగినది. చరిత్ర యథార్థము. కావ్యము కల్పితము. కనుక చారిత్రక కావ్యము సత్యాసత్యముల కలయికయే యగుచున్నది. సత్యదూరము కాని చారిత్రక కావ్యములు మనకు లేవు. కనుక చారిత్రక కావ్యకర్త ఏవిధముగా రచన సాగించిన చారిత్రక కావ్యమునకు న్యాయము చేకూర్చగలడో పరిశీలింతము.

చారిత్రక కావ్యమున ముఖ్యముగ గమనింప వలసినది చారిత్రక ప్రామాణికత్వము. సత్యదూరము కాని విషయములనే రచయిత చెప్పవలయును. ఇట్టి దృష్టితో రచయిత, కావ్య రచన సల్పనిచో, చరిత్రయొక్క అస్తిత్వమునకు భంగము వాటిల్లును. ఇతివృత్తము కావ్యమునకు శరీరము. చారిత్రక కావ్యమునకు శరీరము ప్రామాణికత్వము గల చరిత్ర. కవి తన యొక్క ప్రతిభ ద్వారా, చరిత్రను సాహిత్యమును సమన్వయ పరచి రచన చేయవలయును. రచన చేయునపుడు తాను గ్రహించిన ఇతివృత్తము యొక్క యథార్థతను దృష్టి యందుంచుకొని చేయవలెను. ఇప్పటి వరకు మనకు గల చారిత్రక కావ్యము లేవియు ఇట్టి దృష్టితో వ్రాయబడలేదు. ఇతివృత్తము చారిత్రక మయినదయినప్పటికిని, దానిని మలచి కావ్యముగ మార్చునపుడు కవులు అసత్యములగు పెక్కు విషయములను, వర్ణనలను, అతిశయోక్తులను కూర్చి వ్రాయుట జరిగినది. ఆధునిక యుగమున వచ్చుచున్న కావ్యములు, ఖండకావ్యములును ఇట్టి ధోరణి యందే సాగుచున్నవి. చరిత్రను తెలిసికొనక ఈ కావ్యములను చదివిన, అదియే సత్యమగు చరిత్రయను భావము జనించును. ఇట్టి విషయముల వలన, వర్ణనల వలన, పాఠకులకు ఉత్తేజము కలుగును కాని, సత్యమగు చరిత్ర మరుగున పడిపోవును. కనుక చారిత్రక కావ్యములందు కావ్యత్వముకంటెను, సత్యదూరము

27. Trevelyan, Lecture on History and the Reader.

కాని చరిత్రాంశములుండి తీరవలయును. చరిత్రకు అత్యావశ్యకములగు నామములు, తారీఖులు, సంఘటనలు మొదలగు అంశములను పూర్వాపరములుగ వ్రాయుట, తప్పు సంఖ్యలనిచ్చుట, మన కవులు చేయుచున్నారు. కొన్ని కావ్యములందు నాయకుడుగా వర్ణింపబడిన రాజుగాని, ప్రముఖ వ్యక్తిగాని, చేయని కార్యములను, చేయని యుద్ధములను, చేసినట్లుగ వర్ణించుటకూడ కలదు. ఇట్టి రచనల వలన సత్యములగు చరిత్రాంశములు మరుగునపడి అసత్యములగు వర్ణనములకు ప్రాముఖ్యము హెచ్చును.

పాఠకుని హృదయమున కావ్యములు చదివినప్పుడు కలుగు భావము తొలగిపోదు. కవియొక్క రచనా సామర్థ్యమువలన అతడు చెప్పు విషయములన్నియు సత్యములేయని ఒక్కొక్కప్పుడు పాఠకునకు దృఢమగు అభిప్రాయ మేర్పడవచ్చును. ఈ పాఠకుడు మరియొకరికి చెప్పునపుడు ఈ విషయములన్నియు సత్యములను భావముతో చెప్పిన ఆ వ్యక్తియు నమ్మవచ్చును. ఈ విధముగ కొంతకాలమునకు అసత్యములగు విషయములు సత్యములగును.

కొందరు కవులు అమానుషమగు శక్తులను ప్రవేశపెట్టి, తమ కావ్యనాయకుడు వాటిని జయించినట్లుగ వర్ణించుటయు కలదు. నాయకునకు దేవత్వము నాపాదించుట, లేదా దేవతలకు యుద్ధములందు తోడ్పడునటుల, లేక శివుడో, విష్ణువో ప్రత్యక్షమగుటయో, లేక సహాయము చేయుటయో జరిగినటుల వ్రాసిన కావ్యములును కలవు. ఇవి నమ్మశక్యము కాని విషయములు. చారిత్రకమగు ఇతివృత్తము గ్రహించునపుడు, మానవుల చర్యలతో అమానుష చర్యలను చేర్చినచో, చరిత్రాంశములకు, భంగము వాటిల్లుటయే కాక, పాఠకుని దృష్టియందు ఇట్టి రచనలనిన ఒక విధమగు నిరసన భావమేర్పడును. నేడు మనకుగల చారిత్రక కావ్యములకు, వాఙ్మయమున సరియగు స్థానము లేకపోవుటకు కారణమిదియే. కనుకనే అవి మరుగున పడిపోయినవి.

మన ప్రాచీన సాహిత్యమంతయు, పౌరాణికేతివృత్తము గలది. అనాటి ప్రజలకు పురాణములనిన అభిమానము. పారమార్థిక చింతయందాసక్తి. ఈ కారణమువలన వారికి పురాణములనుండి గ్రహించిన ఇతివృత్తముగల కావ్యములనిన పురాణములనిన గల అభిమానము చరిత్రయందు లేదనియే చెప్పవచ్చును. కావున చారిత్రక కావ్యసృష్టి విరివిగా జరుగలేదు.

కావ్యప్రపంచమున సృష్టికర్త కవి. కనుక అతడు తన యిష్టానుసారముగ కావ్యమును మలచవచ్చును. మార్చవచ్చును. కాని – చారిత్రక కావ్యముల విషయమున అటుల మార్చుటకు వీలులేదు. అటుల చేసిన చరిత్ర అసత్యమగును. కవి కావ్యము కూడ పాఠకుల ఆదరమును కోల్పోవును. కనుక చారిత్రక కావ్యములను సృష్టించిన కవి చరిత్రకు భంగము వాటిల్లకుండ కావ్యలక్షణముల కలిగియుండునటుల రచన చేయవలెను. ఇది కష్టతరమగు కార్యము. చారిత్రక

గాథలను ఇతివృత్తముగ గ్రహించునపుడు కవి ఆ గాథ ఏ కాలమున జరిగినదో ఆనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులను, జనుల జీవిత విధానమును, సంఘటనముల పూర్వాపరములను, తారీఖులను తెలిసికొనవలెను. శాసనాధారమున గాని, మరి యే యితర అధారమువలనగాని, సత్యాసత్యములను పరిశీలించి, సత్యములగు విషయములనే గ్రహించి, కావ్యమున పొందుపరచవలెను. ఇట్టి పరిశీలనమునకు కవికి చరిత్రయనిన అసక్తి, అభిలాష, చారిత్రక దృష్టి యుండ వలెను. చరిత్రకారునకును కవికిని ఇటనే భిన్నత్వము కన్పడుచున్నది. చరిత్ర కారుడు సహితము ఆనాటి విషయమును ప్రత్యక్షముగ చూచి వ్రాయుటలేదు. అతడును ఊహించియే వ్రాయును. అధారముల మూలమున ఆ పరిస్థితులను సంఘటనలను ఊహించి వ్రాయును. కవియును ఊహించియే వ్రాయును. కాని, అతని ఊహకు భౌతికాధారములు అక్కరలేదు. కాని చారిత్రక కావ్యములు వ్రాయు కవి, తన ఊహాశక్తిని, భౌతికాధారములతో చేర్చి, కావ్యసృష్టి చేయ వలయును. రమణీయమగు కావ్యశైలితో చరిత్రను తీర్చిదిద్దిన అది జనాదరణమును పొందును. కాని – మన కవులయందు పెక్కుమంది కిట్టి దృష్టి యున్నటుల లేదు. ఏవోఒకటి రెండు కావ్యములు తప్ప పెక్కు చారిత్రక కావ్యములందు చారిత్ర కాంశములను విమర్శనాదృష్టితో వ్రాయుట జరుగలేదు. బహుశః కవి తన కావ్యమును అంకితమిచ్చు వ్యక్తికి ప్రియము గూర్చునను భావనతో, అసత్యములగు అభూతకల్పనలను చేసి యుండియుండును. ఒక్కొక్కప్పుడు చారిత్రకాంశము లను గ్రహించి కావ్యమును మలచినపుడు కావ్యలక్షణములన్నియు (అష్టాదశ వర్ణనములు, తదితరమైన కావ్య లక్షణములు) నుండునటుల రచన గావింపవలెనను తలంపుతో అభూతమగు కల్పనలు చేయుటయు జరుగవచ్చును. కావ్యము అలంకారికులు నిర్ణయించిన అన్ని కావ్య లక్షణములతో నుండవలయునను దృష్టి నేటి అధునికులందు సన్నగిల్లినది. కాని పూర్వము కావ్యమును అలంకారికులు చెప్పిన విధముగనే వ్రాసితీరవలయునను పట్టుదల హెచ్చుగ నుండెడిది. అందెట్టి చిన్న లోపమున్నప్పటికిని అది సత్కావ్యము కాదను నిర్ణయమును జరిగెడిది. కనుక కవులు ఈ వర్ణనాది విషయములకే ప్రాముఖ్యమునిచ్చి, తక్కిన విషయముల యందంతగా అసక్తి చూపెడివారు కారు. ముఖ్యముగ చారిత్రకేతి వృత్తములను కథావస్తువుగ గ్రహించిన కవులయందీ లక్షణము కన్పడుచున్నది. కనుకనే మనకు చారిత్రక కావ్యములందు పెక్కు కల్పనలు కన్పించుచున్నవి. కనుక ఇట్టి లోపములు లేకుండ కవి కావ్యమును సృష్టింపవలెనననిన, ప్రామాణిక మగు చారిత్రకాంశములనే గ్రహింపవలెను. అప్పుడు సత్యమగు చారిత్రకాంశములు గల కావ్యసృష్టియు జరుగును. పౌరాణికేతి వృత్తములు గలవి చారిత్రకము కాజాలవు. కనుక అందలి సంఘటనలు, ఇందలి సంఘటనలను ఒకచో చేర్చి రచన చేయరాదు.

ఈ కావ్యములందలి పాత్రలన్నియు మానవులే కావలయును. వారికి దేవతలతోగాని, పురాణపురుషులతోగాని దేవ గంధర్వ నాగలోకములతోగాని ఎట్టి సంబంధము ఉండదు. కనుక అట్టి సంబంధ బాంధవ్యములున్నటుల వర్ణించరాదు. మనవలే పుట్టి పెరిగి మనవంటి ప్రవృత్తి స్వభావములు గల మానవులను, వారివలన సంఘమునందు కలుగు మార్పులను యుద్ధ విషయములను కావ్యవస్తువుగ గ్రహించవలయును. ప్రపంచమునందు పుట్టి పెరిగిన ప్రతి మానవుని నాయకునిగా చేయవలెనా అనిన కాదు. మానవులంతా సమానమే అయినప్పటికి, కొందరి జీవిత ప్రవృత్తి మానవుల యొక్క సామాన్య అనుభవముల కంటే కొంచము పైననుండును. వీరొనరించు సాహసాది కార్యములు, తక్కిన మానవుల హృదయములందు. వీర, కరుణ, శృంగార, అద్భుత రసముల కలిగించి, వారియందొక ప్రత్యేక భావమును కలిగించును. సంఘమునందు ఏదేని ఒక ప్రత్యేకమగు కార్యమునుచేసి, అందరి దృష్టియందు ప్రత్యేక వ్యక్తిగ పొగడబడు వ్యక్తి చారిత్రక వ్యక్తియగును. కనుక ఇట్టి వ్యక్తులను వారిచే చేయబడిన ఘనకార్యములను చారిత్రక కావ్య వస్తువుగా గ్రహింపవలెను. ప్రముఖ వ్యక్తిని కావ్యనాయకునిగ గ్రహించుటయే కాక, ఆ వ్యక్తి ఏ కాలమునకు సంబంధంచిన, ఆ కాలమునందు జరిగెడు సర్వ విషయములను ఆధార సహితముగ గ్రహించి సత్యా సత్యములను వివేచన శక్తిచే నిర్ణయించి, సత్యమగు విషయములను కావ్యమున పొందుపరుపవలెను. ఇట్టి సత్యాన్వేషణ కష్టసాధ్యము. ఒక్కొక్కప్పుడు పూర్వ ప్రఖ్యాత పురుషులయొక్కగాని, సంఘటనల విషయములుగాని, తెలిసికొనుటకు, సరియగు ఆధారములు లభింపక పోవచ్చును. శాసనములయంధు సరియగు సమాచారముండక పోవచ్చును. స్థానికమైన (ప్రమాణముగ వ్రాయబడిన) గ్రంథము లేవియు లేకపోవచ్చును. దొరికిన ఆధారముల వలననే సత్యమగు చారిత్రకాంశములను గ్రహించవలెను. ఇట్టి సందర్భములయందే, పెక్కుమంది రచయితలు విని, తెలిసికొనిన విషయములనే, సత్యమయినవిగ గ్రహించుటయు జరుగును.[28] ఒక్కొక్కప్పుడు, సరియగు చారిత్రకాంశములు తెలిసినప్పటికి, అశ్రద్ధవలన కవి గ్రహింపక పోవుట జరుగును.[29] కనుక చారిత్రకేతివృత్తమును, ఇతివృత్తముగ కావ్యరచన చేయు కవి సత్యములను గ్రహించుట యందు శ్రద్ధాసక్తులను చూపవలెను.

చారిత్రక కావ్యములను వ్రాయవలయునను ఉద్దేశము కవుల కేలకలిగినది? అను అనుమానము కలుగును. ఈ విషయము కవులు తీసికొనిన ఇతివృత్తములవలన కొంత గ్రహింపవచ్చును. అసలు మానవునకు కావ్యమును సృష్టింపవలెనను కోర్కె ఎటుల కలుగునో అట్టి కోర్కెయే తన కావ్యమునకు ఇతివృత్తమును గ్రహించుట యందును కలుగుట సహజము.

28. కాటమరాజు కథ.

29. సిద్ధేశ్వర చరిత్ర, కృష్ణరాయ విజయము.

కవియొక్క భావమును బట్టియే అతడు గ్రహించు ఇతివృత్తముండును. అది పురాణముగాని, శాస్త్రముగాని, చరిత్రగాని యేది అయినను కళాభిజ్ఞునకు ఒక్కటే. రామ కథ యనిన మక్కువ ఎక్కువ అగుటచేతనే, వాల్మీకి రామాయణము వ్రాసె నని చెప్పవచ్చును. వ్యాసుడు భారతమును, పంచమ వేదముగ ప్రజలకందించ వలెనను కోర్కెతో రచించెనని కొందరి అభిప్రాయము. పూర్వకాలమున కవులెట్టి ఉద్దేశములతో కావ్యేతి వృత్తమును ఎంచుకొనిరను విషయమునకు పెక్కు అభి ప్రాయములను చెప్పవచ్చును.

పురాణములుగాని మరియే యితర రచనలుగాని చదువునపుడు. అందలి పాత్రలుగాని, సంఘటనలుగాని, మిక్కిలి రమ్యముగ కన్పించి, కావ్యనిర్మాణము నకు దోహదము కావచ్చును. వీరులు చేసిన వీర కార్యములు, తమ కాలమున గాని అంతకంటె పూర్వము గాని జరిగిన ప్రముఖమయిన సంఘటనలుగాని మనస్సు నకు ఉత్తేజమును కలగించి చారిత్రక కావ్య రచనకు హేతువు కావచ్చును.

ఆంధ్రవాఙ్మయము పరిశీలించిన మొదటినుండి వాఙ్మయము రాజాదరమున అభివృద్ధి చెందినటుల స్పష్టము. ఆనాడు రాజులు, కవులను, ఆస్థానములకు రప్పించి, వారు వ్రాసిన కావ్యములను విని సన్మానించెడివారు. అది వారికొక విలాసము. అట్టి సన్మానములును, కావ్యోత్పత్తికి హేతువులు. కొందరు రాజులు తమకిష్టమగు విషయమును తమ ఆస్థానమునందలి కవులకు తెల్పి ఆ ఇతివృత్తముతో కావ్యము వ్రాయ కోరెడివారు. రాజునకు ఇష్టమయిన కావ్యమును వ్రాసిన రాజునకు సంతోషము కలగి, తమకు సత్కారములు జరుగునను భావము కూడ కావ్య రచ నకు కారణమే. రాజులు తమ పూర్వుల చరిత్రను కావ్యముగ వ్రాయుమనుటయు, కవులు వ్రాయుటయును జరిగినది.

## చారిత్రక కావ్యము—ప్రయోజనము

చారిత్రక కావ్యము వలన కలుగు ప్రయోజనములను తెలిసికొందము.

మానవ స్వభావము రెండు విధములు. బాహ్య ప్రకృతి, అంతః ప్రకృతి. మానవుని అంతఃకరణమునందు కలుగు భావములే మానవ చరిత్రయందు క్రియా రూపముగ పరిణమించుచున్నవి. బాహ్య ప్రకృతిని విశదీకరించునది చరిత్ర. మనో గత భావమును చిత్రించునది కావ్యము. కవియొక్క మనోగత భావములే కావ్య మయినప్పటికి, అందు కవియొక్క దేశ కాల పరిస్థితులు ప్రతిబింబించును. సూచనగా నుండును. చారిత్రక కావ్యమునందట్టి విషయములు, సూత్రప్రాయముగ కాక, సూటిగ చెప్పబడును. అవి యథార్థములు, వీరోచితములు, అగుటచే కవి ఉత్తేజితుడగును. ఉత్తేజితుడగు కవి తన రచనద్వార పాఠకునియందును వీరా వేశమును కలిగించును. ఊహా నిర్మితమగు కావ్యము, పాఠకునియందు భావా

వేశమును కలిగించి, మరియొక ఊహా ప్రపంచమునకు గొనిపోవును. సత్య సమ్మిశ్రితమైన చారిత్రక కావ్యము పాఠకుని యందు ఉత్తేజమును కలిగించి వీరావేశుని చేయును.

చారిత్రక కావ్యముల వలన మానవుని యొక్క జీవిత విధానమునకు సంబంధించిన సర్వవిషయములు తెలిసికొనవచ్చును. భూతకాలమునందలి మానవుని యొక్క మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు, నాగరికత, జీవిత విధానము, వస్త్రధారణ, అలంకార విశేషములు, కళలు మొదలగు పెక్కు అంశములను తెలిసికొనవచ్చును. రాజులుగాని, వీరులుగాని చేసిన ఘన కార్యములు యుద్ధములు, సంబంధబాంధవ్యములు, వ్యాపారాది విషయములు తెలియును. తన పూర్వుల చరిత్ర యగుటచే, మరల మరల తెలసికొన వలయునను వాంఛను, పాఠకుని యందు ప్రేరేపించు నీ చారిత్రక కావ్యములు. అట్టి కార్యములను చేయ వలయునను ఆసక్తిని కలిగించును. ఏలయనగా ఈ కావ్యములందలి నాయకుడు (లు) సామాన్య మానవుడు (లు) కాని, అతని జీవితము, తోడి మానవులకంటె భిన్నమయినది. ఆ భిన్నత్వమునందు వీరరసమో, కరుణ రసమో పొంగులు వారు చుండును. తోటి మానవుని వీర కార్యములు ఉత్తేజమును కలిగించును. తన జీవిత విధానమును మలచుకొనుటకు మార్గదర్శక మగును. గత చరిత్రను తెలిపి, భవిష్యత్తునకు, బాటవేయు నీకావ్యములు.

ప్రపంచమునందలి అన్ని భాషలయందును ఈ చారిత్రక కావ్యోత్పత్తి జరిగినది. అన్ని భాషల యందలి కావ్యములును, అతిశయోక్తులతో, నిండియున్నవనియే చెప్పవచ్చును.

భారత దేశమునందలి మొట్టమొదటి భాష యయిన సంస్కృతమునందలి చారిత్రక కావ్యములను ఇంచుక పరిశీలించి, ఆంధ్రవాఙ్మయమున గల చారిత్రక కావ్యములను పరిశీలించెదను.

వేదములు, పురాణములేకాక, సంస్కృతమున పెక్కు చారిత్రక గ్రంథములు కలవు. కాని వాటియందు, కావ్యలక్షణము లధికము. చరిత్ర అల్పము.

## సంస్కృత వాఙ్మయము—చారిత్రక కావ్యములు

సంస్కృతమున తొలి చారిత్రక కావ్యములు, అశ్వఘోషుని 'బుద్ధచరిత్రము' 'సౌందర నందము.' 'బుద్ధ చరిత్రము' బౌద్ధమతమును తెలుపు పదిఏడు సర్గల కావ్యము. 'సౌందర నందము' బుద్ధుని పితృవ్య పుత్రుడగు నందుని చరిత్రము గల ఇరువది సర్గల కావ్యము. ఈ అశ్వఘోషుడు క్రీ.శ. 78 సంవత్సరములలో పరిపాలించిన కనిష్కుని బౌద్ధమత గురువని తెలియుచున్నది.

క్షేమేంద్రుడు, 'రాజావళి' అను కాశ్మీర రాజ చరిత్ర రచించినట్లు, 'రాజ

తరంగిణీ' కారుడైన 'కల్హణుడు' తెలిపెను. సువ్రతుడు, హేలరాజు, నీలముని మొదలగు కవులు కొందరు కాశ్మీర రాజ చరిత్రలు రచించిరి. అందుకొన్ని దోష భూయిష్టములు, కొన్ని ఖిలములు అగుటచేత తాను పూర్వ శాసనాదులను పరిశీలించి ఈ గ్రంథమును (రాజతరంగిణిని) రచించినట్లు కల్హణుడు తెలిపెను. కల్హణుని అనంతరము జోనరాజకవి 'ద్వితీయ రాజ తరంగిణి'ని రచించెను. అందు జయసింహుడు మొదలగు కాశ్మీర రాజుల చరిత్ర కలదు. జోనరాజ శిష్యుడగు శ్రీవర పండితుడు తృతీయ రాజతరణింగిని రచించెను. ప్రాజ్యభట్టు అక్బరు జలాలుద్దీనుల కాలమున కాశ్మీర దేశమును పరిపాలించిన రాజుల చరిత్రను చతుర్థరాజ తరంగిణిగ రచించెను. తరువాత రాజతరంగిణి నెవ్వరు రచించ లేదు.

క్రీ.శ. 606–645 ప్రాంతమున ఉత్తరదేశమును పరిపాలించిన హర్షవర్ధనుని చరిత్రను బాణభట్టు 'హర్ష చరిత్ర'గ రచించెను. పరిమళ కాళిదాసు బిరుదాంకితు డయిన పద్మగుప్తుడు ఉజ్జయినిని పరిపాలించిన వాక్పతిదేవ మహారాజు యొక్క చరిత్రమును 'నవసాహసాంక' చరిత్ర మను పేర పదునెనిమిది సర్గలలో రచించెను. బిల్హణుడు, ఆహవమల్లుని కుమారుడయిన విక్రమాంకుని చరిత్రమును 'విక్రమాంక దేవ చరిత్రము'గ రచించెను. ఇందు చివరి సర్గయందు స్వీయ చరిత్రను వ్రాసి కొనెను. చోళ రాజుల యుద్ధవర్ణన లిందు గలవు. రామిలుడు, శామిలుడు అను వారలు శూద్రకుని జీవితమును గాథగా రచించిరి. పంచశిఖుడను ప్రాకృతకవి 'వైక్రాంత శూద్రకమ'ను గ్రంథమును రచించెను. భట్ట శివస్వామి విరచితమైన 'కంపణాభ్యుదయము,' రాజనాథడిండిమ కవి రచించిన 'అచ్యుతరాయాభ్యుదయ, సాళువాభ్యుదయములు,' గంగాదేవీ విరచితమైన 'మధురా విజయము,' రామ భద్రాంబ వ్రాసిన 'రఘునాథాభ్యుదయము,' వామన భట్ట బాణుని 'వేమ భూపాల చరితము,' కేశవ పండితుని 'రాజారామ చరితము,' 'శహాజి చరిత్రము,' 'శాహేంద్రవిలాసము,' గంగాధర పండితుని 'భోసల వంశావళి,' శేషాచలపతి వ్రాసిన 'కోసల భోసలీయము,' శ్రీనివాస కవి వ్రాసిన 'శాహరా జాష్టపది,' లక్ష్మణకవి 'శాహరాజ సభాసరోవర్ణిని,' సుమతీంద్ర కవి 'జయ మోషణ,' 'సర్వదేశ వృత్త సంగ్రహము,' 'విజయపురకథ,' 'రత్నసేన వంశముక్తావళి,' 'వంశలత' మొదలగు పెక్కు కావ్యములు కలవు. 'సంక్షేపశంకర విజయము,' 'మధ్వ విజయము,' 'దివ్యసూరి చరితము,' 'వల్లభాచార్య చరిత్ర' మొదలగు మహాపురుషుల జీవిత చరిత్రలును గలవు.

'వర్ధమాన చరితము,' 'యశోధర చరితము,' 'ధన్యకుమార చరితము,' 'భద్రబాహు చరిత్ర' మొదలగు కావ్యములు జైనమత విషయములను తెలియ జేయునవి. ఇవి సంస్కృత భాష యందలి కొన్ని చారిత్రక కావ్యములు.

సంస్కృతము నందు వలెనె, తక్కిన దేశభాషల యందును, చారిత్రక

కావ్యములు, చరిత్ర రచన కుపయుక్తమగు గ్రంథములు పెక్కులు గలవు.

జయగొండార్ రచించిన 'కళింగత్తు పరణి,' ఒట్టకుట్టాన్ 'మువాల్ ఉలా,' సెక్కిలార్ వ్రాసిన 'పెరియ పురాణమ్,' 'మణిమేకలై' మొదలగునవి, కన్నడ భాషయందలి 'రన్నని గథా యుద్ధము,' 'పంపభారతము' చారిత్రకములు కానప్పటికిని, అతి ముఖ్యమయిన చరిత్రకాంశములను తెలియ చేయు గ్రంథములు. వీటి యందు, కవి కాలమునాటి జీవితము ప్రతిఫలించు చున్నది. ఈ అంశములు చరిత్రకారులకు ఉపయోగపడును.

సంస్కృత సాహిత్యము తరువాత పరిశీలింపదగినది మాతృ భాషలలోని సాహిత్యములు. మన ఆంధ్ర వాఙ్మయము చరిత్ర కెంతవరకు ఉపయోగ కారియో పరిశీలింతము.

## కావ్యములు—చరిత్ర

మన పురాణములు, కావ్యములు, ప్రబంధములు మొదలగున వన్నియును చరిత్రను తెలిసికొనుటకు యెంతయో తోడ్పడును. భారతము రచించిన నన్నయ కాలము మొదలు క్రీ.శ. 19వ శతాబ్దము వరకు మనకుగల (క్రీ.శ. 20వ శతాబ్ది కావ్యములకు పీఠిక లుండుట లేదు) పీఠికలు, చరిత్రాంశములకాటపట్టులు. ఇవికాక అశ్వాన ఆద్యంత పద్య గద్యములు చరిత్రను తెలియ జేయును. పూర్వము రాజులు, సంస్థానాధీశ్వరులు, జమిందారులు, మంత్రులు, ప్రముఖ రాజోద్యోగులు, రాణులు, కవి పండిత పోషకులు, ఆనాడు కవి పండిత పోషణ వారికొక విలాసము. వారు రసజ్ఞులు. ప్రతిభగల కవులను సభలకు ఆహ్వానించి, సన్మానించి కావ్యరచనకు ప్రోత్సహించెడివారు. వారి కోరిక ననుసరించి కవులు, రచనలు చేసెడి వారు. తమ పోషకుల యందలి భక్తి చేతనో, గౌరవమువల్లనో, అభిమానము చేతనో తాము రచించు కావ్యములను వారికి అంకితమిచ్చుట ఆచారమైనది. పీఠిక యందు కృతిపతి వంశమును వర్ణించుట ఒక నిబంధన వలె సాగినది. నన్నయతో మొదలయిన ఈ పద్ధతి, క్రీ.శ. 19వ శతాబ్దము వరకు అవిఘ్నముగ సాగినది. ఇంక ఆశ్వాసాద్యంత పద్యములును కృతిపతి చరిత్రను, కవియొక్క చరిత్రను తెలియ జేయును.

మన పూర్వ ఆంధ్ర కావ్య రచనా పద్ధతిని మూడు భాగములు చేయ వచ్చును. కృత్యవతారిక, కావ్యభాగము, ఆశ్వాసాద్యంత పద్యములు. ఇందు కృత్యవతారిక, ఆశ్వాసాద్యంత పద్యములు, కేవలము చారిత్రకాంశములను తెలుపు విభాగములు. ఇంక కథతో కూడియున్న కావ్య భాగము కూడ (వస్తువు పౌరాణిక మయినను, కాల్పనిక మయినను) కవి కాలమునాటి మత సాంఘిక విషయములను వ్యక్తపరచును. కనుక మన సాహిత్య మందంతటను, చరిత్ర ప్రతిఫలించుచునే

యున్నదనుట స్పష్టము. అయినప్పటికిని అవి కేవలము చరిత్రను ఇతివృత్తముగ గ్రహించి వ్రాయబడినవి కావు. అపారమగు ఆంధ్ర వాఙ్మయమున హారము నందలి మణులవలె, చరిత్ర ఇతివృత్తముగ గల కావ్యములు మనకు పెక్కు గలవు. ఇందు క్రీ.శ. 17వ శతాబ్దము వరకు గల కవులు రచించిన ఇట్టి చారిత్రక కావ్యములనే నా సిద్ధాంత వ్యాసమున పరిశీలించుట జరిగినది. ఇందు కొన్ని గ్రంథములు అలభ్యములని ఆముఖము నందు తెలిపితిని. ఆంధ్ర మహావిష్ణువు గాథను సూచనప్రాయముగ తెలియజేయుచున్న 'వల్లభాభ్యుదయము,' చోళుల గాథలను వర్ణించిన 'నవచోళ చరిత్ర' చారిత్రకాభాస కావ్యములు అయినప్పటికి ఆ కావ్యముల వలన మనకు విస్మృతమైన కొంత చరిత్ర తెలియుచున్నది. కనుక ఆ రెండు గ్రంథములను కూడ పరిశీలించుట జరిగినది.

# 2. ఆంధ్ర మహావిష్ణువు

ఆంధ్ర దేశమును ప్రప్రథమముగ పరిపాలించిన ఆంధ్రవిష్ణువు అభ్యుదయము మును వర్ణించి విస్మృతమైన తొలి తెలుగు రాజు చరిత్రను అందించుచున్న 'వల్లభాభ్యుదయ' కావ్యమీ ప్రకరణమున పరిశీలించుట జరిగినది. నిశుంభుడను నాగరాజును జయించి కృష్ణానదీ తీరమున గల శ్రీకాకుళమున రాజ్యమును స్థాపించి, ఆంధ్రవల్లభుడు, ఆంధ్రవిష్ణువు అను కీర్తిని గాంచిన ఆంధ్రవల్లభుని చరిత్రతోపాటుగ, సుమతి, అనంతపాలుర చరిత్ర కూడ ఇందు కొంత వర్ణింప బడినది. ఇంకను మరికొన్ని చారిత్రకాంశములిందు పొందుపరుపబడినవి.

### వల్లభాభ్యుదయము—భట్లపెనుమర్తి కోదండరామకవి

కోదండరామకవి గోపాల సచివుని పుత్రుడు. ఈతనిది హరితస గోత్రము. ఈతడు కవులందరి వలె తన వంశాదికములను వర్ణించు కొనలేదు. 'తను బంధ సంబంధాన్వయ పరంపరాభి వర్ణన సేయుట వృథాను లాపంబని' ఈతని అభిప్రాయము. తిరుమల తాతాచార్యుని శిష్యుడని తెలియు చున్నది. కనుక ఈతడు వైష్ణవ మతావలంబి అయి ఉండును. కవికి స్వప్నమున విష్ణుమూర్తి విప్రరూపమున ప్రత్యక్షమై సంస్కృత శ్రీ కోసము నొసగి "శ్రీకాకుళ క్షేత్రమాహాత్మ్యంబిందు వ్యత్యస్తంబైయున్నయది యథాక్రమంబుగా నొనరించి సవిస్తరంబు గావింపుమని" పల్కెనట. తరువాత వ్యత్యస్తముగ నున్న తాళపత్ర గ్రంథము లభింపగా తాను దానిని యథాక్రమముగ సరిచేసినట్లు కవి తెలుపు కొనెను. కవిని గూర్చిన అంశము లింతకంటె నేమియు తెలియుట లేదు.

విష్ణువు యొక్క అనతి ప్రకారము వ్యత్యస్తమైన క్షేత్ర మాహాత్మ్యమును సరి చేసినట్లు కవి తెలిపిన అంశముల వలన వల్లభాభ్యుదయము వైష్ణవ సంబంధియైన క్షేత్రమాహాత్మ్యమని స్పష్టపడుచున్నది.

### చరిత్ర—వల్లభాభ్యుదయము

వల్లభాభ్యుదయము ఐదాశ్వాసముల గ్రంథము. ఇందలి గాథ శ్రీకాకుళ క్షేత్రమునగల ఆంధ్రమహావిష్ణువు యొక్క మాహాత్మ్యమును తెల్పుచున్నది.

ఇది క్షేత్ర మాహాత్మ్యమైనప్పటికి, ప్రాచీన కాలము నందలి కొందరు రాజుల చరిత్రలను, ఆనాటి ఆంధ్రదేశ స్థితి గతులను తెలుపుచున్నది. ఈ గ్రంథము వలన, శ్రీ మహావిష్ణువు గంగాతీరము నుండి కృష్ణాతీరమునకు వచ్చి అచట బ్రహ్మచే ప్రతిష్ఠింపబడగా, కృష్ణవెల్లువలో ఆ విగ్రహము కొట్టుకొని పోవగా అచట గల మునులా విగ్రహమును పదిల పరచిరనియు, కొంత కాలము తరవాత, ఆంధ్రుల రాజధాని యగు విశాల నగరమును పరిపాలించిన ఆహర్వృతి (లేదా హరితి) కుల సంజాతుడైన సుమతి అను రాజాదేవుని ప్రతిష్ఠవిని అచటి కరుదెంచి, మునుల కడ ఆ విగ్రహము గాంచి, అది తన వంశీయుడైన ఆంధ్రనాథుని దనియు, తాను ఆంధ్రనాయక దాసుడనని తెల్పి, ఆ మునుల కోరికపై ఆ విగ్రహమును మరల ప్రతిష్ఠించి, దేవాలయ గోపుర మంటపాదులను నిర్మించెననియు, ఆ దేవాలయము మరల కృష్ణవెల్లువలో కొట్టుకొనిపోగా, కటకపురాధీశుడైన నృసింహుని దండనాయకుడైన అనంతపాలుడు కాంచీపురమును జయించుట కాంధ్రదేశమున కరుదెంచి, ఆంధ్ర నాయకుని మాహాత్మ్యమునువిని, బ్రహ్మకుండినీ తటమున గల శంకరదివ్యధామమను పురమున వామన శర్మయను బ్రాహ్మణుని ఇంట కాకరపాదు క్రింద గల ఆ విగ్రహమును తెప్పించి శ్రీకాకుళమున మరల ప్రతిష్ఠించి గోపుర ప్రాకారవురములను నిర్మించి ఉత్సవాదు లొనరించుటకు తగు ఏర్పాటులను గావించెనని తెలియుచున్నది. ఈ అంశములేకాక ముక్కంటి జనపతి వృత్తాంతము అహిచ్ఛత్రపుర గాథ ఇంకను మరికొన్ని గాథలును వర్ణింపబడి ఉన్నవి. ఈ గ్రంథము క్షేత్ర మాహాత్మ్యమైనప్పటికి తొలి తెలుగు రాజైన ఆంధ్రవల్లభుని గాథను సూచించు ఏకైక గ్రంథము. కాని ఈ గ్రంథము నందలి కొన్ని అంశములు అస్తవ్యస్తముగ, అసంపూర్ణముగ నున్నవి. అస్తవ్యస్తముగ నున్న ఇందలి విషయములను సమగ్రముగ పరిశీలించిన మనకు పెక్కు చరిత్రాంశములు తెలియును.

మునుల కోరికపై గంగానదీ తీరమున తప మొనర్చుచున్న బ్రహ్మ కృష్ణా తీరమునకు వచ్చి విష్ణువు కొరకై తప మొనర్చి, ప్రత్యక్షమైన విష్ణువును కృష్ణా తీరమున నివసింపుమని కోరిన అంశము, సుమతి శ్రీకాకుళమున ఆంధ్రమహావిష్ణు విగ్రహమున ప్రతిష్ఠించుగాథ, అనంతపాలుని జీవితాంశములు, ముక్కంటి మహా జనపతి గాథ చరిత్రను తెలియ చేయు అంశములు.

ఈ గ్రంథమున శ్రీ మహావిష్ణువుగా వర్ణింపబడిన ఆంధ్రమహావిష్ణువు యొక్క చరిత్రను తెలుసు కొనుటకు ముందు, ఆంధ్రు లెవ్వరు ? మొదట వారి నివాస మెచ్చటో తెలిసి కొందము.

ఆంధ్రులు అను మాటకు ఆంధ్ర జాతికి చెందిన వారని, ఆంధ్ర దేశమున నివసించిన వారని అర్థము చెప్పుకొనవచ్చు. ఐతరేయ బ్రాహ్మణము ఆంధ్రులను ఒక ప్రత్యేక జాతిగ పేర్కొన్నది. విశ్వామిత్రుని పుత్రులలో ఆంధ్రులు కలరు. మత్స్యపురాణమున ఉత్తర దేశములను వర్ణించు సందర్భమున

"బాహ్లికా వాట ధానాశ్చ అభీరాః కాలకేయకాః
పురస్థ్రిశ్చైవ శూద్రాశ్చ పహ్లవాశ్చాత్త ఖండికాః"

అని, భాగవతపురాణమున ఉత్తరదిశయందు నివసించు ప్రజలను వర్ణించుచు 'కిరాత హూణాన్ యవనానన్ధ్రాన్ కజ్కాన్ ఖశాన్ శకాన్' అని ఆంధ్రుల ప్రశంస కలదు.[1]

దీని వలన ఆంధ్రులు బాహ్లిక, కాలకేయ, శూద్ర, పల్లవ, కిరాత, హూణ, యవన, కజ్క, శకాదులవలె ఉత్తరదేశవాసులని తెలియుచున్నది. "పురాణములలో నాంధ్రులు తుషారమూలక పహ్లవాదులతోగూడ, హిమవర్షములోని బిందుసరమును నుత్పత్తియై యుత్తర వాహినిగ ప్రవహించు చక్షునదీ తీరమున నివసించుచుండి నట్లు చెప్పియున్నది"[2] అని వేంకటరమణయ్యగారు నిర్ధారించిరి.

మనకు లభించిన ఆధారములను బట్టి ఆంధ్రుల నివాసము నేటి ఆఫ్ఘనిస్థాన మునకు ఉత్తరమున గల మధ్య ఆసియా అని తెలియుచున్నది. తక్కిన ఆర్యుల వలె వీరును భారతదేశమునకు వలస వచ్చి దక్షిణా పథమున స్థిరనివాస మేర్పరచు కొనిరి. వీరు నివాసమేర్పరచుకొన్న దేశమునకే ఆంధ్రదేశమను పేరు స్థిరపడినది.[3]

ఆంధ్రులు వింధ్యపర్వతములను దాటి దక్షిణ దేశమున ఎప్పుడు స్థిరనివాస మేర్పరచు కొన్నది తెలిసి కొనుటకు సరియగు ఆధారములు దొరుకుట లేదు. కాని వీరు దక్షిణ దేశమునకు వచ్చి అచట నివసించెడి ప్రజలను లోబరచుకొని స్థిర నివాసము లేర్పరచుకొని రనుట సత్యము. ప్రథమాంధ్ర రాజైన ఆంధ్రవిష్ణువు గాథ ఇందులకు నిదర్శనము. వీరు కృష్ణానదీ తీరమున రాజ్యము చేయుచున్న నాగజాతి వారిని జయించి రాజ్యమును స్థాపించి నటుల పురాణ చరిత్రకారుల ఊహ. ఈ విధముగా కృష్ణాగోదావరీ నదీ గర్భ పరిసరములలో స్థాపింపబడిన ఆంధ్రరాజ్యము క్రమక్రమంగా విస్తరిల్లి దక్షిణాపథమంతా వ్యాపించి, చివరకు మగధమహాసామ్రాజ్యమును కూడ జయించి భారతదేశమున గొప్ప సామ్రాజ్యమై ప్రఖ్యాతిగాంచినది.

ఈ ఆంధ్రరాజ్యమును స్థాపించినది ఆంధ్రమహావిష్ణువని తెలియుచున్నది. ఆంధ్రదేశమును పరిపాలించుచున్న నిశుంభుని జయించినది ఆంధ్రవిష్ణువని బ్రహ్మాండపురాణమునందలి

"శ్రీశైలభీమకాళేశ మహేంద్రగిరి సంయుతమ్
ప్రాకారంతు మహత్కృత్వా త్రీణిద్వారాణి చాకరోత్
త్రిలోచనో మహాసేనః త్రిశూలంచకరేవహన్
త్రిలింగ రూపీన్యవస త్రిద్వారేషు గణైర్యుతః

1. నేలటూరి వేంకటరమణయ్య, ఆంధ్రులు – చరిత్ర, pp. 2,3.
2. నేలటూరి వేంకటరమణయ్య, ఆంధ్రులు – చరిత్ర, p. 6.
3. నేలటూరి వేంకటరమణయ్య, ఆంధ్రులు – చరిత్ర, p. 6.

ఆంధ్రవిష్ణుస్స్వరయతో దనుజేన నిశుంభునా
యుద్ధ్వాత్రయోదశయుగాన్ హత్వాతంరాక్షసోత్తమమ్
అవసత్తత్రఋషిభిర్యుతో గోదావరీతటే
తత్కాల ప్రభృతిక్షేత్రంత్రిలింగమితి విశ్రుతమ్" అను శ్లోకమువలన,
"ఆంధ్రనాథోమహావిష్ణుర్ని శుంభుదనుజాపహా
పురాస్వాయంభువమనోః కాలేకలియుగేహరిః
కాకులేరాజవర్యస్యసుచంద్రస్యతనూభవః
అభవత్సర్వదేవైశ్చవేష్టితో లోకపూజితః"

అను ఆంధ్రకౌముదిలోని శ్లోకమువలన నిశుంభుని సంహరించి శ్రీకాకుళమున ఆంధ్రరాజ్యమును స్థాపించినది ఆంధ్రవిష్ణువను అంశము స్పష్టమగుచున్నది. అంతే కాక శ్రీకాకుళమును పరిపాలించిన సుచంద్రుని పుత్రుడని, సురలతోడ్పాటున, నిశుంభడను రాక్షసరాజును సంహరించి అటనున్న మునులకు రక్షణకల్పించెనని, శ్రీశైల, భీమేశ్వర, కాళేశ్వర, మహేంద్రగిరిపర్వతములను తన రాజ్యమునకు ప్రాకారముగా నిర్మించెనని విశదమగుచున్నది. ఆంధ్రవిష్ణువు నెలకొల్పిన ఆంధ్రరాజ్యమును త్రిశూలపాణియగు శంకరుడు రక్షించెనని బ్రహ్మాండపురాణమునందలి గాథవలన తెలియుచున్నది. ఆంధ్రవిష్ణువుయొక్క తండ్రిగా ఆంధ్రకౌముది పేర్కొనిన సుచంద్రుని 'ఆర్యమంజుశ్రీ కల్ప' మను బౌద్ధగ్రంథము పేర్కొనుచున్నది.[4]

ఈ అంశములవలన ఆంధ్రవిష్ణువను వీరుడు నిశుంభుడను రాజును జయించి కృష్ణాతీరమున శ్రీకాకుళమున రాజ్యము స్థాపించెననుట స్పష్టమగుచున్నది.

"కృష్ణానదీ సమీపమునగల యమరావతి మొదలగు ప్రదేశములందు బయలు వడిన ప్రాచీనబౌద్ధశిల్పములలో బౌద్ధమతాభిమానులగు నాగరాజుల చిత్రములు గూడ గానవచ్చుటచే నాగులా దేశమునందలి యాదిమనివాసులని యూహింప దగి యున్నది. ఈ నిశుంభుని ఒక నాగరాజుగను అతనిని హింసించి దేశమాక్రమించు కొన్న ఆంధ్రవిష్ణువును ఆంధ్రరాజుగను చరిత్రకారులు గ్రహింతురు" అని శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారల అభిప్రాయము.[5]

బ్రహ్మగంగాతీరమునుండి కృష్ణాతీరమునకు వచ్చి, శ్రీకాకుళమున విష్ణు విగ్రహమును ప్రతిష్ఠించెనను వల్లభాభ్యుదయ ప్రథమాశ్వాసమునందలిగాథ, ఆంధ్రులు గంగానదీతీరమునుండి కృష్ణాతీరమునకువచ్చి, అచ్చట స్థిరనివాస మేర్పరచుకొని రాజ్యమును స్థాపించుకొనిరను అంశముతో సమన్వయపరుచుకొన వచ్చును. అటుల రాజ్యము స్థాపించిన వారిలో ఆంధ్రవిష్ణువు గొప్పవీరుడై ఉండును. నిశుంభుని రాక్షసుడనుటచే అతడు మిక్కిలి క్రూరుడైనరాజై ఉండును. అతనిని జయించి రాజ్యమును ప్రతిష్టించుటచే, అతనికాలముననో లేక అతని తరువాతనో ప్రజ

4. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రులచరిత్ర — సంస్కృతి, p. 102.
5. వల్లభాభ్యుదయము, పీఠిక.

లాతని విగ్రహమును ప్రతిష్ఠించి పూజించిఉందురు (వీరులకు గుడులను గోపురములను నిర్మించి పూజించు ఆచారము మనకిప్పటికి కలదు). కాలక్రమమున ప్రజలచే ఆ విగ్రహము, వీరుడు, రాజునగు ఆంధ్ర మహావిష్ణువిగ్రహముగ కాక, విష్ణువుయొక్క విగ్రమేఅని భావింపబడి ఉండును. క్రమముగా విగ్రహప్రతిష్ఠాపనోద్దేశము మరుగున పడి, దానికి పుక్కిటిపురాణములుచేరి, మునులకోరికపై బ్రహ్మ విష్ణు విగ్రహమును ప్రతిష్ఠించెననుగాథ ప్రజాబాహుళ్యమున ప్రచారముపొంది స్థిరపడిఉండును. "ప్రాచీనకాలమున వీరులను ఆరాధించుట మతమునందొకభాగము. రాజుల విగ్రహములను చెక్కించి ప్రతిష్ఠించు ఆచారమును కన్పట్టుచున్నది. ఇట్టివి రాజుల జ్ఞాపకార్థము స్థాపించుట సంప్రదాయముగ కన్పడుచున్నది. ఈ పద్ధతి శాతవాహనులయందు గలదు. నానాఘాట్ గుహలలో ఇట్లు స్థాపింపబడిన విగ్రహములు గలవట. ఈ విగ్రహముల అడుగున రాయసీముక సాతవాహనుని పేరును అతని కుటుంబమునందలి వారియొక్క పేర్లను చెక్కబడియున్నవట."[6] ఈ పద్ధతి శాతవాహనులకు వారికంటె పూర్వము పరిపాలించిన రాజుల కడనుండియే వచ్చియుండును. ఈగ్రంథమువలన ఆంధ్ర విష్ణ్వాలయము కృష్ణానదీగర్భమున రెండుమూరులు కలిసి పోయినటుల స్పష్టముగతెలియుచున్నది. ఆంధ్రవిష్ణువు స్థాపించిన శ్రీకాకుళము, అతనిచేతనో లేక అతని కాలమునందలిప్రజల చేతనో నిర్మింపబడిన (ఆంధ్రవిష్ణు విగ్రహము స్థాపింపబడిన) ఆలయము కృష్ణానదీగర్భమున కలసిపోగా, అచటనున్నప్రజలు ఆంధ్రవిష్ణు విగ్రహమును పదిలపరచి, అది బ్రహ్మచే స్థాపింపబడిన విష్ణువిగ్రహమని ఒకపురాణకథను కల్పించి దానిని దేవతావిగ్రహముగ భావించి పూజలుచేసి, శ్రీకాకుళము ను తీర్థస్థలముగా చేసియుందురు. తరువాతి తరములకది వీరుడయిన ఆంధ్రవిష్ణువుయొక్క విగ్రహముగకాక భగవంతుడయిన శ్రీహరి విగ్రహముగనే స్థిరపడుట జరిగి. నేటికిని అదియే నిలిచిపోయినది. మానవులకు దేవతలనిన గల అభిమానము కూడ ఇట్టిమార్పులకు కారణము. ఒకరాజుయొక్క విగ్రహమునకు పూజలు సల్పుమనిన ఎవరును సలుపకపోవచ్చును కాని, అదియే విగ్రహమును దేవతావిగ్రహముగ ప్రచారము సలిపిన ప్రజలునమ్మి అవిగ్రహమునకు పూజలు సలుపుట కెట్టి అటంకమును తెలుపరునరికదా, ఎట్టి పుక్కిటిపురాణముల చెప్పినను సత్యములనియే విశ్వసింతురు. కనుక ఈ గ్రంథమున ప్రథమాశ్వాసమున చెప్పబడిన విష్ణువిగ్రహ పతిష్ఠ యందలి విష్ణువు, ప్రథమాంధ్రరాజుగా తలంపబడుచున్న ఆంధ్ర విష్ణువనియే చెప్పవచ్చును. ఈ విషయము విశాలా నగరమును పరిపాలించిన సుమతియను రాజు శ్రీకాకుళమున ఆంధ్ర విష్ణువుయొక్క ప్రతిష్ఠవిని ఆశ్చర్యమునొంది "ఈ దేవుండు మదీయ స్వసత్కులధనంబియుందిరాధాముడేదేదీప్యంబగు నాంధ్ర నాథుఁడనగన్ దివ్యస్వరూపజ్ఞులా భూదేవోత్తము లాలకించిన విని.

6. వల్లభాభ్యుదయము, పీఠిక.

సమ్మోదంబుతో భూవరుండాది బ్రహ్మముం గాకుళాధిపుఁబదధ్యాన ప్రసంగంబులన్"[7] అనుటచే సువ్యక్తమగుచున్నది. మరియు ఈ అంశము వలన ఆంధ్ర విష్ణువు ఆంధ్రదేశమున రాజ్యమును స్థాపించు కాలమును ఊహించుటకు ఆధారమగుచున్నది.

ఆంధ్రసామ్రాజ్యము చంద్రగుప్తునకు పూర్వమే స్థాపింపబడినటుల మనకనేక నిదర్శనములు కలవు. మౌర్య సామ్రాజ్యాధిపతియైన అశోకుడు తన శాసనములందు ఆంధ్రులను గూర్చిన ప్రస్తావన చేసెను.[8] మరియు "...... Presumably in the early Maurya period, they were powerful people with large army and some thirty fortified towns — next to the kingdom of Magadha the strongest State in India. Their Capital was first Srikakulam on the Krishna, and later Dhanyakataka higher upon the same river. Towards the end of the 3rd century B.C. they were rapidly expanding their territory under a King Simuka who founded the Satavahana or Satakarni dynasty, which ruled the Telugu Country for nearly 500 years."[9] అని తెల్పిన Pliny అనునాతని వ్రాతల వలన ఆంధ్రులు క్రీ.పూ. 3వ శతాబ్దమునకు పూర్వమే రాజ్యము స్థాపించి ఉందురని తెలియుచున్నది. ఇన్ని ఆధారములున్నప్పటికి, ఆంధ్ర సామ్రాజ్యమును స్థాపించిన తొలి తెలుగురాజైన ఆంధ్ర విష్ణువును గూర్చి గాని, అతడు రాజ్యము ఎప్పుడు స్థాపించెనను అంశమును గాని ఎవ్వరును పేర్కొనలేదు. ఈ మహాపురుషుని చరిత్రను తెలుసుకొనుటకు ఒకటి రెండు పురాణగాథలు తప్ప ఆధారములు లభించుటలేదు. ఈ ఆధారములకు తోడ్పడుచున్నది వల్లభాభ్యుదయము నందలి సుమతి కథ. ఈ ఆధారముల వలన, ఆంధ్ర మహావిష్ణువుచే ఆంధ్రరాజ్యము, క్రీ.పూ. 4, 3 శతాబ్దులనాడు స్థాపింపబడి యుండునని ఊహింపవచ్చును. ఈతని సంతతివారు క్రీ.పూ. 3వ శతాబ్దపు చివరి భాగమున శాతవాహన రాజ్యము స్థాపింపబడిన వరకు రాజ్యము పరిపాలించియే ఉందురు. కాని వీరి చరిత్రకూడ తెలియుటలేదు.

క్రీ.పూ. 300 సంవత్సరములనాడు ఆంధ్రుల వైభవ ప్రాభవములనుగూర్చి ప్రస్తావించిన Megasthenes వ్రాతల వలనకూడ ఆంధ్రులు క్రీ.పూ. 400 సంవత్సరముల నాడే రాజ్యమును స్థాపించిరను అంశము స్పష్టమగుచున్నది.[10]

---

7. వల్లభాభ్యుదయము, ద్వి. ఆ., ప. 5.
8. Indian Historical Quarterly, Vol. I, p. 562.
9. Alexander, Ancient India, p. 57.
10. The Andhras and the Telugus, Indian Historical Quarterly, March, 1925, Vol. I, p. 562.

పై ఆధారముల వలన క్రీస్తు తరువాత ఆంధ్ర విష్ణువుచే ఆంధ్ర రాజ్యము స్థాపింపబడెనను ఈ గ్రంథమునందలి అంశము సత్యమయినది కాదను విషయము స్పష్టపడుచున్నది.

కాని కృష్ణ వెల్లువలో శ్రీకాకుళము మునిగిపోయిన వేయి సంవత్సరములకు సుమతి మరల కాకుళ నాథుని ప్రతిష్ఠించెనను ఈ గ్రంథమునందలి గాథ సత్యమయినదియే అయియుండును.

ఈగతి శరత్సహస్రం
బేగిన నాకాలమున మహాపతి విజయో
ద్యోగుడు భారత వర్షా
భోగధరా పాలనిపుణ పుణ్యాత్ముడిలన్
అతడహర్పతి కులసం
జాతుడు సదసద్వివేక చాతుర్యగుణో
పేతుడు దిగంత వినుత
ఖ్యాతుడు సుమతి యను నృపుడు ఘనమతి యుతుడన్

అను పద్యముల వలన పై విషయము తెలియుచున్నది.

ఈ గ్రంథము వలన తెలియుచున్న ఇతర చారిత్రకాంశములందు సుమతి చరిత్ర యొకటి.

**సుమతి :**

సుమతి విశాల నగరమును పరిపాలించు చుండెను. ఈతడు అహర్పతి (లేదా హారతి) కుల సంజాతుడు. శ్రీకాకుళదేవుని విషయములను విని, ఆ క్షేత్రమునకు, రథ, గజాశ్వసేనా సమేతుడయి "చామర స్తోమరుచిరాభిరాముడగుచు" వచ్చెను. అచట నివసించుచున్న మునులు రాజునకు అర్ఘ్యపాద్యాదుల నొసంగి, కందమూలఫలాదులతో అతిథ్యము గావించిరి. వారి అతిథ్యమునకు మెచ్చి రాజు నేను మిమ్ములను సత్కరింప వలయునుగాని మీరు ఇట్లు చేయరాదు, మీ అభీష్టమేమిదో తెలియజేసిన నేనటుల చేసెదనని మునులను కోరెను. అంత మునులు వారు పూజించు చున్న విష్ణు విగ్రహమును చూపి,

"అరలేకిచ్చట దేవతాలయ కవాటా నీక మద్ద్వారగో
పురవీధీ ప్రమణాభి మంటపచయంబుల్ భానురాందోళికా
ద్యురు యాన ప్రకరం బొనర్చి మఱి నిత్యోల్లాస మాసోత్సవో
త్కర సంవత్సర వైభవోల్లసిత కైంకర్యంబు లీస్వామికిన్
నడిపింప వలయు నరవర
తడయక భవదీయ పాలితంబగు భువికిన్

దొడవగును రమా వల్లభు
డడరున్ గడు వేడ్క తోడ నని వచియింపన్."[11]

విని రాజు

"ఈ దేవుండు మదీయ సత్కుల ధనంబీయిందిరాధాముడీ
దేదీప్యంబగు నాంధ్ర నాథుడనంగన్."

అని

"మ్రెక్కుచును మాటి మాటికి ముదముతోడ నఖిల పరిచర యుతముగా నచట నిలిచి యాంధ్రనాయక దాసుడ ననుచు" పల్కి, దీక్షవహించి, నేర్పరులయిన శిల్పులను రావించి, కళాకారులను పిల్పించి, సకల సామగ్రియు సమకూర్చి గోపురమును, ద్వార కవాటములను, తోరణ రత్నకుడ్యములను సాలభంజికలతో అలరారు స్తంభములను మంటపములను, ప్రాకారములను నిర్మించి అందు నానామణుల తోడను కాంచనము తోడను అలంకారముల చేయించెను. చక్రతీర్థమను సరోవరము త్రవ్వించెను.

"అమల మణి దండ ధవళధ్వజాత పత్ర
చారుతర చామ రాము వృత్తోరు పీఠి
కాప్రశయ్యామహాందోళి కానికాయ
ముకుర కాంచన భూషణములు నొసంగి"[12]

అచట నానా ఫల పుష్పవృక్షాదులతో ఉద్యాన వనముల నిర్మించి, సకల సౌకర్యములతో నగరమును నిర్మించెను. ఆ నగరము సకల ఫలవృక్షము లతో నయనాభిరామముగా విలసిల్లెను. అనంతరము సుమతి ఆ విష్ణుదేవు నకు మహావైభవముతో మహోత్సవములు శాశ్వతముగా జరుగుటకు వలయు నేర్పాటులను గావించెను. కొన్ని దినములు అచట నివసించి, అచటి విప్రులకు భూరి దక్షిణలనొసంగి, శ్రీ వల్లభునకు అతి భక్తితో ప్రణామములర్పించి, చతురంగ సేనాసమేతుడై, తన పురమునకు చనెను. సుమతి తరువాత అతని వంశపు రాజు లందరును ఈ దేవునకు సపర్యలు చేయు చుండిరి. ఇచట సుమతి ప్రథమాంధ్ర రాజయిన ఆంధ్రవిష్ణు విగ్రహమునకే ఆలయమును నిర్మించెననుట స్పష్టమగు చున్నది. కాని కొన్ని నాళ్లకి దేవాలయము కృష్ణవెల్లువలో కొట్టుకొని పోయెను.

సుమతి పరిపాలించిన విశాల నగరము, లిచ్ఛవి తెగవారు పరిపాలించిన మగధ రాజధానియైన వేశాలి అయి యుండును. పూర్వము ఆంధ్రుల తెగకు చెందిన ఈ సుమతి అను రాజు వేశాలిని రాజధానిగ రాజ్యమును చేసినటుల ఈ గాథవలన తెలియుచున్నది. పూర్వము గంగా తీరమున ఆంధ్రులున్నటుల

11. వల్లభాభ్యుదయము, ద్వి. ఆ., pp. 15, 16.

12. వల్లభాభ్యుదయము, ద్వి. ఆ., p. 29.

మనకు నిదర్శనములు కలవు. అనాడు ఆంధ్ర సామ్రాజ్యము మగధ వరకు విస్తరించియుండుటచే ఇతడు ఆంధ్రులకు ప్రతినిధిగ విశాల నగరమున రాజ్యము చేసి యుండును. ఇతడు క్రీ. శ. రెండవ శతాబ్దమున చివరి భాగమున పరిపాలించెనని తెలియుచున్నది.[13]

కనుక ఈ గ్రంథమున సూచింప బడిన ఆంధ్రులు ఉత్తర దేశమునుండి దక్షిణ దేశమునకు వచ్చు అంశము సమంజసమయినదిగ కన్పట్టు చున్నది.

సుమతి చరిత్ర కాక, అహిచ్ఛత్రపుర వృత్తాంతము, ముక్కంటి మహా జనపతి కథ, అనంతపాలుని జన్మ వృత్తాంతము మొదలగు కొన్ని చారిత్రకాంశములను కూడ ఈ గ్రంథము తెల్పుచున్నది.

అహిచ్ఛత్రపుర వృత్తాంతము :

ఈ పురము గంగాతీరమున నున్నది. దీనిని మహామతి యను రాజు పరిపాలించుచుండెను. ఒకనాడు ఆ పట్టణమునందలి ద్విజులకును, బౌద్ధులకును వాగ్వివాదము జరిగెను. అంత రాజు ఒక పెద్ద కుంభమునందొక విష సర్పము నుంచి దానిపైనొక వస్త్రము వేసి బంధించి సభా మధ్యమునకు తెప్పించి, ఇరు పక్షముల వారితో, 'నీ కుంభ నిక్షిప్త బంధుర సద్వస్తువుఁదెల్పుడీ' యని పలికెను. బౌద్ధులు దానిని గాంచి అందు సర్పముగలదని తెల్పిరి. ద్విజులు అది గాంచి

"సర్పమైన నీ యదనున మాయనుగ్రహ మహత్త్వమునన్ ధవళాతపత్రమై యొదవు" ననుచు పల్కిరి. అంత రాజు కుంభమునకు కట్టిన వస్త్రమును తీసి చూడ నందు ధవళాత పత్రముండెను. రాజు బ్రాహ్మణుల మాహాత్మ్యమునకు మెచ్చి, విప్రులే బౌద్ధల కంటెను పవిత్రమయిన వారని నిర్ణయించెను. బౌద్ధులు ఆ పురమును విడచి వెడలి పోయిరి. ఇట్టి అహిచ్ఛత్రపురమున శ్రీహరి నివాస మేర్పరచుకొని యుండెను. ఇటనుండియే శ్రీహరి శ్రీకాకుళమున నివసించుట కేగెనని ఐతిహ్యము. ఈ గాథవలన మనకు బౌద్ధమత అవసానమును, వైదిక మతోద్ధరణమును తెలియుచున్నవి. గంగాతీరమున గల ఈ అహిచ్ఛత్రపురమునకును, ఆంధ్రదేశమునకును సంబంధ బాంధవ్యములు కలవనియు, ఆంధ్రులు మొదట ఈ గంగాతీరముననే యుండి, క్రమ క్రమముగా ఆంధ్రదేశమున స్థిర నివాస మేర్పరచుకొనిరనుటకు నిదర్శనముగ ముక్కంటి మహా జనపతి కథ వర్ణిత మయినది.

ఈ అహిచ్ఛత్రపుర గాథ యందు బౌద్ధమతావసాన విషయమే కాక ఆంధ్ర విష్ణువు మొదట గంగాతీరమున నుండి కృష్ణాతీరమునకు వచ్చి కలియుగము

---

13. వల్లభాభ్యుదయము, ఆంగ్ల పీఠిక, p.5.

సంభవించుటచే మరల అహిచ్ఛత్రపురమునకు వెడలి పోయెనని వర్ణింపబడి యుండుటచే, అంధ్రులు గంగాతీరమునుండి కృష్ణాతీరమునకు వచ్చి కొన్నాళ్లుండి, మరల గంగాతీరమునకు మరలినటుల సూచనగా తెలియుచున్నది. గంగాతీరమునకు వెడలిన అంధ్రులు మరల మరియొకమారు కృష్ణాతీరమునకు వచ్చి స్థిరనివాసము లేర్పరచుకొనిరి. ఈ చారిత్రక విషయములను, కవి భగవంతునితో ముడిపెట్టి శ్రీహరి గంగాకృష్ణాతీరములకు రాకపోకలను సాగించెనని పురాణ ధోరణిలో తెల్పెను.

**ముక్కంటి మహాజనపతి :**

వింధ్య పర్వత ప్రాంతమున నర్మదానదీ తీరమున గల ఒక శబర గ్రామమున అచ్యుత శర్మ అను బ్రాహ్మణుడుండెను. అతనికి ఒక కుమార్తె గలదు. అతని భార్య మరణించెను.

ఆ విప్రుడా కుమార్తెను తీసుకొని పోవుచు ఒకచోట యయాతి కులము వారగు రాజులు కొందరు తపము చేయుచుండుట గాంచి, వారికి తన కుమార్తె నప్పగించి తాను తపము చేయుటకు పోయెను.

రాజుల కడ దినదిన ప్రవర్ధమానయై, యౌవన వతియైన ఆ బాలికను గాంచి శంకరుడు వివాహము చేసికొనుటకు నిశ్చయించుకొని వారణాసి యందు తపము చేయుచున్న ఆ బాలిక యొక్క తండ్రిని కలసికొని తన కోరికను తెలిపెను. అచ్యుత శర్మ తన కుమార్తెను అతనికొసంగెను. వారికి, నుదుటి యందొక కంటితో నొక పుత్రుడుదయించెను. అతడు ధరణివరణ నగరమునకు రాజాయెను. ఇతడు భైరవుని పూజించి అతని అనుగ్రహమున యోగ పాదుకలను పొందెను. ఆ పాదుకల మహిమతో నిత్యము అతడు పుణ్య తీర్థముల సేవించుచుండెను. ఒకనాడు నారద మహర్షి వలన అహిచ్ఛత్రపురము యొక్క గొప్పతనమును విని, అతని ఉపదేశాను సారముగ అహిచ్ఛత్రపురమున కేగుటకు నిశ్చయించుకొనెను. అంత అతని భార్య కాంతిమతీదేవి తాను కూడ వచ్చెదనని తెలుప ముక్కంటి మహాజనపతి అందుల కంగీకరించి భార్యతో అచటి కేగెను. గంగానదియందు స్నానము చేయు సమయమున, ఒడ్డున గల పాదుకలు మాయమాయెను. రాజు చింతాకులుడాయెను. అది గాంచి అతని భార్య చింతించుటేల ఇచట గల బ్రాహ్మణులు మహిమాన్వితులు, వారిని రప్పించి పూజ చేయుము. వారి మహిమ వలన మరల పాదుకలు లభించునని తెల్పెను. రాజటుల చేయగా, బ్రాహ్మణుల మహిమ వలన పాదుకలు లభించెను. రాజందులకు మిక్కిలి సంతసించి, వారిని అంధ్రదేశమునకు రమ్మని ఆహ్వానించెను. అంతవారు నీవు పాదుకల మహిమ వలన ప్రతి దినము ఈ అహిచ్ఛత్రపురమునకు వచ్చుచు బోవుచు మమ్ము పరామర్శించి పొమ్ము, కొన్ని దినముల కిచట దుర్భిక్షము సంభవించును, అంత

మేమాంధ్రదేశమున కడుదెంతుమని అనతిచ్చిరి.

కొంత కాలమున కట క్షామము సంభవించి, బ్రాహ్మణులందరును ముక్కంటి మహా జనపతికి తెలిపినటుల ఆంధ్ర దేశమునకు వచ్చిరి. ముక్కంటి మహా జనపతి వారిని ఆదరించి ధనధాన్య రత్నరాసులను, భూములను, గ్రామములను ఇచ్చి వారికి స్థిర నివాసము లేర్పరచెను.

ఈ గాథ యందు వర్ణితమయిన ధరణివరణ నగరము, కృష్ణాతీరమున గల ధరణికోట. ఇక ముక్కంటి మహా జనపతియే త్రిలోచన పల్లవుడు. క్రీ.శ. 5వ శతాబ్దము చివరి భాగమున నుండెడి పల్లవ చక్రవర్తి స్కందవర్మయే త్రిలోచన పల్లవుడని కొందరి అభిప్రాయము.[14] ఇతనికి ముక్కంటి కాడు వెట్టియని మరియొక బిరుదము కలదు. ఈ విషయమును కొన్ని శాసనములు పేర్కొనుచున్నవి. ఇతడు చోళ రాజులలో ప్రఖ్యాతి గాంచిన కరికాళ చోళుని సమకాలీకుడనియు, కరికాళుడితనిని యుద్ధమున జయించి, అతనిచే కావేరీ నదికి కట్ట కట్టించెననియు తమిళ చరిత్ర కారుల అభిప్రాయము.[15] ఈ త్రిలోచన పల్లవుడు గంగాతీరము నుండి వచ్చిన అనేక బ్రాహ్మణ కుటుంబములకు అగ్రహారముల నిచ్చినటుల, పండితారాధ్య చరిత్ర, కళింగత్తు పరణి మొదలగు గ్రంథములందు కలదు. కోటవంశీయుడగు కేతరాజు వేయించిన శాసనము వలన, ఈ ముక్కంటీశ్వరుడు గంగాతీరమునుండి వచ్చిన ఏడువందల బ్రాహ్మణ కుటుంబములకు అగ్రహారములనేకాక, గుంటూరు జిల్లా యందలి ఐనగల్లు, ఉప్పుటూరు, సంకురాత్రిపాడు మొదలగు గ్రామములను సప్తర్షుల పేరిట దానమిచ్చినటుల తెలియుచున్నది.[16]

ముక్కంటి పల్లవుడు శివుని మెప్పించి యోగపాదుకలను బడసి, వాటి మహిమవలన తాను తలచిన చోటునకు పోయివచ్చుచు, గంగా తటమున స్నానము చేయు సమయమున పాదుకలు పోగా, అచటగల బ్రాహ్మణుల సహాయమున పాదుకలను పొందుట వారిని తన దేశమునకు రమ్మని కోరుట, గంగాతీరమున క్షామము సంభవింప వారు కృష్ణాతీరమునకు వచ్చుట పల్లవరాజు వారికి వసతి కల్పించుట వల్లభాభ్యుదయమున వర్ణితమయిన కథ. ఇట్టి కథయే మరికొద్ది మార్పుతో రామరాజీయమున వర్ణింపబడినది. అరవీటి వంశమునందలి మూల పురుషుల చరిత్రములను వర్ణించుచు కవి ఇట్టి కథను వర్ణించెను.[17]

ఈ రెండు కథలకును సామ్యము కలదు. ఈ రెండు కథలవలన తెలియు

---

14. B.V. Krishna Rao, Early dynasties of Andhra Desa.
15. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, p. 152.
Annual report on Epigraphy for 1899-1900, para 45.
16. South Indian Inscription, Vol. VI, p. 228.
17. రామరాజీయము, pp. 19, 20.

చున్న విషయము, ఉత్తర దేశమునుండి దక్షిణ దేశమునకు అర్యుల రాక.

పెక్కుమంది రాజులు తాము ముక్కంటి పల్లవుని వంశీయులమని చెప్పి కొనుట కలదు. దర్శి తాలూకా సోమవరపుపాడునందు క్రీ.శ. 1218–19 సంవత్సరములలో వేయించిన శాసనము ఈ విషయము స్పష్టము చేయుచున్నది, (Indian Antiquary, Vol. XXXVIII).

ముక్కంటి పల్లవునకు ముక్కంటి కాడువెట్టియను మరియొక నామ మున్నటుల పైన తెలిపితిని. ఈ 'కాడువెట్టి'ని కార్వేటి నగరముగ, రైస్‌చే సంపాదితమయిన గాంగుల శాసనములవలన తెలియుచున్నది. కార్వేటి నగరము ఉత్తర ఆర్కాటునందు గలదు.[18] ఈ కార్వేటి నగరమువలన అతనికి కాడువెట్టి అను నామమెటుల స్థిరపడినదో తెలియుట లేదు. కాడువెట్టి అనునది వంశనామమొ, లేక వ్యక్తి నామమొ అయి యుండవలెను.

"...Perhaps Kaduvetti is the same as the Tamil Kadava which is synonymous with Pallava" అని Epigraphia Indica నందు గలదు.[19] కనుక 'పల్లవ' అను పదమే వాడుకనందు క్రమక్రమముగ కాడువెట్టిగ మార్పుచెంది స్థిరపడి యుండును.

ఈ గ్రంథమున ముక్కంటి మహాజనపతి కాలమున ఉత్తర దేశమున గొప్ప క్షామము సంభవించుట, అచట నివసించెడి బ్రాహ్మణులందరును దక్షిణ దేశమునకు తరలివచ్చుట దేవుడు కూడ తరలివచ్చుట వర్ణితమయినది.

క్రీ.పూ. 3 వ శతాబ్దమున ఉత్తర దేశమున కరువు సంభవించినటుల ఒక గాథ గలదు. ఈ గాథ శ్రావణ బెల్గొళనందలి జైనశాసనమున గలదట. భద్రబాహు అను నాతడు (జైనుడు) పదిరెండు సంవత్సరములపాటు ఉత్తర దేశమున క్షామము సంభవించునని తెలుపగా, పెక్కుమంది బ్రాహ్మణులు దక్షిణ దేశమునకు తరలివచ్చిరని ఈ శాసనమున గలదట. ఉత్తర దేశమునుండి వచ్చిన ఈ బ్రాహ్మణులు మార్గమున పెక్కు అగచాట్లు పడి కడకెటులో దక్షిణ దేశమును చేరిరనియు, భద్రబాహు జైనుడగుటచే, బ్రాహ్మణులను అగచాట్లు పెట్టుటకే యిట్టి పని చేసెననియు తెలియుచున్నది.[20]

క్రీ.పూ. మూడవ శతాబ్దమున జరిగిన ఈ గాథను క్రీ.శ. 5, 6 శతాబ్దము లకు చెందిన ముక్కంటి పల్లవునితో ముడిపెట్టుట ఈ గ్రంథమున జరిగినది. ముక్కంటి పల్లవుడు గంగాతీరమునుండి వచ్చిన బ్రాహ్మణ కుటుంబములకు వసతి కల్పించనటుల శాసనములందు గలదు. క్షామమే వారి రాకకు కారణమని శాసనము

18. Mysore Gazetteer, Vol. I, p. 313.
19. Epigraphia Indica, Vol. VII, p. 23.
20. Indian Antiquary, Oct. 1912, p. 231.
Brahman Immigration into South India.

లందు లేదు. కనుక కవి ముక్కంటి పల్లవునకు, ముందు జరిగిన విషయముతో ముడిపెట్టి యుండును.

అనంతపాలుని వృత్తాంతము :

కృష్ణాతీరమున శ్రీకాకుళక్షేత్ర ప్రాంతమున మాధవుడను బ్రాహ్మణుడుండెను. అతడు గర్భవతియైన భార్యాసహితుడై గంగాయాత్రకు బయలుదేరెను. కళింగ దేశపరిసరమున అరణ్యమున మాధవుని భార్య ఒక పుత్రుని బడసెను. తీర్థయాత్ర విఫలమగునని, మాధవుడు, ఆ బాలుని

"దళ సంకీర్ణ విశాల శాఖల నితాంతంబైన భూజంబు క్రిం
ద లసత్పల్లవ పత్ర సయ్యా నొసగి సంస్థాపించి దీవించి ర
క్షలు బంధించి ధరాది భూతచయ దిక్పాలాభి ధేయంబు చె
న్నలరన్ వేడి తదీయ డింభకు భవిష్యద్భాగ్య భావంబులన్
తాళీదళమందున నవ
లీలన్ గోత్రాన్వయావళీ నామములా
మూలాగ్రముగ లిఖించియు
బాలుని పద కమలమందు బంధించి వెసన్"

తీర్థయాత్ర కేగెను. తలిదండ్రులు విడిచిపోయిన ఆ బాలునొక సర్పము కాపాడు చుండెను.

కటకపురమును రాజధానిగ కళింగ దేశమును పరిపాలించుచున్న అనంగ భీముడను రాజు వేటకేగి, అరణ్యమున సర్పము పడగ నీడనుగల బాలుని గాంచెను. రాజును చూచిన సర్పము అంతర్ధానమాయెను. అంత రాజా బాలుని గాంచి, సర్పము కాపాడుటచే గొప్పవాడగునని భావించి, ఆ బాలునకు అనంతపాలు డను నామమిడెను. ఆ బాలుని పాదమున కట్టిన తాటియాకును జూచి, అందు వ్రాయబడిన ఆ బాలుని తలిదండ్రుల నామములు, కులగోత్రములు, నివాసస్థానము మొదలగు విషయములను చదివి, ఆ బాలుని విడచిపోవుటకు గల కారణమును తెలిసికొని, ఆ బాలుని తీసికొనిపోయి, తన పుత్రుడయిన నృసింహునితోపాటు పెంచెను. విద్యాబుద్ధులను చెప్పించి, ఉపనయనము చేయునపుడు పత్రముపై వ్రాసిన విధముగ గోత్రాదులను చెప్పి ఉపనయనము చేయించి, ఆ పత్రమును ఆ బాలున కొసంగెను. పుత్రునితోపాటు వివాహమును గావించెను.

అనంగ భీముడు వృద్ధుడయిన తరువాత, కుమారుడగు నృసింహుని పట్టాభిషిక్తుని గావించెను. తాను పెంచిన అనంతపాలుని సైన్యాధ్యక్షుని చేసెను. సైన్యాధ్యక్షుడగుటచే అతనికి దండపాలుడను పేరు వచ్చెను.

నృసింహుడు, సైన్యాధ్యక్షుని సహాయముతో, అత్యంత విక్రముడై ప్రత్యర్థులను జయించుచుండెను. ఇతడు బ్రాహ్మణుల నాదరించుచు ప్రజలందరు ఆనందించు

విధముగా రాజ్యము చేయుచు, సోదరునివంటి అనంతపాలుని గాంచి,

"సకల జనులు పొగడ సత్యవ్రతాహ్వయ
పుణ్యనగరమందు భూరిమహిమ
గరిగిరీంద్ర మలరు కమనీయసానువై
పరనృపాల జైత్ర పటిమదనరి
మనలో నెవ్వరమైనను
(జని) విజగీషాంక లిఖిత శాసనమట సం
తనముగ సంస్థాపించిన
మనమునకు హర్షమగు నమాత్యవరేణ్యా"

—వల్లభాభ్యుదయము, తృ.ఆ, ప. 91, 92

అని పల్కెను. అది విని అనంతపాలుడు తానే శత్రువులను గెల్చి శాసనమును వేయించెదను, నీ కీర్తి అతిశయించునటుల, మార్గమున తటాక కూపవన నిర్మాణమును, దానములను చేసి వచ్చెదనని తెల్పి, రాజాజ్ఞతో చతురంగ సైన్యసమేతముగ, శత్రుభీకరముగ బయలుదేరి మార్గమధ్యమున దానధర్మముల నొనర్చుచు, విప్రుల ఆశీర్వాదములను పొందుచు, శ్రీకాకుళక్షేత్రమున కరుదెంచి అచట సేనా సమేతముగ విడిసెను.

అట కృష్ణానదియందు స్నానాదులనొనర్చి, బ్రాహ్మణులకు దానమునొసంగెను. అనంతరము తన తలితండ్రులను చూడవలెనని భావించి, వారు జీవించియున్న వారిని దర్శింపగలనని ఆలోచించి, ఆ ప్రాంతమునగల సర్వగ్రామములందలి విప్రులను రావించి దానమొసంగ సాగెను. దానసమయమున వారి కులగోత్రాదుల తెలిసికొనుచు, పత్రమునగల కులగోత్రములు, నామముగల బ్రాహ్మణునిగాంచి, అతడే తనతండ్రియని నిశ్చయించుకొని అందరికి సెలవిచ్చిపంపివేసి, ఆబ్రాహ్మణునకు తనవద్దగల పత్రము చూపెను. ఆ పత్రమును ఆ బ్రాహ్మణుడు చూచి పూర్వవృత్తాంతము జ్ఞప్తికితెచ్చుకొని, 'దండకారణ్యమున జన్మించిన నా పుత్రుని చరణమున కీ పత్రమునువ్రాసికట్టి ఆ పుత్రునట విడిచితిని. మరల ఈ పత్రమును మీకడ కనుగొంటిని. ఈ పత్రము మీకడమీకెటుల వచ్చినది దండనాథా! యని ప్రశ్నించెను. అంత అనంతపాలుడాతడే తన తండ్రియని నిశ్చయించుకొని, తనవృత్తాంతమాతనికి తెలిపితండ్రి చరణములకు మ్రొక్కెను. అంత ఆ బ్రాహ్మణుడు తనభార్యను పిలుచుకొనివచ్చెను. అనంతపాలుడు తలిదండ్రులనుగాంచి మిక్కిలి ఆనందించెను. తలిదండ్రులతో అట కొన్ని సంవత్సరంబులు గడపెను.

అచట నివసించుకాలమున, శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యమును విని, విస్మయమంది, మరల ఆ స్థలమున గృహక్షేత్రాది వసతులను నిర్మించి, జన నివాస యోగ్యంబుగా చేసి, అందు బ్రాహ్మణుల నుంచుటకును విగ్రహమును మరల ప్రతిష్ఠ చేయుటకును నిశ్చయించి, విగ్రహాన్వేషణము చేయ మొదలిడెను.

బ్రహ్మకుండి తటినీ తటమున, శంకర దివ్యధామమను పురమున, రామనశర్మ యను బ్రాహ్మణుని ఇంట కాకరపాదు క్రింద శ్రీహరి విగ్రహమున్నదని తెలిసికొని అటకేగి, ఆప్రదేశమున భూమినిత్రవ్వించి, విగ్రహమును తెప్పించి, విష్వక్సేనాది నిత్యసూరి పరివార సమేతముగా, అగమోక్తప్రకారముగా శ్రీ వల్లభుని విగ్రహమును ప్రతిష్ఠించెను. వీరభద్ర, వినాయక, పార్వతి, నంది, భృంగీశ, భైరవాదుల విగ్రహములను సహితము ప్రతిష్ఠచేసెను.

అనంతరము మరకత మణిమయములగు ద్వారకవాటములను, చంద్రకాంత శిలలతో సోపానములను, సాలభంజకలతో స్తంభ మంటపాదులను, తోరణకుడ్యములను నిర్మింపజేసెను. రథ, గజ, తురగ, హంస వాహనములను వివిధ వాద్యములను ఆ దేవున కర్పించెను. నవరత్నఖచితములయిన సమస్త ఆభరణములతో దేవుని అలంకరించెను.

తరువాత నగరమును, సర్వాంగసుందరముగ నిర్మించి అందు సర్వజనులను నింపెను. మునుపు సుమతి యొనర్చిన విధముగనే శ్రీకాకుళనగరమును సర్వాంగ సుందరముగ తీర్చెను. నానావిధ ఫల పుష్పవృక్షములను వేయించి నందనవనమువలె ఆ నగరమును భాసింపచేసెను. దిన, పక్ష, మాస, యుగ, మహోత్సవములకై, వాద్య విశేషములతో నాట్యము చేయుటకు వార వనితల నియమించెను. ఇట్లా శ్రీకాకుళమును సర్వజన యోగ్యమొనర్చి, శ్రీ వల్లభునకు భక్తితోమ్రొక్కి, కాంచీపురముపైకి జైత్రయాత్రకు వెడలెను.

చతురంగసేనతో కాంచీపురమునకేగి, అచటనున్న రాజులనుజయించి, అచట విజయాంక శాసనమునువేయించి, మరల కటకమునకు మరలిపోయెను. ఇది వల్లభాభ్యుదయమునందలి అనంతపాలుని వృత్తాంతము.

3వ అనంగ భీమదేవుడు క్రీ.శ. 1216 నుండి 1235 వరకు కళింగదేశమును పరిపాలించెను. ఇతడే ఈ గ్రంథమున చెప్పబడిన అనంగభీముడు. ఇతనిది తూర్పు గాంగవంశము. ఈ అనంగ భీమదేవుని కాలము విషయమున భిన్నఅభిప్రాయములు కనపడుచున్నవి. వల్లభాభ్యుదయము పీఠికయందు "వింధ్యప్రాంతముననున్న కళింగరాజులలో అనంగ భీముడు క్రీ. శ. 1145 ప్రాంతము వఱకు పరిపాలించెను. అతని కుమారుడు 1145 మొ. 1164 వఱకు పాలించెనని శాసనములు తెలుపుచున్నవి." అని శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారలు వ్రాసిరి.

'Ancient India' అను చరిత్రగ్రంథమున అనంగ భీముని కాలము 1216 నుండి 1235 వరకు అని గలదు[21] 'History of Orissa' అనుగ్రంథమున అనంగభీమదేవుని కాలము క్రీ.శ. 1211 నుండి 1238 వరకును అని గలదు. చరిత్రగ్రంథములు రెండింటికిని కొద్ది సంవత్సరములు మాత్రమే భేదము కలదు.

---

21. Ancient India, p. 391.

కాని వల్లభాభ్యుదయపీఠికయందలి కాలమునకును, చరిత్రకారులిచ్చిన కాలమునకును 66 సంవత్సరములు భేదము కన్పించుచున్నది. ఈ అనంగ భీమదేవుడు చరిత్రకారులచే మూడవ అనంగభీమునిగా పేర్కొనబడెను. ఇతని తాత అనియంక భీముడు. ఈతనికిని అనంగభీముడను పేరుకలదు. వల్లభాభ్యుదయ పీఠికాకారులే అనియంక భీమునే, కథయందలి 3వ అనంగభీమదేవునిగ భావించినటుల తోచుచున్నది. ఈ అనియంకభీముని కాలము 'History of Orissa' ను బట్టి క్రీ. శ. 1190–1198 వరకు.

మూడవ అనంగభీమదేవుని కుమారుడు మొదటి నరసింహదేవుడు. మన పీఠికాకారులు వ్రాసిన విధముగ అనియంక భీమదేవునే, గ్రంథమున వర్ణింపబడిన అనంగ భీమదేవునిగ గ్రహించిన, అనియంకభీమదేవునకు, నరసింహుడను పుత్రుడు లేడు. అనియంకభీమదేవుని కుమారుడు 3వ రాజరాజు. ఈ మూడవ రాజరాజు క్రీ.శ. 1198 నుండి 1211 వరకు పరిపాలించెను. ఇతని కుమారుడు మూడవ అనంగభీమదేవుడు. కనుక గ్రంథమున వర్ణితమయిన కళింగరాజు, మూడవ అనంగ భీమదేవుడే తప్ప అనంగభీమదేవుడను పేరుగల అనియంక భీమదేవుడు కాదనుట స్పష్టమగుచున్నది.

ఈ అనంగభీమదేవుడు అరణ్యమున లభించిన అనంతపాలుని పెంచి, దండనాయక పదవినిచ్చినటుల మనకెట్టి ఆధారములును లేవు. ఈ గ్రంథమే ఆధారమగుచున్నది. అనంగ భీమదేవుని శాసనములు పెక్కుగలవు. ఉత్కళదేశమున గల స్థానిక చరిత్రలను పరిశీలించిన ఇట్టి కథ ఉండిఉండును. చరిత్రకారులీ విషయమును పరిశీలించిన విస్తృతమయిన ఆంధ్రవల్లభునిగాథ తెలిసికొనుటకు ఆధారము లభించును. 3వ అనంగ భీమదేవుని కుమారుడగు మొదటి నరసింహదేవుడు. గాంగవంశమున ప్రఖ్యాతిగాంచినవాడు. ఇతడు పెక్కు యుద్ధములనుచేసి విజయమును గాంచెను. ఇతడు వంగదేశపు గవర్నరయిన సుల్తాన్ తుగ్లక్‌ఖాన్‌ను ఓడించెను. ఈ విషయమును ముసల్మాన్ చరిత్రకారుడయిన మిన్‌హాజ్-అస్-షిరాజ్ వ్రాసెను.[22]

మొదటి నరసింహదేవుడు ముసల్మానులనేకాక హిందూరాజయిన కాకతీయ గణపతి దేవుని సేనానులను ఓడించెనని శాసనమువలన తెలియుచున్నది.

The inscription in the Lingaraj temple at Bhuvaneswar refers to a struggle between the Kakatiyaganapati (1199–1260 A.D.) and Narasimha I. It is stated that Narasimhadeva I in his forth Anka year by the power of the sword terrified the generals of the armies of three categories namely the infantary,

22. H.K. Mahatab, History of Orissa, Vol. I.

cavalry and elephants of the king Gananpati.[23]

పై నిదర్శనముల వలన మొదటి నరసింహ దేవుని దండపాలుడయిన అనంత పాలుడు, దక్షిణ దేశమున దిగ్విజయము చేసియే యుండి యుండును. కంచిని జయించి విజయాంక శాసనమును వేయించియే యుండును. అతడు శ్రీకాకుళమున ఆంధ్ర వల్లభుని విగ్రహమును ప్రతిష్టించి దేవాలయమును నిర్మించినటుల మన గ్రంథము తప్ప యింకెట్టి ఆధారములును లభించుటలేదు. కొంతయైనను సత్యము లేనిదె గాథగా వెలియుట, గ్రంథముల కెక్కుట జరుగదు కనుక, ఇది సత్యమనియే నమ్మ వచ్చును.

ఈ చారిత్రకాంశములే కాక ఈ గ్రంథమున, శ్రీకాకుళ క్షేత్ర మహాత్మ్యము తెలుపు మరి కొన్ని గాథలు గలవు.

సోమశర్మ కథ (ఉత్కళరాజకుమార్తె పురుషుడిగా మారిన కథ మొ॥నవి) :-

పూర్వము, కళింగ దేశమున యజ్ఞశర్మయను బ్రాహ్మణుడు భార్యయగు కాంతిమతితో నివసించు చుండెను. వారికి సోమశర్మ యను పుత్రుడుదయించెను. అతడు తలిదండ్రుల మాటలను వినక దుష్టులతో సహవాసము చేయుచు, కడకు తలిదండ్రులను బంధువులను విడచి అటవికులతో నివసించు చుండెను. మృగములను వధించుచు, మాంస భక్షణము చేయుచు, వ్యభిచారము చేయుచు, చోరుడయి అరణ్యమున సంచరించు చుండెను. అరణ్య మార్గమున ప్రయాణము చేయు పథికులను వధించి వారి వస్త్రసామగ్రులను గ్రహించుచు, పథికులలో స్త్రీలున్నయెడల కామముతో మన్మథ క్రీడల సలుపుట దినచర్య ఆయెను. ఈ విధముగా చేయుచు కొంతమంది స్త్రీలతో కాపురము పెట్టి వారి వలన పుత్రులను, పౌత్రులను గని దారుణ పాప కర్మలతో కాలము గడుపు చుండెను.

ఒకనాడు ఆ మార్గమున శ్రీకాకుళనాథుని ప్రసాదమును గొనుచు కొందరు బాటసారులు పోవుచుండిరి. వారిని వధింప నిశ్చయించుకొని సోమశర్మ వారికడ కరుదెంచెను. వారితో సంభాషించుచు వారిచ్చిన తీర్థ ప్రసాదాదులను గ్రహించెను. తీర్థ ప్రసాదములను గ్రహించిన వెంటనే వాని దుష్ట బుద్ధి సమసి పోయి, తాను పూర్వమొనర్చిన దుష్ట కార్యములకు విచారించి, బాటసారుల వలన శ్రీకాకుళ నాథుడుండెడి ప్రదేశమును తెలిసికొని అచటికేగి, తన శేష జీవితమును అచట గడిపి, మరణానంతరము విష్ణు సాయుజ్యమును పొందెను.

ఉత్కళరాజకుమార్తె కుమారుడుగా మారు కథ :

ఉత్కళ రాజునకు కుమార్తెయే తప్ప పుత్రులు లేరట. (ఆ ఉత్కళ

23. Orissa Historical Research Journal, Vol. I, pp. 392, 305.

రాజెవరో, ఏ ప్రాంతమును, ఏ కాలమున పరిపాలించెనో ఏమియు తెలుప లేదు కవి.) అతడు మిక్కిలి విచారించి శ్రీకాకుళ నాథుని పుత్రుల కొరకై వేడగా, శ్రీకాకుళ నాథుడతని భక్తికి మెచ్చి, అతని పుత్రికనే పుత్రునిగ మార్చెనట.

దండనాథ పురోహితుని ధనమును చోరులు అపహరింప, అతడు శ్రీకాకుళ నాథుని భక్తితో ప్రార్థింప, శ్రీకాకుళ నాథుని మహాత్మ్యమున చోరులాధనమును తిరిగి తెచ్చి యిచ్చు కథ.

చోరునిచే గొనిపోబడి, వల్లభుని మహిమ వలన, మరల చోరుడే తెచ్చియిచ్చిన బ్రాహ్మణ స్త్రీ యొక్క గోవు కథ.

వేశ్యాలోలుడయిన వల్లభుని అర్చకుని ఒకనాడా దేశమును పరిపాలించు రాజు గాంచి, ఏహ్యపడి భగవంతుని పూజించుట కనర్హుడని చెప్పి వెడలి పోవ, వల్లభుడు ఆ రాజు స్వప్నమున కనపడి నా భక్తులకు అపవిత్రత లేదనియు, అతనిని కృపతో చూడమని చెప్ప, రాజు మరల అతనిని అర్చకునిగ నియమించెనని మరియొక కథ, ఇందు గలవు.

స్థలమహాత్మ్యగాథల యందు బ్రహ్మాండ పురాణాంతర్గతంబని చెప్పబడుచున్న సంస్కృత శ్రీకాకుళ మహాత్మ్యమునందు ఇట్టిదే కొంత మార్పుతో నొక కథ కలదు. ఇది సుమతి అను ఆంధ్ర చక్రవర్తి కాలమున జరిగినట్లు వర్ణితమైనది.

సుమతి యొక్క ఇద్దరు రాణులును ప్రతిదినము శ్రీకాకుళేశ్వరునకు పూల మాలలను పంపుచుండిరి. వారు పంపిన పూల మాలలను, దేవాలయార్చకుడయిన వైఖానసుడు వేశ్యాలోలుడయి, వేశ్యకిచ్చి, మరునాడా పూలమాలను రాణులకు పంపెడివాడు. ఒకనాడా మాలయందు సుగంథతైల వాననతో కేశముండుట గాంచి, ఆ రాణులు మిక్కిలి కోపించి, వైఖానసుని పిలచి అడిగిరి. అంత ఆ అర్చకుడు దేవునకు కేశములున్న వనియు, వారి యందు అనుగ్రహముతో కేశమును పంపితిననియు చెప్పెను. అదివిని సుమతి దేవునకు కేశములున్నది లేనిది పరీక్షించుటకు మరునాడు వచ్చెదనని తెల్పెను. ఆ రాత్రి ఆ అర్చకుడు దేవుని ప్రార్థించగా ఆ దేవునకు కేశములు మొలచెను. మరునాడు రాజు కేశములతో నున్న దేవుని గాంచి, వైఖానసుని గౌరవించెను. కొంత కాలము దేవుడు కేశములతో నుండెననియు, తరువాత ఆ కేశములను ఉపసంహరించు కొనెననియు కథ గలదు. కోదండ రామకవి సంస్కృత మూలము ననుసరించియే తన గ్రంథమును వ్రాసి నట్లు తెలిపెను. మరి మూలమున నున్న ఈ గాథను తన గ్రంథమున సంపూర్ణ ముగ ఏల వ్రాయలేదో తెలియుట లేదు.

ఈ గాథలన్నియును కేవలము దేవుని మాహాత్మ్యమును తెల్పుటకు సృష్టింప బడిన గాథలు. చారిత్రకముగ ఈ గాథల కెట్టి అథారమును లభించదు. ఇట్టి గాథలు ఏ కాలమునందైనను పుట్టుచునే యుండు. దేవుని మహిమ వలన ఎవరికో ఏదో జరిగినదను చిన్న వార్త యిట్టి కథలకు అథారమగు చున్నది. ఇట్టి గాథల

వలన ప్రజలకు భగవంతుడనిన భక్తి భావము వ్యక్తమగునే తప్ప ఎట్టి చరిత్రయు తెలియదు. కనుక యిట్టి గాథలు చారిత్రక సత్యములా అని చర్చించుట కాలమును వృథా పరచుటయే యగును.

ఈ క్షేత్ర మాహాత్మ్యగాథలు తక్క, ఈ గ్రంథమున గల తక్కిన అంశములు చరిత్రకు మిక్కిలి ఉపయోగ పడుచున్నవి. ఈ అంశముల వలన ఆంధ్రుల ప్రాచీన చరిత్ర తెలియు చున్నది. ముఖ్యముగ ఆంధ్రదేశమున మొట్ట మొదట రాజ్యమును స్థాపించిన ఆంధ్ర విష్ణువు గాథ, ఒకప్పుడు ఉత్తర దేశమున గంగా తీరమున నివసించెడి అంధ్రులు, దక్షిణ దేశమునకు వచ్చి కృష్ణాతీరమున స్థిర నివాస మేర్పరచుకొనిన విషయము, ఆంధ్ర విష్ణువు యొక్క విగ్రహమును, విష్ణు విగ్రహముగా ప్రజలు పూజించుట, ఆ విగ్రహమును సుమతి అను రాజు, అనంతపాల దండపాలుడు పునఃప్రతిష్ఠించు విషయములు తెలియు చున్నవి. ఇందు ప్రాచీన రాజుల చరిత్రలు తెలియజేయు అంశములున్నప్పటికిని ముఖ్యముగ దైవ మాహాత్మ్యమును తెలుపుటకే ఈ గ్రంథము వ్రాయబడినట్లు స్పష్టపడు చున్నది.

క్షేత్ర మాహాత్మ్యముతో పాటు, చారిత్రకాంశములను పొందు పరచి, 'ఒకే దెబ్బకు రెండు పిట్టలను' విధముగా రెండు లక్ష్యములను సాధించెను కవి. క్షేత్ర మాహాత్మ్యమును తెలిపి పుణ్యమును సాధించెను. చరిత్రాంశములను తెలిపి ఆంధ్రుల చరిత్రకు కొంత తోడ్పడెను. ప్రాచీన ఆంధ్ర రాజుల చరిత్రలను పేర్కొను గ్రంథములు గాని, ఆంధ్రనాయకుని వర్ణించు గ్రంథములుగాని, మనకు లేవవియే చెప్పవచ్చును. అంధ్రనాయకుని ప్రసంశ మాత్రము ఆంధ్రవాఙ్మయమున కొద్దిగ కన్పడు చున్నది.

క్రీడాభిరామమున ఈ శ్రీకాకుళ దేవుని తిరునాళ్ల ప్రశంస కలదు. ఆంధ్ర విష్ణువు కాకర పాదునందు దాగియుండు కథ వర్ణితమయినది. తరువాత విజయ నగర సామ్రాజ్యాధీశ్వరుడైన శ్రీ కృష్ణదేవరాయలు ఈ దేవుని కీర్తించెను. ఆంధ్ర నాయకుని ప్రేరేపణ చేతనే తాను ఆముక్తమాల్యదను రచించినటుల తెలిపెను.

కాకతీయ గణపతి దేవుని మహా ప్రధాని శ్రీకాకుళ వల్లభునకు దానము చేసినట్లొక శాసనము కలదు.[24]

అనంతామాత్యుడు భోజరాజీయమున, తన తండ్రియైన ముమ్మడి తిక్కవిభుడు శ్రీకాకుళమున ఆంధ్ర వల్లభుని సేవ చేయుచుండెనని చెప్పెను.[25]

ఇటీవల కానులపాటి పురుషోత్తమ కవి 'ఆంధ్ర నాయక శతకము'ను రచించెను.

ఇట్టి విస్మృతమయిన ఆంధ్ర నాయకుని యొక్కయు, కొందరి ప్రాచీన

24. వల్లభాభ్యుదయ పీఠిక, p. 17.

25. అనంతామాత్యుడు, భోజరాజీయము, ప్ర. ఆ., p. 40.

ఆంధ్ర రాజుల యొక్కయు చరిత్ర వ్రాసిన ఈ కవి ప్రశంసనీయుడు.

వర్ణనాదికము లేమియును లేక కేవలము కథను చెప్పు ఉద్దేశముతో ఈ గ్రంథము రచింపబడినది. కవిత్వాంశము లేవియును లేక కథ సాగినది.

నాలుగవ అశ్వాసమున మాత్రము ఆంధ్ర విష్ణువు ఊరేగు సమయమున చూచెడి స్త్రీలను కవి పది పద్యములలో వర్ణించెను. సులభ శైలిలో వ్రాయబడిన ఈ క్షేత్ర మాహాత్మ్యమును చారిత్రక కావ్యముగ గ్రహించుటకు కారణము ఆంధ్ర వల్లభుని ప్రసక్తి ఉండుటయే.

# 3. చోళులు

భారతదేశ చరిత్రలో చోళరాజులు ప్రముఖ స్థానమును ఆక్రమించుకొనిరి. దక్షిణ దేశమును పెక్కు సంవత్సరములు అవిచ్ఛిన్నముగ పరిపాలించి, వీరులు గను, శూరులుగను, ప్రజారంజకులైన పరిపాలకులుగను ఖ్యాతిగాంచిన వీరి వ్యుత్పత్తిని నిరూపించుట దుర్లభము. చోళు లెచ్చటివారు, ఎప్పటినుండి రాజ్యమును పరిపాలింప దొడగిరి అను విషయములను తెలుసుకొనుటకు మనకు సరియగు ఆధారములు లభించుటలేదు. కాని వీరు పురాణయుగమున గొప్ప వీరులని, పాండవుల సమకాలీనులని తెలియుచున్నది. క్రీ.పూ. 4 వ శతాబ్దమున నివసించిన వ్యాకరణ శాస్త్రవేత్త కాత్యాయనుడు చోళుల ప్రస్థావన గావించెను.[1] కౌటిల్యుడు, బౌద్ధాయనుడు కూడ చోళుల ప్రస్థావన చేసిరి. అశోకుని కాలమున వీరు గొప్ప శక్తి సామర్థ్యముగల పరిపాలకులని తెలియుచున్నది. అశోకుడు వేయించిన శిలాశాసనములందు చోళులు పేర్కొనబడిరి.[2] కావేరీ పట్టణాధీశులు, వ్యాఘ్రలాంఛనులు అయిన చోళులు విదేశీయులకు కూడ సుపరిచితులు. టోలమి, ప్లిని, పెరిప్లస్ గ్రంథకర్తలు చోళుల ప్రస్తావన గావించిరి.

చోళులు పరిపాలించిన కావేరీ పట్టణ ప్రసక్తి, చోళులను గూర్చిన ప్రసక్తి పాళీ భాషలో బౌద్ధవాఙ్మయమున కలదు. వీరిలో అద్భుత కార్యముల నొనర్చిన మహావీరులు పెక్కుమంది కలరు.

'మహావంశములో' క్రీ.పూ. 2 వ శతాబ్ది మధ్య చోళరత్నుండి ఏళారుడు అను ఉన్నత వంశీయుడు సింహళ రాజైన అసేలుని జయించినట్లు కలదు. ఈతడు 44 సంవత్సరములు ప్రజానురంజకముగ శత్రుమిత్ర పక్షపాతము లేకుండా రాజ్యమేలినాడు. ధర్మపరాయణుడు. ఈతని ధర్మపరాయణతను నిరూపించుటకు పెక్కు గాథలు కలవు. రథమును గోవత్సముపై నడపిన నేరమున కీతడు తన ఏకైక పుత్రునకు మరణదండన విధించినాడు. ఈతని రాజ్యము దక్షిణాగ్రము నుండి ఉత్తరమున గంగాతీరమువరకు విస్తరించినట్లు తెలియుచున్నది. మనకు చోళుల చరిత్రను తెలునుకొనుటకు ముఖ్యాధారమైన తమిళ సారస్వతమున

1. Mahabhasya, Ed. Kielhorn, p. 270.
2. D.R. Bhandarkar, Asoka, p. 38.

ఈ వీరుని వృత్తాంతము కన్పించుటలేదు. క్రీస్తుకు పూర్వమెప్పుడో రాజ్యస్థాపన చేసిన చోళులు క్రీ.శ. 13 వ శతాబ్దమువరకు దక్షిణ భారతదేశమును పరిపాలించిరి.

కావేరీ పట్టణము, ఉరయూరు రాజధానులుగా పరిపాలించిన చోళులు క్రీ.శ. 3 వ శతాబ్దమునకు పూర్వమే అభివృద్ధి చెందిరి. వీరి చరిత్రను తెలిసికొనుటకు కూడ సంప్రదాయకముగ ఎట్టి ఆధారములు లేవు. వీరు 16 అని కొందరు, 84 అని కొందరు, అభిప్రాయపడుచున్నారు. వీరి చరిత్రను తెలిసికొనుటకు ముఖ్యాధారము ప్రాచీన తమిళ వాఙ్మయము నందలి సంఘసారస్వతము. సంఘసారస్వతము క్రీస్తు శకారంభమున వర్ధిల్లినది. ఇందలి కవుల కాలము, కావ్యముల అనుపూర్విని సరియైనదిగా నిర్ణయించుటకు వీలులేదు. అయినప్పటికిని చోళుల చరిత్రను తెలుసుకొనుటకు ఇదియే ముఖ్యాధారము.

చోళవంశోత్పత్తిని గురించి పుక్కిటి పురాణములు ప్రాచీన వాఙ్మయములో కన్పించుచున్నవి. చోళులు సూర్యవంశీయులు. శైవులు, వీరి కాలమున శైవ మతము అభివృద్ధి చెందినది. చోళరాజు లందరును శైవులే. అరివీర భయంకరులు, ప్రజానురంజకులైన పరిపాలకులు, శైవమతోద్ధారకులయిన చోళరాజులలోని కొందరి శివభక్తి నిరతిని సాహసకార్యములను వివరించు 'నవచోళ చరిత్ర' ఈ ప్రకరణమున పరిశీలింపబడినది.

## నవచోళ చరిత్ర—పోశెట్టి లింగనకవి

### పోశెట్టి లింగనకవి :

ఈ కవి తన కులగోత్రములను, తలిదండ్రుల నామములను తెలుపుకొనలేదు. తండ్రి రుద్రుడనియు, తల్లి పార్వతి యనియు చెప్పుకొనెను. ఇంటిపేరు మాత్రము పోశెట్టి యని తెలియుచున్నది. పోశెట్టి అను ఇంటిపేరు కుమ్మరుల యందున్నది కనుక ఇతడు కుమ్మరి వంశీయుడని పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు గ్రంథ పీఠికయందు వ్రాసిరి.[3]

ఇతడు భక్తగణస్తుతియందు కుమ్మరి గుండయను, బసవేశ్వరుడు, పండితారాధ్యుడు మొదలగువారికంటె ముందుగ స్మరించి ప్రశంసించుటచే ఇతడు కుమ్మరుల వంశీయుడని ఆదినారాయణ శాస్త్రిగారు నిర్ణయించిరి.[4]

పోశెట్టి లింగనకవి గార్లపాటి లక్ష్మణకవి శిష్యుడు. చకిలాల లింగప్ప అనునాతడు కన్నడమున రచించిన గ్రంథమును తెలుగు భాషయందు ద్విపదగా రచియింపుమని కోరగా, నవచోళ చరిత్రను రచించినట్లు గ్రంథమున తెలుపుకొనెను.

3. నవచోళ చరిత్ర, పీఠిక, p. 5.
4. నవచోళ చరిత్ర, పీఠిక, p. 5.

ఈ కావ్యమే కాక 'శంకరదాసమయ్య చరిత్ర,' 'వీరసంగయ్య దేవ చరిత్ర,' 'మల్హణ' చరిత్ర,' 'శిష్య ప్రబోధనము' లను రచించెను.[5] ఇతడు నవచోళ చరిత్రమును, శ్రీరాముపల్లి (బగిరాముపల్లి అనియు గలదు) మృత్యుంజయేశ్వరునకు అంకిత మిచ్చెను. ఈ మృత్యుంజయేశ్వరుని గూర్చి "కృతిపతి దేవుడు కాడనియు, బగిరాముపల్లె నివాసియగు మృత్యుంజయ నామముగల మానవుడనియు, కృతి ప్రేరకుడగు చకిలాల లింగప్పకును, మరికొందరు శివభక్తులకును గురువని నేనూహించు చున్నాడను"[6] అని శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసిరి.

నవచోళ చరిత్ర ఐదాశ్వాసముల ద్విపద కావ్యము. చోళరాజులను కథా వస్తువుగ గ్రహించిన ఏకైక గ్రంథము. ఇది కన్నడ గ్రంథమునకు ఆంధ్రీకరణము. చోళులను గూర్చి రచించిన కావ్యములు కన్నడాంధ్రములందేకాక, బృహదీశ్వర మహాత్మ్యము లేదా చోళవంశచరితమను సంస్కృత కావ్యముయొక్క తమిళ అనువాదమందును కలదు. ఈ గ్రంథములు సంపూర్ణముగ చారిత్రకాంశములను తెలుపునవి కావు. అయినప్పటికి కొన్ని చారిత్రకాంశములను అందజేయుచున్నవి.

'నవచోళ చరిత్ర' తొమ్మిదిమంది చోళరాజుల కథలను, మరికొందరు భక్తుల గాథలను తెల్పుచున్నది. ఇందు కరికాళ, విక్రమ, ఉత్తుంగ అహివర, వరధర్మ, సత్యేంద్ర, మనుజేంద్ర, వీర, ఉత్తమ చోళుల కథలు, సాలన పురాధిపతి అయిన భైరవరాజు గాథ; పిట్టవ్వ, తిరుకాళ నాంచారి, పూసలనైనార, గణపాల, కైకూలి కేతయ్య అను శివభక్తుల గాథలు ఉన్నవి. ఈ గాథలన్ని కేవలము వారివారి శివభక్తి నిరతిని మాత్రమే తెలుపు గాథలు. పండితారాధ్యుడు సాలస పురాధిపతి అయిన భైరవ రాజునకు వివరించినట్లు గ్రంథమున కలదు. భైరవరాజొకనాడు శివుని మెప్పించిన రాజులెవరైనను కలరా అని ప్రశ్నించగా, పండితారాధ్యుడు శివుని మెప్పించి ప్రమథులైన తొమ్మిదిమంది చోళరాజుల కథలను చెప్పనారంభించుటతో కావ్యారంభమైనది. ఈ రాజులందరు ఏఏ కాలములందు ఏఏ దేశములు పరి పాలించిరో తెలియుటలేదు. పండితారాధ్యుడీ గాధలను తెల్పుటచేతను, పండితా రాధ్యుడు క్రీ.శ. 12 వ శతాబ్దమునకు చెందిన వాడని నిర్ణయించుట జరిగినది కను. కను, ఈ రాజులందరును 12 వ శతాబ్దమునకు పూర్వులని చెప్పవచ్చును.

ఈ కావ్యమున ప్రథమాశ్వాసమున కరికాళచోళ భాస్కరచోళ, ముక్కంటిచోళ పిట్టవ్వగాధలు, ద్వితీయాశ్వాసము న విక్రమచోళుని గాఢమగు శివభక్తి నిరతి, తృతీయాశ్వాసమున ఉత్తుంగచోళుని కుమారుడైన అహివరచోళుని, శైవభక్త్యా వేశము, వరధర్మచోళుని ధర్మతత్పరత, సత్యేంద్రచోళుని ధర్మనిరతి, చతుర్థాశ్వాస మున మనుజేంద్రచోళ, వీరచోళ, ఉత్తమచోళ, గణపాలుర భక్తియుక్తులు, పంచమా

5. నవచోళ చరిత్ర, p. 3.

6. చాగంటి శేషయ్య, ఆంధ్ర కవితరంగిణి, సం. 9, p. 229.

శ్వాసమున భైరవరాజుగాథ వర్ణింపబడినవి. ఈ కావ్యమున వర్ణితమైనరాజులు భక్తులు, శివపూజాదురంధరులు. కఠినమైన శివపరీక్షలను ఎదుర్కొని శివుని మెప్పించి ప్రమథులై శివసాయుజ్యమును పొందినవారు సత్యవ్రతులు. ధర్మదీక్షాపరులు.

కరికాళచోళుడు :

చోళమండలమును పరిపాలించిన కరికాళ చోళుడు ఒకనాడు, మంత్రి, పురోహిత, దండనాయక, సైన్యాధిపతి, కవిగాయక విద్వాంసులు తన్ను గొలువ భార్యయగు గుణశీలతో కావేరీ నదీ తీరమునకు వాహ్యాళికేగెను. అచట ఒక జారిణి ఒక గుంటను త్రవ్వి అందలి జలమును త్రాగి పాపవిముక్త అగుట గాంచి తన పరివారమును కారణమడుగ, వారా స్థలమాహాత్మ్యమును తెలిపి అటనొక తటాకమును నిర్మించి, కావేరీనదికి గట్టును నిర్మింపుమని కోరిరి. కరికాళుడు కావేరీనదికి గట్టుకట్టి తటాకమును నిర్మింపదలచి, నిర్మాణార్థము, సామంతరాజులందరిని రమ్మని వర్తమాన మంపెను. సూర్యోపాసకుడైన భాస్కరచోడుడు రానిరాకరించెను. భాస్కరచోడుడు ప్రతిదినము సూర్యునుపాసించి ప్రసాదమును పెట్ట సూర్యుడా ప్రసాదమును స్వీకరించెడివాడు. భాస్కరచోడుడు రానిరాకరించెనని ఆగ్రహించి, కరికాళుడు సూర్యుని ఉపాసించి, భాస్కరచోడుడు సమర్పించిన ప్రసాదమును స్వీకరింపరాదని అనపెట్టెను. భక్తుని ఆనతి ప్రకారము భాస్కరుడొసగిన ప్రసాదమును స్వీకరింపమానెను. భాస్కరుడు పరితపించి కారణమడుగ తన భక్తుడైన కరికాళుని ఆన విషయము తెలిపెను. అంత భాస్కరచోళుడు తనకంటెను భక్తుడైన కరికాళుని కడ వెట్టి చేయుటకు సమ్మతించెను. ఈ గాథయందు కరికాళుడెంతటి భక్తుడైనప్పటికి అతని నిరంకుశత్వము వ్యక్తమగుచున్నది.

ముక్కంటి చోడుడు :

శివభక్తుడైన ముక్కంటి చోడుడు శివుని మెప్పించి మూడవ కన్నును పొందెను. తాను శివభక్తుడనను గర్వముతో కరికాళుని కడకు వెట్టికేగ నిరాకరించెను. ఈ విషయము తెలిసి కరికాళుడు శివుని ప్రార్థించి, ముక్కంటి చోడుని మూడవ కన్ను మాయము చేయుమని కోరెను. కరికాళుడు ముక్కంటిచోడుని కంటెను గొప్ప భక్తుడగుటచే ఈశ్వరుడు ముక్కంటిచోడుని మూడవకన్నును మాయముచేసెను. ముక్కంటిచోడుడు శంకరుని ప్రార్థించి కారణమడుగ, కరికాళుని భక్తినిరతులను తెల్పి ఆతడాన పెట్టెనని, అతనిని కాదనుటకు తానశక్తుడనని తెలిపి వెట్టికేగుమని తెలిపెను. ఈశ్వరుని అజ్ఞప్రకారము ముక్కంటి కావేరీగట్టు కట్టుటకు వచ్చెను.

పిట్టవ్వకథ :

శివభక్తురాలైన పిట్టవ్వ, కరికాళుని రాజ్యమునందుండెడిది. చోళరాజ భృత్యులామెనుకూడ కావేరీగట్టు కట్టుటకు పిలచిరి. పిట్టవ్వ ఈశ్వర భక్తురాలగుటచే ఆమెకు

మారుగ శివుడే పిట్టవ్వ వేషమున వచ్చెను. వెట్టి చేయుచు అట పనివారలతో హాస్య మాడగా అదిగాంచి భటులామెను దండించిరి. కొట్టినదెబ్బ లామెకు బదులు దండిం చిన వారికే తగులుట గాంచి అశ్చర్యముతో కరికాళునితో అ విషయము తెల్పిరి. కరికాళుడా విషయమును విని ఆ వ్యక్తి శంకరుడే కాని పిట్టవ్వకాదని, అట కరు దెంచి సాష్టాంగపడి ప్రార్థింప శంకరుడు ప్రత్యక్షమాయెను. మారువేషమున వెట్టి చేయుటకు వచ్చుట కారణమేమని ప్రశ్నింప తాను పిట్టవ్వ అను భక్తురాలకు బదులు వచ్చితినని తెలుప ఆమెను చూపమని కోరెను. శంకరుడు రాజును పిట్టవ్వకడకు గొనిపోయెను. రాజామె భక్తి తత్పరతను కొనియాడి ఆమెను పూజించెను. పిట్టవ్వ శివసాయుధ్యమును పొందెను.

కరికాళుని పరీక్షింపదలచి ఈశ్వరుడొకనాడు నివేదనమును గ్రహించుట జాప్యము చేసెను. కరికాళుడు పలువిధముల ప్రార్థింప తన భక్తుడైన మాదర చెన్నయ్యతో భుజించి సద్గోష్టి చేయుటలో జాప్యమైనదని తెల్పెను. కరికాళుడా భక్తుని చూపమని కోరెను. ఈశ్వరుడు కరికాళుని మాదర చెన్నయ్యకడకు గొని పోయెను. భక్తులిరువురును ఒకరి గుణముల నొకరు ప్రస్తుతించుకొనిరి. శంకరుడు చెన్నయ్యను కైలాసమునకు గొనిపోయెను.

శంకరుడు కరికాళునకు ప్రమథత్వమునీయ తలంచి పరీక్షింపతలచెను. వృషభ రూపము దాల్చి కరికాళుని పట్టణమునకు వచ్చి అందరితో యుద్ధము చేయ మొదలిడెను. ఎంత సైన్యము వచ్చి యుద్ధము చేసినప్పటికి ఆ వృషభ మును జయింప లేకపోయెను. అంత కరికాళుడు ఆ వృషభము శంకరుడే అని గ్రహించి పూజించెను. ఈశ్వరుడు గౌరీసమేతముగా ప్రత్యక్షమై కరికాళుని కైలాస మునకు గొనిపోయెను.

విక్రమచోళుడు :

విక్రమచోళుడు తిరుగుబాటొనర్చిన ఒకరాజును జయించి, రాజ్యమునకు మరలివచ్చుచు, మార్గమధ్యమున పూజాదులు లేక ఉన్న ఒక శివలింగమును గాంచి, ఆ దినము శివరాత్రి అగుటచే, ఆ లింగమునకు దీపారాదన నైవేద్యాదుల నొసగి షోడశోపచారములను గావించెను. అతని భక్తికి మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై తనకొరకొక అలయమును నిర్మింపుమనెను. విక్రమచోళుడు శివుని ఆజ్ఞ నిర్వర్తించి తన పురమునకు వచ్చి శివవియోగమును భరింపలేక మిక్కిలి దుఃఖ పడెను. అది గాంచి శివుడా చోళుని పురమున లింగముగ వెలసెను. రాజు ఈశ్వరుని మిక్కిలి భక్తితో పూజించెను. ఎన్ని పూజలు చేసినను శివుడు ప్రత్యక్షము కాలేదు. పూసల నయనారను భక్తునియం దైక్యమై ఉండెను. రాజు చివరకు తన తల నుత్తరించుకొన అయత్తుడగు సమయమునకు వచ్చి, తన జాప్యమునకు పూసల నయనారుని యోగాకర్షణ అని తెలిపి రాజు కోరికపై అతనిని పూసల

నయనారు కడకు గొనిపోయెను. విక్రమచోళుడు పూసల నయనారుని నుతించెను. ఈశ్వరుడు ప్రమధ గణములతో ప్రత్యక్షమై భక్తులిరువురిని కైలాసమునకు గొని పోయెను.

**ఉత్తుంగచోళుడు :**

ఉత్తుంగచోళుడు ధర్మవ్రతుడు. పుణ్యశీలుడు. అతనికి ఈశ్వరుని వర ప్రసాదమున అహివరచోళుడను పుత్రుడుదయించెను. అహివరుడు రాజ్యమునకు వచ్చిన తరువాత దిగ్విజయము గావించి, కోటిలింగములను పూజించి భక్తియుక్తుడై రాజ్యము చేయుచుండెను.

అహివరుని పరీక్షింపనెంచి శంకరుడు పూజాసమయమునకు పట్టణమునందలి వనములన్నింటిలోను పుష్పములు లేకుండ చేసెను. రాజాశ్చర్యపడి పూవులులేని పూజేమి పూజయని తన శిరమును ఖండించి పూజచేయ తలంచి, శిరస్సుత్తరించు కొన సంసిద్ధుడాయెను. అంత శివుడు ప్రత్యక్షమై అతని భక్తికి మెచ్చి పుష్పక విమానముపై కైలాసమునకు గొనిపోయెను.

**వరధర్మచోళుడు :**

వరధర్మచోళుడు కరయూరు పట్టణాధీశుడు. ధర్మదీక్షాపరుడు. న్యాయపరి పాలనార్ధమై నడివీధియందొక గంటను కట్టించెను. న్యాయార్ధమై వచ్చినవారా గంటను మ్రోగించిన రాజు స్వయముగ వచ్చి న్యాయమును చేకూర్చెడివాడు.

ఒకనాడు వాహ్యాళికేగిన వరధర్మచోళుని కుమారుడు తన రథమును అప్పుడే పుట్టిన లేగపైనుండి నడుపగా ఆ లేగ మరణించెను. అంత ఆవు దుఃఖించి ధర్మగంట మ్రోగించెను.

రాజు ఆవు గంటను మ్రోగించుట తెలుసుకుని, ఆవు మాటలాడనేరదు కనుక సర్వవిషయములు తెలియునటుల చేయుమని శివుని ప్రార్ధించి ధర్మగంటకడ కరుదెంచెను. ఆవు రాజును తన లేగ కడకు కొనిపోయెను. లేగ మరణమునకు తన కుమారుడే కారణమని తెలిసికొని విచారించి, తన కుమారుడెక్కిన రథముపై లేగనుంచి, ఆ రథమును తన పుత్రునిపై నుండి నడుపవలెనని ఆజ్ఞాపించెను. కుమారుడు తండ్రి ఆజ్ఞ శిరసావహించెను. రాజకుమారునిపైనుండి రథము నడచిన తక్షణమే శివుడు ప్రత్యక్షమై వరధర్మచోళునితో 'నీ ధర్మతత్పరతకు మెచ్చితిని' వరమును కోరుకొమ్మనెను. రాజు లేగను బ్రతికింపుమని కోరుకొనెను. లేగ బ్రతికెను. రాజుయొక్క ఔదార్యమునకు ధర్మనిరతికి మెచ్చి శివుడు రాజు కుమారుని, రాజును కైలాసమునకు గొనిపోయెను.

**సత్యేంద్రచోళుడు :**

సత్యేంద్రచోళునకు మితవచనుడు, అతని మంత్రికి లక్షణుడు అను పుత్రులు

గలరు. మితవచన లక్షణులు మిత్రులు. వారొకనాడు అశ్వారూఢులై పోవుచుండ ఒక పేదరాలి పుత్రుడు మంత్రిపుత్రుని అశ్వముక్రింద పడి మరణించెను. అదిగాంచి రాజపుత్రుడు మంత్రిపుత్రునోదార్చి తన అశ్వమును మరణించిన బాలునిపైకి నడిపెను. ఆటనున్నవారు రాజపుత్రుడే ఆ బాలుని మరణమునకు కారణమని భావించిరి.

పుత్రుని గోల్పోయిన పేదరాలు దుఃఖించి, రాజుకడకేగి న్యాయము చేకూర్చ మని ప్రార్థించెను. రాజు పుత్రవ్యామోహమును తెంచుకొని, పుత్రుని వధింప ఆజ్ఞా పించెను. అదిగాంచి మంత్రిపుత్రుడు బాలుని మరణమునకు తానే కారణమని తెల్పెను. రాజపుత్రుడందుల కంగీకరింపక తానే అని పల్కెను. ఇరువురును వాదించుకొనిరి. రాజుతో విన్నవించుకొనిరి. ఎవరిని శిక్షింపవలెనో రాజునకు అర్థము కాలేదు. అంత రాజపుత్రుడు సుమంతుడను వానిని పిలచి శిరమును ఖండింప మనెను. అతడు ఖండింపనందున తానే ఖండిచుకొనెను. అది గాంచి మంత్రి పుత్రుడు తన శిరస్సును తాను ఖండించుకొనెను, తన పుత్రునికొరకు రాజపుత్ర మంత్రిపుత్రులు మరణించుట గాంచి పేదరాలైన తిరుకాళ నాంచారి తన శిరస్సును ఖండించుకొనెను. అది గాంచి రాజు విషయమేమని మంత్రిని ప్రశ్నించెను. మంత్రి విషయమంతయు వివరించెను.

రాజపుత్రుడు మరణించిన విషయమును విని అంతఃపురమున అతని భార్య, తల్లి మరణించిరి. అది తెలిసి రాజుకూడ తన శిరస్సును ఖండిచుకొనెను. అంత శివుడు ప్రత్యక్షమై వారి ధర్మపాలనకు మెచ్చి వారందరిని బ్రతికించెను. అనంతరము కైలాసమునకు గొనిపోయెను.

మనుజేంద్రచోళుడు :

మనుజేంద్రచోళుడు శివభక్తుడు, ధర్మపరుడు. పెక్కు శివలింగములను ప్రతిష్ఠించి, శివాలయములను నిర్మించెను. శివాలయమున లక్ష దీపములు వెలిగింప నమకట్టి వలసిన నూనెకొరకు చేనిలో నువ్వులను విత్తెను.

పంటకాలమున మునిపాలుడను వ్యక్తి రాశిలోని నువ్వులను తినుచుండెను. కావలివారు శివుని సొమ్మపహరించెనని అతనిని నోటిలోని నువ్వులతోపాటు రాజు సముఖమునకు గొనివచ్చిరి. రాజాతని శుభచిహ్నములున్న మహాత్మునిగ తలంచి, శివకైంకర్యార్థముగల నువ్వులను తినుటకు కారణమడిగెను. అంత మునిపాలుడు మానవుల తిలలు భక్షించి వారికి ఋణపడుటకంటె, శివునికి ఋణపడుట ఉత్తమము. ఋణపడినవాని ఇంట పుట్టవలయును కనుక భగవంతునికడ నుండ వచ్చునని తెలిపెను. రాజతని భక్తికి మెచ్చి, అతని నోరు తెరచి నోటిలోగల తిలలను ప్రసాదముగ గ్రహించెను. మనుజేంద్రచోళ, మునిపాలుల భక్తికి మెచ్చి గౌరీ సహితుడై శంకరుడు ప్రత్యక్షమై వారిని కైలాసమునకు గొనిపోయెను.

వీరచోళుడు :

వీరచోళుడు శివభక్తుడు, నిష్ఠాపరుడు. ఇతడు శివాలయములను నిర్మించి సతీసమేతుడై అర్చనలు చేయుచుండెను. ప్రతిదినము సహస్ర పుష్పములతో పూజించుచుండెను. శివుడీతనిని పరీక్షింపనెంచి, పూజించు సహస్ర పుష్పములందొక పుష్పము తక్కువగునటుల చేసెను. రాజందులకు విచారించి తన శిరమునే పుష్పముగ నిచ్చి పూజింపదలచి కరవాలముతో ఖండించుకొనెను. ఆ శిరస్సు శివుని పాదములపై బడెను. వీరచోళుని భక్తికి మెచ్చి ఈశ్వరుడు గౌరీసమేతుడై ప్రత్యక్షమై దివ్యవిమానముపై అతనిని కైలాసమునకు గొనిపోయెను.

ఉత్తమచోళుడు :

శివభక్తుడైన ఉత్తమచోళుడు, తన రాజ్యమున రోగములు, అకాలమరణములు సంభవించిన తన ప్రాణముల నిచ్చెదనని ప్రతిజ్ఞపూని గండపెండేరమును ధరించెను.

అతనిని పరీక్షింపదలచి శివుడు తాపసివేషమున ఉత్తమచోళుని గృహమున కరుదెంచెను. రాజు సతీసమేతుడై అతిథి సత్కారములు చేసెను. తాపసి తాను రోగగ్రస్తుడనని తెలుప అతనినొక మృదుశయ్యపై పరుండజేసి తన రాజ్యమున రోగము సంభవించినందులకు మిక్కిలి విచారించెను.

తన రాజ్యమునందలి భవులందరిని శైవులుగమార్చెదనను ప్రతిజ్ఞపూని, తనను పరీక్షింపవచ్చి పార్వతీసమేతముగ ప్రత్యక్షమైన శివుని సహితము లింగధారిని చేసి ప్రతిజ్ఞను నిలుపుకున్న గణపాలుని తలచుకొని భార్యాసమేతుడై శివుని కొలచెను. (ఇటకొంత గ్రంథభాగము శిథిలమైనది) శివుడు ప్రత్యక్షమై, ఉత్తమ చోళునికి ప్రమథులలో పట్టముకట్టి, అతనితోపాటతని భార్యనుకూడ కైలాసమునకు కొనిపోయెను.

భైరవరాజు :

మల్లూపురాధీశుని కడ తన పరాక్రమమును ప్రదర్శించిన అతడు సత్కరించుననియు ; అనంతరము మల్లూపుర పరిసరారణ్యమున ఒక మృగమును వేటాడిన అది మరణించి, దానినుండి రెండుప్రాణలింగములు వచ్చుననియు ; విభవసంవత్సర భాద్రపదమాసమున తానువచ్చి లింగాంగుని చేసెదననియు, ఒక తపస్వి తెల్పి మాయమైనటుల స్వప్నముగాంచి భైరవరాజు భార్యాసహితుడై మల్లూపురమునకేగి అట వీరభద్రుని జయించెను.

మల్లూపురాధిపతి అతని పరాక్రమమునకు మెచ్చి గౌరవించెను. అచటి ప్రజలకోరికపై వేటకేగి, ఒకమృగమునుగాంచి దానినిచంపెను. అదిరెండు లింగ

ములుగమారెను. శివుడు ప్రత్యక్షమై ఆ దంపతులకు దీక్షనొసగెను. భైరవుడు నిజ పురమునకు ప్రయాణమాయెను.

మార్గమధ్యమున తనను పరీక్షింప ఇంద్రుడు కురిపించిన ఘోరమగు వర్ష మును, శివమహిమతో పూలవర్షముగమార్చి, యేరు ఉధృతముగపొంగి రాగా, భైరవాకారమున ఏటికడ్డముగ నిలిచి దానిని మరియొక ప్రక్కకు ప్రవహించునట్లు చేసి, ఇంకను పెక్కు ఘనకార్యములుచేసి సారసపురమును చేరెను. అనంతరము జంగములను సేవించుచు రాజ్యమును చేయుచుండెను.

ఒకనాడు పండితారాధ్యుడు, శివభక్తుల ఇండ్లలోకూలిచేసి ఆ ధనముతో జంగమార్చనచేయుచు శంకరుని పరీక్షలకు తట్టుకొని కైలాసమునలంకరించిన కైకూలికేతయ్య కథను తెలిపి, జంగమార్చన చేయమని భైరవరాజును కోరెను. పండితారాధ్యుని కోరికపై భైరవరాజు జంగమార్చన చేయ మొదలిడెను. ఈ విషయ ము తెలసి వేశదేశములనుండి జంగములు వచ్చుచుండిరి. ఒకనాడు శంకరుడు భైరవరాజును పరీక్షింప పెక్కుజంగమరూపముల ధరించివచ్చి కానికాలమున మామిడిపండ్లను కోరెను. భైరవరాజు తన భక్తిబలముతో చింతచెట్టునకు మామిడి పండ్లను కాయించి జంగములకిచ్చి వారి ప్రశంసలనొందెను. అంత శంకరుడొక ఆనపవిత్తనగి దానిని మొలపించి కాయించివండిపెట్టుమని కోరగా, రాజు మొక్కను మొలిపించి కాయలను కాయించితుంచు సమయమునకు శంకరుడు ప్రత్యక్షమై రాజును భార్యాసహితునిగా కైలాసమునకు గొనిపోయెను.

నవచోళ చరిత్రలో వర్ణింపబడిన నవచోళులగాథలివి. ఈ గాథల సత్యాసత్య నిరూపణ దుర్లభమని చెప్పవచ్చు. చోళులందరును గొప్పశైవభక్తులైనప్పటికి, శౌర్య ప్రతాపవంతులు, సత్యవ్రతులు అయినప్పటికి ఈ గాథలలో వర్ణింపబడిన అంశములు అభూతకల్పనలనిపించుచున్నవి. మనకుగల భక్తులగాథలన్నియు నిట్టివే అనుట అతిశయోక్తికాదు. కాని ఈ నవచోళులలో కొందరు చారిత్రకపురుషులు.

## చరిత్ర—నవచోళచరిత్ర

ముక్కంటిపల్లవుడు :

నవచోళ చరిత్రయందు మహాశివభక్తులుగ వర్ణింపబడిన కరికాళచోడ ముక్కంటిచోళులు చారిత్రకపురుషులు. సమకాలీనులు. చోళరాజులలో ఖ్యాతి గాంచినవాడు కరికాళుడు. ముక్కంటిచోళునిగ వర్ణింపబడినరాజు చోళవంశీయుడు కాదు. పల్లవరాజు. ఏలన కరికాళుడు జయించినది ముక్కంటి పల్లవుని కాని చోళుని కాదు. ముక్కంటిపల్లవునకు ముక్కంటికాడువెట్టి అనునామాంతరముకలదు. ఇతని చరిత్రను 'కళింగత్తుపరణి,' 'పండితారాధ్యచరిత్ర,' కూడ వర్ణించుచున్నవి. వల్లభా భ్యుదయమున ఈశ్వరునకు అచ్యుతశర్మయను బ్రాహ్మణుని పుత్రికకు ఈ ముక్కంటి

జన్మించెననియు, శంకరుని అనుగ్రహమున యోగపాదుకలను సంపాదించి, క్షామము సంభవింపగా గంగాతీరమునుండి వచ్చిన బ్రాహ్మణులకు కృష్ణాతీరమున అగ్రహారములిచ్చి వసతిఏర్పరచెనని గలదు.[7] బ్రాహ్మణులకు అగ్రహారములిచ్చిన విషయము కోటవంశీయుడైన కేతరాజువేయించిన శాసనమునకలదు.[8] ఈ ముక్కంటి పల్లవుడు క్రీ.శ. 5వ శతాబ్దమున గల పల్లవచక్రవర్తి నందివర్మయే అని కొందరు చరిత్రకారుల అభిప్రాయము.[9] పెక్కుమంది రాజులు తాము ముక్కంటిపల్లవుని వంశీయులమని చెప్పుకొనుటకలదు.[10]

ఈ ముక్కంటిపల్లవుడు గర్వితుడగుటచే కరికాళుడు అతని మూడవకన్నును పెరికించెనని, యుద్ధమునఓడించి కావేరినదికి కట్టుకట్టుటకై నియమించెనని తెలియుచున్నది.[11] ఈ అంశము తిక్కన నిర్వచనోత్తరరామాయణమునందును, పాల్కురికి సోమనపండితారాధ్యచరిత్రనందును వర్ణింపబడినది.

త్రిలోచనపల్లవునిగూర్చిన సమాచారము మెకంజీ సంకలనములో సంకలితమైన దుర్జయరాజుల శాసనమునందుకలదు.[12] ఈ శాసనమువలన ఈతడు బ్రాహ్మణ కన్యకు జన్మించెనని తెలియుచున్నది. ఇతని రాజధాని కాంచీనగరము. ఇతడు పల్లవుడు. ఇతడు దిగ్జయములను గావించి, దుర్జయాది ఆంధ్రరాజులను ఓడించి, వారందరిని తనకు సామంతులుగ చేసుకొని సముద్రము వరకుగల భూమిని పరిపాలించెను. దక్షిణదేశముపైకి దండెత్తి వచ్చిన చాళుక్యవిజయాదిత్యుని సమరమున ఓడించెను. విజయాదిత్యుని ఓడించిన ఈతడు కరికాళుని చేత ఓడింపబడి ఆతనికి సామంతుడాయెను.[13] ఈ శాసనమువలన తెలియు చున్న అంశము ముక్కంటి పల్లవ కరికాళ చోళుల కాలము. చాళుక్యవంశ మూలపురుషుడైన విజయాదిత్యుడు, ముక్కంటి పల్లవుడు, కరికాళచోళుడు సమకాలీకులు. విజయాదిత్యుడు క్రీ.శ. 485 ప్రాంతమున ఉన్నట్లు తెలియుచున్నది. కనుక కరికాళ, త్రిలోచన పల్లవులు ఆ కాలమువారై ఉండవలెను.[14]

కాంచీపురాధీశునిగ ఖ్యాతిగాంచిన పల్లవరాజే, కరికాళునిచే మూడవ కంటిని పోగొట్టుకొని కావేరీ నదికి గట్టు కట్టుటకై వచ్చినట్లు 'నవచోళ చరిత్ర' యందు వర్ణితమైన ముక్కంటి చోడుడు. ఈతడు పల్లవ రాజులలో చివరి వాడు కావచ్చును.

7. భట్లపెనుమర్తి కోదండరామయ్య, పల్లభాభ్యుదయము.
8. South Indian Inscription, Vol. VI, p. 228.
9. B. V. Krishna Rao, Early Dynasties of Andhra Desa.
10. Indian Antiquary, Vol. XXXVII.
11. Indian Antiquary. Vol. XXXVII.
12. నేలటూరి వేంకటరమణయ్య, చరిత్ర రచన, p. 120.
13. నేలటూరి వేంకటరమణయ్య, చరిత్ర రచన, పు. 122.
Look also Annual report of Epigraphy for 1899-1900.
14. నేలటూరి వేంకటరమణయ్య, చరిత్ర రచన, పు. 122.

ఈతని తరువాత పల్లవ రాజుల చరిత్ర తెలియుట లేదు. అంతేకాక చోళులు విజృంభించి పల్లవ రాజ్యము నాక్రమించు కొనుటయే కాక, ఆంధ్రదేశమున చోళ వంశమును స్థాపించిరి. వీరినే ఆంధ్ర చోళ రాజులని చరిత్రకారులు పేర్కొనుచున్నారు.

కరికాళ చోళుడు

ఇతడు కావేరీ పట్టణమును రాజధానిగ తమిళ దేశమును పరిపాలించి ముక్కంటి పల్లవుని జయించి ఆంధ్రదేశము వరకు రాజ్యమును విస్తరింప చేసు కొనెను. ఈతడు క్రీ.శ. 5వ శతాబ్దపు చివరి భాగమున పరిపాలించుటచే క్రీ.శ. 5వ శతాబ్దపు వాడనీ నిర్ణయించుట జరిగినది.[15]

సాంప్రదాయకముగా చోళుల చరిత్ర తెలిసి కొనుటకు మనకు ఆధారము లెక్కువగా లేవు. కాని ఆంధ్ర తమిళ వాఙ్మయములు, కొన్ని శాసనములు వీరి చరిత్రను తెలుపు చున్నవి. చోళుల చరిత్రను నాలుగు భాగములుగ విభజింప వచ్చును.

1. సంఘవాఙ్మయమునకు సంబంధించిన చరిత్ర.
2. సంఘవాఙ్మయ యుగమునకును, విజయాలయునకును నడుమగల చరిత్ర.
3. విజయాలయ వంశము.
4. చాళుక్య చోళ వంశము.

ఈ చోళుల వంశము క్రీ.శ. 5వ శతాబ్దముతో ప్రారంభమయి క్రీ.శ. 13వ శతాబ్దముతో అంతమయినది.

పూర్వ చోళరాజుల చరిత్రను తెలిసికొనుటకు మనకు ముఖ్యమయిన ఆధారము సంఘవాఙ్మయము. (విజయాలయుని కడనుండి మనకు పెక్కు శాసనాధారములు కలవు) కరికాళుడీ సంఘవాఙ్మయమునకు చెందిన వాడు. సంఘవాఙ్మయమున గొప్ప రాజులుగా పేర్కొనబడిన వారు ఇరువురు. కరికాళుడు, కాసింగనన్. కరికాళుని గూర్చి పెక్కు గాథలున్నవి. చిన్న వయస్సులో అగ్ని ప్రమాదము సంభవించుటచే కరికాళుడను పేరు వచ్చెనని ఒక కథ కలదు.[16]

కరికాళుని శత్రువులు బంధించగా తప్పించుకొని వచ్చి రాజ్యమును స్థాపించెనని మరియొక గాథ.[17]

కరికాళుని తండ్రి పేరు ఇలజత్చెన్ని. ఇతడు నన్‌గనూరునకు చెందిన వెళిర్ బాలికను వివాహము చేసికొనెను. (తొలుకాప్పియమ్. పొరుల్ అహం

---

15 Indian Antiquary. Vol. XLI, 1912.

16. పొరునార్ - అరుప్పడై ఆఖరిభాగము, Verse 3, K. A. Nilakanta Sastry, The Cōlas

17. పట్టినప్పాలై II, pp. 220-238, K.A. Nilakata Sastry, The Coles.

నందీ విషయము గలదట.)[18] కరికాళుని కూమార్తె ఆదిమంది. ఈమెను గూర్చి పెక్కు రచనలు గలవు. ఈమె తన భర్తయగు చేరరాజు అట్టాన్ అట్టి, కావేరీనదిలో ప్రమాదవశమున పడి మరణింపగా, తన పాతివ్రత్య మహిమ వలన ఆతనిని బ్రతికించెనట.[19]

కరికాళుని గూర్చిన ప్రశక్తి చాల గ్రంథములందు శాసనములందు గలదు. శిలప్పదిగారము నందు కరికాళుని ఉత్తరదేశ దండయాత్రను గూర్చిన విశేషములు కలవు. వ్రజ, మగధ అవంతి దేశములను జయించినటుల గలదు.[20] ఇతడు కావేరీ నదికి గట్టు కట్టించిన విషయము క్రీ.శ. 7 లేక 8వ శతాబ్దమునకు చెందిన పుణ్య కుమారుని మేలపాడు శాసనమునందు గలదు.[21] తెలుగు చోళులు వేయించిన కొన్ని తామ్ర శాసనముల వలన కరికాళుడు కావేరీ నదికి గట్టు కట్టించి నటుల, త్రిలోచన పల్లవుని జయించి నటుల తెలియుచున్నది.[22]

కరికాళుని స్నేహితుడైన వెన్నిక్కుయట్టియర్ అను కవి, సమకాలీనుడైన పాడనార్, కరికాళుడొనర్చిన యుద్ధములను తమ గ్రంథములందు వర్ణించిరి.[23] 'పట్టినప్పాలై' అను గ్రంథమున ఈతడు ఆనకట్టలు కట్టించి, చెరువులు త్రవ్వించి హెచ్చుగా పంటలు పండించినటుల తెలియుచున్నది. ఈ గ్రంథ మితని పరిపాలనా క్రమమును కూడ తెలుపుచున్నది. 'మణిమేఖలై' నందీతని ప్రసక్తి కలదు,[24] ముడథమక్కనియార్ వ్రాసిన పొరునార్' అర్రుప్పదై, ఉరుత్తిరంగణ్ణన్నార్ వ్రాసిన 'పట్టినప్పాలై' గ్రంథములలో కరికాళుడే నాయకుడు.[25] ఈ గ్రంథములందు చోళుని అస్థాన విషయములు, అంతఃపుర స్త్రీల అలవాట్లు ఆచారములు వర్ణింప బడి ఉన్నవి.

తిక్కన 'నిర్వచనోత్తర రామాయణము,' పాల్కురికి సోమనాథుని 'పండితా రాధ్య చరిత్ర,' పోశెట్టిలింగ కవి వ్రాసిన 'నవచోళ చరిత్ర,' కరికాళుని వర్ణించిన గ్రంథములు.

క్రీ.శ. 11వ శతాబ్దము నాటి ఆంధ్రచోళ రాజులదని డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు నిర్ధారణ చేసిన శాసనమున కరికాళుని విషయములు కొన్ని తెలియుచున్నవి. ఈ శాసనమున"....కరికాళుడు ఈశ్వరుని అరాధించి సర్వ

18. K.A. Nilakanta Sastry, The Cōlas.
19. Silappadigaram, xxi, ii.
20. Silapaadigaram, VII, pp. 89–110, Epigraphia Indica, XI No. 35, II, pp. 3–5.
21. Epigraphia Indica, XI No. 35, II, pp. 3–5.
22. The Indian Antiquary, Trilochana Pallava and Karikala.
23. K.A. Nilakanta Sastry, The Cōlas, p. 41.
24. S. Krishna Swamy Aiyangar, Manimekhalai in its Historical Setting, p. 120.
25. The Indian Antiquary, 1908, p. 234.

సంపదలను సమృద్ధి పరచుటకై స్వర్ణ వృష్టిని కురిపించెను. త్రినేత్ర పల్లవుడను నృపుని గర్వితునిగా నెఱింగి, వాని ఫాలలోచనమును భగ్నము చేసెను. భోజుండను రాజుచే సూర్యుని కర్పితములైన మూండు అర్ఘ్యపాత్రలను సూర్యుని కడకు పోనీయక ఆకాశమున నాపి భోజుని దానునివలె చేసెను. ఇక్ష్వాకువంశ ప్రభువులకు రాజధానియు, మనుష్యులకు శుభావహయునగు అయోధ్యనుండి బ్రాహ్మణాది నాల్గు వర్ణముల వారిని కొని వచ్చి పల్లవ రాజు తన దేశమున రాష్ట్రములను, నగరములను యిచ్చి శ్రీ పర్వతచ్ఛాయ యందు ప్రతిష్ఠించెను. అచ్చట తన పేరిట లింగ ప్రతిష్ఠ చేసెను"[26] అని కలదు. ఈ శాసనమున ఫాలలోచనము భగ్నము చేయబడిన త్రినేత్ర పల్లవుని గూర్చి ముందు తెలుసు కుంటిమి. నవచోళ చరిత్రలో వర్ణింప బడిన త్రినేత్ర చోళుడీతడే. శాసనమున గల భోజుడే భాస్కరచోడునిగ నవచోళ చరిత్రలో వర్ణింపబడినట్లు కన్పడుచున్నది. పేర్లు వేరయినప్పటికి, శాసనమునందలి అంశమునకు నవచోళ చరిత్ర యందలి గాథకు సామ్యము కలదు. కవి శాసనస్థ గాథను ఆధారముగ గ్రహించి భాస్కరచోడుని గాథ వ్రాసియుండును. నవచోళ చరిత్రయందలి ముక్కంటి పల్లవ, భాస్కర చోడుల గాథలకు ఆధార మీ శాసనమనుట నిస్సంశయము.

కరికాళుడు శైవుడనుటకు పెక్కు నిదర్శనములు గలవు. సుందరచోళుని అనిబిల్ శాసనమువలన కరికాళుడు శైవాలయమును నిర్మించినటుల తెలియుచున్నది.[27] ఈతని గాథలను పేర్కొను పెక్కు కైఫీయతులు గలవు.[28] కరికాళుని గూర్చిన పెక్కు కథలు ప్రచారమున ఉన్నవి. మదపుటేనుగు కరికాళుని చోళ సింహాసనమునకు అధికారిని చేసిన ఐతిహ్యము కలదు. నవచోళచరిత్ర చారిత్రక పురుషులైన కరికాళుని, అతని సమకాలీనులైన ముక్కంటి పల్లవ, భాస్కరచోళుల శైవభక్తి నిరతిని నిరూపించుచున్నది.

విక్రమ చోళుడు :

చోళరాజులలో ఇరువురు విక్రమ చోళులు కలరు. అరింజయుని పుత్రుడైన ఆదిత్యచోళుని హత్యకు కారణమైన సుందరచోళుడొకడు[29] ఈతనికి విక్రమచోళు డను బిరుదు కలదని తిరుచునాపల్లిలో దొరకిన శాసనము వలన తెలియుచున్నది.[30] ఇతడు కాక కులోత్తుంగచోళునిపుత్రుడైన మరొక విక్రమచోళుడు కలడు. ఇతడు క్రీ.శ. 1120 నుండి 1163 వరకు రాజ్యముచేసెను. ఇతడు వీరుడు, శూరుడు శైవ భక్తుడు. ఇతని కులదైవము చిదంబరములోని నటరాజు. ఈతడు చిదంబరాలయ

26. నేలటూరి వేంకటరమణయ్య, చరిత్ర రచన, పు. 131.
27. K.A. Nilakanta Sastry, The Cōlas, p. 53.
28. Journal of the Andhra Historical Research Society, Vol. VII, p.216.
29. K.A. Nilakanta Sastry, The Cōlas, pp. 156–157.
30. K.A. Nilakanta Sastry, The Cōlas, p. 160.

మున కొన్ని క్రొత్త కట్టడములు కట్టించెను. ఒట్టకుట్టాన్ అను కవి ఈతని కళింగ యుద్ధమును 'విక్రమచోళ ఉల' అను పరణిగ్రంథమున వర్ణించెను. ఇతడు శివ భక్తుడగుటచే, 'నవచోళ చరిత్ర' ము నందలి శివభక్తుడైన విక్రమచోళుడీతడేనని ఊహింప వచ్చును. మొదటి కుళోత్తుంగ చోళునకును (క్రీ.శ. 1070) విక్రమ చోళుడను బిరుదము గలదు.

ఉత్తుంగచోళుడు :

కవి ఉత్తుంగ చోళునితో ప్రారంభించిన కథను అహివర చోళుని శైవభక్తి నిరతితో అంతము చేసెను. ఉత్తుంగచోళుడను రాజుగాని అహివరచోళుడను ఆతని పుత్రుడుగాని తెలుగు చోళవంశమున కనిపించుటలేదు. క్రీ.శ. 1070–1118 ప్రాంతమున మొదటి కులోత్తుంగ చోళుడు గలడు. అతనికి రాజరాజ, ముమ్మడి చోళ, వీరచోళ, విక్రమచోళులను పుత్రులుగలరు. విక్రమచోళుని పుత్రుడు రెండవ కుళోత్తుంగుడు (1133–1150). ఈతని పుత్రుడు రాజరాజు. నవచోళ చరిత్ర లోని ఉత్తుంగ చోళుని కుళోత్తుంగుడేమో అని సంశయించిన చోళవంశమున ఇరువురు కుళోత్తుంగులు గలరు కనుక, ఎవరు కథానాయకుడో నిర్ణయించుట అసంభవము.

వరధర్మచోళుడు :

'నవచోళ చరిత్ర'లో కరయూరు పట్టణాధిపతిగ, ధర్మదీక్షాపరునిగ, న్యాయ పరిపాలకునిగ వర్ణింపబడిన వరధర్మచోళుని గూర్చి చోళుల చరిత్రలో ఎట్టి ఆధార ములును లేవు. కాని క్రీ.పూ. 2వ శతాబ్దమునకు చెందిన 'ఎలార' అను రాజు (దమిల వంశీయుడు) చోళరాజ్యము నుండి సింహళమునకు పోయి, ఆ రాజ్య మును పరిపాలించుచున్న 'ఎసీల' అను రాజును జయించి సింహళమునకు రాజా యెను. ఇతడు స్నేహితులఎడ, శత్రువులఎడ ఒకేవిధముగ ధర్మము నెరపెడి వాడు. గోవత్సముపైనుండి రథమును నడపి దాని మరణమునకు కారణమైన తన పుత్రునకు మరణదండన విధించి ఈతడు ఖ్యాతి గాంచినటుల మహా వంశమునందు వర్ణింపబడినది.[31] ఇతడు నలుబది సంవత్సరములు రాజ్యము చేసినటులను, బౌద్ధ బిక్షువుల నాదరించినటులను తెలియుచున్నది. కవి ఎలారుని గాథను వరధర్మ చోళున కేల ముడిపెట్టెనో ఊహకందని విషయము. అటులనే 'కరయూరు' ప్రాచీన సంఘ వాఙ్మయము నందలి 'కారియూఱు' అయి ఉండును. కవి కథాంశమును సరిగా గ్రహింప లేదనుట స్పష్టమగుచున్నది.

సత్యేంద్రచోళ, మనుజేంద్రచోళులు ఆంధ్రచోళ రాజులందులేరు. పై గాథవలె ఒకరి గాథల నొకరికి కవి అంటగట్టెనేమో తెలియుటలేదు.

31. Geigers, Mahavamsa, Chap. XXI—XXV.

**వీరచోళుడు :**

చోళరాజ వంశమున వీరచోళుడను బిరుదుగల రాజు లిరువురు కలరు. రాజేంద్రునకు (1012–1044) వీర రాజేంద్రుడను పుత్రుడు కలడు (1036–1069). ఇతడు పెక్కు యుద్ధములను చేసెను. ఆహవమల్లుని, పొత్తపిరాజును చాళుక్య సోమేశ్వరుని జయించెను. వేంగీ సింహళ దేశములతో యుద్ధములను నెరపెను. ఇతడు చాల బ్రహ్మదేయములను చేసెను. నలువదియైదుగురు బ్రాహ్మణులకు భూములను దానమిచ్చెను. చిదంబరమున నటరాజ నాట్యమందిరమున ఒక పత్రమును తాపతము చేయించెను. దాని పేరు త్రైలోక్యసారము. వీరచోళ బిరుదాంకితులలో నితడొకడు.

మరియొక వీరచోళ బిరుదాంకితుడు మొదటి పరాంతకుడు (క్రీ.శ. 907–955). ఇతడు సింహళమును జయించి నెల్లూరు నుండి సింహళము వరకు రాజ్యమును స్థాపించెను.

ఇతడు చిదంబరమునందలి దేవాలయమును బంగారము రేకుతో స్థాపించెనట. ఇతడు హేమ గర్భములను తులాభారములను బ్రహ్మదేయములను చేసెను[32]. తండ్రి అయిన ఆదిత్యునితో ప్రారంభమయిన ఆలయ నిర్మాణము పరాంతకునితో పరాకోటి నందినది. ఈ ఇరువురు రాజులలో కవి వర్ణించిన వీరచోళుడెవరో తెలిసి కొనుటకు ఆధారములులేవు. మొదటి పరాంతకుడు దానధర్మముల నెక్కువగా చేయుటచే 'నవచోళ చరిత్ర' లో వర్ణితమైన వీరచోళుడితడే అయియుండును.

**ఉత్తమచోళుడు :**

ఇతడు పరాంతక సుందరచోళుని సోదరుడు. పరాంతకుని పుత్రుడైన రెండవ ఆదిత్యుని చంపి రాజాయెనని తెలియుచున్నది[33]. ఈతడు క్రీ.శ. 970–985 వరకు రాజ్యము చేసెను. ఈతడు పరాకేసరి ఉత్తమచోళుడని వ్యవహరింపబడెను[34]. ఈతని భక్తియుక్తులను గూర్చి, మతమునుగూర్చి ఏమియు తెలియుటలేదు. ఈతని శైవ భక్తిని నవచోళ చరిత్ర వర్ణించు చున్నది. చోళ వంశీయులలో ఉత్తమ చోళ నామాంకితుడొక్కడే గలడు కనుక నవచోళ చరిత్రయందలి ఉత్తమ చోళుడీతడే. శైవరాజు కథకు చారిత్ర కాధారములేదు.

నవచోళ చరిత్ర కావ్యమును చారిత్రక దృష్టితో పరిశీలించిన దెలియు అంశములివి.

ఈ కావ్యమున వర్ణింపబడిన నవచోళులలో కరికాళచోళుడు చారిత్రకముగ ప్రసిద్ధిగాంచినవాడు. ముక్కంటిచోడుడు, చోళరాజుకాదు, పల్లవుడు. అతడును

32. South Indian Inscriptions II, p. 383.
33. నీలకంఠ శాస్త్రి, సామవేదం రామకృష్ణమాచారి, ప్రాచీన దక్షిణ భారత చరిత్ర, పు. 193.
34. K.A. Nilakanta Sastry, The Cōlas, p. 160.

చారిత్రక పురుషుడే. మిగతాగాథలలో, నామసామ్యమున్న కథాంశమునరిపడుట లేదు. కథాంశము సరిపోయిన నామసామ్యములేదు. ఈ గ్రంథమున పేర్కొనబడిన వారందరును చారిత్రకపురుషులా కాదా అని వెదకుట నిష్ప్రయోజనము. కేవలము శైవమతావేశమును, శైవమతముయొక్క ఘనతను వ్యక్తపరచుటకై కవి శివభక్తులైన చోళరాజులను కథాపురుషులుగ గ్రహించెననుట అతిశయోక్తికాదు. ఈ కావ్యమున వర్ణింపబడిన శిరముల నుత్తరించుకొనుట, జంగములనర్చించుట, జంగముల దుష్కరమైన కోరికలను తీర్ప ప్రయత్నించుట, మాటిమాటికిని శివుని పరీక్షలకు పాల్పడుట మొదలగు అంశములు కేవలము వీరశైవమతావేశమును మాత్రమే వ్యక్తపరచుచున్నది. ఇందలి కథాపురుషులందరును మానవాతీతవ్యక్తులుగ కన్పట్టుచున్నారు. ఈశ్వరానుగ్రహమున మానవాతీతములగు కార్యముల నొనర్చి కైలాసము నలంకరించిన కథాపురుషుల, స్త్రీల శివతత్త్వమునందు వీరశైవమతావేశమున్నది. ఇట్టి శైవమత ప్రచారము మనకు క్రీ.శ. 500 నుండి ఉన్నటులతెలియుచున్నది. నిజమునకు మన సంఘమున మతమునకు ప్రాధాన్యముగలదు. యుగయుగములనుండి భారతీయుల జీవితవిధానము, భావన, సంస్కృతి, మతముద్వారా మలచబడుచున్నదనుట అతిశయోక్తి కాదు. కనుకనే అభూతకల్పనలు, అమానుషచర్యలు సాహిత్యమున చోటుచేసుకొనుచున్నవి. ఇట్టి రచనలకు బౌద్ధవాఙ్మయము పుట్టినిల్లు. అమానుషము, అత్యద్భుతము అయిన వర్ణనలుచేయుట బౌద్ధసాహిత్యపు ముఖ్యలక్షణము. ఈ లక్షణము తక్కిన సాహిత్యములందు చోటుచేసుకున్నట్లు కన్పడుచున్నది. చారిత్రకాంశములను కల్పనలతో ముడిపెట్టి రచనలుచేయుట అనాదినుండి పరిపాటిగానున్నది.

చోళరాజులు పెక్కుమంది ఖ్యాతిగాంచిన చారిత్రక పురుషులు. శైవమతానుయాయులు, శైవమతోద్ధారకులునగుట చారిత్రకసత్యము. శైవమత ప్రవక్తలు, శివభక్తులు అద్భుతమగు కార్యములొనర్చినట్లు, కైలాసమునకు కొనిపోబడినట్లు, శైవమతగ్రంథములందు, పెక్కుగాథలుకలవు. కనుకనే నవచోళచరిత్రయందు కవి శైవమతానుయాయులైన చోళరాజులను కథాపురుషులుగ గ్రహించి, అమానుషకృత్యములను వారికంటగట్టి అద్భుతమైన అవాస్తవిక గాథలను సృష్టించెను. కవి చారిత్రక పాత్రలను ప్రవేశపెట్టినప్పటికి, అవాస్తవికాంశములను ప్రవేశపెట్టుటచే, చరిత్రకు ప్రాధాన్యముతగ్గి కావ్యము అభాసమైనదనుట అతిశయోక్తికాదు. ఇందు వర్ణితమైన అతిలోక అమానుష సంఘటనలయందు చారిత్రకాంశములు నిష్ప్రమాణములు, నిస్తేజములు అగుచున్నవి. ఇట్టిరచనలలో చారిత్రకాంశములను తెలుసుకొనుట బహుకష్టము. ఈ కావ్యము కల్పితకథల కహ్లారమైనప్పటికి కొన్ని చారిత్రకాంశములతో పాటు వీరశైవ గాథలను కవియొక్క శైవమతావేశమును వ్యక్తపరచుచు మనోరంజకముగ నున్నది.

కవిశైవాచారములను వర్ణించునపుడు చూపిన శాస్త్రీయ దృష్టి గమనింపదగ్గది.

పూజోపకరణాదుల ప్రభావము, వివిధ పుష్పార్చన మహిమ, ఘృతదీపారాధన మహిమ, నైవేద్యప్రమాణములు, షోడశోపచారమహిమ, మయూరచామరాది సేవా విచారణ, స్థూలసూక్ష్మదేహవిచారణ, పంచేంద్రియ వివరణ, సాత్వికాది గుణ విచారణ, పంచకోశవిచారణ, షడ్భ్రమలు, షడూర్ములు, ఆధ్యాత్మిక ఆధిభౌతిక వివేచనము, బంధమోక్షములు, యమనియమాది వివేచనము, సంకల్ప వికల్ప స్వరూపములు, స్వయంప్రకాశధ్యానరీతి, నాదానుభవ వినోదము, భక్తిమహిమ, లింగ ధారణమహిమ మొదలగు విషయములను శాస్త్రీయముగ విపులముగ వివరించెను. ఈ విషయ వివరణము కవికిగల ఆధ్యాత్మికానుభవము, ఆగమజ్ఞానవిజ్ఞానము వెల్లడి చేయుచున్నది.

వర్ణనములు చక్కని శైలితో మనోహరముగ ఉన్నవి. విషయము జటిలమైనదైనప్పటికిని రచనాసౌలభ్యము కలదు. ప్రతి వర్ణనయందును భక్తి భావమునే వ్యక్తపరచెను. కవి చోళరాజుల చరిత్రములనే రచనావస్తువుగ స్వీకరించుటయందు ఔచిత్యము కనపడుచున్నది.

శైవమతము చోళులకాలముననే ప్రచారమునకు వచ్చినది. విజయాలయుని తరువాత వచ్చిన రాజులందరును శైవమతావలంబులు. మొదటి ఆదిత్య చోళుడు కావేరీ తటమున అనేక శివాలయముల నిర్మించెను. ఇతని తరువాత వచ్చిన చోళ రాజు చిదంబరమునందు ఆలయమును నిర్మించెను. మొదటి రాజరాజు కాలము నుండి, శైవాచార్యులకు, వారి శిష్యులకు హెచ్చుగా సంభారములు ఇవ్వబడు చుండెను. రాణులు సహితము శివాలయములను కట్టించిరి. సెంబియ మహాదేవి తిరుక్కావేరినందు చంద్రమౌలీశ్వరాలయమును కట్టించెను. దానిని అధిరాజేంద్రుడు మరల కట్టించెను. రెండవ కులోత్తుంగుడు శైవుడేకాని ఇతడు వైష్ణవమత ద్వేషి. చోళ రాజులు, కిరాతార్జునీయ, భిక్షాటన, కల్యాణ సుందర, పంచదేహ, లింగ పురాణ దేవ, ఉమాసహిత నటరాజ, దక్షిణామూర్తి, శ్రీ కంఠ మొదలగు శివమూర్తులను పూజించెడివారు. దేవాలయములందు అన్నదానము చేయబడుచుండెడిది. వీరి కాలముననే శైవమతమునందు పాశుపతులు, కాపాలికులు, కాలాముఖులు అను విభజన వచ్చినది. శివసాన్నిధ్యము కొరకు శివయోగులు మరణమును కోరెడివారు.

చోళరాజుల సామంతులు గూడ శైవమతమును ప్రోత్సహించిరి. కొడుంబలూరు రాజైన విక్రమకేసరి ఆత్రేయ గోత్రీయుడును, కాలాముఖశాఖకు పెద్దయును అయిన మల్లికార్జునునకు మఠమును కట్టించి యిచ్చెను. మఠపోషణముకొరకు యాదవవిక్రమకేసరి పదునొకండు గ్రామములనిచ్చెను.

శివభక్తులైన చోళులచరిత్రను కవి తన భక్తితాత్పర్యములను వ్యక్తపరచుటకు కావ్యవస్తువుగ గ్రహించెనని చెప్పవచ్చును. ఈ గ్రంథము సంపూర్ణముగు చారిత్రక కావ్యము కానప్పటికిని, యిందు భక్తిరసోత్పాదకములగు పెక్కు పుక్కిటి పురాణముల వంటి గాథలున్నప్పటికిని, పిట్టకథలవంటి పిట్టవ్వ, గణపాలుడు, మొదలగు

వారి కథలున్నప్పటికిని, కరికాళచోళుని, ముక్కంటిపల్లవుని వంటి చారిత్రక ఖ్యాతి గాంచిన రాజులగాథలు వర్ణితమగుటచే 'నవచోళచరిత్ర' చారిత్రకకావ్యముగ గ్రహింపబడినది.

రాజ్యమును విస్తరింపజేయు కాంక్షతో యుద్ధములు చేయగా వారిలో కాకతీయులు ప్రబలులై అందరిని జయించి మహాసామ్రాజ్యమును స్థాపించిరి. గణపతి దేవుని కాలమున ఆంధ్రదేశమంతయు కాకతీయుల అధీనమునకు వచ్చినది. గణపతిదేవ మహారాజు ఆంధ్రచక్రవర్తి అయ్యెను. ఇతడు రాజధానిని హనుమకొండ నుండి ఓరుగల్లునకు మార్చెను.[2] అచట పెద్ద కోటను నిర్మించెను.

ఇట్లు మహాసామ్రాజ్యమును స్థాపించిన కాకతీయులలో మహా పరాక్రమ వంతులు, ఖ్యాతిగాంచిన మేటి వీరులు గొప్ప పరిపాలకులు అయిన రుద్రదేవ, గణపతిదేవ, ప్రతాపరుద్రుల వంటి రాజులు, రుద్రమదేవి వంటి రాణులు ఉన్నారు. వీరి కాలమున అంధ్రదేశము అన్ని రంగములందు ముందంజవేసి దశదిశల ఖ్యాతిగాంచినది. మహా వీరులైన కాకతీయుల చరిత్రను వర్ణించి, పెక్కు నూతనాంశముల నందిచ్చుచున్న ఏకామ్రనాథుని 'ప్రతాప చరిత్రము,' కాసె సర్వప్ప 'శ్రీ సిద్ధేశ్వర చరిత్రము' ఈ ప్రకరణమున పరిశీలింపబడినవి.

## ప్రతాప చరిత్ర, శ్రీ సిద్ధేశ్వర చరిత్రములు
### — ఏకామ్రనాథ, కాసెసర్వప్పలు

ఏకామ్రనాథుని పుట్టు పూర్వోత్తరములుగాని, వంశ చరిత్రగాని ఏమియు తెలియుట లేదు. ఇతనిని గూర్చిన వివరము లేవియు ప్రతాప చరిత్రమున లేవు. కాని ఈతడు క్రీ.శ. 15వ శతాబ్దపు వాడని నిర్ణయించుట జరిగినది.[3]

కాసెసర్వప్పను గూర్చిన వివరములు సిద్ధేశ్వర చరిత్రమున లేవు. ఈతడు క్రీ.శ. 16వ శతాబ్దపు వాడని తెలియుచున్నది.[4] ఈతడు బ్రాహ్మణుడు. ఆత్రేయ గోత్రము, ఆశ్వలాయన శాఖ. ఇతని తాత తండ్రి కాసె మల్లనమంత్రి, తాత కాసె గంగాధరుడు, గంగాధరుడు శైవుడు, లింగధారి. పెక్కు గ్రంథములను బయు కావ్యములను వ్రాసెను. శైవాగమములు చక్కగా తెలిసిన వాడు. ఇతని భార్య గౌరి. వీరి కుమారుడు మల్లపరాజు. ఈతడే సర్వప్ప తండ్రి. సంగీత విద్వాంసుడు. తల్లి పేరు లక్ష్మాయి. సర్వప్ప వీరి పెద్ద కుమారుడు. సర్వప్పకు ఇరువురు సోదరులు కలరు. వారు పరదేశి, వీరనమంత్రి. వీరిది బీద కుటుంబ మగుటచే సర్వప్ప తన తండ్రి నేర్పిన విద్యనే నేర్చుకొనెను. వీరి నివాసము చెరువుపల్లి. సర్వప్ప, హనుమకొండలో రాజుకడ ఉద్యోగిగ ఉన్నముదిగొండ దమ్మన్న అను

2. మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము, p. 64.

3. వివరములకు, ఖండవల్లి లక్ష్మీ రంజనం: ప్రతాప చరిత్ర పీఠిక.

4. వివరములకు, శ్రీ సిద్ధేశ్వర చరిత్ర, Introduction.

నాతని కుమార్తెను వివాహము చేసి కొనెను. మామగారీతనికి హనుమకొండయందు ఉద్యోగము నిప్పించెను. ఈతడీ గ్రంథమును హనుమకొండలో నుండగా రచించెను. ఈతడీ గ్రంథమును సిద్ధేశ్వరుని కృపవలన ఏకామ్రనాథుడు చెప్పిన కథ ననుసరించి, నాగనాథుని అనుమతితో వ్రాసినట్లు చెప్పు కొనెను. బ్రతుకు కొరకై నూతన కథలను వ్రాసి బ్రతిమాలి కృతులిచ్చుట కన్న పూర్వ రాజన్యు చరితలు నుతించుట మేలని తానట్లు చేసితినని సర్వప్ప తానీ గ్రంథమును వ్రాయుటకు కారణముగ చెప్పుకొనెను.

ప్రతాప చరిత్ర, శ్రీ సిద్ధేశ్వర చరిత్రములు రెండు హనుమకొండను పరిపాలించిన పూర్వ రాజుల వృత్తాంతములతో ప్రారంభమై, ప్రతాపరుద్రుని కుమారుని పట్టాభిషేకముతో అంతమగు చున్నవి. ప్రతాప చరిత్ర వచన కావ్యము. శ్రీ సిద్ధేశ్వర చరిత్ర మొదటి మూడాశ్వాసములు ద్విపద, తక్కిన భాగము వచనము. ప్రతాప చరిత్రను అనుసరించి వ్రాయ బడిన గ్రంథమైనప్పటికి శ్రీ సిద్ధేశ్వర చరిత్రలోని కొన్ని అంశములు ప్రతాపచరిత్రకంటెను భిన్నముగ నున్నవి. అదియునుగాక ఈ గ్రంథమున కుప్పలుగా తప్పులున్నవి.

ఏకామ్రనాథుడు కేవలము నామమాత్రముగ పేర్కొనిన పద్మాక్షి సిద్ధేశ్వరుల వృత్తాంతము, హనుమద్గిరివర్ణనలను సర్వప్ప పెంచి, సిద్ధేశ్వరుని ఆవిర్భావము, పార్వతీ వివాహము మొదలగు అంశములను జోడించి వ్రాసెను. ప్రథమ ద్వితీయాశ్వాసాంతములందు చెప్పిన తీరునుబట్టి ఈ సిద్ధేశ్వరుని కథలో కాకతీయుల చరిత్ర ఒక భాగముగ భావించి గ్రంథమును రచించెనేమో యనిపించును. అసలు ఈ దేవుని ప్రశంస కాకతీయుల శాసనములందెచ్చటను లేదు. కాని కాకతీయుల కాలమున కీ దేవుడు వెలసినట్లు తెలియుచున్నది. రెండవ ప్రతాపరుద్రుని కాలము వాడగు నృసింహకవి, సిద్ధేశ్వరాలయమునకు ఎదురుగ ఒక గుట్టపై సిద్ధ దంపతుల ప్రణయగాథను కావ్యముగ చెక్కెనట. పార్వతీ పరమేశ్వరులుగా ప్రజలచే ఆరాధింప బడుచున్న పద్మాక్షి సిద్ధేశ్వరుల అవతార కథనే సర్వప్ప తన కావ్యమున చెప్పెను. సర్వప్ప కాలమునాటికి సిద్ధేశ్వరుడు ప్రసిద్ధ దేవత అని చెప్పవచ్చు. ఎఱుక దేవరాజు వంశీయులు రాజ్యమును 180 సంవత్సరములు పరిపాలించిరని ఏకామ్రనాథుడు వ్రాయగా సర్వప్ప 186 సంవత్సరములని వ్రాసెను. తిక్కన గణపతిదేవుని దర్శించిన వృత్తాంతము ప్రతాప చరిత్రమున లేదు. సిద్ధేశ్వర చరిత్రమున కలదు. ప్రతాప చరిత్ర వర్ణనాదులు లేక కాకతీయుల చరిత్రను సూటిగ చెప్పినది. శ్రీ సిద్ధేశ్వర చరిత్ర వర్ణనాదులతో ఆశ్వాస విభజనతో కావ్య ధోరణిలో వివరించినది. ద్విపద ఛందములో చరిత్రాంశములను వర్ణించినది.

ఇట్టి చిన్న చిన్న భేదము లున్నప్పటికి రెండు గ్రంథములలోని వర్ణనీయాంశములు ఒక్కటే. ఈ కావ్యములు మహోజ్వలమైన కాకతీయుల చరిత్రను వివరించి చరిత్రకారులకు మిక్కిలి ఉపయోగపడినవనుట అతిశయోక్తికాదు.

## చరిత్రాంశములు—ప్రతాప చరిత్ర, శ్రీ సిద్ధేశ్వర చరిత్రములు

ప్రతాపచరిత్ర సిద్ధేశ్వర చరిత్రలందు కాకతీయుల చరిత్ర సోమదేవరాజుతో ప్రారంభమైనది. చరిత్రకారుల అభిప్రాయము ప్రకారము కాకతీయుల చరిత్ర కాకర్త్య గుండనతో ప్రారంభమైనది. ఈ రెండు గ్రంథములు కాకతీయ రాజ్యస్థాపన సోమదేవరాజుతో ప్రారంభమైనటుల తెలుపుచున్నవి. చరిత్రకారుల అభిప్రాయము ప్రకారము కాకతీయుల రాజ్యస్థాపన మొదటి బేతరాజుతో ప్రారంభమైనది.

### ప్రతాపరుద్ర, సిద్ధేశ్వరచరిత్రములు - కాకతీయుల వంశవృక్షము

సోమదేవరాజు
|
మాధవ వర్మ
|
పద్మసేనుడు
|
వెన్నమరాజు
|
పోరంకి వెన్నమరాజు
|
పెండ్లి గుండమరాజు
|
ఎఱుక దేవరాజు, కుంతలదేవి
|
భువనైక మల్లుడు
|
త్రిభువన మల్లుడు
|
కాకతి ప్రోలరాజు
|
రుద్రదేవ మహారాజు
|
మహా దేవరాజు
|
గణపతి దేవుడు
|
రుద్రమ దేవి
|
ప్రతాప రుద్రుడు

(5)

చరిత్రకారులు నిర్ణయించిన కాకతీయుల వంశ వృక్షము




చరిత్రకారులు నిర్ణయించిన ప్రకారము కాకర్త్య గుండనతో కాకతీయుల వంశమును ప్రారంభించిన ఈ రెండు గ్రంథములందు వర్ణింపబడిన పెండ్లి గుండమ రాజునే కాకర్త్య గుండనగ నిర్ణయింప వచ్చును. కాకర్త్య గుండనకు పూర్వము కాకతీయ సామ్రాజ్యమును హనుమకొండయందు స్థాపించిన పూర్వ రాజులలో ప్రఖ్యాతి గాంచిన మరి అయిదుగురి చరిత్రను మనకు ప్రతాప, సిద్ధేశ్వర చరిత్రలు తెలుపుచున్నవి. వీరు సోమదేవరాజు, మాధవవర్మ, పద్మసేనుడు, వెన్నమరాజు, పోరంకి వెన్నమరాజు. ఏకామ్రనాథ సర్వప్పలు వీరి చరిత్రయే కాక, కాకతీయుల ప్రాచీన పట్టణమయిన హనుమకొండ వివరములను కొన్నింటిని తెల్పిరి.

కాకతీయులు, చాళుక్యుల సామంతులనియు, వీరి పరాక్రమమునకు మెచ్చి, హనుమ కొండను, వీరికి నాలుగవ చాళుక్య సోమేశ్వరు డిచ్చెననియు, ఈ విధముగ కాకతీయ సామ్రాజ్యమును స్థాపించినది మొదటి బేతరాజనియు చారిత్రకుల అభిప్రాయము.

ఈ రెండు గ్రంథములు మాత్రము, నందగిరి ముఖ్యపట్టణముగ పరిపాలించిన నందరాజు వంశమున జన్మించి కందారమును రాజధానిగ చేసుకొని పరిపాలించిన కన్నడదేవుడను రాజు యొక్క దౌహిత్రుడయిన సోమదేవరాజు కటక బల్లహుడను రాజుతో యుద్ధముచేసి మరణించగా, అతని పుత్రుడైన మాధవవర్మ అనుమకొండలో రాజ్యము స్థాపించుట, కటక బల్లహుని వధించుట మొదలగు అంశములను తెలుపుచున్నది.

ఈ రెండు గ్రంథములలోని చరిత్రాంశములను, శాసనముల వలన లభించిన అంశములతో పోల్చిన మూడు విధములుగా విభజింపవచ్చును :

1. శాసనాధారములవలన అసత్యములని నిరూపింపబడినవి,

2. శాసనాధారములకు విరుద్ధము కాక, ఇతర అభ్యంతరములు లేక సత్యములుగ విశ్వసింపదగినవి,

3. శాసనములతో సరిపోవునవి, అని విభజింపవచ్చు.

శాసనములతోనేకాక మనకుగల చారిత్రక గ్రంథములతో సరిపోల్చినను ఈ విధముగనే విభజింపవచ్చును.

ఈ రెండు గ్రంథములలోని చరిత్రాంశములను మనకుగల చరిత్రతో ఎంత వరకు సరిపోవుచున్నవో పరిశీలింతము.

## హనుమకొండ — హనుమకొండను పరిపాలించిన ప్రాచీన రాజులు

కృష్ణా గోదావరీ మధ్యభాగమునగల దండకారణ్యమున హిడింబాశ్రమము గలదు. ఆ ఆశ్రమమునకు ఈశాన్య దిశయందు హనుమద్గిరి కలదు. ఆ గిరి ఆధారముగ ఒక పురము గలదు. ఎఱుక దేవరాజను నాతడు అచట హనుమకొండను పట్టణము నిర్మించి రాజ్యముచేసెను. అతని తరువాత హనుమడు, కొండడు, గర్గిరేయుడు, కొమ్మకాత్రేడు మొదలగు ఎఱుకరాజులు నూటఎనుబది సంవత్సరములు రాజ్యము చేసిరని ప్రతాపచరిత్ర, 186 సంవత్సరములని సిద్దేశ్వరచరిత్ర చెప్పుచున్నవి. సిద్దేశ్వర చరిత్రమున ఒక అశ్వాసమంతయు హనుమద్గిరి వర్ణనము, సిద్దేశ్వరుడు అచట వెలయుట మొదలగు అంశములు వర్ణింపబడినవి. ఈ వర్ణన కవి కావ్యధోరణిలో చేసిన రచనకు తార్కాణము.

ఎఱుకరాజుల తరువాత పద్మాక్షి వరప్రసాదము వలన ఏకశిలానగరమును నిర్మించి కాకతీయులు వేయి సంవత్సరములు పరిపాలించిరి.

## కాకతీయుల వంశక్రమము

వీరి వంశక్రమము పురాణ పద్ధతినే నారాయణునితో ప్రారంభింపబడినది. ఈ క్రమమున జన్మించిన నందుడను రాజు గోదావరీ నదికి ఉత్తర భాగమున గల

నందగిరిని పరిపాలించెను. అతని ప్రధానులు చంద్రవర్మ, సూర్యాదిత్యుడు. భార్య భానుమతి. గురువు శారదానందుడు. స్నేహితుడు లంబోదరుడను రాజు. ఇతని దౌహిత్రుని వంశమున జన్మించిన కన్నడ దేవుడను రాజు కందారమను పురమును రాజధానిగా చేసికొని పరిపాలించెను. ఇతని కుమారుడు సోమదేవరాజు.

సోమదేవరాజు :

ఇతనికి మూడువేల ఏనూరు అలమందలు గలవు. ఇతని గోగణములు మంత్రకూటము మొదలు గోదావరీ తీరము వరకు నుండెడివి. ఈ విషయములను విని కటక బల్లహుడు దండెత్తివచ్చి గోగణములను తీసుకొనిపోయెను. సోమదేవరాజు కటక బల్లహునితో యుద్ధముచేసి, యుద్ధమున మరణించెను. అప్పటికి సోమదేవ రాజు భార్య సిరియాలదేవి గర్భవతి. భర్త మరణవార్త విని సిరియాలదేవి కొందరు బ్రాహ్మణులను తీసికొని హనుమకొండ కేగి ఎఱుకదేవరాజు ఆశ్రయమును కోరెను. మొదట ఆశ్రయమిచ్చినప్పటికిని కటక బల్లహునకు భయపడి ఆమెను ఎఱుక దేవరాజు నగరమును విడిచి పొమ్మనెను. అంత ఆమె ఎఱుకదేవరాజు పురోహితుడగు మాధవశర్మను ఆశ్రయించెను. బల్లహుడు హనుమకొండ కరుదెంచి సిరియాల దేవిని అప్పగింపుమని ఎఱుకదేవరాజునకు కబురంపెను. ఆమె నగరమునకు రాలేదని చెప్పిన ఎఱుకదేవరాజు మాటలను నమ్మక, నగరమునగల ప్రతి గృహమును పరిశోధింప భటుల నియమించెను. మాధవశర్మ గృహమున గల సిరియాలదేవిని రాజపత్నిగా సంశయించి బల్లహుని కడకు భటులు గొనిపోవుట గాంచి, అచటి విప్రులందరును బల్లహుడు కోరిన ప్రకారము సిద్ధేశ్వరాలయమున ఆమె వడ్డించిన పదార్థములను భుజించి, ఆమె మాధవశర్మ కుమార్తెయని, బ్రాహ్మణ యువతి యని అతనిని నమ్మించి ఆమెను కాపాడిరి. ఆమెకు ఒక పుత్రుడుదయించెను. అతనికి మాధవవర్మ యను నామమిడిరి. అతని గురువు మాధవశర్మ. మాధవవర్మ పద్మాక్షిదేవి అనుగ్రహము వలన, కటక బల్లహుని జయించు నటుల వరమును పొంది, ఆ దేవి యిచ్చిన దివ్యఖడ్గ ఖేటకములను గ్రహించి, కటక బల్లహుని చంపి, వాని పుత్రునకు పట్టముగట్టి, తన తండ్రికడ కటక బల్లహుడు గ్రహించిన మూడువేల నేనూఱు మందల గోగణంబులను తరలించుకొని వచ్చి రాజ్యము చేయుచుండెను. రాజ్యమును చేయుచు తన తల్లిని రక్షించిన విప్రులకు వారి కోరిక ప్రకారము గోదావరీ తీరమున అగ్రహారముల నిచ్చి, పద్మాక్షిదేవి అనుగ్రహము వలన నూట ఇరువది సంవత్సరములు పరిపాలించెను. ఇతడు శా.శ. 291 నుండి 411 వరకు పరిపాలించెను. ఇతని కుమారుడు పద్మసేనుడు.

పద్మసేనుడు :

ఇతడు శా.శ. 411 నుండి 489 వరకు పరిపాలించెను. ఇతడు పుత్రులు లేనందున ప్రతిదినము శంకరుని కూష్మాండములతో పూజింపగా పుత్రుడుదయించెను.

అతని పేరు వెన్నమరాజు. కాకతీయులు గుమ్మడి తీగకు పుట్టిరను విషయము ఒక సన్నివేశముగ మారినది. అట్టి కథకు ఆధారము ఈ కథయే అయియుండును.

**వెన్నమరాజు :**

ఇతడు శా.శ. 489 నుండి 572 వరకు పరిపాలించెను. ఇతని పుత్రుడు పోరంకి వెన్నమరాజు. శా.శ. 571 నుండి 648 వరకు పరిపాలించెను. ఇతని కుమారుడు గుండమరాజు. వెన్నమరాజు కటక బల్లహునితో మూడు మాసములు యుద్ధముచేసి బల్లహుని చంపి అతని పుత్రుని రాజుగ నియమించెను.

**గుండమరాజు — ఎఱుకదేవరాజు :**

గుండమరాజు శా.శ. 724 నుండి 794 వరకు పరిపాలించెను. గుండమరాజు కుమారుడు ఎఱుకదేవరాజు. ఇతడు శా.శ. 794 నుండి రాజ్యము చేసెను. ఇతడు రాజ్యమునకు వచ్చునప్పటికి పసివాడగుటచే మేనత్తయగు కుంతలదేవి 8 సంవత్సరములు ఎఱుకదేవరాజు తరపున రాజ్యము చేసెను. ఈమె ఎనిమిది సంవత్సరములు రాజ్యము చేసెనని ప్రతాప చరిత్రమున గలదు. 19 సంవత్సరములని సిద్ధేశ్వర చరిత్రకారుడు వ్రాసెను. ఈమె మహారాష్ట్ర రాజ్యమును జయించెను. అనంతరము సేనాధిపతి యగు రాణా గంగిదేవుని కటక బల్లహుని పైకి పంపెను. అతడు కటక బల్లహుని చంపి అతని కుమారుని రాజ్యాధికారిని చేసెను. కటక బల్లహునికడనుండి మూడుకోట్ల సువర్ణములను కప్పముగ గ్రహించెను. ఈ విధముగ రాజ్యమును సుస్థిరమొనర్చి కుంతలదేవి ఎఱుకదేవరాజునకు రాజ్యమప్పగించెను. ఈ అంశములవలన కాకతీయ సామ్రాజ్యమును స్థిరముగ స్థాపించినది ఎఱుక దేవరాజని స్పష్టపడుచున్నది. చరిత్రకారుల అభిప్రాయము ప్రకారము కాకతీయ సామ్రాజ్యము స్థాపింపబడినది మొదటి బేతరాజుతో. కనుక ఈ ఎఱుకదేవరాజే మొదటి బేతరాజనుట స్పష్టము. ఈ మొదటి బేతరాజువరకు మనకు శాసనాధారము లేవియును లభించుటలేదు.

ఈ రెండు గ్రంథముల వలన మన కింతవరకు తెలిసిన అంశములు హనుమ కొండ ప్రాంతమును కిరాత వంశీయులు క్రీ.శ. 137 ప్రాంతమున పరిపాలించుట మొదలిడి 180 సంవత్సరములు పరిపాలించిరనియు, వారిని జయించి మాధవవర్మ రాజ్యము చేసెననియు, ఈతని వంశీయులే కాకతీయులనియు తెలియుచున్నది. శాతవాహనులు ఆంధ్ర రాజ్యమును పరిపాలించిన కాలమున హనుమకొండను కిరాత వంశీయులు పరిపాలించిన పరిపాలించి యుండవచ్చును.[5] కాని మన కెట్టి ఆధారములును కనబడుట లేదు.

అదే కాలమునందలి మరి రెండు ప్రాచీన రాజ్యములు, నందగిరి,

---

5. ప్రతాప చరిత్ర, పీఠిక.

కంధారములు. నందగిరి గోదావరీ నదికి ఉత్తర ప్రాంతమున గలదు. దీనిని నందుడను రాజు స్థాపించెను. ఇతని వంశ క్రమమును ఈ రెండు గ్రంథములును, చంద్రునితో ముడిపెట్టి పురాణ పద్ధతిలో తెలిపినవి. నందుని తండ్రి ఉత్తుంగ భుజుడు గోదావరీతీరమున గల ధర్మపురికి దక్షిణ భాగమున ఒక నగరమును నిర్మించి రాజ్యమును చేసెనని ఈ గ్రంథములందు గలదు. ఆ నగర నామ మేదియో చెప్పలేదు. నందగిరిని విశాఖపట్టణ జిల్లా యందలి నందాపురముతో అన్వయించిరి మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.[6] ఇది పూర్వము జయపుర సంస్థానమునకు రాజధాని. దీనిని పరిపాలించిన వ్యాఘ్రరాజును, సముద్రగుప్తుడు జయించినటుల తెలియుచున్నది. ఈ విషయ మింకను పరిశీలింప వలయుననను అభిప్రాయమును సోమశేఖర శర్మగారు వెలిబుచ్చిరి.[7]

నందుని దౌహిత్రుడైన కన్నడదేవరాజు స్థాపించిన కందారము ఆనంద గోత్ర వంశీయుల ముఖ్యపట్టణమైన విజయ కందర పురముగ నిశ్చయించుట జరిగినది. ఇది కృష్ణానదికి దక్షిణమున నున్న ప్రాంతము. ఈ రెండు గ్రంథములును కన్నడదేవరాజు, సోమదేవరాజు, మాధవవర్మ విప్రులకు గోదావరీ తీరమున పెక్కు అగ్రహారముల నిచ్చినటుల వర్ణించినవి. వీరు పరిపాలించిన కాలము శాతవాహను లకు, ఇక్ష్వాకులకు సమీప కాలము. మహా సామ్రాజ్య స్థాపకులయిన ఆ వంశీయు లకు ఈ రాజులు అతి చిన్న సామంతరాజులై ఉందురు. కనుక వీరు బహు సంఖ్యాకముగ విప్రులకు అగ్రహారములను దానమిచ్చిరను అంశము అతిశయోక్తి అనుట నిశ్చయము. వీరి రాజ్యభాగము కృష్ణా గోదావరీ నదుల నడుమ కాక కృష్ణానదికి ఉభయ తటములందు మాత్రమే ఉండెను. సిద్ధేశ్వర చరిత్రను బట్టి ఈ విషయము స్పష్టమగు చున్నది.[8]

అనుమకొండలో కాకతీయ సామ్రాజ్య స్థాపన చేసిరని చెప్పబడిన మాధవ వర్మ విషయమును, అతని తండ్రి యగు సోమదేవరాజు విషయమును పరిశీలింతము.

సోమదేవరాజు నందగిరిని పరిపాలించుచు, కటక బల్లహునితో యుద్ధము చేసి యుద్ధమున మరణించెను. గర్భముతో నున్న అతని భార్య సిరియాలదేవి హనుమకొండ కేగి అచట మాధవ శర్మ అను బ్రాహ్మణుని ప్రాపు సంపాదించెను. అట అమె ఒక కుమారుని ప్రసవించెను. అతనికి మాధవవర్మ అను నామమిడి పెంచి పెద్ద చేసెను. మాధవవర్మ సకల శాస్త్ర పారంగతుడై, పద్మాక్షిదేవి వరమును

6. Mallampalli Somasekhara Sarma, History of Reddi Kingdoms, p.137.
7. Mallampalli Somasekhara Sarma, History of Reddi Kingdoms, p. 137.
8. సిద్ధేశ్వర చరిత్ర, పీఠిక, p. 67.

సంపాదించి కటక బల్లహుని వధించి, అనుమకొండ యందు రాజ్యస్థాపన గావించెను. ఈ కథను, ప్రతాపరుద్ర, సిద్ధేశ్వర చరిత్రములు వర్ణించినవి. ఇట్టి కథ త్రిలోచన పల్లవునకు సంబంధించిన దొకటి గలదు. చాళుక్య రాజైన విజయాదిత్యుడను నాతడు త్రిలోచన పల్లవుని జయించుట కేగి రణరంగమున మరణించెను. అప్పటికి అతని భార్య ఆరు నెలల గర్భవతి. ఆమె ముడివేము అను అగ్రహారమును చేరి, ఆట విష్ణుభట్ట సోమయాజి అను బ్రాహ్మణుని ఆదరమును పొంది అతని కడ నుండెను. అచట ఆమె విష్ణువర్ధనుడను కుమారుని గాంచెను. ఈ గాథ తూర్పు చాళుక్యుల రికార్డుల వలన తెలియుచున్నది.[9] ఈ గాథ క్రీ.శ. 6వ శతాబ్దమున జరిగినది.[10] ఈ ఆఖ్యానము లందలి కథకును ఈ గాథకును సంబంధము కన్పించుచున్నది. కాని కాలము సరిపోవుట లేదు. ఈ ఆఖ్యానముల వలన మాధవవర్మ శాతవాహన శకము 291 వ సంవత్సరమున రాజ్యము స్థాపించినటుల స్పష్టమగుచున్నది.

తూర్పు చాళుక్యులకును పల్లవులకును యుద్ధములు జరిగినటుల, ముఖ్యముగా చాళుక్య విజయాదిత్యునకును, త్రిలోచన పల్లవునకును యుద్ధము జరిగినటుల మనకు చరిత్ర వలన స్పష్టమగుచున్నది. కనుక చాళుక్య విజయాదిత్యుడే సోమదేవరాజని నిరూపించుటకు మనకెట్టి ఆధారములును లేవు. కాని ఈ కథల నాధారముగా చేసికొని కటక బల్లహుడు ధాన్య కటక పరిపాలకుడైన పల్లవ రాజని నిర్ణయింప వచ్చును. ఇక్ష్వాకుల అనంతరము కాంచీపురమును పరిపాలించిన పల్లవులు ఆంధ్రదేశమును జయించుచు ఆనాడు ఆంధ్ర రాజధాని యగు ధాన్య కటకమును హస్తగతమును చేసికొనిరి. వీరు క్రీ.శ. 975 ప్రాంతమున రాజ్య స్థాపనము చేసినటుల చారిత్రకుల అభిప్రాయము. వీరితో ఆనందగోత్రికులు ఎల్లప్పుడును యుద్ధము చేయుచునే ఉండిరి. ఈ ఆనందగోత్రికులు క్రీ.శ. నాల్గవ శతాబ్ది మధ్యభాగమున బలవంతులు కాజొచ్చిరి. ఆనాడు పల్లవుల ప్రాభవము కొద్ది కొద్దిగా క్షీణదశకు వచ్చుచుండెను.[11] ఆనంద గోత్రికులు నిరంతరము పల్లవులతో యుద్ధములు చేయుచు క్రీ.శ. 4, 5, 6 శతాబ్దములలో రాజ్యము చేసినట్లే చరిత్ర వలన తెలియుచున్నదని ఖండవల్లి లక్ష్మీరంజనముగారు తెల్పిరి.[12] సోమదేవరాజు ఈ వంశీయుడు. కనుక ఆ కాలమున ఉండి ఉండును. కాని మన కతని చరిత్ర తెలియుట లేదు.[13]

ఆనంద గోత్రికులకును, తూర్పు చాళుక్యులకును, ఎల్లప్పుడు పల్లవులతో

9. Epigraphia Indica VI, p. 239.
10. Epigraphia Indica VI, p. 44.
11. Dr. D.C. Sircar, The Successors of Satavahanas, p. 56.
12. ప్రతాప చరిత్ర, పీఠిక, p. 17.
13. ప్రతాపరుద్ర చరిత్ర, పీఠిక, p. 17.

యుద్ధములు సంభవించుచునే ఉండుటచే తరువాత కాలమున ఈ గాథను కాకతీయుల మూల పురుషుడని వర్ణింప బడిన సోమదేవరాజునకు ముడిపెట్టిన కాకతీయుల గొప్పతనము వ్యక్తమగునను భావముతో చాళుక్య రాజకథనమును సోమదేవరాజునకు ముడిపెట్టుట జరిగి ఉండును.[14]

మాధవవర్మ :

ఈతని చరిత్ర విషయమున కూడ మనకెట్టి ఆధారములును లభించుట లేదు. ఇతడు పద్మాక్షిదేవి అనుగ్రహము వలన ఖడ్గ ఖేటకములను పొంది సైన్యమును సమకూర్చుకొని, తన తల్లికి ఆశ్రయమిచ్చుటకు నిరాకరించిన అనుమకొండ రాజైన ఎఱుక దేవరాజును జయించి, అనుమకొండ యందు రాజ్యమును స్థాపించిన విషయము మనకు ఈ రెండు గ్రంథముల వలన తెలియుచున్నదని ముందు వివరించుట జరిగినది. ఇతడు శా.శ. 291 నుండి 411 వరకు పరిపాలించెను. అనగా క్రీ.శ. 369 నుండి 489 వరకు పరిపాలించెను.

మాధవవర్మ పరిపాలించెనని చెప్పబడిన కాలమున (క్రీ.శ. 369–489) ఆంధ్రదేశమున శాలంకాయనుల అధికారమును నాశనము చేసి విష్ణు కుండినులు రాజ్యమును చేయుచుండిరి. ఈ వంశీయులలో మాధవవర్మ పేరుగల ప్రఖ్యాతులగు రాజులు కలరు. మాధవవర్మ అను పేరుగలవారు ఈ వంశమున ముగ్గురని కొందరు, ఇద్దరని కొందరు, నలుగురని మరికొందరు చరిత్రకారులు అభిప్రాయ పడుచున్నారు. ఈ విష్ణుకుండినులు అశ్వమేధ, వాజపేయ, సర్వమేధ, యుధ్యా షోడశి ప్రాధిరాజ్య, రాజసూయ, పురుష మేధము మొదలగు యాగములను గావించిన వారు. వీరు వైదికమతాభిమానులు, శివ భక్తులు. విష్ణుకుండిన మొదటి మాధవవర్మ క్రీ.శ. 458–488 ప్రాంతమున పరిపాలించెను. ఇతడు బ్రాహ్మణులకు పెక్కు అగ్రహారములను దానము చేసెను. విష్ణుకుండినుల శాసనముల వలన ఈ విషయము స్పష్టమగుచున్నది. ఇతని కాలముననే బౌద్ధమతము వెనుకపడి, వైదిక మతము ప్రముఖ స్థానము నాక్రమించెను. విష్ణుకుండినుల రాజ్యము, కృష్ణా గోదావరీ నదులకు ఉత్తర దక్షిణ భాగముల వరకు వ్యాపించెను. ఈ విష్ణుకుండిన మాధవవర్మ పరిపాలించిన కాలముతో, అనుమకొండ యందు రాజ్యము స్థాపించిన సోమదేవరాజు పుత్రుడయిన మాధవవర్మ కాలము సరిపోవుచున్నది. కనుక విష్ణుకుండిన మొదటి మాధవవర్మకు సంబంధించిన అంశములు

14. తూర్పు చాళుక్య రాజయిన విజయాదిత్యుడు త్రిలోచన పల్లవునితో యుద్ధముచేసి మరణించుట, గర్భవతియయిన అతని భార్య విష్ణుభట్ట సోమయాజి కడనుండుట, అతని కుమారుడు భగవతి అనుగ్రహము వలన మహిమలను పొంది శత్రువులను జయించి సుస్థిరమగు రాజ్యము స్థాపించుట మొదలగు అంశములు గల కథ పెక్కు కైఫీయతులందు గలదు (The Cholas of Renodi, p. 217).

అనుమకొండ పాలకుడయిన మాధవవర్మకు అంటగట్టుట జరిగినదని చెప్పవచ్చును. మాధవవర్మ రాజ్యము కృష్ణా గోదావరీ తీరముల వరకు వ్యాపించినటుల మనకెట్టి ఆధారములును లేవు.

మాధవవర్మ తరువాత రాజ్యమునకు వచ్చిన వారిలో కొద్దిమంది నామములను మాత్రమే ఈ రచయితలు తెల్పిరి. పరిపాలనా కాలము సరిపోవుటకై ఒక్కొక్కరికి సుదీర్ఘమగు పరిపాలనా కాలమును నిర్ణయించిరి. మధ్యలో కొందరి చరిత్ర తెలియక పోవుటయే దీనికి కారణమయి ఉండును. ఈ పరిపాలకులలో ప్రతీ ఒక్కరును కటక బల్లహుని జయించి కప్పమును గ్రహించినవారే. ఇందలి సత్యాసత్యములను తెలిసికొనుటకు మనకెట్టి ఆధారములును లభించుటలేదు. మాధవవర్మ తరువాత చరిత్రకు అందని రాజులు పద్మసేనుడు, వెన్నమరాజు. పోరికి వెన్నమరాజు, పోరికి వెన్నమరాజు కుమారుడు గుండమరాజు.

గుండమరాజు :

ఇతడు శా.శ. 748 నుండి 718 వరకు పరిపాలించెను. ఈయన కాకర్త్య గుండన. ఇతనిని ఈ అఖ్యానములు పెండ్లిగుండమరాజని పేర్కొనినవి. ఆ పేరు వచ్చుటకు కారణమును మాత్రము తెలుపలేదు.

గుండమరాజు విషయములు మాగల్లు శాసనము వలన తెలియుచున్నవి. ఇతని తాతపేరు గుండియరాష్ట్రకూటుడు. తండ్రి ఎఱ్ఱియరాష్ట్రకూటుడు. తల్లి వంద్యనాంబ. వీరిది సామంత బడ్డెవంశము. నతవాటి విషయము. వీరు తూర్పు చాళుక్య రాజైన రెండవ అమ్మరాజునకు సామంతులు.[15] దీనినిబట్టి కాకర్త్య గుండన పూర్వులు విశాఖమండలము వారని, గోదావరికి ఉత్తరమునఉన్న ఆంధ్రభూభాగమును కళింగదేశమని పిలిచెడివారని, ఒడ్డెదేశమనుటయు కలదేమో అని ఖండపల్లి లక్ష్మీరంజనముగారు తెలిపిరి. (ప్రతాపరుద్ర చరిత్ర పీఠిక, పుట, 24, 25)

రెండవ అమ్మరాజు కాలమున రాజ్యము అల్లకల్లోలమున నుండెను. అట్టిసమయమున, ఎఱ్ఱియరాష్ట్రకూటుడు, గుండ్యన యుద్ధమున రెండవ అమ్మరాజునకు తోడ్పడిఉందురు. ఆ సహాయము ఫలితముగ గుండ్యనకు నతవాటిసీమ మండలాధిపత్యము లభించి ఉండును. తన గౌరవము హెచ్చిన తరువాత గుండ్యన అనుమకొండ రాజకుటుంబముతో వివాహము చేసికొని క్రమక్రమముగ అనుమకొండయందు రాజ్యము స్థాపించియుండును.

ఇతడు పెక్కుయుద్ధములను చేసెనని, యవనాది తురష్కులను జయించెనని, కటక బల్లహుని జయించెనని సిద్దేశ్వరచరిత్రమున కలదు. ఈ విషయములు ప్రతాప చరిత్రమున లేవు.

---

15. Indian Antiquary Vol. XI, p. 12.
Inscriptions of Andhra Dynasties Dr. M. Rama Rao.

గుండమరాజు తన సోదరియైన కుంతలదేవిని, ఆంధ్రదేశమున మహాబల వంతులుగ నుండిన విరియాల వంశీయుడైన ఎఱ్ఱనరేంద్రునకిచ్చి వివాహము చేసెను. గూడురు శాశనమునందలి కామసానియే కుంతల దేవియని నిర్ణయించుట జరిగినది. ఈ విధముగ సంబంధ బాంధవ్యములు చేసికొని, రాజనీతి చతురతతో స్వతంత్ర రాజ్య స్థాపనమునకు గుండమరాజు ప్రథమ సోపానమును వేసెను. ఇతని కుమారుడు ఎఱుకదేవరాజు.

ఎఱుకదేవరాజు :

ఎఱుకదేవరాజు బాల్యమునందే గుండనచే అనుమకొండ యందు పట్టాభిషిక్తుడాయెను. (శ్రీ సిద్ధేశ్వర చరిత్రము) ఎఱుక దేవరాజు బాల్యమునందే గుండన మరణించెను. ఎఱుకదేవరాజు బాలుడగుటచే మేనత్త యగు కుంతలదేవి అతనికి సంరక్షకురాలాయెను. ఈమె ఎనిమిది సంవత్సరములు రాజ్యము చేసెనని ప్రతాప చరిత్రమునగలదు. 19 సంవత్సరములని సిద్ధేశ్వరచరిత్ర కారుడు వ్రాసెను. ఈమె మహారాష్ట్రరాజ్యమును జయించెను. అనంతరము సేనాధిపతియగు రాణాగంగి దేవుని కటకబల్లహుని పైకి పంపెను. అతడు కటకబల్లహుని చంపి, అతని కుమారుని రాజ్యాధి కారిని చేసెను. కటక బల్లహుని కడనుండి మూడు కోట్ల సువర్ణములను కప్పముగ తెచ్చెను. కుంతలదేవి రాజ్యమును సుస్థిరమొనర్చి ఎఱుక దేవరాజునకు అప్ప గించెను.

ఎఱుక దేవరాజు రాజ్యమునకు వచ్చిన తరువాత దేవగిరి జయించి ఆ రాజు కుమార్తెను వివాహము చేసికొనెను. అతని పుత్రుడు భువనైక మల్లుడు. ఎఱుక దేవరాజు వీరనరసింహరాయలను జయించి కప్పములను గ్రహించెను.

విరియాల ఎఱ్ఱనృపేంద్రుని భార్య అయిన కామసానియే కుంతలదేవి అని నిర్ణయించుట జరిగినదని పైన పేర్కొంటిమి. ఈమె బేతరాజు పక్షమున రాజ్యము చేసి, శత్రువులను జయించి, సుస్థిరమగు రాజ్యస్థాపన గావించి బేతరాజును అనుమ కొండకు రాజుగచేసినటుల ఈ రెండు గ్రంథములయందును గలదు. ఈ విషయము మనకు గూడూరు శాసనమువలన తెలియుచున్నది.[16] కాకతీయులు పరిపాలించు చున్న కొరవి సీమ తూర్పు చాళుక్య రాజ్యమున నుండెను. ఎఱుక దేవరాజు కాల మున జటాచోడ భీముడు చాళుక్య రాజ్యము నాక్రమించెను. అతడు కాకతీయులు కొరవిసీమయందు ప్రబలులు కాకుండ ప్రయత్నించెను. అట్టి పరిస్థితులలో ఎఱుక దేవరాజు మేనత్త అయిన కుంతలదేవి పశ్చిమ చాళుక్య రాజైన భాస్కర విభుని సహాయముతో కాకతీయ రాజ్యమునకెట్టి ఆపదరాకుండ కాపాడి, ఎఱుక దేవరాజున కప్పగించెను.[17] ఈ ఎఱుకదేవరాజే మొదటి బేతరాజని చారిత్రకులు నిర్ణ

16. తెలంగాణా శాసన సంపుటము.

17. తెలంగాణా శాసనములు, సంపుటము 1, p. 165.

యించిరి. పై అంశముల వలన కాకతీయ సామ్రాజ్యము మొదటి బేతరాజుతో ప్రారంభమైనదని తెలియుచున్నది. కాకతీయుల చరిత్ర మనకి మొదటి బేతరాజు కడనుండియే తెలియుచున్నది.

ఎఱుకదేవరాజు (మొదటి బేతరాజు) రాజ్యమునకు వచ్చిన తరువాత దేవ గిరి రాజును ఓడించి, అతని కుమార్తెను వివాహము చేసుకొనెనని ఈ రెండు గ్రంథములందును కలదు. కాని అకాలమునకు దేవగిరి రాజ్యము అవతరించలేదు. కనుక ఈ విషయము పురాభవిష్యత్కథనముగ గ్రహింపవచ్చును.

ఈ ఎఱుకదేవరాజు చోడ చక్రవర్తిని జయించినటుల రెండవ బేతరాజు వేయించిన శాసనము (కాజీపేట) వలన తెలియుచున్నది. ఇతడు, పశ్చిమ చాళుక్యులకు యుద్ధమున తోడ్పడి యుండును. ఈ విషయమును మనుమడు, తాతగారి ప్రతాపము వ్యక్తమగునను ఉద్దేశముతో ఘనముగ శాసనము వేయించి ఉండును.

ఈ రెండు గ్రంథములందు గుండమరాజు తండ్రిగా వర్ణింపబడిన పోరంకి వెన్నమరాజు, గుండమరాజు తండ్రి కాడను విషయము పై అంశముల వలన తెలియుచున్నది. ఈ పోరంకి వెన్నమరాజు నిజమునకు దుర్జయ కులమున విరియాల వంశమున సుప్రసిద్ధి బడసిన పోరంకి వెన్నమరాజు. ఇతని తాత పద్మసేనుడు. ఈ పద్మసేనుడు సంతానము కొరకు సిద్ధేశ్వరుని పూజించి పుత్రుని గాంచెను. ఇతడు సిద్ధేశ్వరుని కుష్మాండములతో పూజించెను. క్రీ. శ. 15వ శతాబ్దమున అనితల్లి వేయించిన శాసనమున గల గుమ్మడి తీగకు కాకతీయులు ఉద్భవించిరను గాథకు నిదియొక ఆధార భూతమగు గాథగా కన్పట్టుచున్నది.

పద్మసేనుని తండ్రి మాధవవర్మ, అతని తండ్రి సోమదేవరాజు. విరియాల వంశీయులైన ఈ పూర్వరాజులు కందారమును పరిపాలించిరి.[18] వీరి గాథను మన రచయితలు, కాకతీయులరాజకథనముతో జోడించిరనుటకు ఎట్టి సంశయమును లేదు.

కందరమును పరిపాలించిన పద్మసేనాది రాజుల కాలముతో ఈ రెండు గ్రంథములందు వర్ణింపబడిన మాధవవర్మ, సోమదేవరాజాదుల కాలము సరిపోవుచున్నది

## భువనైక మల్లుడు (మొదటి ప్రోలరాజు) శా. శ. 792 నుండి 818

ఇతడు పెక్కుమంది రాజులను జయించెను. విజయనగర రాజైన వీరనరసింహరాయలను యుద్ధమునకు ఆహ్వానింపగా, అతడు రాకపోవుటచే తానే విజయనగరమున కేగెను. రాయలు భార్యాసహితుడై భువనైక మల్లున కెదురువచ్చి గౌరవించి తన సోదరియగు రంగమదేవినిచ్చి వివాహముచేసి కాంచీపురమును (చోళరాజ్యమును) అరణముగా నిచ్చి పెక్కు కానుకల నిచ్చెను.

రంగమదేవి గంగాపురమున పాంచాలరాయనికి ఆలయమును కట్టించెను.

18. Dr. D.C. Sircar, The Successors of Satavahanas, p. 56.

నైవేద్యము నిమిత్తము పదకొండు గ్రామములను దానముచేసెను. వీరి కుమార్తె పాంచాలి. విజయనగర రాజకుమారుడైన వేంకటనాధుడు, భువనైక మల్లునితో యుద్ధము చేయుటకు రాగా, భువనైక మల్లుడు, కుమార్తెయగు పాంచాలినిచ్చి వివాహముచేసి కొండవీడు (విదర్భదేశమట) అరణముగనిచ్చెను. (ప్రతాపచరిత్ర శ్రీ సిద్ధేశ్వరచరిత్రములు) ఈ భువనైక మల్లుడు ఎనుబదిరెండు సంవత్సరములు పరిపాలించెను. పాంచాలరాయనికి దేవాలమేకాక, శివాలయమును గూడ నిర్మించెను.

భువనైక మల్లుడు విజయనగరముపై దండెత్తుట మొదలగు విషయముల సత్యాసత్యముల నిర్ణయించుటకు మనకెట్టి ఆధారములును లభించుటలేదు. మొదటి ప్రోలరాజు అనుమకొండను త్రైలోక్య మల్ల బిరుదాంకితుడైన మొదటి చాళుక్య సోమేశ్వరుని కడనుండి సంపాదించెను. చాళుక్య చక్రవర్తి యగు రెండవ సోమేశ్వరునకు భువనైక మల్లుడను బిరుదము కలదు. వారి సామంతుడైన మొదటి ప్రోలరాజు భువనైక మల్లుడను బిరుదును మైత్రీసూచకముగ ధరించి ఉండును. ఈ కాలము నాటికి విజయనగర సామ్రాజ్యస్థాపనము జరుగలేదు. కనుక భువనైక మల్లుడు విజయనగరముపై దండెత్తెనను గాథ అసత్యమనియే చెప్పవచ్చును. ఇట్టి సంఘటన ఒకటి అనాడు సుప్రసిద్ధిగాంచిన చోళ, చాళుక్య సామ్రాజ్యముల మధ్య జరిగియుండును. అసత్యములగు విషయములు కాలక్రమమున సాంప్రదాయక చరిత్రముగ (Traditional History) చెప్పబడుట, చరిత్రయందు చేర్చబడుట జరుగుచుండును. పై గాథకూడ యట్టిదే.

ఈ మొదటి ప్రోలరాజు సేనాని ఒకడు కాంచీనగరము వరకు వెళ్ళి చోళ రాజును పరాభవించి కాకతి వల్లభునకు విజయలక్ష్మని చేకూర్చెనని, పిల్లలమర్రి పాలంపేట శాసనముల వలన తెలియు చున్నది. ఇతనికి కాంచీ పురపాలకులైన చోళులతో వైరము కలుగుట కెట్టి అస్కారమును లేదు.

కాకతి బేతరాజు హనుమకొండను పరిపాలించెననియు, మొదట కొరవి దేశమును, తరువాత పశ్చిమ చాళుక్యుల సామంతునిగ సబ్బిమండలమును, పరిపాలించినటుల శాసనాధారము వలన తెలియుచున్నది.[19] ఇవి రెండును నైజాము రాష్ట్రమునందలి వరంగల్లు మండలము నందలివి. వేంగీ సామ్రాజ్యము ఈ కొరవి దేశము వరకు వ్యాపించి ఉండెను. దీనివలన కాకతీయులు వేంగీదేశమునకు పశ్చిమోత్తర దిశయందు స్థిరపడినటుల తెలియుచున్నది. ఈ ప్రాంతమున ఉన్న ప్రోలరాజునకు కాంచీపుర రాజులతో వైరము సంభవించుట అసంగతమైన విషయము. కాని ఆ కాలమున ఆంధ్రదేశముపై దాడి వెడలిన రాజేంద్రచోళుని ఎదిర్చిన చాళుక్యులకు ఈతడు సహాయము చేసి ఉండును. ఈ యుద్ధమున ఓడిపోయిన రాజేంద్రుని కాకతీయ సైన్యాధ్యక్షుడగు బమ్మ సేనాని కాంచీపురము వరకు తరిమి మరియొకసారి

19. గూడూరు శాసనము, హనుమకొండ శాసనము, Epigraphia Indica, Chap. IX, p. 256.

పరాభవించి ఉండును.[20] అనంతరము వేంగీ పాలకుడైన విజయాదిత్యుడు మరణించెను. కాంచీపురమునకు కుళోత్తుంగుడు రాజాయెను. ఆసమయమున వేంగీ దేశమున అనేక సామంత రాజవంశములు స్వతంత్ర్య రాజ్యములను స్థాపించుకొన జొచ్చినవి. ఆ సమయముననే కాకతీయులు కూడ స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొనిరి.[21]

ఈ చారిత్రక విషయములేవియు విక్రమనాథ సర్వప్పలు పేర్కొనలేదు. ఈ మొదటి ప్రోలరాజును గూర్చి విశేషము లింతకంటెను ఏమియు తెలియుటలేదు.

## త్రిభువన మల్లుడు (రెండవ బేతరాజు) శా. శ. 818 - 892 :

ఇతడు, కటక బల్లహుడు దండెత్తిరాగా అతనిని యుద్ధమున చంపి, వాని కుమారునకు పట్టము గట్టి మూడుకోట్ల సువర్ణ నిష్కములను కప్పముగా గ్రహించెను. గంగాపురమున శివాలయములను నిర్మించెను. కాకతి మహాదేవిని కొలచి పుత్రుని బడసెను. అతనిపేరు కాకతి ప్రోలరాజు. ఇతడే రెండవ ప్రోలరాజు.

మనకు కాకతీయుల చరిత్ర ఈ త్రిభువన మల్లుని (మొదటి బేతరాజు) కడనుండియే ఆధారసహితముగ లభించుచున్నది. ఇతడు పరాక్రమ శాలియని తెలియుచున్నది. కాకతీయుల చరిత్రయందు పేర్కొనదగిన మొట్టమొదటి రాజితడనియే చెప్పవచ్చును. చేబ్రోలు శాసనమునందును, పాకాల శాసనము నందును, హనుమకొండ శాసనమునందును ఇతడు పేర్కొనబడి యున్నాడు.[22]

ఈ రాజును గూర్చిన విశేషాంశము లేవియును ఈ రెండు గ్రంథములును చెప్పలేదు.

కాకతి బేతరాజునకు వ్యోజన దండనాధుడను నాతడు మంత్రిగ నుండెను. ఇతడు కాకతి బేతరాజుచే, శ్రీ త్రిభువన మల్లదేవ విక్రమాదిత్య చక్రవర్తికి మ్రొక్కించి సామంత మండలేశ్వరునిగ నుండి, సబ్బిసాయిర మండలమును పరిపాలించునట్లుగ నియోగింప చేసెనట.[23] ఈ దండనాధుడు వేయించిన శాసనము పద్మాక్షిదేవాలయమున కలదు.

కాకతి బేతరాజు హనుమకొండలో తనపేర బేతేశ్వరాలయమును నిర్మించెను. ఉద్యానవనమును వేయించెను. తన తండ్రియగు ప్రోలరాజు పేర ప్రోలేశ్వరుని స్థాపించెనట. (ఖాజీపేట శాసనము) పెక్కు దానధర్మములను చేసి ఖ్యాతి గడించెను.

## కాకతిప్రోలరాజు (రెండవ ప్రోలరాజు) శా. శ. 892 - 964 :

కాకతి ప్రోలరాజు బాలుడను విషయము విని, కటక బల్లహుడు విశ్వనాధ

20. ప్రతాపరుద్ర చరిత్ర, పీఠిక.

21. కాకతీయ సంచిక, pp. 15–17.

22. శాసన సంపుటి.

23. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 150.

దేవుడను దళవాయిని హనుమకొండను ముట్టడించుటకు పంపెను. అతడు 12 సంవత్సరములు ముట్టడిచేసెను. ప్రోలరాజు సైన్యమును సమకూర్చుకొని కటకముపై దండెత్తి బల్లహుని చంపి, అతని పుత్రునకు పట్టము కట్టి, మూడుకోట్ల సువర్ణ నిష్కములు కప్పముగ తెచ్చెను. హనుమకొండయందలి కటక బల్లహుని దళములను పారద్రోలెను.

ఇతడు గంగాపురమున చెన్నరాయని దేవాలయమును కట్టించెను. ఒక కోనేరును కట్టించెను. త్రిదండి స్వామియను ముని వలన హిడంబాశ్రమ మహిమ విని అచట కొన్ని దేవాలయములను నిర్మించెను.

ఓరుగల్లు నిర్మాణము :

హనుమకొండ కాగ్నేయ దిశయందు ఆగ్రామ ప్రజలు కొందరు శకటముపై రాగా, ఆ శకటమొకచోట ఓరగిలబడెను. మరు దినమున దానిని పైకితీయ, చక్రము సువర్ణమగుట గాంచి వారు ఆ విషయము రాజునకు తెలిపిరి. రాజు పురోహిత బుధ జనులతో అరుదెంచి, అచట పరుసవేదియగు శివలింగమును గాంచి, రామారణ్య శ్రీ పాదులను, మహేంద్ర శ్రీపాదులను త్రిదండిస్వామిని రప్పించి వారి అనుమతి ప్రకారము అలింగమును నడుమనుంచి, యోజన విస్తారమున శా.శ. 909 శోభ కృతునామ సంవత్సరము కార్తీక శుద్ధ షష్టి గురువారమునాడు పట్టణము నిర్మించెను. రామారణ్య శ్రీపాదుడు కోటకు రేఖలు వ్రాసి చుట్టును ప్రహరీ గోడ కట్టించెను. ముక్తీశ్వర, విశ్వనాథ, భీమేశ్వర, విరూపాక్ష, రామేశ్వర దేవాలయములను 250 నిర్మించెను. వేంకటనాథ, శ్రీరంగనాయకులు, గోపాలుడు, పాంచాలరాయడు, మొదలగు విష్ణు దేవాలయములను, ఏబది దేవీభవనములను, వీరభద్ర, వినాయక, భైరవ భవనములు నలువది కట్టించెను. ఇతని పుత్రుడు రుద్రుడు. రుద్రుడు జన్మించినపుడు 'ఈ పుత్రునిచేత నీవు మృతిపొందగలవు. కనుక, ఆ బాలుని వధింపు' మని బ్రాహ్మణులు రాజునకు తెల్పిరి. అంత రాజు, భార్యా సహితుడై ఆ బాలుని శంభుదేవుని ఆలయ మంటపమున విడిచి వచ్చెను. ఆ మరునాడు కావలివారా బాలుని గాంచి రాజునకు తెలిపిరి. రాజు ఆశ్చర్యము ప్రకటించి, ఆలయ పూజారిని రప్పించి ఆ బాలుని పోషింపుమని ఆజ్ఞాపించెను. బాలునకు రుద్రుడని నామమిడెను. ఆ బాలుడు పెద్దవాడు కాగా ఉపనయనాదుల గావించి సకల శాస్త్రముల నేర్పించెను. తరువాత ఆ బాలునకు కొంత సైన్యము నిచ్చి శంభు లింగాలయమునకు కావలిఉండనియమించెను.

కాకతి ప్రోలరాజునకు మహాదేవరాజను మరియొక పుత్రుడుదయించెను. మహాదేవుడు మహాశ్వేత వ్యాధిగ్రస్తుడు. ఆ వ్యాధి నివారణ కొరకు అయిదువేల పుట్లు తిలలు పర్వతాకారమున పోయించి దానిపైన పన్నెండు మణుగుల సువర్ణ కాలపురుషుని ప్రతిమను ప్రతిష్ఠించి, పదివేల సువర్ణ నిష్కములు దక్షిణగా తగినవానికి

దాన మివ్వవలెనని పండితులు తెల్పిరి. అంత రాజు దూదికేశవ పెన్నయ్య అను సద్బ్రాహ్మణునకు దానము నిచ్చెను. మహాదేవరాజునకు రోగ నివారణమాయెను. కాని దానమును పరిగ్రహించిన బ్రాహ్మణుడు బ్రహ్మరాక్షసుడాయెను. అతడు పుణ్య లోకమున కరుగుటకై ప్రోలరాజు, అతని భార్యాబిడ్డలకు అపారమైన ధనము నిచ్చి, వారణాసియందు దోష విముక్తిని చేయించెను. ప్రోలరాజు 72 సంవత్సరములు రాజ్యము చేసెను. ఒకనాడు అర్ధరాత్రి శంభులింగమును పూజించుటకు ఆలయమున కేగెను. అతడు షట్కాల శివపూజాపరుడు. ఆలయ మంటపమున తల్పముపై నిదురించుచున్న కుమారుని గాంచి, నిద్రాభంగము కాకుండ ఆలయములోనికేగి పూజ గావించి మరలి వచ్చెను. వచ్చునపుడు రుద్రునకు తన జంపలు తగలుటచే రుద్రుడు మేల్కాంచి, రాజుని, చోరుడని తలంచి ఖడ్గముతో పొడిచెను. అనంతరము అతడు రాజని తెలిసికొని మిక్కిలి భయపడెను. అంత రాజు ఆలయము వెలుపల నున్న మంత్రిపురోహితాదులను రావించి రుద్రుడు తన కుమారుడేయని తెలిపి రుద్రునకు పట్టాభిషేకము గావించి అనంతరము మరణించెను.

పై అంశములందు ప్రోలరాజు కటక బల్లహునితో పోరాడు విషయము, రుద్రుని ఆలయమున విడచిన విషయములు సత్యములని నిరూపించుటకు మనకు అధారములు కన్పించుటలేదు.

కాకతి ప్రోలరాజు కాలమున చాళుక్య చక్రవర్తి (చాళుక్య విక్రమాదిత్యుని అనంతరము) సమర్థుడు కాకపోవుటచే సామంతరాజులు స్వాతంత్ర్యమును ప్రకటించుకొన మొదలిడిరి. ఆ సందర్భమున జగద్దేవ దండనాయకుడను నాతడు హనుమకొండను ముట్టడించెను. అతనిని పారద్రోలి ప్రోలరాజు విజయమును గాంచెను. ఈ విషయము రుద్రదేవుడు వేయించిన హనుమకొండ శాసనమున గలదు.[24]

చాళుక్య చక్రవర్తి బలహీనుడగుటచే, కాకతి ప్రోలరాజు పెక్కుమంది సామంతరాజులతో యుద్ధములు చేసెను. కొండపల్లి పరిపాలకుడైన గోవిందరాజును జయించెను. నూజివీడు తాలూకాను పరిపాలించుచున్న గుండ లేక మంతెన అను నాతనిని యుద్ధమున సంహరించెను. తరువాత వెలనాటి రాజ్యమువైపు మరలెను. ఇది గాంచి, చాళుక్య రాజైన మూడవ తైలపుడు, జగద్దేవ దండనాయకుని సహాయముతో హనుమకొండను ముట్టడించెను. ప్రోలరాజు తైలపుని బంధించి, జగదేవుని పారద్రోలెను. అనంతరము తైలపుని విడిచిపెట్టెను. ఈ విజయములు కాకతీయ మహాసామ్రాజ్య స్థాపనమునకు అంకురార్పణము చేసినవి.

ఈ చారిత్రక విషయములను విడిచి ఆఖ్యాత లిడవురును కటక

24. A Corpus of Inscriptions in the Telangana District, H.E.H. The Nizam's Dominions.

బల్లహుని సేనాని విశ్వనాథుడను నాతడు హనుమకొండను ముట్టడించు విషయము వర్ణించిరి. ఈ కటక బల్లహుని జయించుట అనునది లాంచనముగ గ్రహించి, ఈ కవులిరువురును ప్రతి రాజునకు ఈ కథను ముడిపెట్టినట్లు కన్పడుచున్నది.

ఈ రెండు గ్రంథములందును, ప్రోలరాజు, రుద్రదేవునిచే వధింపబడెనని గలదు. ఈ విషయమును నిర్ధారించుటకు మనకెట్టి ఆధారములును లేవు. ప్రోలరాజు వెలనాటి రాజులతో యుద్ధము చేసి మరణించినటుల తెలియుచున్నది. వెలనాటి వంశీయుడైన రెండవ చోడరాజునకు "కాకతి ప్రోలనిర్దహన" అను బిరుదమున్నటుల దాక్షారామ శాసనము వలన తెలియుచున్నది. కనుక ఇతడు వెలనాటి రాజులతో యుద్ధము చేయుచు మరణించియుండునని ఊహింపవచ్చును.[25]

రుద్రదేవుడు ప్రోలరాజును చంపెనన్న అంశము, రుద్రదేవుడు తండ్రిని చంపుటకు ప్రయత్నించియుండునేమో అను సందేహమునకు తావిచ్చుచున్నది. కాని ఆధారములు లేవు.

**రుద్రదేవ మహారాజు — శా.శ. 964-1152 :**

ఇతడే మొదటి ప్రతాపరుద్రుడు. పరాక్రమశాలి, శివభక్తుడు. అయినవోలు నందలి మైలారు దేవునకు ఒడ్డిపల్లి వినాయకునకు, మొగలిచర్ల వీరాదేవికి ఆలయములను నిర్మించెను. కాశీవిశ్వనాథుని, శ్రీశైల మల్లిఖార్జునుని సేవించెను. ఎనిమిది తులాభారములు తూగి, మల్లికార్జునకు కోటి సువర్ణములు దానము చేసెను. ఏకశిలానగరమున సహస్ర శివలింగములకు ఆలయములను కట్టించెను. హనుమకొండయందు తన పేరిట రుద్రేశ్వరాలయము నిర్మించెను. కోనేరును త్రవ్వించెను. ఎనుబది నాలుగు గ్రామములను నిత్యోత్సవము కొరకిచ్చెను. ఓరుగల్లు పట్టణమున వాడలు తీర్చి సుందరముగా కట్టించెను. ప్రోలరాజుతో ప్రారంభమయిన ఓరుగల్లు నిర్మాణము రుద్రదేవునిచే సుందరముగ తీర్చిదిద్దబడెను. రుద్రదేవుడు దేవాలయాదులను నిర్మించిన వైనము హనుమకొండ శాసనములందు గలదు.

రుద్రదేవుడు పెక్కు విజయములును గాంచెనని చెప్పబడెను. కటకమును జయించెను. కటక వల్లభుని చంపి అతని పుత్రుని రాజును చేసెను. పాండ్యరాజును జయించి, రామేశ్వరమున కేగి, ఆ దేవుని సందర్శించెను. మలసాట రాజును జయించెను. ఎరుక దేవరాజును జయించెను. వెలనాటి రాజులను జయించి కప్పముల గ్రహించెను. గింగి భైరవులను జయించి, వరాహలాంఛనము గ్రహించెను. తురుష్కులను జయించెను.

శత్రువులను జయించి, దానధర్మములు చేయుచు రుద్రదేవ మహారాజు 78 సంవత్సరములు పరిపాలించెను. ఇతనికి మల్లికార్జునుని కృపవలన ఒక

25. కాకతీయ సంచిక, p. 21.

పుత్రుడు జన్మించెను. అతని నామము గణపతి దేవుడు. తమ్ముడగు మహాదేవరాజు కొంత పరిజనమును సమకూర్చుకొని రుద్రదేవుని చంపెను. అనంతరము తన్ను రాజుగా నియమింపుమని ప్రజలను కోరెను. వారు అంగీకరింపకపోవుటచే మహాదేవుడు గణపతిదేవుని రాజును చేసి తాను యువరాజుగ నుండి కొన్నాళ్లు రాజ్యపాలనము చేసెను.

పై అంశములందలి రుద్రదేవుని విజయములు కొన్ని సంశయాస్పదమైనవి. తురుష్కులను జయించుట, కటక విజయము, గింగి భైరవులను జయించుట అసంగత విషయములు. రుద్రదేవుని కాలమునకు తురుష్కులు ఆంధ్రదేశమున అడుగిడలేదు. ఇక కటక విజయము, కాకతీయుల తరతరముల విజయమును సూచించు లాంఛనప్రాయమైన గాథ. జింజి ప్రాంతమును పరిపాలించిన కొప్పెరుం జింగడు అను నాతడే గింగి భైరవులు. ఇతడును రుద్రదేవుని కాలమున లేడు.

మలసాట పృథ్వీశ్వరుని జయించిన విషయము నిరూపింపబడినది. ఈ అంశము హనుమకొండ శాసనమున గలదు. పృథ్వీశ్వరునే కాక, పాకాల తాలూకాను పరిపాలించిన దొమ్మరాజు, మేడరాజులను కూడ జయించెను. ప్రోలవలన పాలకుడైన మైలింగి దేవుని జయించెను. మేడరాజు మాధవవర్మ వంశీయుడైన దుగ్గరాజు పుత్రుడని తెలియుచున్నది.[26]

మైలింగి దేవుడు దేవగిరి యాదవుల పూర్వీకుడని ఆంధ్రుల చరిత్రవలన తెలియుచున్నది.[27] కాని ఇది సరికాదనియు హనుమకొండ సమీపమున జగత్యాల తాలూకానందొక మైలింగి కలడనియు, ఆ ప్రాంతమునకు నేటికిని 'పాలాసా' అను నామము గలదనియు, కనుక రుద్రదేవుడు జయించిన మైలింగి ఇతడే అనియు తెలియుచున్నది.[28]

రుద్రుడు వర్ధమానపురమును పరిపాలించిన రేనాటి చోళశాఖవాడైన చోళ రాజు భీముని జయించెను. రుద్రుని ధాటికోర్వలేక భీముడు సకుటుంబముగ అరణ్యములకు పారిపోయెను. రుద్రదేవుడా పురమును నాశనమొనర్చి, అచట నొక తటాకమును నిర్మించెను.[29]

చోడోదయ రాజగు ఉదయచోడుని జయించి, అతని కుమార్తె పద్మావతిని వివాహము చేసికొనెను.

రుద్రదేవుడు వెలనాటి రాజులను సహితము జయించెను. తన తండ్రి

---

26. కాకతీయ సంచిక, p. 26.

27. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 163.

28. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 163.

29. The Dynasties of Eastern Deccan – Chap. VIII.
కాకతీయ సంచిక.

A Corpus of Inscriptions in the Telangana District of H.E.H. The Nizams Dominion, Part II.

ప్రోలరాజు వెలనాటి చోళులతో గావించిన యుద్ధమునందు మరణించుటచే, ప్రతీకారముకొరకు ఈతడీ యుద్ధయాత్రను చేసి విజయమును గాంచెను. ఇందులకు శాసన ప్రమాణములు గలవు.[30]

రుద్రదేవుని ఈ విజయముల విషయములను వివరింపక, కవులిరువురు సంశయాస్పదములైన ఆధారములు లేని కొన్ని విజయములను వర్ణించిరి.

గణపతిదేవుడు రుద్రదేవుని కుమారుడని ఈ రెండు గ్రంథములందును వర్ణింపబడినది. కాని శాసనాధారముల ప్రకారము, చారిత్రకుల నిర్ణయము ప్రకారము రుద్రదేవునకు పుత్రులు లేరనియు, గణపతిదేవుడు మహదేవుని కుమారుడనియు తెలియుచున్నది.[31]

రుద్రదేవుని మరణ విషయమున కూడ, ఈ రెండు గ్రంథములు, రుద్రదేవుని తమ్ముడగు మహదేవుడు చంపెనని వర్ణించినవి. పెక్కుమంది రాజులను జయించి కాకతీయ సామ్రాజ్యమును వ్యాపింపజేసి, మహాపరాక్రమశాలియై విరాజిల్లు రుద్రదేవుని గాంచి, అసూయచెంది దేవగిరి యాదవులు హనుమకొండపై దాడి చేయగా రుద్రదేవుడా యుద్ధమున మరణించెనని చారిత్రకుల ఊహ. రుద్రదేవుని చివరి దినములు ఏ విధముగ గడచినదీ అతడు ఎప్పుడు మరణించినదీ తెలిసికొనుటకు సరియగు ఆధారములు లేవు.[32]

## మహాదేవుడు – 1052–1059 :

ఇతడు అన్నను చంపి రాజ్యమునకు వచ్చెను. అన్నను చంపుటచే పట్టాభిషిక్తుని చేయుటకు ప్రజలు నిరాకరించిరి. అంత వారి కోరిక ప్రకారము తన కుమారుడగు గణపతి దేవునకు పట్టముకట్టి తాను యువరాజుగ నుండెను.

దేవగిరి రాజులు దండెత్తిరాగా, వారితో యుద్ధము చేసి ఆ యుద్ధమున మరణించెను. అంత గణపతి దేవుడు శత్రువులతో యుద్ధము చేసి వారిని ఓడించెను. యాదవరాజ కుమార్తెయగు రుద్రమను వివాహము చేసికొనెను. తాను రాజాయెను.

మహదేవుని గూర్చి ఈ రెండు గ్రంథములు తెల్పిన గాథ యిది. ఈ రెండు

30. కాకతీయ సంచిక, p. 27.

31. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్ర, p. 178.
also look – A Corpus of Inscriptions in the Telangana Districts of H.E.H. The Nizams Dominions, Part I.
కాకతీయ సంచిక.
The Dynasties of Eastern Deccan, Chap. VIII.
The Early History of the Deccan.

32. G. Yazdani, The Early History of the Deccan, p. 595.
R.C. Majumdar, The Dynasties of Eastern Deccan.

గ్రంథములును మహదేవరాజును భాతృ హంతకునిగ వర్ణించినవి. కాని ఇతడు మంచి గుణగణములు కలవాడనియు, శివభక్తుడనియు తెలియుచున్నది. ధృవేశ్వరుడను శివయోగి కడ ఈతడు శివదీక్షను పొందెను. ఇతడు రాజ్యకార్యములందు అంతగా శ్రద్ధవహింపక పోవుటయే అతని మరణమునకు కారణమని తెలియుచున్నది.[33] ఇతనిని గూర్చి సరియగు చరిత్ర ఏదియును తెలియుట లేదనియు, ఇతని కాలమునకు సంబంధించిన ఒకటి రెండు శాసనములు కూడ సరియగు చరిత్రను తెలుపుట లేదని తెలియుచున్నది.[34]

యాదవ జైతుగితో కాకతీయులు చేసిన యుద్ధమున మహదేవరాజు మరణించెననియు, గణపతి పట్టుబడెననియు చరిత్రలు తెలుపుచున్నవి.[35] కాని ఈ రెండు గ్రంథములు గణపతి యాదవరాజును జయించి అతని కుమార్తెను వివాహము చేసికొనెనని తెలుపు చున్నవి. ఇది చారిత్రక సత్యమునకు విరుద్ధమగు విషయము.

## గణపతి దేవుడు – శా.శ. 1059–1127 :

ఈ రెండు గ్రంథములును గణపతి దేవుడు తన పిన తండ్రిని చంపిన దేవగిరి రాజవంశమును నాశనము చేసి దేవగిరి రాజకుమార్తె అయిన రుద్రాదేవిని వివాహము చేసికొని, ఏకశిలానగరమున కరుదెంచి రాజ్యమును పరిపాలించుట ప్రారంభించి, తన్నెదిరించిన సోదరులను సంహరించి, పట్టాభిషేకమును చేసికొని, ఏకశిలానగరమునకు శిలా ప్రాకారమును నిర్మించుటతో ప్రారంభమైనవి.

నెల్లూరు నుండి మహాకవి తిక్కన సోమయాజి సహాయార్థముారాగా, తన మంత్రియగు శివదేవయ్య అనుమతి ప్రకారము, సేనా సమేతుడై మార్గమున పెక్కు రాజుల జయించి, నెల్లూరున కేగి అక్కన బయ్యనలను ఓడించి, మనుమ సిద్ధిని రాజును చేసి, అతనికి రెండువేల ఏడు వందల గ్రామములిచ్చి తక్కినవి తన రాజ్యమున కలుపుకొనెను.

ఇతడనేక రాజగృహములను కట్టించెను. నగరునకు ఇటుక ప్రాకారము కట్టించెను. మల్లికార్జునుని పన్నెండు వేల సువర్ణ కమలములతో పూజించెను. పంచారామములను సేవించి షోడశ మహా దానముల నిచ్చెను. మల్లికార్జున పండితుని కడ శివ దీక్షను పొందెను. గుండ బ్రహ్మయ్య అను శివ భక్తుని, ఒక చోరునకు శరణ మిచ్చినందులకు కొరత వేయించగా శివుడు ప్రత్యక్షమయి గుండ బ్రహ్మయ్యను కైలాసమునకు గొని పోయెననియు ఈ గ్రంథములందు గలదు. ఈ కథ కేవలము శివ భక్తుల మహిమలను తెలుపుటకు వ్రాయ బడినటులున్నది.

33. G. Yazdani, The Early History of Deccan, p. 198.
34. R.C. Majumdar, The Dynasties of Eastern Deccan.
35. Epigraphia Indica, Vol. III, p. 113.

గణపతి దేవుడు ఏకశిలా నగరమునకు నైరుతి భాగమున ఒక మహా తటాక మును నిర్మించెను. దానికి ఈశాన్య భాగమున గణపురమను పురమును నిర్మించెను. ఇతడు మూరు రాయర గండ పెండేరమును ఎడమ కాలికి ధరించెడివాడు.

గణపతిదేవ మహారాజునకు పుత్రులు లేరు. ముమ్మమ్మయను పుత్రిక కలదు. ముమ్మమ్మను చోళ వంశీయుడయిన వీరయ్య దేవుడను నాతని కిచ్చి వివాహము చేసి ఎనిమిది కోట్ల సువర్ణములను నిక్షేపించెను. (ప్రతాపరుద్ర చరిత్రము) సిద్ధేశ్వర చరిత్రమున 'చాళుక్య వంశాబ్ధి చంద్ర దిగంత రాళుండు వీరభద్రరాజు' నకిచ్చి వివాహము చేసెనని గలదు. తరువాత తన నగరము నందలి అగ్ర గణ్యు లకు, నానావర్ణముల వారికి, వారికి తగిన నాయకత్వముల నిచ్చి నానామండలీకర గండడను బిరుదు గాంచెను. గణపతి దేవుడు 28 సంవత్సరములు పరిపాలించి మరణించెను. గణపతి దేవుని తరువాత అతని భార్య రుద్రమ రాజ్యమునకు వచ్చెను (ప్రతాపరుద్ర, సిద్ధేశ్వర చరిత్రలు).

ఇందలి కొన్ని అంశములు చరిత్రకు విరుద్ధముగ కన్పడు చున్నవి. గణపతి దేవుడు రుద్రుని కుమారుడు కాడని, మహాదేవరాజ పుత్రుడని, యాదవ రాజయిన జైతుగితో చేసిన యుద్ధమున పట్టుబడెననియు, మన చరిత్రలన్నియు ఆధార సహితముగ తెలుపు విషయమును పరిశీలించుట జరిగినది. చారిత్రకుల అభి ప్రాయము ప్రకారము గణపతి దేవుని పరిపాలన రాజ్యము క్లిష్ట పరిస్థితులలో నున్నపుడు ప్రారంభమైనది. గణపతి దేవుడు శత్రువులచేత చిక్కుటచే, కాకతీయ రాజ్యము వర్ధిల్లు చుండుట సహించలేని, శత్రురాజులు ఈ రాజ్యమును సమూల ముగ నాశన మొనర్పవలెనను అభిప్రాయముతో హనుమకొండపైకి దాడి వెడలిరి. రాజభక్తియు, దేశభక్తియు ఉన్న కాకతీయ సేనాపతులు సమర్థతతో శత్రువుల బారినుండి సామ్రాజ్యమును రక్షించి బంధవిముక్తుడై వచ్చిన గణపతి దేవునకు రాజ్యము నప్పగించిరి. వారిలో ముఖ్యుడు రేచర్ల రుద్ర సేనాని.

గణపతి దేవుడు రాజ్యమునకు వచ్చునరికి ఆంధ్రదేశమున పెక్కుమంది సామంతరాజులు స్వతంత్రులైరి. వేంగిదేశమున కోట వంశీయులు, మదపల్లె యందు నతవాడి వంశము, సారసి పురమున కొలని నాయకులు, గుడిమెట్ట యందు చాగి వంశీయులు, కృష్ణానదీ ముఖద్వారమున దయ్యు వంశీయులు, పిఠాపురమున వేంగీ దేశమునుండి పలాయితుడైన వెలనాటి పృథ్వీశ్వరుడు, ఉత్తరమున కళింగ గాంగులు, పొత్తపి, నెల్లూరు ప్రాంతములందు తెలుగు చోళులు హనుమకొండకు దక్షిణ భాగమున చోళులు, ఉత్తర దిశయందు దేవగిరి యాదవులు, వాయవ్యమున హొయసలులు ప్రబలులగుచు, కాకతీయ రాజ్యమును కబళించుటకు ప్రయ త్నించు చుండిరి.[36] గణపతి దేవుని కాలమున చోళ రాజ్యము భాగములుగ

36. కాకతీయ సంచిక, p. 40.

విడిపోవు చుండెను. కాకతీయులు, హొయసలులు, పాండ్యరాజులు చోళ రాజ్యము కొరకు తగవులాడుట మొదలిడిరి.[37]

గణపతి దేవుడు రాజ్యమునకు వచ్చిన వెంటనే మొదట వెలనాటి చోళులను జయించి గోదావరికి పడమటి భాగమును తన రాజ్యమున కలుపు కొనెను. వేంగి రాజ్యములోనికి వచ్చిన గాంగ రాజయిన మూడవ అనంగ భీముని సైన్యములను లోబరచుకొనెను. అనంగ భీముడు మరణించుటచే అతని కుమారుడగు నరసింహుడు గణపతి పైకి దండెత్తి వచ్చెను. ఇందెవరు గెలచిరను విషయము స్పష్టమగుట లేదు. నందలూరి శాసనము వలన గణపతి దేవుడు జయించునటుల తెలియుచున్నది.[38]

లింగరాజ దేవాలయమునందలి ఒక శాసనము వలన నరసింహదేవుడు గణపతిని ఓడించినటుల తెలియుచున్నది.[39] కనుక ఈ విషయము స్పష్టమగుట లేదు.

తరువాత గణపతి దేవుడు అమరావతి పాలకులైన కోట వంశీయులను, గుంటూరు, నతవాడి పాలకులైన తెలుగు చోడులను, నెల్లూరి రాజైన మనుమ గండ గోపాలుని జయించి, కాంచీపురము, కర్నూలు చుద్దప్ప ప్రాంతములను తన రాజ్యమున కలుపు కొనెను.

గణపతి దేవుని పైకి పాండ్యరాజయిన జాతవర్మ వీర పాండ్యుడు సైన్యమును పంపెను. ఆ సైన్యమునకు పల్లవ సామంత రాజగు కొప్పెరుంజింగడు నాయకత్వమును వహించెను. కాని ఇతడు గణపతి దేవుని సేనానులచే నిర్జింపబడెను.[40] (ఈ సంఘటన క్రీ.శ. 1249 లో జరిగి యుండును).[41] కాని గణపతి దేవుని సేనాని యగు సామంత భోజునిచే ఆక్రమింపబడిన కాంచీపురమును, పాండ్యులు క్రీ.శ. 1250లో కాకతీయ సేనానిని పారద్రోలి ఆక్రమించుకొనిరి. నెల్లూరును జయించి వీరాభిషేక మొనర్చిరి.[42]

ఇవి గణపతి దేవుని జయాప జయములు. ఈ గ్రంథకర్తలు ఇట్టి ముఖ్యమయిన చారిత్రకాంశములను విడచి, పుక్కిటి పురాణములగు గుండ బ్రాహ్మయ్య గాథను, సిద్ధుడు పాషాణము నరికి జలధారను దెచ్చిన అంశములకు ప్రాముఖ్యము నిచ్చిరి.

---

37. R.C. Majumdar, The Dynasties of Eastern Deccan.
38. G. Yazdani, The Early History of the Deccan, p. 609.
39. Orissa Historical Research Journal, Vol. I, pp. 392–305.
40. South Indian Inscriptions IV Nos. 1342 A & C.
41. కాకతీయుల చరిత్ర, p. 45.
42. వివరముల కొరకు చూ.
The Early History of the Deccan.
The Dynasties of Eastern Deccan.

ఈ రెండు గ్రంథములందు చరిత్రకు భిన్నముగ నున్న మరి మూడు అంశములు—

1. గణపతి దేవుని కుమార్తె ముమ్మమ్మయనుట.

2. గణపతి దేవుని తరువాత రాజ్యమునకు వచ్చినది భార్యయగు రుద్రమ యనుట.

3. ముమ్మమ్మను చోళ వంశీయుడయిన వీరభద్రునకిచ్చి వివాహము చేసెననుట.

గణపతి దేవుని కుమార్తె రుద్రమ దేవి గాని ముమ్మమ్మ కాదు. రుద్రమదేవి గణపతి దేవుని కుమార్తె యనుటకు శాసనాధారములు గలవు.[43]

గణపతి దేవుని అనంతరము రాజ్యమునకు వచ్చినది. గణపతి దేవుని భార్య యగు రుద్రమ కాక కుమార్తెయగు రుద్రమ దేవి. ఈమె చాళుక్య వీరభద్రుని వివాహము చేసికొనినది. ముమ్మమ్మ రుద్రమ కుమార్తె. గణపతి దేవుని కుమార్తె కాదు. రుద్రమ దేవి గణపతి దేవుని భార్యయను అంశమును ప్రతాపరుద్ర యశో భూషణ వ్యాఖ్యాన కర్తయైన కొలచెలమ కుమారస్వామి సోమ పీథి, విదేశీయాత్రి కుడయిన మార్కోపోలో కూడా నుడివిరి.[44] ఈ విధముగ భ్రమపడుటకు, గణపతి దేవుని భార్య పేరు కూడ రుద్రమ యగుటయే కావచ్చును.

ఈ విషయములేకాక, రుద్రమదేవి భర్తయగు చాళుక్య వీరభద్రుని, చోళ వంశీయునిగ పొరపడిరీ కవులు. అంతియే కాక ఇతనికి ముమ్మమ్మనిచ్చి వివాహము చేసినట్లు వ్రాసిరి. ఇదియును పొరపాటే. రుద్రమదేవి భర్త చాళుక్య (చోళ కాదు) వీరభద్రుడను విషయమును కోపాక శాసనము స్పష్ట పరచుచున్నది.[45] చాళుక్య వీరభద్రుడు. ఇందు శేఖర నృపతి కుమారుడు. ఇతనికి మహాదేవుడను సోదరు డున్నటుల తెలియుచున్నది. చాళుక్య వీరభద్రుడు క్రీ. శ. 1266 ప్రాంతమున మరణించెను. ఈ కాలముననే గణపతి దేవ చక్రవర్తియు మరణించెను.[46]

గణపతి దేవ చక్రవర్తి కాకతీయ రాజులందరిలో అగ్రగణ్యుడు. ఇతని పరి పాలనాకాలమునకు ఆంధ్రచరిత్రలో అగ్రస్థానము గలదు. అల్లకల్లోలముగ నున్న సామ్రాజ్యమును అతి సమర్థతతో చక్కబరచి, కాకతీయ రాజ్యమును విస్తరింపజేసి ప్రఖ్యాతిగాంచెను. ఇతడు శివభక్తుడు. శివభక్తులకు పెక్కుదాన ధర్మములు చేసెను. శివభక్తుడైనప్పటికి వైష్ణవాలయములను సహితము నిర్మించి పరమత సహనము

43. Kupak Inscription. A Corpus of Inscriptions in the Telingana Districts of H.E.H. The Nizams Dominions, Part I.
44. Yole - Marcopolo Vol. II, p. 361.
45. A Corpus of Inscriptions in the Telingana - Districts of H.E.H. Nizams Dominions, Part-I.
46. A Corpus of Inscriptions in the Telingana - Districts of H.E.H. Nizams Dominions, Part - I.

చూపెను. ఇతడు న్యాయ పరిపాలకుడుగ కన్పట్టుచున్నాడు. ఇందులకు గుండ బ్రహ్మయ్య గాథయే నిదర్శనము. గణపతి దేవుడు మోటుపల్లి రేవును సముద్ర వ్యాపారమునకు అనువుగ తీర్చి దిద్దెను. ఈ విషయము ఈ రెండు గ్రంథములందు లేదు.

గణపతి దేవ చక్రవర్తి వెలనాటిని జయించినపుడు ఆ రాజు యొక్క సేనాపతియయిన పిన్నచోడుని కుమార్తెలు దామాంబ, నారాంబలను వివాహముచేసికొని, అతని కుమారులలో ఒకడయిన జాయపనాయకుని బుద్ధివిశేషములను విని అతనిని గూడ తనతో ఏకశిలా నగరమునకు గొనివచ్చి, తన గజసైన్యమునకు సేనాధిపతిని గావించెను. ఈతడే జాయప సేనాని అని పేరు గాంచెను. జాయప సేనాని తండ్రి తాతలందరును ధైర్యసాహస పరాక్రమవంతులు. జాయపసేనాని యనిన శత్రువులు తలఎత్తుటకు భయపడుచుండిరి.

గణపతి దేవుడు ఏబది రెండు సంవత్సరములు రాజ్యముచేసి రాజ్యమును విస్తరింపజేసి చక్రవర్తి ఆయెను. ఇతడు తన చివరి కాలమున గోళకీ మఠాచార్యుల సంపర్కమును పొంది, అనేక దానములను చేయుచు ఆధ్యాత్మిక చింతనతో కాలము వెళ్లబుచ్చి, ఎనుబదవ ఏట స్వర్గస్తుడాయెను.

గణపతి దేవునకు రాచకార్యములందు, ఆలోచనలు చెప్పి రాజతంత్రమును నడపించు నాతడు విశ్వేశ్వర శివ దేశికుడు (శైవమత ప్రవక్త).

ఇతని ముఖ్యమయిన సేనాపతులు కాటచమూపతి, భాండ సేనాధిపతి. మంత్రులలో ప్రసిద్ధుడు గోపరాజు రామ ప్రధాని. మహా ప్రధాని గంగయ సాహిణి. మరియొక మంత్రి సామంత భోజుడు. ఇంకొక మంత్రి చెన్నాప్రగడ గణపామాత్యుడు. వీరందరును సుప్రసిద్ధులు, మహావీరులు.[47] ఇట్టి వీర శిఖామణుల అండదండలతో గణపతి దేవ చక్రవర్తి మహావైభవముగ రాజ్యమును పరిపాలించెను. ఈ వీరుల విషయము లేవియు ఈ ఇద్దరు కవులును తెలుపలేదు.

గణపతి దేవ చక్రవర్తి, వైష్ణవ మత సహిష్ణువయినప్పటికి, జైన బౌద్ధమత ద్వేషిగ కన్పట్టుచున్నది. ఈ విషయమును, తిక్కన గణపతి దేవుని దర్శించు ఘట్టము స్పష్టపరచుచున్నది. ఇతడు జైన బౌద్ధ దేవాలయములను కూల ద్రోయించినటుల, తిరుగుబాటు చేసిన అనేకమంది జైనులను సంహరించి దేశమునుండి వెడలగొట్టించినటుల తెలియు చున్నది.[48]

## రుద్రమదేవి — శా. శ. 1122-1205 :

ఈమె శివదేవయ్య మంత్రి సహాయమున రాజ్యము చేసెను. ఈమె కలుకోట, భూమి కోట, పుట్టకోట కట్టించెను. అనేక శివాలయములను కట్టించెను. వృక్షముల

---

47. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, pp. 252–266.

48. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రులచరిత్రము, p. 265.

నాటించెను. ఐదువేలమంది విప్రులకు వివాహముల చేయించెను. చెరువులను త్రవ్వించెను.

కటక వల్లభుని ఓడించి సామంతునిగ జేసికొనెను. తిరుగుబాటు చేసిన సవతి పుత్రులయిన హరిహర మురారి దేవులను మట్టు పెట్టించెను. దేవగిరి రాజు ఏకశిలా నగరముపైకి దండెత్తి రాగా, ఎదిరించి వారి మూడు లక్షల పదాతులను, లక్ష గుఱ్ఱములను నేల కూల జేసెను. మిగిలిన వారిని దేవగిరి పర్యంతము తరిమి, వారికడ కోటి ద్రవ్యమును గ్రహించి, దానిని సరదారులకు పంచి పెట్టెను. దేవగిరి యందు జయస్తంభములు వేయించెను. శాసనములను వ్రాయించెను. తన పేర అంబాలయమను గ్రామమును కట్టించెను. ఈమె మహా వైభవముతో రాజ్యము చేసెను.

కుమార్తె ముమ్మమ్మ గర్భముదాల్చిన సందర్భమున రుద్రమ పురమును అలంకరింపజేసి, విప్రులను పిలిచి, యాబది లక్షల వరహాలు పంచిపెట్టించెను.

శా. శ. చైత్రశుద్ధ పంచమి ఆనందనామ సంవత్సర, గురువారమునాడు రోహిణి నక్షత్రమున బ్రాహ్మీముహూర్తమున 1305 సంవత్సరమున ముమ్మమ్మకు ప్రతాపరుద్రుడు జన్మించెను.[49] ఆ సందర్భమున రుద్రమ సర్వజనులకు ఐదు కోట్ల వరహాలు పంచిపెట్టించెను. విప్రులకు లక్ష ధేనువులను దానమొసంగెను. శివదేవయ్య ఆ బాలునకు ప్రతాపవీరరుద్ర దేవుడని నామకరణము చేసెను. ముమ్మమ్మకు ప్రతాపరుద్రుడు కాక అన్నమ దేవుడను మరియొక కుమారుడు కలడు. ప్రతాపరుద్రుడు దినదిన ప్రవర్ధమానుడై కావ్యనాటకాలంకారాది—సకల శాస్త్రములను అభ్యసించెను. పదునాల్గవయేట సమస్త దేశ భాషాసంజ్ఞలు నేర్చుకొనెను. పదునేనవయేట రాజనీతి ధర్మాధర్మములు తెలిసికొనెను. పదునారవయేట విశాలాక్షి మొదలగు పదునార్గురు రాజకన్యల వివాహమాడెను. ఆ తరువాత రుద్రమ ముప్పది ఎనిమిది సంవత్సరములు పరిపాలించి మరణించెను.

ఇవి రుద్రమను గూర్చి ఈ రెండు గ్రంథములు తెలుపు అంశములు. రుద్రమ గణపతి దేవుని భార్యఅని ప్రత్యేకముగ పేర్కొనిన వీ గ్రంథములు. గణపతి దేవుని తరువాత రాజ్యమును పరిపాలించినది గణపతి దేవుని భార్య రుద్రమ కాదను విషయమును గణపతిదేవుని చరిత్రయందు చర్చించితిని. ఏకశిలానగర పరిపాలకురాలు గణపతి దేవుని కుమార్తె రుద్రమ అనియు, ఈమె చాళుక్య వీరభద్రుని భార్య అనియు నిశ్చయముగ తెలియుచున్నది.

ఈమెయును తండ్రివలెనే పరిపాలనా విషయమున కొన్ని క్లిష్ట పరిస్థితుల నెదుర్కొన వలసి వచ్చెను. రుద్రమ యొక్క సేనానులగు త్రిపురాంతకుడు, అంబదేవుడు అనువారలు ఈమెకు అన్ని విషయములందు తోడ్పడి కాకతీయ

49. ప్రతాప చరిత్రమున శా. శ. నందన సంవత్సర చైత్రమాస, శుక్లపక్ష పంచమి అని గలదు.

స్సామ్రాజ్యమును శత్రువుల బారినుండి కాపాడిరి.

రుద్రమదేవి సేనానులు, కాకతీయ సామ్రాజ్యముపైకి దండెత్తి వచ్చిన కళింగ రాజయిన గణపతి నరసింహుని ఒడ్డాది అర్జున దేవుని ఓడించిరి.[50]

క్రీ. శ. 1263 ప్రాంతమున రుద్రమ పాండ్యులచే జయింపబడిన కాకతీయ షూభాగమును మరల సంపాదించునటుల తెలియుచున్నది.[51] ఈమెయొక్క సేనానులు, కాకతీయ సామ్రాజ్యపు దక్షిణదిశయందు అలజడి గావించిన, మూడవ కులోత్తుంగ చోడుని, ఎదువ మల్లిదేవ చోడుడు, కేశవ దేవుడు, సోమి దేవుడు అల్లు గంగు, మల్లికార్జునుడు, దామోదరుడు మొదలగు రాజులను, కొప్పెరుంజెంగని, విజయగండ గోపాలుని, మనుమగండ గోపాలుని జయించి కాకతీయ సామ్రాజ్యమును కాపాడినటుల తెలియుచున్నది.[52]

ఈ యుద్ధముల తరువాత రుద్రమ శాంతియుతముగ పరిపాలన చేసెను. శౌర్య సంపన్నులు, రాజనీతిజ్ఞులునగు మంత్రి సేనాధ్యక్షుల సేవా సహకారములతో ఈమె ప్రజాహితముగ దానధర్మముల నొనర్చుచురాజ్య పాలనము చేసెను.

ఈమె తన జీవితకాలముననే మనుమడగు ప్రతాపరుద్రుని పట్టాభిషిక్తుని గావించెను. ప్రతాపరుద్రుని పట్టాభిషిక్తుని గావించిన తరువాత ముప్పది ఎనిమిది సంవత్సరములు రుద్రమ రాజ్య పాలనము చేసినటుల ఈ ఆఖ్యానములు తెలుపుచున్నవి. రుద్రమదేవి కొలువునందు మల్యాలగుండ దండాధీశ్వరుడు, గోన గన్నారెడ్డి, ప్రసాదాదిత్య నాయడు, రేచెర్ల దామానాయుడు, జన్నగదేవ, త్రిపురాంతక దేవుడు మొదలగు మహాపరాక్రమవంతులు, విశ్వాసపాత్రులు అయిన ఉద్యోగులు ఉండిరి. రుద్రమదేవి పరిపాలనలో చారిత్రకులు తెలుపని, ముఖ్యమైన అంశము ఆమె సవతి పుత్రులయిన హరిహర మురారిదేవుల తిరుగుబాటు.[53] రుద్రమ నగరమున లేని సమయమున వీరిరువురు నగర ప్రవేశము చేసి, రుద్రమకు దుర్గ ప్రవేశము లేకుండ చేసిరి. కాని రుద్రమ అతి చాకచక్యముతో వారిని లొంగతీసుకొని సకుటుంబముగ నాశనమొనర్చినది. ఈమె సెవున మహాదేవునితో కూడ యుద్ధము చేసినట్లు తెలియుచున్నది.[54] ప్రజలు ఈమెను "అంబ" యని వ్యవహరించెడివారు. ఈమె ఎడ తమ గౌరవప్రపత్తులను చూపుటకు "అంబాల" అను గ్రామమును నిర్మించిరి.

తండ్రిఅగు గణపతిదేవునిచే రాజకీయ శిక్షణ పొందిన ఈమె రుద్రమదేవుడను పేరిట రాజకార్యముల నొనర్చెను. ఈమె యుద్ధములందు పాల్గొనినటుల ప్రతాప

---

50. South Indian Inscription, The Andhra Patrika, 1922.
51. G. Yazdani, The Early History of the Deccan, p. 627.
52. కాకతీయ సంచిక, p. 58.
53. ఈ హరిహర మురారి దేవులెవరో చారిత్రకులు నిర్ణయించలేదు.
54. పానగల్లు, నల్గొండ శాసనములవలన ఈ యుద్ధము జరిగినటుల తెలియుచున్నది.

రుద్రీయమువలన తెలియుచున్నది. రుద్రదేవుడను పేరిట ఈమె వేయించిన శాసనములును గలవు. స్త్రీ తమకు ఏలిక అగుట సహింపలేని పెక్కుమంది తిరుగుబాటుదారులను ఓర్పుతో నేర్పుతో సాధించి సామ్రాజ్యమును శాంతియుతముగ పరిపాలించి ప్రఖ్యాతిగాంచిన తొలి తెలుగు మహారాజ్ఞి ఈమె. ఇట్టి మహాసామ్రాజ్ఞి చరిత్రను విశదముగ ఈ గ్రంథకర్తలు తెలుపలేదు.

## ప్రతాపరుద్రుడు — శా.శ. 1205-1282 :

ప్రతాపరుద్రుడు శా.శ. 1180 వ సంవత్సరమున పట్టాభిషిక్తుడైనప్పటికిని, సింహాసనమెక్కినది శా.శ. 1205 వ సంవత్సరమున.

రాజ్య పరిపాలనము : గణపతిదేవుడు నానా వర్ణంబులవారికి నాయకత్వం బిచ్చుటచే బహు నాయకత్వమై రాజ్యము అరాచకమైనదని తలంచి, ఇతడు అగ్ర వర్ణముల వారినందరిని రావించి, అందు వివేక సంపన్నులకు నాయకత్వమివ్వ దలంచెను. ముఖ్యముగ పద్మనాయకులను రప్పించి వారిని సన్మానించి, వాహనాందోళికాదులను, ఛత్రచామరములను ఇచ్చి, బిరుదుల నొసంగి గోత్రమునకు డెబ్బది ఏడుగుర నేరి, వారికి ఏకశిలానగరమున వసతి ఏర్పరచెను. మరి డెబ్బది ఏడుగురు నాయకులకు తన రాజ్యములోని భాగమును పంచిపెట్టి వారిని అధికారులను చేసెను. ఈ విధమగు విభజన చేసి రాజ్యమున చోరాది భయములేకుండ పరిపాలించెను.

పాండ్యాధీశ్వరుని జయించి, అతని పుత్రునికి పట్టము కట్టెను. గోదావరి మొదలు రామేశ్వరము వరకు రాజ్యములు జయించెను. విజయనగరమును పరిపాలించు నరసింహరాయలు, తన మేనల్లుడగు నరసింహదేవుని పంద్రెండు లక్షల పదాతి వర్గముతో ప్రతాపరుద్రుని కొలుచుటకు పంపెను.

ప్రతాపరుద్రుడు అడమళయాళ రాజ్యమును పాలించుచున్న ముకుందాదేవి నోడించి 14 వేల సువర్ణటంకములు కప్పము గైకొనెను. ఆమెను తన సేనలతో తన వెంటరా నియమించెను. తరువాత కొంకణ, మాళవ, మళయాళ, బాహ్లిక దేశములను గెలిచి, వారికడ పదిపదేసి లక్షలు అప్పనము గైకొనెను. పశ్చిమదేశాధీశ్వరులను జయించెను. వారికడ యేబది లక్షల సువర్ణ నిష్కములను గ్రహించెను. తరువాత గుజరాష్ట్ర, మహారాష్ట్ర దేశాధీశ్వరుల నోడించి వారికడ కప్పములు గైకొనెను. ఓడినవారి నందరిని తనతో రా నియమించెను. ఈతడు పూర్వదక్షిణ, పశ్చిమ భూములను వశపరచుకొనెను. గంగా యమునా సరస్వతీ సంగమమున స్నానము చేసి, ఎనిమిది తులాపురుషంబులను దాన మొసంగెను. ప్రయాగను వశపరచుకొనెను. అటనుండి కాశికేగి మణికర్ణికయందు స్నానము చేసి విశ్వనాధుని సేవించి, అచట యిరువది తులాబారంబులు తూగి, కోటి సువర్ణములను దానము చేసెను. గయయందు తన పెద్దలకు విహితకృత్యములను చేయించెను.

దిగ్విజయమునుండి మరలివచ్చి, గోదావరికడ మంత్రకూటమున పంద్రెండు యజ్ఞములు చేసి, కాళేశ్వరమున ముక్తీశ్వరును దర్శించి కోటి సువర్ణములు దానము చేసెను. వేయి శివాలయములను ప్రతిష్ఠించెను. ఏకశిలానగరమునకు ఈశాన్య భాగమున ప్రతాపగిరి అను దుర్గమును కట్టించెను. మౌద్గల్య క్షేత్రమున పాకాల చెరువును త్రవ్వించెను. ఒక పురమును నిర్మించెను. పాకాలసీమలో నలువది గ్రామములను రామేశ్వరుని వైభవము కొరకు దానమిచ్చెను. షోడశ మహాదానములు చేసి ఏకశిలానగరము చేరెను. రామేశ్వరము నందున్నపుడు వేయి ఓడలను రావించి తగిన వర్తకులను నియమించి నానాదేశములతో వర్తకము చేయుటకు పంపించెను.

ప్రతాపరుద్రునకు విశాలాక్షియందు విరూపాక్షుడు, వీరభద్రుడు అను పుత్రులుదయించిరి.

ఈ విధముగా విజయములను పొంది సర్వజన సమ్మతముగ రాజ్యము చేయుచున్న ప్రతాపరుద్రునిపైకి పశ్చిమ దేశాధీశ్వరులగు తురష్కులు తిరుగుబాటు చేసిరి. ప్రతాపరుద్రుడు తన దళములను పంపి వారిని ఓడించెను. పత్నీసమేతముగ వారిని గిరి వేయించెను. ఇంక తురష్కులు యుద్ధమునకు రారని నిశ్చయించి ప్రతాపరుద్రుడు నిశ్చింతగా విద్యావ్యాసంగములను నెరపుచుండెను. ఈ అదను కనిపెట్టి శత్రువులు ప్రతాపరుద్రునిపై దండెత్తుటకు నిశ్చయించిరి. ఆ సమయమున దేవగిరి రాజైన రామదేవరాయలు, పారశీక రాజు తమ్ముడైన జమానుముల్కుతో మంతనములు చేసెను. వారిరువురును ఢిల్లీసుల్తాను సహాయము కోరిరి. పశ్చిమ దేశాధీశుడు ఒక లక్ష గుఱ్ఱములు, రెండు లక్షల పదాతులతోను, మహారాష్ట్ర రాజు రెండు లక్షల గుఱ్ఱములు, రెండు లక్షల పదాతి వర్గముతోను, కటక వల్లభుడు 5 వేల గజములు, 8 వేల పదాతి వర్గముతోను, తక్కిన చిల్లర రాజులు 2 లక్షల గుఱ్ఱములు, 5 లక్షల పదాతి వర్గముతోను, ఢిల్లీశ్వరుని దళవాయి మలేఖాను 250 వేల గుఱ్ఱములు, 15 లక్షల పదాతులతోను ఏకశిలానగరమునకు మూడు దిక్కులందును విడసిరి.

ఈ విషయము తెలిసి ప్రతాపరుద్రుడు డబ్బది ఏడుగురు పద్మనాయకులను, అన్నమదేవుని, పశ్చిమ దిశయందున్న శత్రువులతోను, నరపతిరాయలను కటక వల్లభునితోను యుద్ధము చేయుటకు నియమించెను. సుల్తాను బలములమీదికి తన మూల బలమును పంపెను. యుద్ధము ఘోరముగ జరిగెను. మలేఖాను మరణించెను. కటక వల్లభుడు పారిపోయెను. సుల్తాను మరల బిరుదుఖానను వానిని పంపెను. నరపతిరాయలు 5 వేల గజములను చంపి, వేయి గజములను పట్టుకొని, కటక వల్లభుని చంపెను. బిరుదుఖానుని చంపెను. ఉల్లాఖాను ఓడిపోయెను. ఈ విధముగా ఏడుమారులు ఘోరమగు యుద్ధము జరిగెను. అంత ఉల్లాఖాను ప్రతాపరుద్రుని కడనున్న యితర నాయకులకు 50 లక్షల వరహాలు

యిచ్చుటకొప్పుకొని ప్రతాపరుద్రునిపై కుట్ర పన్నెను. ఆ సారి ప్రతాపరుద్రుడు అన్నమదేవుని, పద్మనాయకులను 9 లక్షల ధనుర్ధరులతో జమానుముల్కు పైకి, కటక వల్లభుని పైకి నరపతిరాయలను పంపెను. ఇతర జాతి నాయకులు 5 లక్షలు; భోజారెడ్డి 3 లక్షలు, కన్నాజు రాజు మొదలగువారు 2 లక్షల గుఱ్ఱములతోను, వీర పాండ్యరాజు 89 ఏనుగులతో, తన మదపుటేనుగులు 200 లున్ను, తనను కొలిచి రాగా తాను స్వయముగ యుద్ధమున కేగెను. అందు పాండ్యరాజు మరణించెను. ఇతర జాతి నాయకులు రాజుతో జగడమాడి యుద్ధభూమినుండి తొలగిపోయిరి. సర్వసేనలును నమసిపోయెను. శా.శ. 1291 రుధిరోద్గారి సంవత్సరము అశ్వయుజ బహుళ గురువారమునాడు ప్రతాపరుద్రుడు శత్రువులకు పట్టుపడెను. సుల్తాను దళములు ప్రతాపరుద్రుని తీసుకొని ఢిల్లీకి ప్రయాణమై మార్గమున గోదావరి కడ విడిసిరి. ఈ విషయము తెలిసి ప్రతాపరుద్రుని కడకు ఏకశిలానగరవాసులందరును వచ్చిరి. రాజు వారందరిని గౌరవించెను. ఆ సమయముననే విద్యానాధుడను నాతడు ప్రతాపరుద్రీయమను గ్రంథమును వినిపించి రాజున కంకితమిచ్చెను. రాజు సంతోషించి తన అంగుళీయకమును బహుకరించెను.

నరపతిరాయలు ప్రతాపరుద్రుని రక్షించుటకు శత్రువులతో యుద్ధము చేసెను. ఉల్లాఖాను రహస్యముగ ప్రతాపరుద్రుని ఢిల్లీ నగరమున కంపెను. ఢిల్లీ సుల్తాను ప్రతాపరుద్రుని సత్కరించెను. తన తల్లి ఆజ్ఞ ప్రకారము ప్రతాపరుద్రుని గౌరవించి, కానుకల నిచ్చి, ప్రతాపరుద్రునితో వచ్చిన విప్రులకు 3 కోట్ల ద్రవ్యము పంచిపెట్టి, ఏకశిలానగరమునకు పంప నిశ్చయించుకొనెను. ప్రతాపరుద్రుడు కాశియందు గంగా స్నానము చేసి, విశ్వనాథుని సేవించి, ప్రయాణమై గోదావరి చేరి అట కాళేశ్వరమున నిలచెను. బంధు జనులు, ప్రజలు కొలుచుటకు రాగా వారినందరిని గౌరవించెను.

అనంతరము ప్రతాపరుద్రుడు నరపతిరాయలకు తన కుమార్తె రుద్రమహాదేవి నిచ్చి వివాహము చేసెను. రామచంద్రదేవునకు అన్నమదేవుని కుమార్తెనిచ్చి వివాహము చేసెను. అన్నమదేవుని రాజ్యమును పాలింప ఆనతిచ్చి శా.శ. 1291 సంవత్సర మాఘశుద్ధ సప్తమినాడు మరణించెను. భార్యయగు విశాలాక్షియు దేహత్యాగము చేసెను.

అన్నమదేవుడు ప్రతాపరుద్రుని పుత్రుడయిన వీరభద్రదేవునకు పట్టాభిషేకము చేసెను. మరల తురుష్కులతో యుద్ధము సంభవించెను. నరపతి రాయలు వారిని కృష్ణను దాటనివ్వకుండ 12 సంవత్సరములు యుద్ధముచేసెను. అంత వారు నరపతి రాయలతో సంధి చేసికొనిరి. తదుపరి ఏకశిలానగరము సుల్తాను వశ మాయెను. మునల్మానులు దేవాలయములు పడగొట్టుట, ప్రజలను బాధపెట్టుట ప్రారంభించిరి. వీరభద్ర దేవుడది సహింపలేక కొండవీటి యందున్న రాయలను కలసి అచట నుండెను. ఈ గ్రంథముల యందలి ప్రతాపరుద్రుని చరిత్ర ఇది. ఈ

అంశములు ఎంతవరకు చరిత్రతో సరిపోవుచున్నవో పరిశీలింతము.

రుద్రమ దేవికి ముమ్మమ్మ యను పుత్రిక కలదనియు ఆమె కుమారుడు ప్రతాపరుద్రుడనియు పైన చెప్పుట జరిగినది. ఈమెను చాళుక్య వంశీయుడయిన వీరభద్రున కిచ్చి వివాహమొనర్చినటుల, ఈ రెండు గ్రంథములు తెలుపుచున్నవి. ఈ విషయము సంశయాస్పదముగనున్నది. ఒకే వంశీయులను తల్లియు, కుమార్తెయు వివాహము చేసికొనుట ఆచార విరుద్ధము. ఈ విషయము లేవియు చారిత్రకముగ తెలియుటలేదు.

రుద్రమకు రుయ్యమ్మ యను మరియొక కుమార్తె కలదనియు, ఆమెను ఇందులూరి అన్నదేవ భూపాలున కిచ్చి వివాహము చేసినటులను తెలియుచున్నది (ఇందులూరి వారి వంశ చరిత్ర). ఆమెకు సంతానము లేదు.

ప్రతాపరుద్రుడు శా.శ. 1133 చైత్రశుద్ధ పంచమి గురువారము రోహిణీనక్షత్రమున బ్రాహ్మీ ముహూర్తమున అనందనామ సంవత్సరమున జన్మించెనని ప్రతాపరుద్ర చరిత్రము, శా. శ. 1266 వ సంవత్సరము (నందన) చైత్రమాన శుక్ల పక్ష పంచమి యందని సిద్ధేశ్వర చరిత్ర తెలుపుచున్నవి. ప్రతాప చరిత్రనే అనుసరించిన సిద్ధేశ్వర చరిత్ర ఈ విషయమున భిన్నాభిప్రాయమును వెలిబుచ్చినది. ప్రతాపరుద్రుని జనన కాలమును సరిగా నిర్ణయించుట యింత వరకును జరుగలేదనియే చెప్పవచ్చును. ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా నిర్ణయించుట జరిగినది. ప్రాచీన చరిత్రములొక్కొక్కటి ఒక్కొక్క విధముగ తెలుపుచున్నవి. సరియగు శాసనాధారములులేవు. మాల్కాపుర శాసన మొక్కటియే ఆధారముగ కన్పట్టుచున్నది. ప్రతాప చరిత్రము శా.శ. 1210 అని ఏకశిలానగర వృత్తాంతము శా.శ. 1165 అని తెలుగురాజుల చరిత్ర, శా.శ. 1160 అని ప్రతాపరుద్రుని జనన కాలమును తెలుపుచున్నవి.

క్రీ.శ. 1261 వ సంవత్సరమున వేయించిన మాల్కాపుర శాసనమున రుద్రమకు ప్రతాపరుద్రుడను కుమారుడున్నటుల గలదు.[55] అనగా క్రీ.శ. 1261 వ సంవత్సరము నాటికే రుద్రమ ప్రతాపరుద్రుని దత్తపుత్రునిగ స్వీకరించినటుల స్పష్టపడుచున్నది. ఈ శాసనమువలన గణపతిదేవ చక్రవర్తి 1261 వ సంవత్సర ప్రాంతమునకు జీవించి యున్నటుల తెలియుచున్నది. ప్రతాపరుద్రుడు, గణపతిదేవుడు జీవించియున్న కాలముననే యుక్తవయస్కుడైనచో గణపతిదేవుడు తన తదనంతరము రాజ్యమును ప్రతాపరుద్రునికే పట్టము కట్టిఉండును. అటుల జరుగక రుద్రమ రాజ్యమునకు వచ్చుటచే ప్రతాపరుద్రుడు పసివాడై యుండియుండునను విషయముస్పష్టమగుచున్నది. పది సంవత్సరములు దాటక మున్నె దత్తస్వీకారము చేయుటఆచారము. కనుక ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1250–52 ప్రాంతమున జన్మించి ఉండునని మారేమండ రామారావుగారు ప్రతాపరుద్రుని జన్మకాలమును క్రీ.శ.

55. Journal of Andhra Historical Research Society, Vol. 4.

1254 సంవత్సరము మార్చినెల 25 వ తేదీకి సమన్వయ పరచిరి.[56]

ప్రతాపరుద్రుడు సింహాసనారూఢుడైన సంవత్సరము శా.శ. 1205 అని ప్రతాపచరిత్ర తెలుపుచున్నది. అనగా క్రీ.శ. 1283 అగును.

ప్రతాపరుద్రుడు తన 29వ ఏట రాజ్యాభిషిక్తుడై వెంటనే రాజ్యాధికారమును చేపట్టినటుల ఈ గ్రంథములయందు లేదు. ప్రతాపరుద్రుని పట్టాభిషిక్తుని గావించిన అనంతరము రుద్రమ 38 సంవత్సరములు పరిపాలించినటుల గలదు. ఇది వాస్తవమైన ప్రతాపరుద్రుడు తన 67 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినటులగును. అదికాక కవియొక్క ఉద్దేశము, ప్రతాపరుద్రుడు రాజ్యమును క్రీ.శ. 1283 వ సంవత్సరమున ప్రారంభించెనని అయిన, రుద్రమదేవి, ప్రతాపరుద్రుని పట్టాభిషేకానంతరము 38 సంవత్సరములు రాజ్యపాలనము చేసెననుట అసత్యమగును. ఏలన క్రీ.శ. 1283 వ సంవత్సరమునకు, 38 సంవత్సరములు వెనుకకు వెళ్ళిన క్రీ.శ. 1245 అగును. అప్పటికి ప్రతాపరుద్రుడు జన్మించియే ఉండలేదు. చారిత్రకుల నిశ్చయము ప్రకారము రుద్రమ రాజ్యమును ముప్పదినాలుగు సంవత్సరములు పరిపాలించెను. ఈమె క్రీ.శ. 1261 నుండి 1295 వరకు పరిపాలించెను. ప్రతాపరుద్రుడు ఈమె పరిపాలన ప్రారంభించునాటికి ఏడేండ్లవాడు. కనుక ప్రతాపచరిత్రమున చెప్పబడిన ఈ అంశము సత్యమనుటకు ఏ విధముగా చూచినను కుదురుటలేదు. కాని, ఈ అంశము రుద్రమ ప్రతాపరుద్రునకు పసితనమున పట్టాభిషేకము చేసి యుండునేమో అను అనుమానమునకు తావిచ్చుచున్నది.

ప్రతాపరుద్రుని రాజ్యకాలము, చరిత్రకారులు నిర్ణయించిన ప్రకారము క్రీ.శ. 1295 నుండి క్రీ.శ. 1323 వరకు. రుద్రమదేవి క్రీ.శ. 1295లో మరణించగ ప్రతాపరుద్రుడు రాజ్యమునకు వచ్చెను. క్రీ.శ. 1295 కు పూర్వమునుండియే ప్రతాపరుద్రుడు రాజ్యకార్యములందు పాల్గొను చుండినటుల తెలుపు శాసనములు కలవు. శకసంవత్సరము 1214లో వేయించిన గణపవరము శాసనమునందు శ్రీ మన్మండలేశ్వర ప్రతాప కుమార రుద్రదేవ మహారాజులు పృథివీ రాజ్యము సేయగాను అని ప్రతాపరుద్రుని ప్రస్తావన గలదు.[57] శకసంవత్సరము 1216 (క్రీ.శ. 1294) నాటి మణూరు శాసనము నందు ప్రతాపరుద్రుని ప్రశంస గలదు.[58] కనుక ప్రతాపరుద్రుడు రుద్రమతో రాజకార్యములందు పాల్గొని నటుల భావింపవచ్చును. ప్రతాపరుద్ర యశోభూషణ కర్త విద్యానాథుడు, యువరాజుగ నుండగనే ప్రతాపరుద్రుడు అనేక దేశములను జయించినటులను, రాజ్యభారము వహించినటులను వ్రాసెను. మల్యాల

---

56. కాకతీయ సంచిక, p. 64.

57. తెలంగాణ శాసనములు, నెం. 43, మరియు కాకతీయ శాసనములు.

58. ప్రతాపరుద్ర చరిత్ర పీఠిక, pp. 53-54.

శాసనము, కళ్ళేపల్లి శాసనము కూడ ఈ అంశమును స్పష్టము చేయుచున్నవి.[59]

ప్రతాప చరిత్రము ప్రకారము ప్రతాప రుద్రుని విజయములు.

1. గోదావరి నుత్తరించుట.
2. కటక వల్లభుని జయించుట.
3. పాండ్య కేరళ దేశముల జయించుట.
4. ఆడమళయాళ దేశమునేలు ముకుందాదేవిని జయించుట.
5. గండికోటలో తిరుగుబాటు చేసిన రెడ్డి సామంతుల నోడించుట.
6. తురుష్కులను రెండు సారులు ఓడించుట.
7. పూర్వ దక్షిణ పశ్చిమ భూభాగములను జయించుట.
8. ఢిల్లీశ్వరునిచే కానుకలు గ్రహించుట.

పై విజయములందు ఆడమళయాళ పరిపాలకురాలు ముకుందాదేవిని జయించెనను అంశము నిర్ధారించుటకు మనకు ఆధారములు లేవు. ఆనాడు మళయాళ దేశమును స్త్రీ పరిపాలించెననుటకు అధారములు లేవు. కేరళ దేశమును మళయాళమందురు. 'అడుమళయాళం' అను పదము నేటికిని మనకు వాడుకలో కలదు. ఈ పదము ఆనాడును వ్యాప్తిలో నుండి మళయాళ దేశమును ఆడువారు పరిపాలించిరని రచయితలు భావించి ఉండవచ్చును.

ప్రతాపరుద్రుడు పూర్వ, పశ్చిమ, దక్షిణ భూభాగములను జయించెననుట నిరాధారముగనే కన్పట్టు చున్నది. ఢిల్లీశ్వరుడు కానుకలు పంపెననుట కవి కల్పితమే అయి ఉండును. ప్రతాపరుద్రునితో ఢిల్లీ ప్రభువు సంధిచేసుకొను సందర్భములున్నవి కాని కానుకలంపినటుల ఎచటను లేదు.

కటక బల్లహుని జయించెననుట లాంఛనము మాత్రమే. ప్రతాపరుద్రుని పూర్వులందరును కటక బల్లహుని జయించిరి. వారు జయించిచ కటక రాజులు కల్యాణకటక పరిపాలకులైన పల్లవులుగ నిష్ణయించుట జరిగినది. కాని గణపతి దేవుని కాలమునుండి ఒరిస్సా పాలకులైన (కటక పాలకులు) రాజులు ఆంధ్ర దేశముపై దండెత్తు అంశములు శాసనపూర్వకముగ తెలియుచున్నది. క్రీ.శ. 1314–15 ప్రాంతమున ఒరిస్సా పాలకుడైన కపిలేంద్రగజపతి ఏకశిలానగరమును ముట్టడించినటుల "కోయిలోలుగు" అను ద్రావిడ కావ్యము వలన తెలియుచున్నది.[60] ఈ అంశమునే ఈ కావ్యములందు కటకబల్లహుని జయించెనను అంశముగ మార్చినటులున్నది. కవులు తెల్పిన పాండ్య, కేరళ విజయములు సత్యములే. క్రీ.శ. 1311 లో కాంచీపురముపై దండు వెడలిన పాండ్యులను, ప్రతాపరుద్రుని సేనానియగు ఎఱ్ఱదాచానీడు (పద్మనాయక సేనాని) జయించెను.

59. కాకతీయ సంచిక, p. 65.

60. Epigraphical Report No. 72 of 1929–30.

క్రీ.శ. 1313 లో కేరళ పరిపాలకుడయిన రవివర్మ కాంచీపురమును ముట్టడించి, అచట నున్న వీరగండగోపాలుని తరిమికొట్టి కాంచీపురము నాక్రమించెను. ముప్పిడి నాయకుడు కేరళరాజును జయించెను. అదేసమయమున ప్రతాపరుద్రుడు తొల గించిన ఇతర జాతినాయకులు పగతీర్చుకొనుటకై, గండికోట దుర్గమున విద్రోహ మొనర్చిరి. ప్రతాపరుద్రుడు స్వయముగా వెళ్లి ఈ విప్లవమునణచెను. ఈ విజయా నంతరమే ప్రతాపరుద్రుడు పుణ్యక్షేత్ర సందర్శనార్థ మేగెను.

ఈ రెండు గ్రంథములు క్రీ.శ. 1319–20 ప్రాంతమున కంపిలి పాలకుడైన రామదేవరాయల ముద్గల్లు ముట్టడిని గూర్చి చర్చించలేదు. ఇతనిని బెండపూడన్న యామాత్యుడు జయించెను. సంధి జరిగెను.

ప్రతాపరుద్ర చక్రవర్తి జీవితమున చెప్పదగిన ముఖ్యమైన అంశము తురుష్కుల దండయాత్రలు. ఈ దండయాత్రలతో మహోన్నతమగు కాకతీయ సామ్రాజ్యము తురుష్కుల హస్తగతమై అంతరించి పోయెను.

ప్రతాపరుద్రుడు రాజ్యాధికారియైన సంవత్సరమున ఢిల్లీసామ్రాజ్యమునకు అల్లా ఉద్దీను ఖిల్జీ రాజాయెను. ఇతడు దక్షిణ దేశమును జయించవలెనను కోరికతో, క్రీ.శ. 1294 వ సంవత్సరమున దేవగిరిపై దాడివెడలెను. అందు యాదవ రాజులు ఓడిపోయిరి. మరల క్రీ.శ. 1303 లో వంగదేశ మార్గమున వచ్చి కళింగ పాలకులైన గాంగరాజులచే ఓడింపబడి, వెనుకకు మరలెను. అయినను తురుష్కులు వెనుకంజవేయక మాలిక్ నాబర్ కాఫర్ అనువాని నాయకత్వమున దక్షిణ దేశమునకు వచ్చిరి. వీరికి దేవగిరి యాదవులు సహాయ మొనర్చిరి. కాని కాకతీయ సేనానులు వారిని తరిమికొట్టిరి.[61]

కాని క్రీ.శ. 1290 లో దేవగిరి యాదవులు కప్పము చెల్లించుట మానుటతో అల్లా ఉద్దీను, మాలిక్ కాఫర్‌ను మరల పంపెను. అతడు దేవగిరిని జయించి అంతటితో తృప్తినొందక ఓరుగల్లుపై దాడిచేసెను. మరల ఆంధ్ర వీరుల హస్తములలో పరాజయమందెను. ఈ విజయానంతరము ఆంధ్రులు మరల త్వరలో యుద్ధములు సంభవింపవను ఉద్దేశముతో విద్యావ్యాసంగములతో కాలము గడుపు చుండిరి. కాకతీయ సామ్రాజ్యమును గాంచి అసూయ చెందిన దేవగిరి రాజులు ఈ విషయమును సుల్తానునకు తెల్పిరి. వెంటనే ఢిల్లీ సుల్తాను మాలిక్ నాయబ్ కాఫర్‌ను పంపెను. ఆకస్మికముగ సంభవించిన దాడికి తట్టుకొనలేక వెనుక పడిన తనసైన్యముల గాంచి ప్రతాపరుద్రుడు మునల్మానులతో సంధి చేసి కొనెను. ఈ విషయమును ఈ గ్రంథకర్తలు తెలుపలేదు. వీరు విజయము ప్రతాపరుద్రునిదేయని తెల్పిరి.

క్రీ.శ. 1316 లో అల్లా ఉద్దీన్ మరణించెను. మాలిక్ కాఫర్ సింహాసనము

61. కాకతీయ సంచిక, p. 67.

నాక్రమించుకొనెను. అతనిని చంపి ముబారక్ ఖిల్జీ రాజ్యమునకు వచ్చి క్రీ.శ. 1320 లో హత్యగావింపబడెను. అతని తరువాత 'ఖుస్రూఖాన్' అను సామంతుడు రాజాయెను. ఇతడు దక్షిణ దేశమును జయించుటకు 'ఉల్గుఖాన్' ను పంపించెను. ఓరుగల్లును ముట్టడించిన 'ఉల్గుఖాన్'నునకు మొదట విజయము లభించినట్లుండెను. కాని తురుష్కులకు వారిలో వారికి కలహము సంభవించుటచే ప్రతాపరుద్రునికే విజయము లభించెను. ఉల్గుఖాన్ దేవగిరికి పారిపోయెను. కాని ఢిల్లీ సుల్తానీ పరాజయమునకు నిరుత్సాహ పడక మరల విశేష సైన్యమును పంపించెను. ఈ యుద్ధమున ప్రతాపరుద్రుడు బందీ అయెను. ఇది క్రీ.శ. 1323 వ సంవత్సరమున సంభవించెను.

ఈ యుద్ధమున ముసల్మానులకు కటక బల్లహుడు, ముకుంద సుందరుడు (సింధుకటక పరిపాలకుడు) సహాయపడినట్లు రెండు గ్రంథములందును గలదు. కటక బల్లహుడన కళింగాధిపతి యని నిర్ణయించుటచే, ఆ నాటి పాలకులైన కళింగ గాంగరాజులు ముసల్మానులతో యుద్ధములు చేయుచున్నటులను, విజయులైనటులను, పెక్కు శాసనములు కలవు. కనుక వీరు తురుష్కులకు సహాయము చేసిరనుట అసమంజసము. ముకుంద సుందరుని విషయము లేవియు తెలియుట లేదు.

ఈ గ్రంథములు ప్రతాపరుద్రునకు నరపతిరాయలను రాజు సహాయపడినట్లు వర్ణించినవి. ఈ నరపతిరాయలు విజయనగర ప్రభువని కలదు. ప్రతాపరుద్రుని కాలమునకు విజయనగర సామ్రాజ్యనిర్మాణమైన నిదర్శనము లేవియును లేవు. ఆర్వీటి వంశీయులకును నరపతులను బిరుదముండుటచే, ప్రతాపరుద్రుని కాలమున ఆరవీటిని పరిపాలించిన సోమదేవరాజే ఈ నరపతిరాయలై యుండును.[62] ఈ సోమదేవరాజు, ఒక మహమ్మదును బంధించి విడిచెనని తెలియుచున్నది.[63] ఆ తురుష్కరాజు క్రీ.శ. 1325 వ సంవత్సరమున ఢిల్లీ సామ్రాజ్యమును పరిపాలించిన మహమ్మదు బీన్ తుగ్లక్ అని తెలియుచున్నది.[64] కనుక నరపతిరాయలు పన్నెండు సంవత్సరములు సుల్తాను సేనలతో పోరాటము జరిపెనని ఈ ఆఖ్యాతలు తెలిపిన అంశము సత్యమే కావచ్చును.

ప్రతాపరుద్రుని బంధీగ గొనిన సుల్తాను తల్లి ఆజ్ఞప్రకారము ప్రతాపరుద్రుని విడిచి పుచ్చెననియు ప్రతాపరుద్రుడు గోదావరీ తీరమున కాళేశ్వరము కడ మరణించెనని ఈ కావ్యములు తెలిపినవి. ఇది సత్యమనుటకు ఆధారములు లేవు. ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1323 వ సంవత్సరమున ఢిల్లీ పురమునకు బందీగ గొని

62. ప్రతాప చరిత్ర, పీఠిక.

63. అందుగుల వెంకయ్య, రామరాజీయము, ప. 131, p. 23.

64. శ్రీ ఆళియరామ భూపాలుడు, pp. 15-29.

పోవునపుడే మార్గమధ్యమున మరణించెనని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. ఈ ఆఖ్యానములు ప్రతాపరుద్రుడు బంధవిముక్తుడైన మూడు మాసముల తరువాత మరణించెనను అంశమును స్పష్టపరచు చున్నవి. అనితల్లి వేయించిన కలువచేరు శాసనము కూడా ఈ అంశమును బలపరచుచున్నది.[65] సామ్రాజ్య పతనానంతరము మానధనుడైన ఆ మహారాజు చిరకాలము జీవించి యుండలేదను యంశము పై విషయముల వలన స్పష్టపడుచున్నది. శ్రీగొర్తి వెంకటరావుగారు కూడ ప్రతాపరుద్రుడు బంధీగ నున్నపుడే మరణించి యుండునని వ్రాసిరి.[66]

ప్రతాపరుద్రుడు మరణించగానే భార్యయగు విశాలాక్షి సహగమనము చేసెనని ఈ రెండు గ్రంథములు తెలిపినవి. ప్రతాపరుద్రునితో కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయినది.

ప్రతాపరుద్రుని అనంతరము అతని పుత్రుడు కొన్నినాళ్లు రాజ్యము చేసెనని ఈ రెండు గ్రంథములందును గలదు. ప్రతాపరుద్రునకు పుత్రులున్నటుల ఏ చరిత్ర కాపుడును తెలుపలేదు. కనుక ఈ విషయమును చరిత్రకారులు పరిశోధింప వలయును.

ఈ అంశములే కాక ఈ రెండు గ్రంథములు తెలిపిన ప్రతాపరుద్రుని ఆస్థానము నందలి నానావర్ణముల వారి సంఖ్య, ఆదాయ వ్యయములు, ఆస్థానమున గల కవి పండితుల సంఖ్య, రాజోద్యోగుల వివరములు మొదలగు అంశములు చరిత్రకు ఎంతేని ఉపయోగపడును.

ఈ రెండు గ్రంథములు కేవలము రాజకీయ చరిత్రనేకాక రాజుల దినచర్య, రాజ్యవైభవము, మత సాంఘిక చరిత్ర, విద్యావినోదములు మొదలగు పెక్కు ఇతరాంశములను తెలుపుచున్నవి. ఈ గ్రంథముల వలన ప్రతాపరుద్ర చక్రవర్తి దినచర్య వివరముగ తెలియుచున్నది.

ప్రతాపరుద్రుని రాజ్యమున నానావర్ణముల వారిగృహముల సంఖ్య:[67]

| | |
|---|---|
| వేదవేదాంగపారంగత్తులైన విప్రగృహములు | 18,000 |
| రాజగృహ రాజకార్యములు తీర్చు మంత్రుల ఇండ్లు | 1,000 |
| రణరంగ చతురులైన క్షత్రియుల ఇండ్లు | 1,000 |
| సకల సామాగ్రిచే ఒప్పు వైశ్యుల ఇండ్లు | 3,000 |
| కోటికి పగడ లెత్తిన వైశ్యుల ఇండ్లు | 420 |
| పద్మనాయకుల ఇండ్లు | 77 |
| అష్టాదశవర్ణముల గృహములు | 1,50,000 |
| విశ్వకర్మవంశీయుల ఇండ్లు | 20,000 |

65. G. Yazdani, The Early History of the Deccan, p. 657.
66. Journal of Andhra Historical Research Society, Vol. VI.
67. ప్రతాప చరిత్ర, శ్రీ సిద్ధేశ్వర చరిత్ర.

| | |
|---|---|
| సర్వ సంపదలుఉన్న గొల్లల ఇండ్లు | 4,000 |
| కాపుల ఇండ్లు | 16,000 |
| ఈడుగల ఇండ్లు | 3,000 |
| రుద్రజయ్య మొదలైన బ్రాహ్మణుల ఇండ్లు | 15,000 |
| కుమ్మర ఇండ్లు | 4,500 |
| పట్టునేసె సాలె ఇండ్లు | 2,500 |
| పద్మసాలె వాండ్ల ఇండ్లు | 6,500 |
| మేదర ఇండ్లు | 2,000 |
| చిత్తరు వ్రాసే ఇండ్లు | 1,500 |
| ఉప్పర ఇండ్లు | 15,900 |
| మేర వాండ్ల ఇండ్లు | 1,500 |
| బెస్తవాండ్ల ఇండ్లు | 16,000 |
| తెనుగు ఇండ్లు | 6,500 |
| బుక్క ఇండ్లు | 6,300 |
| సంగర ఇండ్లు | 13,000 |
| రజకుల ఇండ్లు | 50,000 |
| అగణ్యవస్తు వాహన శోభితంబైన వేశ్యాగృహంబులు | 1,27,000 |
| ప్రవాసులయిన వారికి వండిపెట్టే వంటలక్కల ఇండ్లు | 500 |
| బలిజల భవనములు | 15,000 |
| ఇతర గృహములు | 7,71,000 |
| దేవాలయములు—దేవాలయముల కొరకు జరిగెడి ఖర్చు : | |
| శివాలయములు | 5,500 |
| విష్ణాలయములు | 1,300 |
| మైలారు, పోలేరులు | 1,400 |
| భైరవాది దుర్గగణపతి వీరభద్ర నివాసములు | 4,400 |
| ప్రసిద్ధ స్థానములు భేరీలు | 550 |
| నిస్సానంబులు | 1,500 |
| పంచమహా శంఖములు, పట్నమున అహోరాత్రములు మ్రోయుచుండునవి, గుడులమీద పసిడికుండలు | 15,500 |
| దేవస్థానములందు పెట్టెడి దీపములకు దినమునకు ఖర్చయ్యెడి మానెపుట్లు | 25 |
| నగరిదీపములకు నిత్య బ్రాహ్మణుల సంతర్పణమునకు ఖర్చయ్యెడి ఘనసార పరిమళ ద్రవ్యములు పుట్లు | 50 |
| నానావస్తు శోభితమయిన అంగళ్లు | 300 |

| | |
|---|---|
| చిన్న అంగళ్లు | 800 |
| పురమునకు చుట్టు ఉన్న వీరభట వాసములు | 300 |
| గూడెములు | 25,000 |
| రాజును కొలచిన నానాదేశాధీశులు, పద్మనాయకులు | 77 |
| ఒక్కొక్కనాయకుని వీరభటులు | 1,500 |
| ఉత్తమాశ్వములు | 100 |
| మదగజములు | 10 |
| కోటను కాచెడివారు | 9,00,000 |
| రాజనగరిలో అశ్వములు | 2,400 |
| సామజంబులు | 2,400 |
| కనోజరాజిచ్చిన గుఱ్ఱములు | 80,000 |
| వీరపాంశ్య రాజును గెలిచి తెచ్చిన ఏనుగులు | 8,000 |

ప్రతాపరుద్రుని దినచర్య :

ప్రతాపరుద్రుడు బ్రాహ్మీ ముహూర్తమున మంగళ వాద్యముల విని మేలుకాంచి విహిత కార్యములను తీర్చుకొని, పరిమళ తైలముచే అభ్యంగనము చేసి, కాశ్మీర ఘనసార చందనముల నలుగ బెట్టించుకొని, పన్నీట జలకమాడి, దివ్యాంబరములను ధరించి, అభరణాదులను, కనక పాదుకలను ధరించికొలువు తీర్చెడివాడు.

రాజు దర్శనమునకు విద్వాంసులు సమస్త కళా ప్రవీణులైన పరిహాసకులు, ఉత్తమ క్షత్రియులు, ఆస్థాన వేశ్యలు, బిరుదు పాత్రులు, కవీశ్వరులు, పురోహితులు, నానాదేశాధిపతులు, డెబ్బది ఏడుగురు పద్మనాయక వీరులు, తమ్ముడు అన్నమదేవుడు, నానాదేశముల నుండి రాయబారులు, లెంకనాయకులు, ఆలయ స్థానముల అధికారులు మొదలగువారు వచ్చి, విన్నవించిన విన్నపములు నాలకించి, సభ చాలించెడివాడు.

అనంతరము, బంధువులతో, తమ్ముడగు అన్నమదేవునితో డెబ్బది ఏడుగురు లెంకనాయకులతో భోజనము చేసి, వారికి కర్పూరవిడెము లిచ్చి సాగనంపి, రహస్య స్థలమున తూగుటుయ్యాలపై బవళించి విశ్రమించెడివాడు.

మరల కొలువుకూటమునకేగి అచట మల్లయుద్ధ, వ్యాఘ్ర, గజ, భల్లూక యుద్ధములను, కావ్యనాటకాలంకారాది శాస్త్ర ప్రసంగములను, పుణ్యకథా శ్రవణముచేసి, వారాంగనల నృత్యగీత వినోదములను తిలకించెడివాడు.

సాయంత్రము శంభులింగమును సేవించి, నగరున కేతెంచి, పెద్ద తలారియైన నిశ్శంక వల్లభుని పరివారముతో కొంతతడవు ప్రత్యేకముగ కొలువు తీర్చెడివాడు. ఇది ప్రతాపరుద్రుని దినచర్య.

ప్రతాపరుద్రుని రాజ్యము ఉత్తరమున భగీరథి మొదలు పూర్వ దక్షిణ

పశ్చిమముల సముద్ర పర్యంతము వ్యాపించి యుండెను.

**వ్యయములు :**

ప్రతాపరుద్రుని భాండాగారమునకు ప్రతిసంవత్సరము వచ్చు నలుబది నాలుగుకోట్లకు జరిగెడి వ్యయము ఈ విధముగ నుండెను. నిత్యవైభవమునకు పంక్తి భోజనములకు, నగరిదీపములకు, నానాదేశముల నుండివచ్చు విద్యార్థులకు పంచినది, ప్రతి సంవత్సరము మూడుకోట్ల అరువది లక్షలు. పురమును కాచెడి నిశ్శంక వల్లభుని జీతము (భటులతో సహా) ఎనుబది ఎనిమిదిలక్షల యిరువదివేలు, అన్న సత్రములకు ఒక్కొక్కదానికి వెయ్యి చొప్పున నూరుసత్రములకు, ద్విజులకు ఒకకోటి ముప్పది లక్షలు. నగరు మొగసాలకాచు తొమ్మిది లక్షల ధనుర్ధరులకు ఏడాదికి మూడు కోట్ల ఎనుబది లక్షలు, రాజుయొక్క మదగజ ఉత్తమాశ్వముల జూచువారికి రెండుకోట్ల ఏబది లక్షలు, రాజగృహములు కట్టేవారికి ఒకకోటి, వారణాసి విశ్వేశ్వర, మల్లిఖార్జున, వేంకటేశ్వర, రంగనాయక, ఏకామ్రేశ్వర, రామేశ్వర, గోకర్ణేశ్వరులాది దేవతలకు సంవత్సరమునకు మూడుకోట్లు వ్యయమగు చుండెను.

**విద్యావినోదములు :**

ప్రతాపరుద్రుని కాలమున ఏకశిలానగరము సర్వవిద్యావ్యాసంగములకు ఆకరముగ నుండెడిది. కవిత్వము, జ్యోతిషము అనాడు ప్రముఖస్థానమును అలంకరించినటుల కనపడుచున్నది. ఆనాటి జ్యోతిష పండితులు, బ్రాహ్మణులు అద్భుతములగు కార్యములను ప్రదర్శించుచుండిరి. ప్రజలు శివభక్తులై కఠినమగు వ్రతములను చేయుచుండిరి. ప్రతాపరుద్రుడే స్వయముగా దీక్షను పొందెను. గంగాజలములతో స్నానము చేయుట, దేవతాభిషేకము చేయుట గొప్ప పుణ్యకార్యముగ అనాడు భావింపబడుచుండెడిది. 1,27,000 వేశ్యాగృహములుండెనని ప్రతాపచరిత్ర వర్ణించుటచే అనాడు ప్రజలు వేశ్యాలోలురను అంశము తెలియుచున్నది.

పాల్కురి సోమనాథుడు, విద్యానాథుడు, చక్రపాణి రంగనాథుడు, కుమ్మరి మొల్ల, భాస్కరుడు, శాఖవెల్ల మల్లిఖార్జునభట్టు మొదలగువారు ప్రతాపరుద్రచక్రవర్తి కాలమున నుండి నటుల ఈ గ్రంథములు తెలుపుచున్నవి. పై కవుల, కవయిత్రుల కాలనిర్ణయములను మన ఆంధ్రవాఙ్మయ చరిత్రకారులందరును పలుమారులు నుడివిరి కనుక మరియొకమారు నేను వారు చెప్పిన అంశములే చెప్పనక్కరలేదని భావించుచున్నాను.

ఈ గ్రంథములవలన కాకతీయులు ఉత్తమ పరిపాలకులనియు, దైవభక్తి కలవారనియు, న్యాయనిర్ణేతలనియు తెలియుచున్నది. వీరు నగర, ఆలయ గోపుర, తటాక, ఉద్యానవనములను నిర్మించిరి. అసంఖ్యాకములగు దేవాలయములను

నిర్మించి నిత్య నైవేద్య భోగములకై, దానధర్మములను చేసిరి. కవిపండితులను పోషించిరి. సత్కరించిరి. యజ్ఞయాగాదుల నొనర్చిరి. వీరు నిరతాన్నదాన సత్రములు కట్టించిరి. శైవమఠములు స్థాపించిరి. ఈ శైవమఠములు ఆరోగ్య సదనములుగ విద్యాసంస్థలుగ వర్ధిల్లినవి. వీరి పరిపాలనలో గమనింపదగ్గ అంశము రుద్రమ కాలమున స్త్రీలకొరకు ప్రత్యేకముగ ప్రసూతి ఆరోగ్యశాల స్థాపించుట. ప్రజానురంజకముగ పరిపాలించిన కాకతీయుల చరిత్రను తెలుపుచున్న ప్రతాప చరిత్రము, శ్రీ సిద్ధేశ్వరచరిత్రములు ఆంధ్రచరిత్రకు మహోపకారమును చేసినవని చెప్పవచ్చును. కానివీనియందు కేవలము చరిత్రాంశములే కాక, మానవాతీతమగు కొన్ని కార్యములు జరిగినట్లు తెలుపు అంశములును గలవు.

పద్మాక్షిదేవి అనుగ్రహమువలన మాధవవర్మ ఖడ్గకేటకములు సంపాదించుట, ఆ ఖడ్గకేటకములే రెండవ ప్రతాపరుద్రుని వరకు వంశపారంపర్యముగ వచ్చుట, కాకతి ప్రోలరాజు యిచ్చిన దానమును పరిగ్రహించిన దూదికేశవ పిన్నయ్య బ్రహ్మ రాక్షసుడగుట, గుండ బ్రహ్మయ్య కథ, విప్రుడొకడు గొడ్డుటావువద్ద కుంచెడు పాలు తీయు గాథ, అమావాస్య తిథిని పౌర్ణమిగ మార్చిన శాఖవెల్ల మల్లిఖార్జునుని గాథ, కృష్ణమాచార్యులు తన సోదరుని శవమును, తనంతతానే కాష్ఠమునకు పోవు నటుల చేయు గాథ, కాశీబుగ్గ ఉత్పత్తి, ప్రతాపరుద్రునకు శివసాక్షాత్కారమగు అంశము, ప్రతాపరుద్రుని కడనున్న ఖడ్గము సర్పమై పద్మాక్షిదేవి వదనగహ్వరమున దూరిన విషయము, పాల్కురికి సోమనాథుడు అంధులకు కండ్లు, అంగహీనులకు అంగములు, బధిరులకు వీనులు తన ప్రభావమువలన వచ్చునటుల చేయు విషయములు ఈ గ్రంథములు తెలుపుచున్నవి.

ఇట్టి గాథలు సత్యములనుటకు మనకెట్టి ఆధారములు ఉండవు. దేవతా మహిమలవలన, మహాపురుషుల మహిమవలన లోకోత్తరమగు కార్యములు జరిగి నటుల మనకు ప్రాచీనకాలమునుండి పెక్కు గాథలు గలవు. మన దేశముననేకాక ఇతర దేశములందు కూడ ఇట్టి గాథలు పెక్కు గలవు. పూర్వకాలముననే కాదు నేడును ఇట్టి మానవాతీతకార్యములను చేయు పురుషులు గలరని, దర్శన మాత్రముననే పెక్కు రోగములను నయమొనర్చెడి సాధుపుంగవులు గలరని నమ్మెడివారు గలరు. కాని నేటి మన శాస్త్రవిద్య అట్టి విషయములు సత్యము లనుటకు అంగీకరింపనీయదు. దేవతానుగ్రహమున మనకార్యములు సాధించు అంశములు గల శాసనములును గలవు. ప్రజలలో మిక్కుటముగ ప్రచారమయిన గాథలును గలవు. అందు కొంత కల్పన ఉన్నప్పటికిని కొంత సత్యముండియే యుండును. నేటి కాలమున కంటె, ప్రాచీనకాలమున అట్టి గాథలకు ప్రాముఖ్య ముండుటకు కారణములు అనాటి ప్రజలకు అట్టి గాథలయెడ గల ఆసక్తి, నమ్మకము కావచ్చును.

ఈ గాథలే కాక, చరిత్రాంశములను సహితము, ఈ కవులు పరిశీలించి ఆధార

సహితముగ రచింపలేదు. వినికిడిగ తెలియుచున్న పెక్కు అంశములను చేర్చిరి. ముఖ్యముగ కాలనిర్ణయమును వీరు సరిగా చేయలేదు. ఉదాహరణమునకు ప్రతాపరుద్ర చక్రవర్తి క్రీ. శ. 1323 (కొందరు 1326) లో మరణించెనని చరిత్రకారులు పెక్కుమంది అంగీకరించిరి. క్రీ.శ. 1323–26 ప్రాంతములలో కాకతీయ సామ్రాజ్యము అంతమైనటుల మనకు పెక్కు నిదర్శనములు కలవు. అట్టిది మన రచయితలు ప్రతాపరుద్రుడు శా.శ. 1291 అనగా క్రీ.శ. 1369 సంవత్సరమున స్వర్గస్తుడాయెనని వ్రాసిరి. ఈ అంశములు వీరికి chronology శూన్యమని తెలుపుచున్నది. అదియేకాక పూర్వ భవిష్యత్కథనమును (anachronism) ఈ గ్రంథములందు గలదు. జరగబోవు విషయములను జరిగిపోయిన విషయములతో కలిపి చెప్పిరి. విజయనగర వీరనరసింహరాయలతో కాకతీయుల సంబంధ బాంధవ్యములు — దీనికి ఉదాహరణము. కాకతీయ సామ్రాజ్యము అస్తమించిన తరువాత ఉదయమందినది విజయనగర సామ్రాజ్యము. కాకతీయుల చరిత్ర నిర్మించుటకు పెక్కు ఆధారములున్నప్పటికినీ వీరా విషయమున శ్రద్ధ చూపలేదను విషయమును పై అంశములు స్పష్టపరచుచున్నవి. చారిత్రక విమర్శనా దృష్టి వీరికి లేదనుట స్పష్టము.

ఈ కవులకు కాకతీయులనినగల అభిమానము, ముఖ్యముగ చరిత్ర అనినగల అభిమానము ప్రశంసింపదగ్గది. ఏకామ్రనాథుడు కేవలము చరిత్రను చెప్పు ఉద్దేశముతోనే వ్రాసెను. సర్వప్ప కావ్యరూపమున వ్రాయవలెనను ఉద్దేశముతో ద్విపద చందమున వ్రాసెను. సర్వప్ప మాధవవర్మ వృత్తాంతమును ఖండకృతిగా తీర్చిదిద్దినాడు. ఈతని ద్విపద రచన ప్రతాపరుద్రుని విద్యాభ్యాస వర్ణనతో ఆగిపోయినది. తరువాతి భాగము వచనము. ఇది రుద్రమ దేవగిరి యాదవులపై యుద్ధము ప్రకటించుటతో ప్రారంభించబడినది. సర్వప్ప మరణించగా ఆతని బంధువులో, సన్నిహితులో శేషభాగమును వచనమున రచించి గ్రంథమును పూర్తిచేసిరని తోచుచున్నది. ఈ వచనము చాలా భాగము మూలమైన ప్రతాప చరిత్రకు ప్రతిగా ఉన్నది.

ప్రతాపరుద్రుని కడపటి యుద్ధకాలము, మరణకాలము సిద్ధేశ్వర చరిత్రమున స్పష్టముగ కలవు. ప్రతాప చరిత్రమున లేవు. ఏ కారణముననో నష్టపడియుండవచ్చును. కాకతి ప్రతాపరుద్రునియొక్క, అతని పూర్వులయొక్క చరిత్ర అగుటచే ఏకామ్రనాథుడు 'ప్రతాప చరిత్ర' అని, సిద్ధేశ్వర మహాత్మ్యమున వెలసిన సామ్రాజ్యమని భావించుటచే కాసె సర్వప్ప 'సిద్ధేశ్వర చరిత్ర' అని, తమ గ్రంథములకు నామము లిడిరి. వీరీ గ్రంథములను వ్రాయుటవలన వీరికిగల జాతీయాభిమానము ద్యోతకమగుచున్నది.

ఏకామ్రనాథుడు వర్ణనాదులేమియు చేయక (విమర్శనాదృష్టితో కాకపోయినప్పటికి), తనకు తెలిసినంతలో కాకతీయుల వైభవప్రాభవములను సూటిగా వివరించెను.

సర్వప్ప కావ్యమున అక్కడక్కడ కవితావేశ మెక్కువగ గన్పట్టును. కైలాసమునుండి శివుడు హనుమకొండ కరుదెంచు సందర్భమున, గౌరీ కల్యాణ పట్టమున విషయముకంటె కవితకే ప్రాధాన్యము కనపడుచున్నది. ఇతడు పార్వతీ కల్యాణ వర్ణనమున కవికాలమునాటి ఆంధ్రుల వివాహ పద్ధతిని, వాతావరణమును చక్కగా చిత్రించెను. తన కుమార్తెకు పుత్రుడు కలుగవలెనను కోరికతో రుద్రమ పడిన తాపత్రయమును చక్కగా వర్ణించి, స్త్రీ హృదయమును ప్రతిఫలింపజేసెను. ద్విపద ఛందమున అలతిఅలతి పదములతో చక్కని రచన గావించెను.

ఏకామ్రనాథ, కాసె సర్వప్ప లిరువురును కాకతీయులకు రెండు శతాబ్దముల తరువాతివారు. ఆనాటికే కాకతీయుల చరిత్రమ గూర్చిన పెక్కు ఆధారములు కలవు. శాసనములు కలవు. కాని వీరిరువురును చరిత్రతెలుపు విషయమున శ్రద్ధ చూపలేదు. ఏమైనప్పటికి కవులకు, గ్రంథకర్తలకు చరిత్రయనిన శ్రద్ధలేని కాలమున, ఆంధ్రదేశమును కొన్ని తరములు మహెూజ్వలముగ పరిపాలించిన ఒక రాజ వంశచరిత్రను వ్రాయుటకు నడుముకట్టిన వీరు బహుధా ప్రశంసనీయులు.

# 5. హైహయులు

పలనాటి వీరుల గాథను తెలియని ఆంధ్రులుండరనుట అతిశయోక్తికాదు. క్రీ.శ. 11వ శతాబ్దపు ఉత్తర భాగమునుండి క్రీ.శ. 12వ శతాబ్దపు ఉత్తర భాగము వరకు ఆంధ్రదేశము రాజకీయముగ అల్లకల్లోలమైనది. చాళుక్యరాజ్యము సమసి పోయి కాకతీయరాజ్యము సుస్థిరముగ అవతరించిన వరకు దేశము పెక్కు సంక్షోభములకు లోనైనది. దీనికి ముఖ్యమైన కారణము వేంగి దేశాధిపత్యమునకై తూర్పు చాళుక్యులకు పశ్చిమ చాళుక్యులకు నడుమ తరుచు జరిగిన యుద్ధములు. పల్నాడు, పాకనాడు, కమ్మనాడు మొదలైన మండలములుగ విభజింపబడిన వేంగీ దేశము, తూర్పు, పశ్చిమచాళుక్యుల నడుమజరిగిన యుద్ధములకు రణరంగమైనది. యుద్ధమున ఎవరి సామంతులు వారికి తోడ్పడుచుండిరి. ఈ సామంతరాజులు ఒక ప్రక్క తమ ప్రభువులకు తోడ్పడుచు, మరియొక ప్రక్క స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుటయేకాక ఇరుగుపొరుగు మండలములను స్వాధీనపరచు కొనుటకు తమలో తాము పోరాడుకొనుచుండిరి. ఇటుల యుద్ధములతో వేంగీదేశము శాంతిభద్రతలు కొరవడి విప్లవములకు ఆటపట్టయ్యెను. అటుల జరిగిన అనేక యుద్ధములలో పలనాటి యుద్ధమొకటి. ఈ యుద్ధము ఆనాడు పలనాటిసీమకు పాలకులైన హైహయ వంశీకులకు దాయ భాగమునకై సంభవించిన కుటుంబ కలహము. అన్నదమ్ములనడుమ చెలరేగిన ఈ యుద్ధమున స్నేహధర్మమును పురస్కరించుకొనియో, బంధుత్వమునుబట్టియో, కల్యాణకలచూరి రాజులు, వెలనాటి దుర్జయులు, కోటరాజులు, కాకతీయులు, మొదలగు రాజులు, మండలాధిపతులు పాల్గొనిరి. ఫలితముగ పెక్కుమంది వీరులు మరణించి హైహయ వంశము సర్వనాశనమైనది. అన్నదమ్ములనడుమ చెలరేగిన కలహము 'కారెమపూడి' రణరంగమునకు ఎటుల ద్రోవతీసినది వివరముగ తెలుపు 'పలనాటి వీరచరిత్ర' ఈ ప్రకరణమున పరిశీలించుట జరిగినది.

## పల్నాటి వీరచరిత్ర – శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య

### శ్రీనాథుడు :

శ్రీనాథుని చరిత్ర తెలియని ఆంధ్రుడుండడు. శ్రీనాథుడు క్రీ.శ. 1365 ప్రాంతమున జన్మించెను. క్రీ.శ. 1380 ప్రాంతమని కొందరి అభిప్రాయము. ఇతని

తాత కమలనాభామాత్యుడు. శ్రీనాథుడు చిన్ననాటినుండియే రచనా వ్యాసంగము చేపట్టెను. పెక్కుగ్రంథములను రచించెను. 1. మరుత్తరాట్చరిత్రము, 2. శాలివాహన సప్తశతి, 3. శృంగారనైషధము, 4. భీమేశ్వర పురాణము, 5. కాశీఖండము, 6. హరవిలాసము, 7. పల్నాటి వీరచరిత్రము, 8. శివరాత్రిమహాత్మ్యము, 9. పండితారాధ్యచరిత్రము, 10. నందనందన చరిత్రము, 11. మానసోల్లాసము, 12. ధనంజయ విజయము. క్రీడాభిరామము నీ కవియే వ్రాసెనని కొందరి వాదము.

శ్రీనాథుడు కొండవీటి ప్రభువగు పెదకోమటి వేమారెడ్డి కడ ఆస్థానపండితునిగ, విద్యాధికారిగ 20 సంవత్సరములుండెను. కొండవీటి రాజ్యము నశించిపోగా విజయనగర ప్రభువుల నాశ్రయించెను.

అవసానకాలమున ఒడ్డెరాజులవలన శిక్షింపబడి మరణించెననీ తెలియుచున్నది.[1] ఇతనిఅవసానకాలము క్రీ. శ. 1460 ప్రాంతమని నిర్ణయింపబడినది.

మల్లయ్య :

ఇతని చరిత్ర తెలిసికొనుటకును ఆధారములు లేవు. కాని ఇతడు బ్రహ్మనాయని వర్ణించునపుడు శ్రీకృష్ణదేవరాయలమూర్తిని ఉపమానముగా గ్రహించుటచే (శ్రీకృష్ణదేవరాయలనగా శ్రీకృష్ణుడని కవి అభిప్రాయము) ఇతడు రాయల కాలమువాడో లేక ఆ తరువాతి కాలమువాడో కావచ్చును కనుక ఇతడు పదహారవ శతాబ్దమునకు చెందిన కవి కావచ్చును.[2]

కొండయ్య :

ఇతడేశతాబ్దమువాడో చెప్పుటకు ఆధారములు లేవు. ఇతని చరిత్రయేమియు తెలియుటలేదు.

పలనాటి వీరచరిత్ర, అనుగురాజు పలనాటిని సంపాదించుట, పలనాటి రాజ్య విభాగము, కోళ్ళపోరు, గోపన్న విరుగు, అరణ్యావాసము, మందపోటు, లంకన్న విరుగు, గురజాల యుద్ధము, అలరాజురాయబారము, కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము, కొమ్మరాజు యుద్ధము, బ్రహ్మన్న విరుగు అని విభజింపబడినది. ఇందు కోళ్ళపందెము, గోపు యుద్ధము, మల్లయ ; మండాదివలన, మందపోటు, కొండయ ; కల్లుప్రతిష్ఠ, కార్యమపూడి యుద్ధరంగము, బాలుని యుద్ధము, శ్రీనాథుడు ; కొమ్మరాజు యుద్ధము ఆదిని శ్రీనాథుడు, తుదిని కొండయ వ్రాసిరి. అలరాజు రాయబారము, బ్రహ్మనాయని విరుగు ఎవరు వ్రాసిరో తెలియుటలేదు. అనుగు రాజు పలనాటి సంపాదనము, పలనాటి రాజ్య విభాగముకూడ వ్రాసినదెవరో తెలియుట

1. శ్రీనాథుని చరిత్ర వివరములకు వీరేశలింగముగారి ఆంధ్రకవుల చరిత్ర, ఆంధ్రకవి తరంగిణి, సమగ్రాంధ్ర సాహిత్యము, డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారి శ్రీనాథుఁడు (సిద్ధాంతవ్యాసము) చూడుడు.

2. పల్నాటి వీరచరిత్ర పీఠిక, pp. 32-33.

లేదు. ఈ కావ్యము దేశీయఛందమైన మంజరీ ద్విపదలో వ్రాయబడినది. మన దేశమున ప్రాచీనకాలమునుండి వీరులను పూజించుట, వీరగాథలను పాడుకొనుట కలదు. కారెమపూడి యుద్ధమున మరణించిన మహావీరులు, వీరనారులునైన బాలచంద్రుడు, బ్రహ్మనాయుడు, అలరాజు, మాంచాల, పేరమ్మ, నాయకురాలు మొదలగువారు పలనాటి ప్రజా హృదయములను ఆకర్షించుకొనిరి. ప్రజలు వీరిని దేవతాంశసంభూతులుగా నెంచి పూజింపసాగిరి. వారి గాథలను పాడుకొనజొచ్చిరి. పలనాటి ప్రజలు తమ దేశమునకు ఇతర సీమలవారుగాని, విదేశీయులుగాని వచ్చి నప్పుడు ఉత్సాహముతో

"ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై
సామంత నృపతులు చాపకూడు
ఇచ్చోటఁజింతించె నిచ్చనుపాయంబు
నళినాక్షి యార్వెల్లి నాయురాలు
నిజమను శుద్ధికై నిప్పుల యేటిలో
నోలాడె నిచ్చోటఁ బీలసాని,
యిచ్చోటఁ బోరిరి యిలపణంబుగ గొల్ల
సవతి తల్లుల బిడ్డలవనిపతులు
ధీరులగు వారలేవురు వీరపురుషు
లై మదోద్ధతి నిచ్చోట నాజిఁబడిరి"
యనుచుఁ జెప్పుదు రైతిహ్యమచటనచట
జనపపెద్దలు పల్లెదేశములయందు.[8]

అట్టి ప్రజాకర్షితమైన ఈ వీరగాథను, తన వార్ధక్యము కొన్నినాళ్ళు పలనాటి సీమ యందు గడపిన శ్రీనాథుడు, సుద్దుల వాండ్లు, పంబవారు పాడుచు ఆడుచు ప్రజలను ఆకర్షించుట చూచి ఉండును. ఆ గాథ తన హృదయమున హత్తుకొనగా ప్రజామోదము కొరకు, ఆకర్షణ కొరకు ద్విపద కావ్యముగా మలచియుండును. మంజరీద్విపద పాడుకొనుటకు, హావభావవిలాస విభ్రమముల ప్రకటించుటకు, అభినయించుటకు అనుకూలమైనది. కనుకనే శ్రీనాథుడు మనను రంజిల్ల చేయు విధముగ మంజరీ ద్విపదలో పలనాటి వీరులగాథను రసవంతముగ మలచినాడు. ఆంధ్రవీరుల గాథను దేశీయ ఛందమున మలచిన దేశీయ మహా కావ్యమిది.

## చరిత్ర – పలనాటి వీర చరిత్ర

ఉత్తర హిందూ దేశమున పాలమాచాపురి అను పురము కలదు. కార్త వీర్యార్జున వంశీయుడైన అనుగురాజు దాని పరిపాలకుడు. అతడు పురాకృత

8. వినుకొండ వల్లభరాయడు, క్రీడాభిరామము, ప. 121.

పాపములను పరిహరించుకొనవలెనని తలంచి, దానములను చేయు చుండెను. ఒకనాడు వారి ఇలువేల్పు కనకాద్రి చెన్నకేశవులు వృద్ధ బ్రాహ్మణ వేషమున వచ్చి, "కార్తవీర్యార్జునుడు జమదగ్నిని చంపగా వచ్చిన బ్రహ్మ హత్య దోషము ఎన్ని దానములు చేసినను తొలగదు. నీలి వస్త్రములు ధరించి, పుణ్య తీర్థములలో స్నానము చేయవలెను. నీలివలువలెప్పుడు తెల్లబడిన అప్పుడా దోషముతొలగి పోవునని" చెప్పెను. విప్రుని ఆదేశము ప్రకారము అనుగు రాజు, భార్యలైన విద్యలదేవి, భూరమాదేవి; మంత్రియైన దొడ్డనాయడు, దొడ్డనాయని పుత్రుడైన బ్రహ్మనాయుడు, సైన్యాధిపతి తెప్పలినీడు మొదలగు వారితో ప్రయాణమై తీర్థ యాత్రలు చేయుచు ఆంధ్రదేశమునకు వచ్చెను. అచట మోటుపల్లి కడ సముద్రమున స్నానము చేయగా నీలి వలువలు తెల్లబడి బ్రహ్మ హత్యా దోష నివారణ మాయెను. అనుగు రాజు సంతోషముతో అచట నివాస మేర్పరచుకొనెను.

సైన్యాధిపతియైన తెప్పలినీడు ఒకనాడొక భూకామందుతో జొన్న విత్తుల విషయమై వైరము తెచ్చుకొని, ఊరకోట రాజైన పేరమరాజుతో యుద్ధము చేసి అతనిని చంపి, 'భూమండలమందలి రాజులందరును స్త్రీలతో సమానులని అనుగు రాజొక్కడే రాజనామార్థుడని' ఒక బిరుదు శాసనము వేయించి ఊరకోట యందు ప్రతిష్ఠించెను. ఈ వార్తవిని చందవోలు రాజు యుద్ధము ప్రకటించెను. పెద్దన్న, పేర్నీడులు చందవోలు రాజును ఓడించి బంధిని చేసిరి. అంత చందవోలు రాజు అనుగురాజుతో సంధి చేసు కొనెను. తన కుమార్తె మైలమదేవినిచ్చి పెండ్లి చేసి, పలనాటి సీమను ఆమెకు అరణముగ నిచ్చెను. అనుగురాజు గురజాల రాజధానిగ పలనాటికి ప్రభువాయెను. అనుగు రాజునకు విద్యలదేవి వలన పెదమల్ల, పినమల్ల, బాలమలిదేవులు, భూరమాదేవి వలన కామరాజు, నరసింగరాజులు, మైలమదేవి వలన నలగామరాజు జన్మించిరి. కొన్ని నాళ్లు రాజ్యము చేసిన తరువాత అనుగు రాజు, నలగామునకు పట్టాభిషేకము చేసెను. కొన్నాళ్ళ తరువాత అనుగురాజు మరణించెను. అనుగురాజు మరణించు నమయమున తన కుమారులను బ్రహ్మనాయునకు అప్పగించి, వారందరు ఐకమత్యమున మనలుకొను నట్లుగా అరయుచు నలగామునకు మంత్రిత్వము చేయవలెనని కోరెను. అనుగురాజు కోరిక ప్రకారము బ్రహ్మన నలగామునకు మంత్రియై పల్నాటి రాజ్యము చక్కగా నేలించు చుండెను.

అనుగురాజొకనాడు వేటాడి వచ్చు చుండగా జిట్టగామాలపాడను గ్రామమున వీరజగ్గారెడ్డి దత్తపుత్రికయైన నాగమ్మ అతనికి విందు చేసి మెప్పించి పల్నాటి ప్రభువుల కడ తాను ఏడు గడియల కాలము మంత్రిత్వము చేయునట్లు వరమును పొంది పత్రమును పుచ్చుకొనెను. ఆమె నాటినుండి గురజాలకు వచ్చి పోవుచునే ఉండెను. నాయకులందరితో మంతనములు చేయు చుండెను. కాని బ్రహ్మన మాత్రము ఆమెను లెక్కచేయ కుండెను. ఇరువురి నడుమ పగ వృద్ధి పొందు చుండెను. అదను కొరకు వేచియున్న నాగమ్మ అనుగురాజు మరణించిన

తరువాత, ఒకనాడు నలగాముని కొలువునకు వచ్చి అతని తండ్రి తన కిచ్చిన పత్రము చూపి ఆ మాట చెల్లింపుమని నలగాముని కోరెను. నలగాముడు నాగమ్మకు తండ్రి వ్రాసిన పత్రము ప్రకారము మంత్రిత్వమునిచ్చి తండ్రి మాట చెల్లించెను. నాగమ్మ క్రమముగ నలగాముని ప్రాపు సంపాదించి నలగామునకు, అతని సవతితమ్ములకు, బ్రహ్మనకు నడుమ వైషమ్యములు కల్పింప మొదలిడెను. ఆమె రహస్యముగ రాజభటులను పంపి బ్రహ్మన స్నేహితుల ఇండ్లను కొల్లగొట్టించి ధనమును తెప్పించి, ఆ ధనమును నలగామునకు చూపెను. ప్రభుత్వ కోశాగారమునకు చేరవలసిన ఆ ధనము బ్రహ్మన అపహరించి స్నేహితుల ఇండ్లకు తరలించెనని బ్రహ్మనపై నేరారోపణ చేసెను. నలగాముడు నాగమ్మ మాటలు నిజమని నమ్మి బ్రహ్మనాయుని ఎడము సేయ మొదలిడెను. నాయకురాలంతతో ఆగక పట్టమహిషి విజ్జలదేవి పుత్రుడైన మలిదేవునకు రాజ్యము నిచ్చుటకు బ్రహ్మన తంత్రము పన్నుచుండెనని నలగామునితో చెప్పి మలిదేవుని అతని తమ్ములను చెరలో వేయించెను.

బ్రహ్మన మలిదేవాదులను చెరనుండి విడిపించి, రాజ్యమును నలగామ మలిదేవాదులకు పంచిపెట్టెను. చంద్రవంక కడ మాచర్ల అను పట్టణము నిర్మించి, మలిదేవాదులతో మాచర్లకేగెను. మలిదేవుడు బాలుడైనందున మలిదేవుని పక్షమున తాను రాజ్యము నేలుచుండెను. కొంత కాలమైన తరువాత బ్రహ్మన కల్యాణ పురాధీశ్వరుడైన వీరసోముని కడకేగి అతని పుత్రికయైన సిరాదేవిని మలిదేవున కిమ్మని అడిగెను. వీరసోముడు శైవుడు. బ్రహ్మన వైష్ణవుడు. వీరసోముడు వైష్ణవులతో వియ్యమంద నిరాకరించెను. కాని కొంత కాలము తరువాత వీర సోముడు, బ్రహ్మన తనకు యుద్ధమున సహాయపడి గెలిపించినందున, తన పుత్రిక సిరాదేవిని మలిదేవునకిచ్చి వివాహము చేసెను. బ్రహ్మన మలిదేవునకు పట్టాభి షేకము చేసెను. మలిదేవుని వివాహమునకు నలగాముడు రానందున బ్రహ్మన విచారించెను. దాయాదుల నడుమ వైరము మంచిదికాదని వారినడుమ పొత్తు కుదర్పవలెనని గురజాలకు ప్రయాణమయ్యెను. అది గ్రహించి నాయకురాలు నలగామునితో, పొరుగున బలమైన మాచర్ల రాజ్యమున్న గురజాలకు ప్రమాదమని, బ్రహ్మనకు కోడిపందెములన్న కుతూహలము కనుక మోసముతోనైనను అతనిని ఓడించి మాచెర్ల భాగమును గ్రహింపవచ్చునని చెప్పెను. ఆమె దుర్బోధలకు నలగాము డంగీకరింపలేదు. కాని నాగమ్మ ఊరుకొనక బ్రహ్మన చూచుచుండగా అతని విడిది కెదురుగా రెండు కోడిపుంజులతో పోరాడించి అందు ఓడిన పుంజును బ్రహ్మన పుంజని గేలి చేసెను. అది గాంచి బ్రహ్మన చెన్నకేశవుని ప్రార్థింపగా పారిపోయిన పుంజు తిరిగి గరిడిలోనికి వచ్చి రెండవ కోడిని చంపెను. అంత నాయకురాలు పందెములేని పోరేమి పోరని, ఓడినవారు ఏడు సంవత్సరములు అరణ్యవాసము చేసివచ్చి మరల రాజ్యము గ్రహింపవచ్చని సమయమేర్పరచి

కయ్యమునకు కాలు దువ్వెను. బ్రహ్మన పందెమున కంగీకరించి, మాచెర్లకు పోయి మలిదేవుని అనుమతి పొంది తన కోడిపుంజుతో గురజాలకు తిరిగివచ్చెను. తొలి పందెమున బ్రహ్మనాయని పుంజు గెలిచెను. నాయకురాలొప్పక మరునాడు మలి పందెము వేయించెను. మరునాడు నాయకురాలు రహస్యముగ బ్రహ్మనాయని పుంజునకు మంత్రాక్షతలు చల్లించి చంపించెను. బ్రహ్మనాయుడు ఓడిపోయెను. ఆ దుస్తంత్రమును గ్రహించిన బ్రహ్మనాయని బంట్రైన గోపన్నను చంపించెను. నిబంధన ప్రకారము ఓడిపోయిన మలిదేవాదులు మాచెర్లను విడచి మండాదికి వలస పోయిరి. నాయకురాలు వారిని చీకాకు పరుపవలెనని చెంచుమూకలచేత మలిదేవాదుల అలమందలను పొడిపించెను. మలిదేవుని గొల్లలకు, నలగాముని సైనికులకు యుద్ధము జరిగెను. మలిదేవుని తరపున లంకన్న, నలగాముని పక్షమున పలినేడు మరణించిరి. మలిదేవుని పక్షమువాడైన కన్నమనీడు నలగాముని సైనికులను చంపి గోవులను మరలించెను. బ్రహ్మన రుద్రుడై నలగాముని చంపుటకై గురజాలకు వెళ్లెను. నలగాముడు భయపడి గంగ గుడిలో దాగెను. బ్రహ్మనాయుడతనికి అభయమిచ్చి మరలివచ్చి వారి నివాసమును మండాదినుండి మేడపికి మార్చెను. మలిదేవాదులు చివరికెట్లో గడువు కాలమును పూర్తిచేసికొనిరి.

తమ రాజ్యభాగమడుగుటకు, వీరసోముని మనుమడు నలగాముని అల్లుడునైన అలరాజును బ్రహ్మన రాయబారమునకంపెను. నాయకురాలి మాట ప్రకారము నలగాముడు రాజ్యమిచ్చుటకు నిరాకరించెను. అలరాజు ఈ కలహమునకు కారణము నాయకురాలే అని ఆమెను నిందించెను. తన్ను నిందించెనను కోపముతో నాయకురాలు, మార్గమధ్యమున విషము పెట్టించి అలరాజును చంపించెను. అలరాజు భార్య పేరిమిదేవి సహగమనము చేసెను. అలరాజు మరణము యుద్ధమునకు ప్రేరణమాయెను. యుద్ధమున కాని తమ రాజ్యము తమకు రాదని మలిదేవాదులు యుద్ధమునకు ముహూర్తము పెట్టించిరి. మలిదేవుని పుత్రుడు చిరుదురాజునకు పట్టాభిషేకము చేసి, బ్రహ్మనాయని పుత్రుడైన బాలచంద్రుని మంత్రిని చేసి యుద్ధమునకు సన్నద్ధులైరి. దళముల నాయత్తపరచి కార్యమపూడి కదనరంగమున దండు విడిసిరి. యుద్ధమునకు రమ్మని నలగామునకు, ఒక భట్టుచే రాయబారమంపిరి. నలగాముడు తనకు తోడై వచ్చిన వివిధ మండలాధిపతుల సైన్యములతో సమరరంగమున మోహరించి నిలచెను. అప్పుడు నాయకురాలునకు సంధి చేసుకొనవలెనన్న తహతహ హెచ్చెను. చింతపల్లి రెడ్డి, కొండ అన్నమరాజు, కోట బేతరాజు అనువారలను నలగాముడు, మలిదేవాదులకు మాచర్ల నిచ్చుటకు సిద్ధముగనున్నాడని బ్రహ్మనకడకు రాయబారమంపెను. సంధి కుదిరెను. కాని బ్రహ్మనాయని కొడుకు బాలచంద్రుడు రాయబారమును భగ్నము చేసెను. యుద్ధము అనివార్యమయ్యెను. ఇరుపక్షములవారికి కార్యమపూడి కదనరంగమున ఘోరసంగ్రామము జరిగెను. పెక్కుమంది వీరనాయకులు మరణించిరి.

బ్రహ్మనాయనికి విజయము లభించెను. యుద్ధము ముగిసిన తరువాత మిగిలినవారు బ్రహ్మన, నలగామరాజు, మలిదేవుడు, నాయకురాలు. తన వంశ నాశనమునకు తానే కారణమని తలచి మలిదేవుడు హఠముచేసి ప్రాణత్యాగము చేసెను. నలగాముడు బ్రహ్మనకు భయపడి కొదమగుండ్లకు పారిపోయెను. అచటి విప్రుల కోరికపై బ్రహ్మన నలగాముని కరుణించి విడిచిపెట్టెను. స్త్రీయని తలచి నాయకురాలిని చంపక బ్రహ్మన విడిచిపెట్టెను. యుద్ధమున విజయ మెవరిదైనప్పటికి, యుద్ధఫలితముగ వంశము సర్వనాశనమైనది. అందరును మరణించుటచే బ్రహ్మన నలగామరాజును పునరభిషిక్తుని కావించెను.

ఈ పలనాటి వీరచరిత్రలో అనేక కల్పితాంశములు, చారిత్రక విషయములు పడుగుపేకలవలె అల్లుకొనియున్నవి. కనుక ఈ కథంతయు యథార్థమని నమ్ముటకు తగు ఆధారము లభింపదు. ముఖ్యముగ అనుగురాజు పాపపరిహారార్థము ఉత్తర దేశమునుండి వచ్చి ఆంధ్రదేశమున స్థిరపడిన గాథ. ఉత్తర దేశమునుండి ఆంధ్ర దేశమునకు వచ్చిన మొదటి హైహయరాజు అనుగురాజే అనుటకు తగిన అధారములు లేవు. అది చారిత్రక సత్యము కాదు. ఇట్టిదే మరియొక అంశము అనుగురాజు ఉత్తర దేశమున నున్నప్పడే అతని కొలువున దొడ్డనాయుడు, పెద్దన, బ్రహ్మనాయుడు, పేర్నీడు, సూర్నీడు, తెప్పలినీడు, కన్నమనీడు మొదలగు తెలుగు వారుండిరనుట. ఇది కేవలము అసంగత విషయము. అతని భార్య బిడ్డలైన విద్యలదేవి, భూరమాదేవి, పేరమ్మ, నలగామరాజు, నరసింగరాజు, మలిదేవుడు మున్నగువారి పేర్లను అచ్చముగ తెలుగు పేర్లు. తెలుగువారు ఉత్తర దేశము వెళ్లి అచట రాజుకడ కొలువుచేసిరనుటగాని, ఉత్తర దేశీయులు అచ్చముగ తెలుగు పేర్లను పెట్టుకొనిరనుటగాని అసంగతమగును. కనుక అనుగురాజునకు పూర్వమే ఎప్పుడో అతని వంశీయులు ఉత్తర దేశమునుండి ఆంధ్ర దేశమునకు తరలివచ్చి ఇచట స్థిరనివాస మేర్పరచుకొని క్రమముగా తెలుగువారితో కలసిపోయిరి. ఎన్నో తరములకు పూర్వమీ దేశమున స్థిరపడక పోయినచో శుద్ధదేశీయ నామములు పెట్టుకొనుటగాని, ఆచారములను అలవరచుకొనుటగాని అసంభవము. కనుక కవి చెప్పిన అనుగురాజు పలనాటి సంపాదనము, అతని కడ దొడ్డ నాయుడు, బ్రహ్మనాయుడు మొదలగువారు రాజకీయోద్యోగులుగ నుండుట నిజము. కాని అనుగురాజే మొదట ఆంధ్ర దేశమునకు వచ్చిన హైహయరాజని అతనికడ తెలుగు వారు ఉద్యోగము చేయుచుండిరని చెప్పిన అంశములు కేవలము కట్టుకథలు.

అనుగురాజు పూర్వీకులు ఉత్తరదేశమునుండి ఆంధ్రదేశమునకు ఎప్పుడు వచ్చిరో, పలనాట వారి పరిపాలన ఎప్పుడు ప్రారంభమైనదో తెలియుటలేదు. హైహయులు తాము కార్తవీర్యార్జునుని సంతతివారమని శాసనములందు చెప్పుకొనిరి. మొదట వీరి రాజధాని పాలమాచాపురి. దీనికి మరొకపేరు జంభనాపురి. ఇది నేటి మధ్యప్రదేశ్‌లోని జబల్‌పూర్ కావచ్చును. జబల్‌పూర్ నుండి నాగపూర్

వరకు గల ప్రాంతము చేది దేశము. వీరా చేది దేశమును పాలించి యుండిరి. అంతేకాక చాళుక్యుల కాలమున కొంకణ దేశమునుకూడ పాలించుచుండిరి. కాని వీరు పరరాజుల దండయాత్రలకు తట్టుకొనలేక ఉత్తర దేశము నుండి ఆంధ్ర దేశమునకు తరలి వచ్చి పశ్చిమ చాళుక్యులకు సామంతులుగ కోనసీమ యందు, పలనాడు నందు స్థిరపడిరి. కోనసీమను హైహయులు క్రీ.శ. 1128 నుండి 1209 వరకు పరిపాలించినట్లు శాసన ప్రమాణములున్నవి. కాని పల నాటిని హైహయులు ఎప్పుడు పరిపాలింప మొదలిడిరో తెలుసుకొనుటకు తగిన ఆధారములు లేవు. ఈ పలనాటి పరిపాలకులైన హైహయులే 'పలనాటి వీర చరిత్రము' నందలి పలనాటి వీరులు.

ఈ గాథ క్రీ.శ. 12 వ శతాబ్దమున జరిగినది. క్రీ.శ. 11వ శతాబ్ది చివరి భాగమున వేగి దేశము, వెలనాడు, పాకనాడు, కమ్మనాడు, అను విభాగములుగ విభజింపబడియుండెను. క్రీ.శ. 12 వ శతాబ్దమున ఆంధ్ర దేశమును, పశ్చిమ చాళుక్యులను తరిమి, వెలనాటి చోళులు ఆక్రమించుకొనిరి. వీరిలో ప్రఖ్యాతి గాంచిన రాజు మొదటి గొంకరాజు. ఇతడు క్రీ.శ. 1076–1108 వరకు పరి పాలించెను. ఇతడు మొదటి కుళోత్తుంగ చక్రవర్తికడ సేనాధిపతిగ నుండి, వెల నాటిని సంపాదించెను. కుళోత్తుంగుని తరువాత రాజులు సమర్థులు కాకపోవుటచే, వేంగి దేశాధిపత్యమును వెలనాటి వారికే కట్టబెట్టిరి. గొంకరాజు పుత్రుడైన మొదటి వెలనాటి చోడుని కాలమున వీరు ఆంధ్రదేశాధిపతులైరి.

క్రీ.శ. 1118 ప్రాంతమున కాంచీపుర పాలకుడైన కులోత్తుంగ చోడుడు మరణించి, విక్రమ చోడుడు సింహాసన మధిష్ఠించుట తోడనే, కళ్యాణి చాళుక్య ప్రభువు ఆరవ విక్రమాదిత్యుడు వేంగీ దేశమును స్వాధీన పరచుకొని, తన సామంతులకు, దండనాయకులకును పరిపాలనాధికారము నిచ్చెను. వీరిని కాంచీ పుర చోళులు, వెలనాటి చోళులును కలసి తరిమి తామాక్రమించుకొనిరి.

వెలనాటి చోడుని కుమారుడైన రెండవ గొంకరాజు పరాక్రమశాలి. ఇతడు క్రీ.శ. 1132–1163 వరకు పరిపాలించెను. ఇతని తరువాత, ఈతని కుమారుడగు రెండవ వెలనాటి చోడుడు క్రీ.శ. 1163–80 ల మధ్య, ఆంధ్ర దేశమును పరి పాలించెను. ఇతని తరువాత పరిపాలించిన మూడవ గొంకరాజు సమర్థుడు కాక పోవుటచే, అంతవరకును వెలనాటి చోళుల ఆధిపత్యమును గుర్తించిన పెక్కు మంది సామంత మండలేశ్వరులు స్వాతంత్ర్యమును ప్రకటించుకొని, స్వతంత్ర రాజ్యాధిపతులైరి. తూర్పు చాళుక్యులు, కాలచుర్యులు, కాకతీయులు స్వతంత్రులైరి. వెలనాటిని కూడ కాకతి రుద్రదేవుడు జయించుటకు దండెత్తెను. వెలనాటి చోడుల ఆధిపత్యము క్షీణ దశకు వచ్చెను. మూడవ గొంకరాజు కుమారుడైన పృథ్వీశ్వరునితో వెలనాటి రాజ్యమంతరించెను. క్రీ.శ. 1225 ప్రాంతము నాటికి కాకతీయులు ఆంధ్ర దేశాధిపతులైరి.

మూడవ గొంకరాజు సమర్థుడు కాకపోవుటచే, పెక్కు సామంత రాజ కుటుంబములు సామంత రాజ్యములను స్థాపించినవి. ఇందు చాగి వారు, కోట వంశీయులు, హైహయులు, కమ్మనాయకులు మొదలగువారు ముఖ్యులు.[4] వీరందరును తమలో తాము కలహించుకొనుచునే యుండిరి. ఈ సామంత రాజులలో హైహయులు పలనాటి సీమను పరిపాలించిరి. వీరి కుటుంబ వైరమే పలనాటి యుద్ధగాథగా నిలచినది.

హైహయరాజులు పలనాటికి ఎప్పుడు పరిపాలకులైరో తెలిసికొనుటకు మనకు ఆధారములులేవు. అసలు పలనాటి యుద్ధము క్రీ.శ. 12 వ శతాబ్ది చివరి భాగమున జరిగెననియే తప్ప, ఏల జరిగెను? ఎవరి నడుమ జరిగెను? ఆ యుద్ధమున పాల్గొనిన రాజులెవ్వరు? అను విషయములు స్పష్టముగ తెలిసికొనుటకు ఈ గ్రంథమును, ఒకటి రెండు శాసనములును, Local Records తప్ప ఆధారము లంతగా లభించుట లేదు.

పలనాటియందు గల వీరి శాసనముల వలన క్రీ.శ. 11వ శ. ఆరంభమున చాగి బేతరాజు, క్రీ.శ. 1128 ప్రాంతమున బిరుదాంకరుద్రుడు (బేతరాజు), కామరాజు క్రీ.శ. 1147 ప్రాంతమున పలనాటిని పరిపాలించినటుల తెలియుచున్నది. మలిదేవ నలగామరాజులు పలనాటిని పరిపాలించినటుల శాసనము లున్నప్పటికి, అవి ఏనాటివో తెలియుటలేదు.

హైహయులు, క్రీ.శ. 1076 నుండి క్రీ.శ. 1126 వరకు పరిపాలించిన పశ్చిమ చాళుక్య ప్రభువైన త్రిభువన మల్ల విక్రమాదిత్యునకు క్రీ.శ. 1118 సంవత్సరమున జరిగిన వేంగీ దండయాత్రయందు సహాయపడినట్లు తెలియుచున్నది. కనుక క్రీ.శ. 1118 నాటికే హైహయులు పలనాటి పరిపాలకులనుట స్పష్టము. పింగళి లక్ష్మీకాంతముగారు శాసనాధారములనుబట్టి నిర్ణయించిన హైహయుల వంశవృక్షము.[5]




4. ఖండవల్లి లక్ష్మీరంజనము, ఆంధ్రులచరిత్ర - సంస్కృతి, pp. 218-222.

5. హైహయులను పేర్కొను శాసనములు దక్షిణ భారత శాసనముల సంపుటి నెం. 66, 72 లందు గలవు. హైహయులకు సంబంధించిన మరికొన్ని శాసనములు Epigraphic collection, 1916, 1930, 1931, 1933 నందు గలవు.

ఈ అంశముల వలన కామరాజునకు మూడు తరములముందు నుండియే హైహయులు పలనాటి పాలకులైనట్లు తెలియుచున్నది. కామరాజునకు ముందు బహుశః బేతరాజు కాలమున, చందవోలు రాజులు (వెలనాటి ప్రభువులు) పలనాటిని జయించి ఉందురు. అనుగురాజు పృథ్వీశ్వరుని కుమార్తెను వివాహము చేసికొని పలనాటిని అరణముగ గ్రహించెను. ఈ వివాహముతో వెలనాటి చోళులకును, హైహయులకును నడుమగల వైరము సమసి పోయెను.

అనుగురాజు పుత్రులైన నలగామ, మలిదేవరాజులు, వెలనాడు, కళ్యాణ రాజుల కుమార్తెలను వివాహముచేసికొనిరి. నలగామరాజు, వెలనాటి రాజైన మూడవ గొంకరాజు పుత్రికను వివాహము చేసికొనెను. మలిదేవునకు కళ్యాణ పురాధీశ్వరుడైన వీరసోముడు తన పుత్రిక నిచ్చెను. కనుకనే యుద్ధమున నలగాముని పక్షమున హైహయరాజు, మలిదేవుని పక్షమున కళ్యాణ పురాధీశ్వరుడును పాల్గొనిరి.

మలిదేవుని మామయైన కళ్యాణ సోమేశ్వరుడు క్రీ. శ. 1167–1177 సంవత్సరముల నడుమ, కళ్యాణపురము నేలిన కలచురి సోమేశ్వరుడని చారిత్రకుల నిర్ణయము. పలనాటి యుద్ధ కాలమున కితడు లేడు. క్రీ.శ. 1147 సంవత్సర శాసనమునందు వర్ణింపబడిన అనుంగు కామరాజు, నలగామ మలిదేవుల తండ్రి కనుక, ఇతనికి సమకాలికుడైన వెలనాటి రాజు రెండవ గొంకయ. ఇతడు క్రీ.శ. 1126–1161 వరకు రాజ్యము చేసెను. తూర్పు చాళుక్య రాజైన ఇమ్మడి కులోత్తుంగ చోళుడు క్రీ.శ. 1135 సంవత్సరమున పశ్చిమ చాళుక్యులతో పోరి వారిని జయించిన గొంకయను, మహేంద్రగిరి, శ్రీశైల మధ్య ప్రాంతమునకు అధిపతిని చేసెను. ఈ సమయముననే, పశ్చిమ చాళుక్యుల సామంతులుగ నుండి హైహయులు పలనాటిని కోల్పోయి ఉందురు. మరల అనుగురాజు వైవాహిక బాంధవ్యముతో పలనాటిని పొందియుండును. ఇతని కుమారుల వివాహములతో వీరి నడుమ బాంధవ్యము పటిష్ఠమాయెను.

ఈ కావ్యమున వివరింపబడిన ముఖ్యమైన చారిత్రకాంశములు మూడు. 1. అనుగురాజు చందవోలు పృథ్వీశ్వరుని కుమార్తెను వివాహము చేసికొని పలనాటిని అరణముగ గ్రహించుట, 2. కళ్యాణ పురాధీశ్వరుడైన వీర సోముడు తన పుత్రికను మలిదేవునకిచ్చి వివాహము చేయుట, 3. కార్యమపూడి యుద్ధము. నలగామ మలిదేవుల వివాహాంశములు ముందు వివరించుట జరిగినది. ఇంక పలనాటి యుద్ధమెపుడు జరిగినది, ఆ యుద్ధమున పాల్గొనిన రాజులెవరు, యుద్ధ పర్యవసానమేమి, మొదలగు అంశములను పరిశీలింతము.

పలనాటి యుద్ధమే సంవత్సరమున జరిగినది తెలిసికొనుటకు ప్రత్యక్షమగు ఆధారము లంతగా లేవు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, అక్కిరాజు ఉమాకాంతముగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు క్రీ.శ.

1181 వ సంవత్సరమని నిర్ణయించిరి.[6]

క్రీ.శ. 1181 వ సంవత్సరమున రెండవ కుళోత్తుంగ రాజేంద్ర చోళుడు మరణించెను. అతని రాజ్యము కొరకు వారసులలో కలహము చెలరేగెను. ఆ సమయముననే పలనాటి యందు హైహయరాజు కుమారుడైన నలగామునకు అతని సోదరులకు నడుమ యుద్ధము జరిగినట్లు తెలియుచున్నది.[7] పలనాటి యుద్ధమున పాల్గొన్న రాజుల కాలమును బట్టి యుద్ధ కాలమును నిర్ణయింప వచ్చును.

నలగామ రాజు తనకు సాయము రమ్మని ధరణికోటకు దక్షుడైన భీమదేవుడను పృథ్వీశ్వరునకు, వీరప్రతాపునకు, వీరసేనునకు లేఖలు వ్రాసెను. తొమ్మిదివేల కాల్బలమును, ఒక వేయి అశ్వములను, నమ్మదగ్గ నాయకులను ప్రతాపరుద్రుడు పంపించెను. వీరభల్లాణి, మూడువేల బంట్లతో, ఏడువందల యవనాశ్వములతో వచ్చెను. వీరుకాక తమతమ బలగములతో, పాన్గాడ భూపతి, మాళవపతి, బాచిదేవుడు, బంగాళ విభుడు, ఒరిస్సా రాజైన బలదేవ పురుషోత్తముడు, కల్యాణి ఘూర్జరపతులు, ఉజ్జయిని పాలకుడైన మహదేపవాసుడు, ద్రావిడ, కేరళ రాజులు, పద్మసేనుడు, సింధురాజు శివకీర్తి, సానిపోతమరాజు, ప్రగడ గుండమ దేవుడు, గొబ్బూరి రాజు మొదలైన వారు నలగాముని పక్షమున యుద్ధము చేయుటకు వచ్చిరి.[8] యుద్ధమును నివారించుటకు నలగాముని పక్షమున కోట కేతన్న బ్రహ్మనాయునితో రాయబారము నెరపెను.

యుద్ధమున ప్రత్యక్షముగ, పరోక్షముగ పాల్గొనిన రాజులలో ఖ్యాతిగాంచిన రాజు కాకతి ప్రతాపరుద్రదేవుడు. కాకతీయులలో ఇరువురు ప్రతాపరుద్రులు కలరు. కవి ఏ ప్రతాపరుద్రుడు నలగామునకు యుద్ధమున తోడ్పడెనో స్పష్టముగ తెలుపలేదు. ఒక ప్రతాపరుద్రుడు 1140 మొదలు 1196 వరకు పరిపాలించిన రుద్రదేవమహా రాజు. మరియొక ప్రతాపరుద్రుడు క్రీ.శ. 1296 నుండి 1323 వరకు పరిపాలించిన రెండవ ప్రతాపరుద్రుడు. రుద్రమదేవి దౌహిత్రుడు. ఈ ఇరువురిలో నలగామునకు సహాయమొనర్చినది ఏ ప్రతాపరుద్రుడను సంశయము వచ్చును. కవి వర్ణించిన రాజు లలో ధరణికోట నేలు భీమన, కోటకేతన్న కలరు. ధరణికోట వంశమునకు కోట వంశమని పేరుకలదు. ఈ కోటవంశమున భీమరాజు, కేతరాజు పేర్లతో తండ్రి కొడుకుల జంటలు రెండు కలవు. మొదటి జంటలో కేతరాజు క్రీ.శ. 1153 వ సంవత్సరమున మరణించెను. క్రీ. శ. 1159 లో రాజ్యమునకు వచ్చిన ప్రతాపరుద్రున కితడు సమకాలికుడు కాడు. ఈ కేతరాజు కుమారుడు భీమరాజు.

6. పలనాటి వీర చరిత్ర పీఠిక, లక్ష్మీకాంతముగారు, బాలచంద్రుని యుద్ధము పీఠిక, ఉమా కాంతముగారు.

7. G. Yazdani, The Early History of Deccan, p. 593.

8. పలనాటి వీరచరిత్ర, కల్లు ప్రతిష్ఠ, pp. 344-346.

ఇతడు క్రీ.శ. 1153 లో రాజ్యమునకు వచ్చి 1182 వరకు పరిపాలించెను. ఆ సంవత్సరమే అతని కుమారుడు రెండవ కేతరాజు పట్టాభిషిక్తుడయ్యెను. రెండవ జంటలోని వారైన ఈ భీమరాజు, కేతరాజులు మొదటి ప్రతాపరుద్రునకు సమకాలికులు. కనుక మొదటి ప్రతాపరుద్రుడే నలగామునకు సహాయ మంపిన కాకతి ప్రతాపరుద్రుడు. మొదటి ప్రతాపరుద్రుడు దిగ్విజయ యాత్రలు చేయుచు క్రీ.శ. 1182 వ సంవత్సరమున ధరణికోటను వశపరచుకొని రెండవ కేతరాజును సామంతునిగ చేసుకొని, ఆతనిని పట్టాభిషిక్తుని గావించెను. క్రీ. శ. 1182 వ సంవత్సరమున రెండవ కేతరాజు ధరణికోటకు ప్రభువాయెను. అంతవరకు అతని తండ్రి రెండవభీమరాజు రాజ్యము పాలించుచుండెను. ఈతని కాలమునే పలనాటి యుద్ధము జరిగెను. ఈతని పరిపాలనా కాలము క్రీ.శ. 1153–1182. కవి 'ధరణికోట పురికి దక్షుడైనట్టి భీమదేవుండును' అనుటచే పలనాటి యుద్ధము క్రీ.శ. 1181–1182 ల నడుమ జరిగినదనుట స్పష్టము. యుద్ధకాలమునాటికి భీమదేవుడు ధరణికోటను పాలించుచుండెననుట స్పష్టము. క్రీ.శ. 1182న రెండవ కేతరాజు రాజాయెను. కనుక నలగామునకు సాయపడినది మొదటి ప్రతాపరుద్రుడనుట స్పష్టము. ఈ ముగ్గురురాజుల కాలము ననుసరించి పలనాటి యుద్ధము క్రీ.శ. 1181లో జరిగెననుట స్పష్టము.

ఈ గ్రంథమున వీరభల్లాణుని ప్రసక్తి కలదు. ఇతడు హొయసల పరిపాలకుడైన రెండవ వీరభల్లాణుడై ఉండును.[9]

తక్కిన రాజుల విషయము లేవియు తెలియుటలేదు. ఇక పలనాటి చరిత్రలోని వీరులను గూర్చి వీర నారులను గూర్చి తెలుసుకొందము.

**అనుగురాజు :**

పలనాటి వీరగాథకు మూలపురుషుడైన ఈతని చరిత్ర ముందుగ చెప్పుట జరిగినది.

**నలగాముడు :**

అనుగురాజునకు మైలమదేవి వలన కలిగిన పుత్రుడు. గురజాలకు ప్రభువు. నాయకురాలి మాటలు విని, సోదరులైన మలిదేవాదులను, మంత్రి బ్రహ్మనాయని దూరము చేసికొనెను. నాయకురాలి చేతిలో కీలుబొమ్మ యయ్యెను. తనకు తెలియక అమెమిచేసినను పట్టించుకొనక తన చేతగాని తనముతో, యుద్ధమునకు, తత్ఫలితముగ వంశనాశనమునకు, బంధునాశనమునకు కారణభూతుడాయెను. నాయకురాలు విషప్రయోగమున తన అల్లుని చంపించినపుడు సహితము అమెను వారింపలేని అసమర్థుడాయెను. కనీసమీతనికి యుద్ధోద్ద

9. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 193.

త్యమును లేదని చెప్పవచ్చు. బ్రహ్మనాయనితో యుద్ధముచేయలేక రెండుమారులు రణరంగమునుండి పారిపోయెను. నాయకురాలికిగల సాహసమున నగమైనను నలగామునకు లేకపోవుట విచారింపదగ్గ అంశము. కవి నలగాముని పాత్రనీ విధముగ సృష్టించుటకు కారణము బ్రహ్మనాయని పాత్రకు విశిష్టత నాపాదించుటకే అని పించుచున్నది.

**మలిదేవుడు :**

మాచర్లకు ప్రభువు. నలగామునకు సవతి సోదరుడు. ఇతడు మాచర్లకు రాజగుటకు కారణము బ్రహ్మనాయడు. మలిదేవుని పెంచి పెద్దచేసి కల్యాణ సోమేశ్వరుని పుత్రికనిచ్చి వివాహముచేసి రాజ్యాభిషిక్తుని చేసినది బ్రహ్మన. మలిదేవుడు పేరునకు మాత్రమేరాజు. సర్వకార్యములు బ్రహ్మనాయుడే చేసెను. కాని నలగాముని వలెకాక మలిదేవుడు రాజకార్యములందు పాల్గొనుచుండెను. కాని ఈతనికి ఈగ్రంథమున ప్రాముఖ్యమేమిలేదు. అనాటి ప్రజల దృష్టిలో బ్రహ్మనయే ప్రభు వనుట స్పష్టమగుచున్నది.

నరసింగరాజు :

నలగాముని తమ్ముడు. ఈ గ్రంథమున ఈతని కేమియు ప్రాముఖ్యము లేదు. కేవలము భీరువుగ వర్ణింపబడినాడు. బాలుడైన బాలచంద్రుని ధాటికాగలేక అన్నకడకు పారిపోయిన పిరికివాడు. ఈతనికి వ్యక్తిత్వమేమియులేదు.

ఝుట్టిరాజు, పెరుమాళ్ళరాజు, కామరాజు, పినమల్ల బాలమల్లదేవులకు ఈ గాథలయందు ప్రాముఖ్యములేదు.

**దొడ్డ నాయడు :**

రేచర్ల బేతినాయని కుమారుడు. అనుగురాజు మంత్రి. ఇతనికి పెద్దన, బ్రహ్మనాయడు, పేర్నీడు, సూర్నీడు, మల్లినీడు అను పుత్రులు కలిగిరి. ఇతడు పలనాటి యుద్ధమునకు ముందేమరణించెను. ఇతని తరువాత తన రెండవ కుమారుడైన బ్రహ్మనాయడు అనుగురాజునకు మంత్రిత్వము నెరపెను.

పెద్దన :

అనుగురాజునకు మొదట సంతానము లేకపోవుటచే పెద్దనాయని పెంచుకొనగా తన ముప్వురు రాణులకు సంతానము కలిగెను. పెద్దనాయని వివాహమునుగూర్చిన ఒకగాథ కలదు.[10] ఈతనికి హయారూఢరేవంతుడను బిరుదము కలదు. పలనాటి వీరులలో సుప్రసిద్ధుడు.

10. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, pp. 198-200.

బ్రహ్మనాయుడు :

వెలమ కులజుడైన రేచర్ల దొడ్డనాయనికి శీలమ యందు జన్మించెను. బ్రహ్మ నాయుడు మహావీరుడు. రాజకార్యధురంధరుడు. పలనాటి వీరులకు మంత్రి. వైష్ణవ మతావలంబి. వైష్ణవమతమును పలనాటిలో వ్యాపింపచేసి ప్రసిద్ధుడయ్యెను. ఇతడు కులవ్యవస్థను పాటింపలేదు. అన్ని వర్ణములవారిని వైష్ణవులను గావించి సహపంక్తి భోజనములు చేసినట్లు పలనాటి వీరచరిత్ర పేర్కొనినది.[11] మాలలకు సహితమీతడు వైష్ణవమతమిప్పించి, సభలలో గౌరవించుటయే కాక, తనతోడి సహపంక్తి భోజనమును కూడ కలుగచేసెను. బ్రాహ్మణుడైన అనపోతరాజు, వెలమకులస్థుడైన దొర్నీడు, చాకలి చందన్న, కుమ్మరి తేర్కుడు, కంసాలి చందన్న, మంగలి వనితకు జన్మించిన మంచన్న అను బాలురను బహ్మనాయుడు తన పుత్రుడైన బాలచంద్రునితోపాటు పెంచెను. వీరు పెంచిన బిడ్డలుకాక బ్రహ్మనాయని పుత్రులె అనిపించుచున్నది. వీరందరు విష్ణువరప్రసాదులు. బ్రహ్మన మాలయైన కన్నమ నాయని వైష్ణవునిగ చేసి జ్యేష్ఠపుత్రునివలె పెంచుకొనెను.

వైష్ణవులానాడు జాతిభేదము పాటించెడివారు కాదనుటకు మాడుగుల రెడ్డి కావించిన విందుభోజనము నిదర్శనము. బ్రహ్మనాయుడు ఇట్టి పెక్కు సంస్కరణలు చేసి సంఘసంస్కర్త అయ్యెను. పెక్కుమందీతనిని వైష్ణవమత మిప్పింపుమని కోరెడివారట.

బ్రహ్మనాయుడు మహిమాన్వితునిగను, విష్ణ్వాంశ సంభూతునిగను, విష్ణువు యొక్క అవతారమూర్తిగను ఈ గ్రంథమున పలుతావులందు వర్ణింపబడినాడు. ఇతడు చేసిన అత్యద్భుతమైన పెక్కు చర్యలు పలనాటి చరిత్రలో పెక్కుచోట్ల వర్ణింపబడినవి.[12] కన్నమనాయడు, శీలమ్మ మొదలగువారు బ్రహ్మనాయుని విష్ణువు యొక్క అవతారమూర్తిగా భావించిరి. బ్రహ్మనాయనికి పలుమారులు విష్ణువు ఆదిగాగల దేవతలు ప్రత్యక్షమైరని ఈ కావ్యమున పలుతావులందు గలదు.[13]

బ్రహ్మనాయుడు వైష్ణవమతావలంబి అగుటచే నిదుర మేల్కాంచిన వెంటనే

"కాలోచితములైన కర్మలు తీర్చి
తిరుమంత్ర పఠనముతో తిరుమణి హత్తి
కనుదోయి మోడ్చుచు కరములు మొగిచి
ఆదినారాయణు నాత్మ చింతించి

11. పలనాటి వీరచరిత్ర, p. 123.

12. పలనాటి వీరచరిత్ర, pp. 123, 192, 193, 194, 195.

13. పలనాటి వీరచరిత్ర, pp. 228-525.

పరగు మహాస్తోత్రపాఠంబు చేసి"[14]
తరువాతనే తక్కిన పనులు చేసెడివాడు.

బ్రహ్మనాయుడు మాతృభక్తి పరాయణుడు. ఏ కార్యము తలపెట్టినను మొదట తల్లి అనుజ్ఞ గైకొనెడివాడు. తల్లి శీలమ ఈతనికి గురువు. శీలమ ఎవరెవరిని ఎట్టి వేళలందు సంహరింపరాదో, ఏఏ కార్యములొనర్చిన ఎట్టి ఫలితములు కలుగునో, ఎట్టి దోషములంటునో మొదలగు అంశములను బ్రహ్మనాయునికి బోధించెడిది.[15]

బ్రహ్మనాయునికి స్త్రీలను, శరణు వేడినవారిని చంపరాదను నియమము గలదు. కనుకనే రణరంగమునుండి పారిపోయిన నలగాముని విడిచిపుచ్చెను. కదనమున నాగమ్మను చంపక ఆమె అశ్వమును మాత్రమే కూల్చెను.[16]

బ్రహ్మనాయుడు వైష్ణవ మత ప్రచారము కొరకు తన జీవితమును ధార పోసెను. ఇతడు వైష్ణవ మతావలంబియైనప్పటికి శైవమత సహిష్ణువు. ఇతడు శ్రీశైలమున కేగి మల్లికార్జునుని పూజించెను. త్రిపురాంతకమున మహదేవుని మ్రొక్కెను.[17] ఇతనికి వైష్ణవ మతావలంబులవలె శివుడనిన నిరాదరము లేదని ఈ అంశము స్పష్టపరచుచున్నది. ఇటుల కవులు బ్రహ్మనాయుని గుణగణములను వర్ణించి, నీలవర్ణుడు, నీలబోదరుడు మొదలగు నామము లాతని కన్వయించి అవతార పురుషునిగ వర్ణించిరి.

పామర జనులలో చారిత్రక పురుషులు అవతారపురుషులుగా మార్పుచెందుట సహజముగ కన్పడుచున్నది. కనుకనే ప్రజలు బ్రహ్మనాయుని మహానుభావునిగ ఆరాధించిరి. విష్ణుభక్తుడైన బ్రహ్మన విష్ణుని అవతారమే అయినాడు. వీరపూజా పరులైన ఆంధ్రులకు వీరమూర్తియైనాడు.

కాని ఎంతటి సద్గుణమూర్తికిని కొన్ని దుర్గుణములుండుట సహజము. ఈతడు తన స్వప్రయోజనముకొరకు నాయకురాలి మాటలకు లొంగిపోయిన అనుగు రాజును చంపించెనని తెలియుచున్నది.[18] అంతేకాక రాయబారిగ నేగిన అలరాజునకు ప్రాణాపాయము కలుగకుండ బ్రహ్మన తులసిమాల నిచ్చెననియు, అలరాజు తల్లితండ్రులు వీరశైవులగుటచే, బ్రహ్మన దురాలోచన చేసి తులసిమాలను మాయోపాయమున గొనిరమ్మని కుమారుడైన బాలనాయని పంపి తెప్పించెననియు

14. పలనాటి వీరచరిత్ర, pp. 127-128.

15. పలనాటి వీరచరిత్ర, pp. 227-228.

16. పలనాటి వీరచరిత్ర, pp. 527-528.

17. పలనాటి వీరచరిత్ర, p. 61.

18. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 202.

తెలియుచున్నది.[19] రాజకీయము లందిట్టి కార్యములు చేయించుట, చేయుట ఆశ్చర్యకరమైన విషయము కాదు.

ఈతని గుణగణము లెట్టివైనప్పటికి బ్రహ్మనాయుడు ఆనాటి ప్రజా హృదయములందు శాశ్వతముగ నిలచిపోయిన వీరపురుషుడు. విప్లవవాది, సంఘ సంస్కర్త, మతప్రవక్త. ఈతని గూర్చిన చారిత్ర కాధారములు తక్కువగనే ఉన్నవి. పలనాటి విప్లవని ఖ్యాతిగన్న బ్రహ్మనాయుని గూర్చి ఆధారములు లేకపోవుట వింతయే.

నాగమ్మ :

జిట్టగామాలపాడను గ్రామమున చౌదరి రామిరెడ్డను బీదరైతునకు తన పొలముకడ దొరికిన బిడ్డ నాగమ్మ. నాగమ్మతోపాటుగా అతని కా భూమిలో ధనము లభించి భాగ్యవంతుడాయెను. రామిరెడ్డి ఆమె నొక ధనికుని కిచ్చి వివాహము చేసెను. కాని వివాహమైన కొలదికాలమునకే నాగమ్మ తండ్రి, భర్త కూడ మరణించిరి. వారి ధనమంతయు ఈమెకు ప్రాప్తించి ఆ ప్రాంతమున ప్రముఖురాలిగా పరిగణింపబడెను.

ఎట్లో అనుగురాజు అనుగ్రహము సంపాదించి నాయకురాలను బిరుదు వహించి, తన నేర్పుచేత అనుగురాజునకు, మంత్రియైన దొడ్డనాయనికి నడుమ వైరము కల్పించెను. దొడ్డనాయడు తన మంత్రి పదవిని రెండవ కుమారుడైన బ్రహ్మనాయని కిచ్చి తాను వైదొలగెను. నాయకురాలు అనుగురాజుకడ పల్నాటి ప్రభువులకడ ఏడు గడియలు మంత్రిత్వము నెరపుటకై పత్రమును తీసుకొనెను.

బ్రహ్మనాయుడు మంత్రియైన కొలది దినములకు అనుగురాజు మరణించెను. బ్రహ్మనయే అతనిని చంపించెనన్న ప్రవాదము గలదు.[20]

బ్రహ్మనాయనిపై వైరము పూనిన నాయకురాలు అదనుకై వేచివుండి, వేట కేగిన నలగామునకు అతిధి సత్కారములను నెరపి అతని అనుగ్రహమును సంపాదించెను. కొన్ని దినముల తరువాత గురజాల కరుదెంచి నలగామునకు అతని తండ్రి యిచ్చిన పత్రమును చూపెను. తండ్రి కోరిక ప్రకారము నలగాముడు నాగమ్మను మంత్రిని చేసెను. నాగమ్మ మంత్రి పదవిని చేజిక్కించుకుని నలగాముని కీలుబొమ్మను చేసి అన్నదమ్ముల నడుమ వైరమును కల్పించెను. ఆ వైరము పలనాటి యుద్ధముగ పర్యవసించినది. బ్రహ్మనాయుడు అన్నదమ్ముల నడుమ వైరమును బాపుటకు ఎంత ప్రయత్నించినను నాయకురాలు పడనీయలేదు. తుదకు యుద్ధము తప్పలేదు. నలగాముడు నాయకురాలికి సంపూర్ణముగ వశవర్తియైనట్లు

19. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 209.

20. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 202.

ఈ గ్రంథమువలన తెలియుచున్నది. రాజకార్యములన్ని ఆమెపై విడచి, ఆలోచన యన్నదిలేక నాగమ్మచేతి కీలుబొమ్మ అయ్యెను నలగాముడు.

నాగమ్మకు బ్రహ్మనాయుడనిన వైరమేలనో సంపూర్ణముగ తెలియుటలేదు. ఈ గ్రంథమున

"స్త్రీయని తలపోసి శీలము బ్రహ్మ
చులకన చేయగా"[21]
"......చూచి రోషించి
పగపట్టె నాగమ్మ పాము చందమున"[22]

అని కారణము చెప్పబడినది. స్త్రీయని చులకన చేసినందులకే ఒక రాజవంశ క్షయమునకు, పెక్కుమంది వీరుల మరణమునకు కారణమైన నాగమ్మ అభిజాత్యము అనిర్వచనీయము. బ్రహ్మనపై పగ హైహయ వంశక్షయమునకు కారణమగుట విచిత్రము. సరియైన రాజకీయావగాహన, బ్రహ్మన వ్యక్తిత్వము పట్ల నిశితమైన పరిశీలన లేక, నాగమ్మ అన్నదమ్ముల నడుమ కలహమును సృష్టించి, పర్యవసానముగ సంభవించిన కారెమపూడి యుద్ధమున ఓటమి అంగీకరింపవలసి వచ్చెను. తన్నవమాన పరచిన బ్రహ్మనాయనిపై పగ సాధించుటకై, మహాయుద్ధము సంభవించినప్పటికి వెనుదీయక తన ప్రయత్నమును కొనసాగించుట, తన్నవమాన పరచిన అలరాజును నలగాముని అల్లుడైనప్పటికీ చంపించుట, పగసాధించుట యందీమెకు గల పట్టుదలకు తార్కాణములు.

అపజయము తనను వరించినప్పటికి రణరంగమున
"అడుదాన ననుచు నాలస్యమేల
కనిపాడువు నాయుడ కదలక నీవు"[23]

అని బ్రహ్మనాయని కవ్వించి కదనానికి కాలుదువ్విన వీరవనిత.

ఈమె మంత్రి పదవిని గ్రహించుటకు, బ్రహ్మనాయనిపై పగ పూనుటకు సరియైన కారణము లీగ్రంథమున తెలుపబడలేదు. ఈమె శైవ మతావలంబిని. ఈమె పరమత ద్వేషమే యుద్ధమునకు మూలకారణమని మనమూహింప వచ్చును. కారణమేదైనప్పటికి కారకురాలు నాగమ్మ.

**బాలచంద్రుడు :**

బ్రహ్మనాయునకు ఐతమయందు విష్ణువరప్రసాదమున బాలచంద్రుడు జన్మించెను. ఇతని భార్య మాంచాల. ఈతడు తండ్రివలె మహావీరుడు. చిన్నతనముచేతను, వేశ్యా లోలత్వము చేతను బాలచంద్రుడు మొదట రాజకార్యములందు పాల్గొనక,

21. పలనాటి వీరచరిత్ర, p. 42.
22. పలనాటి వీరచరిత్ర, p. 42.
23. పలనాటి వీరచరిత్ర, p. 528.

భార్యకడ కేగక ఆటపాటలతో కాలము గడపుచుండెను. బొంగరము లాడుచుండగా ఆ బొంగరము అన్నమ్మ అను వేశ్యకు తగిలి ఆమె మందలింపగా తన పొరపాటును తెలిసికొని, భార్యకడకేగి ఆమె ప్రోత్సాహానుమతులతో కదనరంగమునకేగి వీర మరణమును చూరగొనిన బాలవీరుడు.

తల్లి ఐతాంబ రణరంగమున కేగవలదని బ్రతిమాలగా 'ప్రాకృతభామల పగిది బల్కెదవు, వైరితనంబేల వీరుని సతివి' అని వీరధర్మమును పల్కి,

"కాయమనిత్యంబు కల్మి హుళక్కి
జలబుద్బుదములట్లు సత్యంబుగాను
షట్చక్రవర్తులు సకల భూపతులు
చనిరి బ్రహ్మేంద్రాది సర్వదేవతలు
భూతలంబులైదును పొలియుచునుండి"[24]

అని వేదాంతమును బోధించి, వీరులైనవారు పుణ్యభూముల కేగెదరని తల్లికి నచ్చ చెప్పి రణరంగమున కేగిన ధీరుడు.

ఎంతటి వీరుడైనప్పటికి బాలచంద్రుడు చంచల హృదయుడు, ఆవేశపరుడు. తల్లి పనుపున భార్యయైన మాంచాల కడకేగి ఆమె సౌందర్యమునకు అబ్బురపడి, తన వేశ్యాలోలత్వమునకు విచారించి యుద్ధ ప్రసక్తిని విరమించుకొనుట బాల చంద్రుని మానసిక దౌర్బల్యమును తెలుపుచున్నది. తుదకు స్నేహితుల హెచ్చరి కతో, భార్య ప్రోత్సాహముతో రణరంగమున కేగి వీర మరణము పొంది ఖ్యాతి గడించెను.

రణరంగమున తనను వారించిన తండ్రిని గాంచి "పిన్నవాడని నన్ను బెద రించకయ్య, పిడుగు చిన్నదికాదె భేదించు కొండ" అని పలికి —

"నవ్య వ్రతోత్సాహ సాహసులార
నిర్మల గుణయుక్త నిశ్చలులార"

అని వీరులను సంబోధించి, బ్రతుకుపై ఆశ పారద్రోలి పిరికితనము మరచి, లోభ మోహములను విడచి యుద్ధమునకు అయత్తము కమ్మని ప్రోత్సహించి 'బ్రహ్మన్న కెదురైన పగతులు లేరు, అటువంటి బ్రహ్మన్న కనుగుపుత్రుడను, భీతిచే పగరకు బెదరను నేను' అని శౌర్య విభవమును వెలార్చిన పలుకులు పలికి వీరులందరను యుద్ధమునకు సన్నద్ధులను చేసిన బాలచంద్రుని మించిన వీరులు లేరనుట అతిశ యోక్తి కాదు.

బాలచంద్రుడెంతటి పరాక్రమవంతు డైనప్పటికీ ఆవేశపరుడు. ఆలోచన హీనుడు. ఆలోచనలేని ఇతని ఆవేశమే యుద్ధముగ పర్యవసించినది. పలనాటి యుద్ధ మునకు అగ్నిని రగిల్చినది నాయకురాలు కాగా అజ్యము పోసి ప్రజ్వరిల చేసినది

24. పలనాటి వీరచరిత్ర, p. 389.

బాలచంద్రుడు. నాగమ పంపిన రాయబారమునకు ఒడంబడి బ్రహ్మనాయుడు సంధి కుదుర్చుకొనెను. ఆ సమయమున బాలచంద్రుడు వచ్చి, సంధి జరుగుటకు వీలులేదని ఆవేశముతో పలికి ఎవ్వరు యుద్ధమునకు రాని యెడల తానొక్కడేపోయి శత్రువులను జయించెదనని పలికెను. బాలుని మాటలకు ఉప్పొంగి బ్రహ్మనాయుడు రాయబారులను పంపివేసి యుద్ధసన్నద్ధుడాయెను. ఇటుల కుదిరిన సంధిని పాడుచేసి అందరిని యుద్ధోన్ముఖులను గావించి హైహయ రాజవంశ సర్వ నాశనమునకు కారణమయ్యెను.

నలగాముని తమ్ముడైన నరసింహుని శిరమును ఖండించి సభలోనికి తెచ్చిన బాలచంద్రుని చూచి నిందించిన బ్రహ్మనాయుని తండ్రి అనియైనా తలంపక బ్రహ్మనాయుడు చేసిన దుష్కార్యములను ఎత్తిచూపి, దూషించిన వీరుడు బాలచంద్రుడు. బ్రహ్మనాయుడు తనను 'విమతులకు వెన్నిచ్చి వచ్చిన నీవంటి వీరుడను గాను' అని పలుక బాలచంద్రుడు కోపముతో మరల కదనరంగమునకేగి శత్రువులతో పోరాడి సోదరులతోకూడ మరణించెను.

బాలుడైనప్పటికి ప్రళయకాల రుద్రునివలె విజృంభించి యుద్ధము చేసిన బాలచంద్రుని రణ కౌశలమును వర్ణింప బ్రహ్మకైనను తరము కాదని కవియైన శ్రీనాథుడే తెల్పెను. ఇందతిశయోక్తులున్నప్పటికి బాలచంద్రుడు పలనాటి వీరులందరిలో మహావీరుడనుట నిస్సంశయము.

తప్పులు చేయుట మానవ సహజము. చేసిన తప్పును దిద్దుకొనుట గొప్పతనమునకు లక్షణము. బాలచంద్రుడు తాను చేసిన పొరపాటు గ్రహించుకొని జీవితమును చక్కదిద్దుకొన నిశ్చయించుకొనిన తరుణమున మృత్యువు వాతపడిన దురదృష్టవంతుడు. బాలచంద్రుని దొక విలక్షణమైన పాత్ర.

అలరాజు :

కల్యాణ పురాధీశ్వరుడైన వీరసోముని మనుమడు. నలగాముని అల్లుడు. కొమ్మరాజు పుత్రుడు. క్రీ.శ. 1165 సంవత్సరము నుండి 1176 వరకు కల్యాణ నగరమును పరిపాలించిన కలచురి సోమేశ్వరుని కుమారుడు కొమ్మరాజని ఉమాకాంతముగారు తెల్పిరి. కొమ్మనాయకుడను నాతనిని పేర్కొను శాసన మొకటి అమరావతి యందు గలదు.[25] పలనాటి వీర చరిత్రమున ఈతని పాత్రయును ప్రధానమైనదే. కాని ఈతని గూర్చిన చారిత్రకాంశములు లభించుట లేదు. అలరాజు బ్రహ్మనాయని పనుపున నలగాముని కడకు రాయబారిగ నేగెను. నాయకురాలి మాటలను విని రాయబారమునకు నలగాముడు అంగీకరింపక పోవుటచే, నాయకురాలి దుస్తంత్రమును గ్రహించి ఆమెను నిందించిన కారణమున ఆమె కోపమునకు పాత్రుడై, ఆమె విషప్రయోగము చేయించగా అకాలమున

25. డా॥ బి. రామరాజు, తెలుగు జానపదగేయ సాహిత్యము, p. 167.

మరణించిన వీరుడు. శైవుడు. భారతీయ యుద్ధచరిత్రములలో రాజకీయ సీమము ఉల్లంఘింపబడి, వధింపబడిన రాయబారి ఈతడొక్కడే.

మాంచాల :

ఈమె బ్రహ్మనాయుని కోడలు, బాలచంద్రుని భార్య. ప్రథమ సమాగమము నాడే భర్తను ప్రోత్సహించి

"శాత్రవ విజయంబు సమకూరు మీకు
కలియుగమున మీకు ఘనపూజలమరు
ఈ యాయుధము నీకు నిచ్చును జయము"[26]

అని కరవాల మందిచ్చి రతిరాజ సుందరుడైన భర్తను రణరంగమున కంపిన వీరవనిత.

పేరమ్మ :

నలగాముని కుమార్తె. అలరాజు భార్య. భర్త నాయకురాలి కుట్రకు బలియై మరణించగా, అడుదాని చేతిలో కీలుబొమ్మ యైనందుకు తండ్రిని నిందించి, చితిని పేర్పించి భర్త శవముతో సహగమనమును చేసిన వీరవనిత. పతివ్రత. ఈ ఘట్టము పాఠకుల హృదయములను ద్రవీభూత మొనర్చును.

శీలమ్మ :

బ్రహ్మనాయుని తల్లి. ఈ గ్రంథమున ఈమె మహిమాన్వితురాలుగను, సర్వజ్ఞురాలుగను వర్ణింపబడినది. పుత్రుడైన బ్రహ్మనాయునికి గురువు. ఏ ఏ వేళలందే యే కార్యములు చేయవలెనో, ఎవరిని సంహరింపవలెనో మొదలగు విషయముల నీమె పుత్రునకు, స్నేహితులకు బోధించెడిది. మారువేషములలో వచ్చిన శత్రువులను పోల్చుట యందీమె దందెవేసిన చేయి.

వీరు పలనాటి యుద్ధమున ప్రత్యక్షముగను పరోక్షముగను పాల్గొనిన వీరులలో వీరనారులలో ముఖ్యులు. వీరు కాక కొమ్మరాజు, పలినేడు, కన్నమనీడు, గోపన్న మొదలగు వారెందరో పలనాటి యుద్ధమున పాల్గొని వీరస్వర్గమలంకరించిరి.

రాజ కార్యమునకై తమ ప్రాణములను అర్పించిన బాలచంద్రుడు, మాంచాల, అలరాజు, పేరమ్మ, నరసింగరాజు, కొమ్మరాజు, పలినేడు, కన్నమదాసు మొదలైన వీరులందరును పల్నాటి ప్రజాహృదయములందు హత్తుకొని దేవతాంశ సంభూతులైరి. వీరి అద్భుత శౌర్యపరాక్రమములు అనాటి ప్రజలను పరవశులను గావించియుండును. కనుకనే వీరులను వీరనారులను దేవతాంశ సంభూతులను చేసి పూజలు సాగించిరి. కనుకనే తరువాతి శతాబ్దములందు

---

26. పలనాటి వీరచరిత్ర, p. 419.

పలనాటి వీరగాథకు ఆంధ్రదేశమున చాల ప్రాచుర్యము కలిగెనని క్రీ.శ. 15 వ శతాబ్దపు కవియైన వల్లభరాయడు తన క్రీడాభిరామమున—

"ద్రుతతాళంబున వీర గుంభితక ధుంధుంధుం కిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతి గూడన్ ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నౌ
క్కతె ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబు నందూలఁగన్."[27]

పలనాటి వీరుల గాథను ఆనాటి ప్రజలు పాడుకొనెడి వారని వర్ణించెను. తెలుగు నాట నేటికిని వీరారాధన కలదు. ఆంధ్రదేశ మంతటను వీరులకు గుళ్లు కలవు.

ఈ పలనాటి వీరగాథ యందు వర్ణితమైన వీరుల గాథలు తెలుసు కొనుటకు చారిత్రకముగ మనకు ఆధారము లంతగా లభించుట లేదు. కాని కారెమపూడి వీరుల శాసనమని ఒక శాసనము కలదు. ఇది క్రీ.శ. 1445 వ సంవత్సరమున వేయించినది. జీవరక్ష తిమ్మన యను నాతడు కారెమపూడి వీరుల స్మృతి కొరకు ఒక మేడను నిలిపి వేయించిన శాసనమిది.[28] ఇందు కొందరు వీరుల విగ్రహములు చెక్కబడి వానిక్రింద పేరులు చెక్కబడినవి. చారిత్రకముగ పలనాటి వీరులను గూర్చి తెలియుచున్న అంశములివి.

ఈ గాథ యందు నలగామ, మలిదేవ, నరసింగరాజులు తెరవెనుక నున్న పాత్రలు. ఈ అన్నదమ్ముల నడుమ కలహమునకు ప్రత్యక్షముగ కారణమేమియు లేదు. ఈ గ్రంథమందెచ్చటను అన్నదమ్ములు స్వయముగా పోట్లాడు కొని నటుల వర్ణింపబడలేదు. నాయకురాలి దుస్తంత్రముతో అన్నదమ్ముల నడుమ కలహము సంభవించినది. నలగాముని చేతగానితనము యుద్ధమునకు త్రోవ తీసినది. సవతి తమ్ములకు రాజ్య భాగమీయ వలదన్న నాయకురాలి ప్రలోభమునకు లొంగి పోయిన నలగాముని సన్మార్గమున పెట్టి సవతి సోదరులకు న్యాయము చేకూర్ప వలెనన్న సద్వర్తనుడు, నిష్పక్షపాతియునగు బ్రహ్మనాయని ప్రయత్నము విఫల మయ్యెను. బ్రహ్మనాయనికి నాయకురాలికి నడుమ ప్రత్యక్ష వైరమేర్పడెను. ఆనాటి మత సాంఘిక పరిస్థితులు వీరి వైరమునకు తోడ్పడి మహాయుద్ధమునకు దారి తీసినవి. బంధుప్రీతివలననో, స్నేహభావము తోడనో ఇరుపక్షములందు పెక్కు దేశపు రాజులు పాల్గొనిరి. ఆనాడు చిన్నచిన్న రాజ్యముల నడుమ నున్న అంతః కలహములకు పలనాటి యుద్ధమొక నిదర్శనము.

ఈ యుద్ధము వలన కలిగిన అపారమైన జన నష్టముతో రాజుల అహంకార ములు చల్లారినవి. సైనికబలము నన్నగిల్లినది. ప్రజలలో అలజడి చెలరేగినది. ఈ పరిస్థితిని గమనించి సామంత రాజులలో బలవంతులైన కాకతీయులు దిగ్విజయ

27. వినుకొండ వల్లభరాయడు, క్రీడాభిరామము, p. 116.

28. South Indian Inscriptions, Vol. 10, No. 585.

యాత్రలు చేసి సామంత రాజులందరిని ఓడించి ఆంధ్రదేశము నంతటిని వారి పరిపాలన క్రిందకు తెచ్చిరి.

వైష్ణవులైన బ్రహ్మనాయునికి, పరమమాహేశ్వరియైన నాగమ్మకు నడుమ చెలరేగిన ఈ పలనాటి యుద్ధమున శైవవైష్ణవుల పోరాటము ప్రతిఫలించు చున్నది. తెలుగు దేశమును పరాక్రమమునకు ఆలవాలముగను, తెలుగు వీరులను జగదేక వీరులుగ తీర్చిదిద్దినది పలనాటి వీర కథ. బ్రహ్మనాయుని వంశీయులైన పద్మనాయకుల వీరత్వమునకు ఆంధ్రదేశమున ఖ్యాతిలభించినది.

## పలనాటి వీరచరిత్రము—భారతము

పలనాటి వీరచరిత్రకు పల్నాటి భారతమని మరియొక నామము గలదు. ఈ గాథకును మహాభారత గాథకును కొన్ని పోలికలు కలవు. కౌరవ పాండవులు అన్నదమ్ముల బిడ్డలు, పలనాటి వీరులు సవతి తల్లుల బిడ్డలు. దుర్యోధనునకు రాజ్యభాగమును పాండవుల కిచ్చుట ఇష్టములేక భారత యుద్ధము జరిగెను. ఇట నలగామున కిష్టములేక పలనాటి యుద్ధము సంభవించెను.

భారతమున దుర్యోధనుని ప్రేరేపించినది శకుని. నలగామునకు దుర్బోధ చేసినది నాయకురాలు. రెండు గాథలయందు ద్యూతము, అరణ్యవాసము గలదు. భారతమున నిర్జీవ ద్యూతము. శకుని మాయోపాయముతో పాండవులు ఓడిపోయిరి. పలనాటి వీరచరిత్రమున సజీవ ద్యూతము. ఇట నాయకురాలి దుస్తంత్రముతో బ్రహ్మనాయుడు ఓడిపోయెను. భారతమున ఘోషయాత్ర గలదు. ఇందును మందపోటు గలదు.

భారతమునందు దుర్యోధనుని వలెనే ఒప్పందము ప్రకారము రాజ్యభాగము నిమ్మని అడుగవచ్చిన తమ్ములకు మరల రాజ్యము నిచ్చుటకు నలగాముడు నిరాకరించెను. ఫలితము యుద్ధము. సర్వనాశనము.

అన్నదమ్ములలో జ్యేష్ఠుని పుత్రుడు కనుక రాజ్యము తనదనెను దుర్యోధనుడు. నలగాముడు తన తల్లికి అరణముగ వచ్చిన రాజ్యము కనుక తానే అర్హుడనని తమ్మునకు భాగమీయ నిరాకరించెను. అన్నదమ్ముల నడుమ కలహము కూడదని కలిసిమెలసి ఉండుట మంచిదని పెద్దలు చెప్పిన మాటలు, భారత కథలో దుర్యోధనుడు, పలనాటి వీరచరిత్రలో నలగాముడు పెడచెవిని పెట్టిరి. కలసి బ్రతుకుట ఇష్టములేక కౌరవ రాజ్యము విభాగింపబడినది. ఇట నలగామున కిష్టములేక పలనాడు విభజింపబడినది. దుష్టమంత్రుల ప్రేరణము అట దుర్యోధనునకు ఇట నలగామునకు యిష్టమైనది.

రాజ్యవిభజన న్యాయము కాదనుకొని ఇచ్చిన భాగమును మరల తీసికొనుటకు శకుని ప్రేరణచే దుర్యోధనుడు, నాగమ ప్రేరణచే నలగాముడు ప్రయత్నించిరి.

అట పాండవులు వనవాసమునకు పోయిరి. ఇట బ్రహ్మన మలిదేవాదులు అడవులకు పోయిరి.

రాయబారులకు ఇరువురును విషప్రయోగము చేసిరి. భారతమున కృష్ణుడు (భగవంతుడగుటచే) ముందుగ విషప్రయోగమును తెలుసుకొని తప్పించుకొనెను. పలనాటి అలరాజు నాగమ చేసిన విషప్రయోగ యత్నము ఫలించి మరణించెను. వంశనాశనము జరుగకుండ రెండింటచేసిన సంధి ఫలింపలేదు. ఫలితముగ రెండు చోట్ల యుద్ధము జరిగెను. కురుక్షేత్రమునందు వలె, కారెమపూడి రణరంగమున ఇరుపక్షములవారును సర్వనాశనమైరి. భారత యుద్ధమున అభిమన్యునివలె పలనాటి యుద్ధమున బాలచంద్రుడు తన శౌర్యపరాక్రమములను చూపి వీరమరణమందెను. ఈ విధముగ ఈ రెండు గాథలకును పెక్కు పోలికలున్నవి. కాని యుద్ధానంతరము రెండు గాథలకు పోలిక కుదురలేదు. భారతమున విజయుడైన ధర్మరాజు రాజాయెను. పలనాటి గాథయందు అపజయము పొందిన నలగాముడు రాజాయెను. యుద్ధానంతరము మిగిలిన దాతడొక్కడే కనుక బ్రహ్మనాయు డాతనిని క్షమించి రాజ్యాభిషేకము చేసెను. ఈ రీతిగా రెండు కథలును ఒకదానితో ఒకటి పోలియున్నవి. ఇది చిత్రమైన నైమిత్తికము. ఇది కవి చేసిన అభూత కల్పన కాదు. స్వతఃసిద్ధమైనది.

భారతకథ భారతజాతి కంత విస్మరింపరానిదైనట్లే, పలనాటి వీరగాథ ఆంధ్రులకు విస్మరింపరానిది. భారత వీరులు, భారతదేశమున ఎట్టి చిరస్మరణీయులో పలనాటి వీరులు ఆంధ్రదేశమున అట్టి చిరస్మరణీయులు. రెండును జాతీయ మహాకావ్యములు. రెండు గాథలయందలి పాత్రలును పాఠకుల మనస్సుల నుత్తేజపరచి ఉత్పాత లూగించును. కనుకనే మనకుగల ఇతర చారిత్రక రచనలకు లభింపని కీర్తి ఈ పలనాటి వీరకథకు లభించినది. కనుకనే నేటికిని పల్నాటి సీమయందు పలనాటి వీరులను దేవతలవలె పూజించు నాచారము మిగిలినది.

## పలనాటి వీరచరిత్ర—సాంఘిక పరిస్థితులు

పలనాటి వీరచరిత్ర కేవలము ఒక వంశమునకు చెందిన గాథనేకాక ఆనాటి సాంఘిక స్థితిగతులు మతపరిస్థితులు, ఆచారవ్యవహారములు మొదలగు పెక్కు అంశములను తెలుపుచున్నది. మతద్వేషములు, సామంతరాజుల నడుమ చెలరేగుచున్న అంతఃకలహములు, సంఘమున స్త్రీకిగల స్థానము, సంఘమున వచ్చిన మార్పులు ఈ గ్రంథమువలన మనకు తెలియుచున్న ముఖ్యాంశములు.

వెలనాటి చోళుల కాలమున వైష్ణవమతమునకు ప్రాముఖ్యము వచ్చి వారి పరిపాలనలో అనేక వైష్ణవ దేవాలయములు నిర్మింపబడినవి. చాళుక్య రాజులు శైవమతమును ప్రోత్సహించిరి. తెలుగు చోళులు శైవ వైష్ణవ మతములను

సమదృష్టితో చూచినప్పటికి వారు శైవమతావలంబులు. వైష్ణవమతము ఆంధ్ర దేశమున ప్రవేశముపొందక పూర్వమునుండి శైవమతము ప్రచారమున నున్నది. ఈ రెండు మతములవారికి క్రమక్రమముగా ఒకరనిన మరొకరికి ద్వేషము రగుల జొచ్చినవి. పలనాటి యుద్ధము ఈ అంశమును స్పష్టము చేయుచున్నది. పలనాటి యుద్ధమున ప్రధాన పాత్ర వహించిన బ్రహ్మనాయుడు వైష్ణవ మతమును స్వీకరించెను. కులభేదమును పాటింపక సహపంక్తి భోజనమును ప్రోత్సహించి సంఘసంస్కరణమునకు పూనుకొనినట్లు పలనాటి చరిత్రలో కలదు. ఈ సంఘ సంస్కరణమువలన బ్రహ్మనాయుడు పల్నాటిలో ప్రజారంజకుడైనాడు. పల్నాటి విష్ణువుగ పూజింపబడినాడు. ఈతని ప్రత్యర్థి నాగమ్మ శైవమతాభిమానిని. వీర మాహేశ్వరి. నలగామరాజాదులు కూడ శైవమతాభిమానులే.

నాడు వర్ణాశ్రమ ధర్మములను నాశనము చేయవలెనను అంశమునకు పునాదులు వేయబడుచుండెను. వర్ణాశ్రమ ధర్మమునకు ప్రాముఖ్యమునీయక బ్రహ్మనాయుడు నానా వర్ణముల బాలురను పెంచి, గోసంగి కన్నమనీని జ్యేష్ఠపుత్రునిగా పరిగణించి నూతన సత్త్వముతో మతప్రచారమును చేయుట దీనికి నిదర్శనముగ కన్పడు చున్నది. ఆనాడు రెండు మతముల నడుమ కేవలము కలహము చెలరేగుటయే కాక, శైవులు వైష్ణవులకు పిల్లలనిచ్చుటకు నిరాకరించెడివారు. మలిదేవునకు కుమార్తెనిచ్చి వివాహము చేయుమని అడుగవచ్చిన బ్రహ్మనాయనితో వీరసోముడు "మీమ దాసరివారు మేదినిమీద భవులకు నేరీతి పడుచు నిచ్చెదము"[29] అని అనెను. కాని బ్రహ్మన "ఈసున తలపక యీ వీయమైతి, నీ విచ్చెద చూడు నిఖిలైక వీర"[30] అని సవాలు చేసెను. ఈ సవాలు శైవమతమునకే సవాలు. చివరకు బ్రహ్మనయే నెగ్గెను. వర్ణాశ్రమ ధర్మములేని వైష్ణవ మతప్రచారమునకు నడుము కట్టిన ఆనాటి సంఘసంస్కర్త బ్రహ్మన. ఈ విధముగా వీరశైవమునకు ఎదురొడ్డి నిలచినది వైష్ణవము. దానితో వ్యక్తులకేకాక సమాజమునకు ఉన్మాదావస్థ యేర్పడి కలహములకు కారణమైనది.

ఆనాటి సంఘమున మెచ్చదగిన మరియొక మార్పు స్త్రీలు విద్యావివేకవంతు లగుట. రాజకార్యములందు పాల్గొనుట. మంత్రి పదవులను స్వీకరించుట. రాజ్యముల నేలుట. రణరంగమున పాల్గొనుట.

పలనాటి యుద్ధమునకు కారకురాలైన నాగమ్మ రాజభక్తి కార్యనిర్వహణ, అలోచనాపరత మెచ్చదగినవి. ఈమె రాజకీయ పరిజ్ఞానమున పురుషుల కెంత మాత్రమును తీసిపోలేదు. ఈమె నలగాముని ప్రాపు సంపాదించి మంత్రిత్వమును చేపట్టకముందే "జాడ లెరుంగుచు జాణయై మసలెడిదట"[31] ఆనాడు రాజవంశపు

29, 30. పలనాటి వీరచరిత్ర, p. 56.

31. పలనాటి వీరచరిత్ర, p. 42.

స్త్రీలు గుఱ్ఱములపై నెక్కి ప్రయాణము చేసెడివారు. నాడు రాణివాస రక్షణ స్త్రీలచే.[32] స్త్రీలకు మారువేషముననున్న వేగులను పోల్చుకొను నేర్పుండెడిది.[33] ఈ విషయమున బ్రహ్మనాయని తల్లి శీలమ నేర్పు ఎన్నదగ్గది. మారువేషమున వచ్చిన వేగులను పేరుపేరున పిలచి వారిని హెచ్చరించి పంపినటులు వర్ణింపబడినది. నలగామునిని జయించుటకు ప్రయాణమై తల్లి అజ్ఞను పొందుట కరుదెంచిన బ్రహ్మనాయునకు, పశుల కాపరులను, స్త్రీలవలె ఇండ్లలో దాగినవారిని, గుడులలో దాగినవారిని, బలుసు కూరాకులు తిని అడవులలో బ్రతికినవారిని మగపాడి విడచి చంపుట దోషమని నీతులు గరపిన శీలమ నీతి విశారదత్వము ఎన్నదగ్గది.[34]

అనాడు స్త్రీలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములతోపాటు అధికారమును ఉన్నటుల స్పష్టపడుచున్నది. అనాటి సంఘమున స్త్రీ ఆధిక్యముగల కుటుంబములు (Matriarchical families) ఉన్నటుల తెలియుచున్నది. బ్రహ్మనాయుడు పలుతావులందు శీలమబ్రహ్మన యని పిలువబడుట ఇందులకు నిదర్శనము.[35]

హైహయ వంశజుడైన బిరుదాంక రుద్రుడను నామాంతరముగల బేతరాజు క్రీ.శ. 1129 లో గురజాల త్రిమూర్తి దేవాలయమున ఒక శాసనము వేయించెను. మరియొక బేతరాజు పండ్రెండవ శతాబ్ది ప్రారంభమున మాచెర్ల అవిత్యేశ్వర దేవాలయమునకు భూదానము చేసినట్లు ఒక శాసనము గలదు. ఇందు క్రీ.శ. 1147 ప్రాంతమున కామరాజను హైహయుడు పలనాడు పరిపాలించినట్లుగలదు. అతనికి అనుంగు కామరాజని, మైలలదేవి కామరాజని నామాంతరములు గలవు. అనగా స్త్రీల పేర్లను తమ పేర్లకు ముందు చేర్చుకొను ఆచారమున్నటుల దీనివలన స్పష్టమగుచున్నది.

ఈనాడు దురాచారమని భావింపబడుచున్న సహగమన మానాడు సతీత్వమునకు చిహ్నముగ పరిగణింప బడెడిది. కాని ప్రతిస్త్రీ మరణించిన భర్తను అనుసరింపవలెనను నియమమేమియు లేదు. ఈ కావ్యమున ఒక్క పేరమ్మ తప్ప, అనుగురాజు భార్యలుగాని, దొడ్డనాయని భార్యయైన శీలమ్మగాని, తదితరు లెవరుగాని తమతమ భర్తలతో సహగమనము చేయలేదు. సాహసమో, తమ భర్తలేనిదే బ్రతుక లేమను భావమోగల ఒకరిద్దరు తప్ప స్త్రీలందరును సహగమనము చేయుచున్నటులలేదు. కనుక అనాడది దురాచారముగ మార్పు చెందలేదని చెప్పవచ్చు.

భూధనము, గోధనము అనాడు ప్రభువుల చేతను ప్రజల చేతను శ్రేష్ఠమైనదిగ పరిగణింప బడుచుండెడిది. తలితండ్రులు తమ కుమార్తెలకు గోవులను

---

32. పలనాటి వీరచరిత్ర, p. 295.
33. పలనాటి వీరచరిత్ర, p. 206.
34. పలనాటి వీరచరిత్ర, p. 227.
35. పలనాటి వీరచరిత్ర, p. 179.

కానుకగా నిచ్చెడివారు. కల్యాణ పురాధీశ్వరుడైన వీరసోముడు తన కుమార్తె సిరా దేవికి అరణముగ గోవులను గోపాలకులనుగూడ నిచ్చెను.[36]

భట్టులు, బ్రాహ్మణులు, అప్పుడప్పుడు రాజబంధువులు రాయబారులుగ పోవు చుండిరి.

రణరంగమునకు ప్రయాణమైన కుమారులను తల్లులు, భర్తలను భార్యలు దీవించి పంపెడి ఆచారముండెడిది. యుద్ధమున కేగునపుడు, పంచభక్ష్య పరమాన్న మిడి, దృష్టిదోషమును బాపి

"అల్ల మార్కండేయు నాయువు కలిగి
ధర విభీషణువంటి తాలిమి కలిగి
తెర గొప్ప సూర్యుని తేజంబు కలిగి
శివపురి కోటను శ్రీఘ్రంబె గెల్చి
తడవుచేయక రమ్ము తనయుడ వీవు"[37]

అని దీవించి శీలమ్మ బ్రహ్మనాయని శివపురికోటను పట్టుటకు పంపించెను. మాంచాల భర్తయైన బాలచంద్రుని అటులనే దీవించి పంపెను.[38]

స్త్రీలు పుత్ర సంతానము కొరకు 'విష్ణు కాంత,'[39] 'చెన్నకేశవనోము,' 'పార్వతీ శుని నోము'[40] నోచెడివారు. పుత్రులకొరకు పేద బ్రాహ్మణులకు పెండ్లిండ్లు చేసెడి వారు. పాడుపడిన దేవాలయములను బాగుచేయించెడివారు. అమడామడకు అన్న సత్రములను కట్టించెడివారు. అరణ్యము లందు చలివేంద్రము లమర్చెడివారు.[41] శ్రీశైలము నందు అశ్వత్థ వృక్షములను పెంచెడివారు. పెంటిపోతులకు పెండిండ్లు చేసెడివారు.[42] విధి వెలుగు, సంజవత్తి. జగజ్జోతి, ఏకవిల్లు, పచ్చవిల్లు, కేదారేశ్వర నోము మొదలగు నోములను కూడ నోచెడివారు. నందికి పులగమును పెట్టెడివారు.[43] పుత్రులకొరకు గజనిమ్మ నోముకూడ నోచెడివారట. ఈ నోము నోచుకొనెడి విధానము సవిస్తరముగ వివరింపబడినది.[44] బహుశః ఈ వ్రత మాదినములలో పలువురు ఆచ రించెడివారేమో. ఈ నోము లన్నింటికంటె చిత్రమైన మరియొక అంశము పుత్ర సంతానర్థమై చీరలను అద్దించి కట్టుకొనుట.

36. పలనాటి వీరచరిత్ర, p. 68.
37. పలనాటి వీరచరిత్ర, p. 59.
38. పలనాటి వీరచరిత్ర, p. 419.
39. పలనాటి వీరచరిత్ర, p. 381.
40. పలనాటి వీరచరిత్ర, p. 30.
41. పలనాటి వీరచరిత్ర, p. 380.
42. పలనాటి వీరచరిత్ర, p. 381.
43. పలనాటి వీరచరిత్ర, p. 381.
44. పలనాటి వీరచరిత్ర, p. 382.

"పుత్ర కామ్యంబిచ్చు పొలుపైన చీర
లద్దించి గట్టితి యాస మీరంగ"[45]

అని ఐతమ్మ తాను పుత్రులకొరకు చేసిన పనులను బాలచంద్రునితో తెలిపెను. శ్రీశైలమున కేగెడు భక్తులకు కమండలముల నిచ్చెడివారు. మల్లికార్జున భ్రమరాంబలకు దక్షిణతో గుమ్మడి పండ్లను సమర్పించెడివారు.

ఈనాడు గుఱ్ఱములపై నెక్కినటుల ఆనాడు ప్రజలు పాటేళ్ళపైనెక్కి వెళ్లెడివారు.[46]

కోళ్ల పందెములను వేయుటకు గరిడిలను (పెద్ద శాలలవంటివి) ప్రత్యేకముగ నిర్మించెడివారు.[47] శకునములను నమ్మెడివారు. ప్రశ్నలను వేయించెడివారు.[48] గడియారపు మొగసాలలుండెడివి.

**స్త్రీ పురుషులు ధరించెడి ఆభరణములు :**

తీరైన రాగిడి, తిరుగుడు పువ్వు, సొరైన కెంపుల చంద్రవంక, పాపటబొట్టు, పసిడిపోక, సూసకము, పల్లెరు పువ్వు, నెరితమ్మిరేకు, రావిరేక, అపరంజికమ్మలు, బావిలీలు, కుట్టంట్లు, బవిరెలు, కుప్పె, కుతికంటు, మెడనూలు, గుండ్ల పేరులు, నానుపట్టెడ, దండసరిగెలు, వెలలేని కడియములు, గంటల మొలనూలు, గజ్జలందియలు, గిల్కు సరిమట్టెలు, ముక్కెర, ముత్యపునత్తు, బంగారుపూచేర్లు, తాటంకములు, ముత్యాల కుచ్చులు[49] మొదలగు ఆభరణములు ఆనాటి స్త్రీలు ధరించెడివారు.

ముత్యాలపేరులు, కర్ణకుండలములు, రత్నములతో అమర్చిన పతకములు, మాలికలు, భుజకీర్తులు, తాయెత్తులు, మురుగులు, గొలుసులు, పదివ్రేళ్ళకు ఉంగరములు, నవరత్నఖచితమైన నడికట్టు, పాదములకు బంగారు పావాలు, రాజులు, ధనికుల ఇండ్లలోని పురుషులు క్రీ.శ. 12–15 శతాబ్దుల నడుమ ధరించెడి ఆభరణములు.[50]

నాడు లోహ పరిశ్రమలు అభివృద్ధిలో నున్నట్లు తెలియుచున్నది. సకల ధాన్యంబులు, సకల రత్నములు, బంగారు, వెండి, కాంస్య తామ్ర స్వేత క్రమ భాండములు, సరసపు పట్టుబట్టలు, పటములు క్రయవిక్రయములు చేసెడి వారుండిరి. నాడు అద్దకము పరిశ్రమకూడ నుండెడిది. మాంచాల ప్రతిమలు వ్రాసిన పట్టు

45. పలనాటి వీరచరిత్ర, p. 381.
46. పలనాటి వీరచరిత్ర, p. 368.
47. పలనాటి వీరచరిత్ర, p. 133.
48. పలనాటి వీరచరిత్ర, pp. 104–110, 36.
49. పలనాటి వీరచరిత్ర, pp. 66, 408–409.
50. పలనాటి వీరచరిత్ర, pp. 718–719.

వస్త్రములు ధరించినది. ముఖమలు బట్టలుకూడ వాడిరి.

యుద్ధమునకు సమస్త వస్తు వాహనములతోపాటు దాసీలను, వేశ్యలను తీసుక వెళ్లెడువారు. సైనికులకు ఇబ్బంది కలుగకుండ సమస్త వస్తు విక్రయము రణరంగ మున జరిగెడిది. రెండు సేనలకు నడుమ సాక్షిగ పంచలోహములతో చేసిన స్తంభ మును నిలుపు ఆచారము గలదు.

తోలుబొమ్మల నాటకములుండెను. దొమ్మరాటలును కలవు. నాడు గుమ్మడి కాయలు, చెరుకుల పందెములు, పోకలాటలు, బంతులాటలు, గుంతమాపలు, జంతువుల పోరాటము, రూకల కుప్పలు, సొగటాలు, బొంగరములు మొదలగు ఆటల నాడెడివారు. ముఖ్యముగ బొంగరములను రావిచెట్ల నీడను ఆడెడివారు.

ఆనాడు, 'చంద్రిక, లేతమామిడి, కల్పవృక్షము కనకాంగి, కామధేనువు, కమలాక్షి, మహలక్ష్మి, నలినాక్షి, అలివేలు, చిన్నారి'[51] మొదలైన చిత్రవిచిత్రము లైన పేర్లను గోవులకు పెట్టు కొనెడి వారు.

వైష్ణవులు సిగయందు పుష్పములు ధరించెడివారు. నీర్కావి ధోవతి కట్టెడు వారు. పన్నెండు నామములు ధరించెడువారు. శైవులు ఉరమున లింగములు, గళమున రుద్రాక్షలు ధరించెడివారు. బొమ్మలను అద్దించిన చీరలు ధరించెడివారు.

నావాలవారు, నాణెమువారు, కొండ్లవిందులవారు, గోవిందువారు, ముతసాని వారు, ముయ్యూరువారు, పైడిబుక్కలపాపర్తివారు, బులుమూరివారు, బాలెము వారు, అట్లూరివారు, ముట్లూరివారు మొదలైన ఇంటి పేరులు గలవారుండిరి.

అనుకొన్న కార్యము నెరవేరుటకై గంధపుష్పాక్షతలతో నదులను పూజించు ఆచారముండెడిది.[52] కార్యార్థమేగువారికి, రణరంగమునకేగువారికి తాంబూల మిచ్చి పంపెడివారు.[53]

ఇవి పలనాటి వీరచరిత్రము వలన తెలియుచున్న కొన్ని సాంఘిక స్థితి గతులు, ఆచారవ్యవహారములు, ప్రజల అలవాట్లు.

రచనా విశేషములు :

పలనాటి వీరచరిత్రము దేశ కవితా శబ్దమును ఇతివృత్తమునందు, భాష యందు, భావము నందు సార్థకము చేసికొనిన దేశికావ్యము. మనకు గల ద్విపద కావ్యము లన్నియు ఒక్క చందస్సు విషయమున తప్ప తక్కిన గుణములలో మార్గ కవిత్వమునకు చెందినవే. దేశీయమైనకథను దేశి ఛందమున సజీవవ్యవహారిక భాషలో సహజమైన కావ్య సంపదను సంతరించు కొని దేశితనమును ప్రతిష్ఠించిన కావ్యము పలనాటి వీరచరిత్ర.

51. పలనాటి వీరచరిత్ర, p. 208.
52. పలనాటి వీరచరిత్ర, p. 203.
53. పలనాటి వీరచరిత్ర, pp. 203-461.

సుకుమారమైన భావములతో హృదయమునకు హత్తుకొను నటుల వర్ణింప బడిన ఈ వీరగాథ పాఠకుల హృదయముల నుత్తుంగతలూగించి వీరావేశులను చేయు చారిత్రక పద కవితల యందు ఉత్తమోత్తమమైనది.

ఇందలి పాత్రలన్నియు పాఠకుల హృదయమున శాశ్వతముగ నిలచి పోవును. ఇందలి పాత్రలు ఊహా జనితములు కావు. నిజస్థితి కలిగిన చారిత్రక పాత్రలు. తెలుగువారికి చిరస్మరణీయములు. కనుకనే పాఠకుల సానుభూతిని సహితము చూరగొన్నవి. అలరాజు, పేరమ్మ, బాలచంద్రుడు, మాంచాల, ఐతమ్మ, శీలమ్మ, బ్రహ్మన్న, నలగాముడు, నాగమ్మ వారు వీరన నేల ప్రతిఒక్కరు పాఠకుల హృదయములందు శాశ్వతముగ ముద్రింపబడిరి.

వీరగాథాకావ్యమైన పలనాటి వీరచరిత్రయందు ప్రధానముగ వీరరసము పోషింపబడినది. గ్రంథమందంతటను వీరరసము పొంగులువారుచున్నది. ఈ గాథ యందలి పురుషులు వీరులు, స్త్రీలు వీరవనితలు. ప్రతిఒక్కరి యందు వీరావేశము ఉప్పొంగు చుండును. యుద్ధ ఘట్టములు ముఖ్యముగ 'బాలచంద్రుని యుద్ధఘట్టము'[54] ఇందుకునిదర్శనము. ఈ కావ్యమున వీరరస మొక్కటియే కాక, కరుణ, అద్భుత, భయానక, హాస్యరసములును చక్కగా పోషింప బడినవి.[55] కోళ్ల పోరునందు అద్భుత భయానక రసములు, కార్యమపూడి కదనరంగ వర్ణనమున అద్భుత భయానక బీభత్స రసములు సందర్భోచితముగ చక్కగ వర్ణింపబడినవి.

వీరరస మీ గ్రంథమున ప్రధానస్థాన మాక్రమింప తరువాతి స్థానము కరుణ రసము ఆక్రమించుకొన్నది. గోపన్న మరణింపగా, బ్రాహ్మనాయుడు, గోపన్న తల్లి దారమ్మ విలపించిన వైనము, అలరాజు మరణవార్త విని తల్లి చల్లమాంబ దుఃఖించిన ఘట్టము, రత్నాలపేరమ్మ భర్త అలరాజు మరణించగా, జంగముల రావించి వారిని పూజించి భర్తతో సహగమనము చేయు ఘట్టము కరుణ రసమునకు పతాక సన్నివేశములు.

గురజాలలోని కామేశ్వర గుడిలో పూజారి పలుకులు ; మలిదేవుని గోవులను తరలించుటకు వచ్చిన వేగుల వారిని శీలమ్మ గుర్తించి, వారు ప్రార్థింపగా ఆమె వేగమే పట్టణము విడచి పొమ్మనగా వారు ప్రాణములు గుప్పెట పట్టుకుని పారి పోయిన వైనము, హాస్యమును వెదజల్లు కొన్ని ఘట్టములు. ఈ కావ్యమున వేర్వేరు రసపోషణములను చూపుట కెన్నియో ఉదాహరణములను చూపవచ్చును.

కథాసందర్భమును బట్టి పాత్రపోషణము అతి స్వాభావికముగ తీర్చి దిద్దుట జరిగినది. మహా కవియైన శ్రీనాథుని చేతిలో పాత్రలన్నియు మెరుగులు దిద్దు

54. పలనాటి వీరచరిత్ర, p. 463.

55. పలనాటి వీరచరిత్ర, pp. 143, 308-309.

కొనినవి. కొన్ని పాత్రలు దుర్బలములుగ మనకు తోచును. నరసింహారాజు, ఐతమ్మ మొదలగునవి. అది కవిలోపము కాజాలదు. ఈ గాథ యందలి పాత్రలు కల్పితములు కావు. చారిత్రముగా ఉదాత్తములైన లక్షణ సంపత్తి లేనప్పుడు దోషము కవిది కాదుకదా! కనుకనే శ్రీనాథుడు దుర్బలమైన మానసిక స్థితిగల పాత్రలను సహితము అతిశయోక్తులు చేర్చక అతి స్వాభావికముగా చిత్రించినాడు. ప్రతివ్యక్తికి కొన్ని అవగుణములుండుట సహజము. అంత మాత్రమున వారు ఉదాత్తత లేని వారని కాని, భీరువులని కాని నిర్ణయింపలేముకదా? పుత్ర వ్యామోహము ఐతాంబను భీరువును చేసినది. అంతమాత్రమున ఆమె వీరపత్ని, వీరమాత కాకపోలేదు. కులవైరమును తీర్ప ఉద్యుక్తుడైన బాలచంద్రుడు భార్యను చూచి మోహపడి ఆ మాటను కొంత కాలము మరచినంత మాత్రమున వీరుడు కాకపోలేదుకదా? మనసు చిత్రమైనది. ఒక్కొక్క సమయమున కొన్ని బలహీనత లకు లోనగుటయు సహజము. ధీరులు దానిని సరిదిద్దు కొందురు. మానవుని యందలి ఈ స్వాభావిక లక్షణములను శ్రీనాథుడు యథా తథముగ చిత్రించినాడు. నాయకురాలి పాత్రకు మాత్రము శ్రీనాథుడు కొలదిగ మెరుగులుదిద్దినాడు. ప్రజలతో వ్యాపించిన కథలందు నాయకురాలు కడు దుర్మతిగ దుష్టురాలిగ ప్రతిఫలించు చున్నది. నవతి తమ్ములకు రాజ్యమున పాలు పెట్టరాదన్న నరసింగరాజును పలనాటి ప్రజల ద్వేషమునకు గురియైనాడు. శ్రీనాథుడు ఈ ఇరువురి పాత్రలను దుర్మార్గులవలె చిత్రింపక కడు నేర్పుగ పాత్ర పోషణము చేసి రసవంతముగా కథను నడిపించినాడు. వివిధ ప్రకృతులను పొందుపరచి, కవితకు సొబగులు కూర్చినాడు.

ఈ కావ్యమున శ్రీనాథుడు—

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః"[56]

అను గీతయందలి చరమోపదేశ శ్లోకమును

"సకల ధర్మంబులు నమ్మతివిడిచి
నా శరణందితే నను జేర్చుకొందు
వగవకుమదిలోన వద్దు భయంబు
సత్యమీమాట............"[57]

అని సరసమైన చక్కని శైలిలో తెనిగించి తన రచనా వైదుష్యమును చాటుకొనెను.

56. భగవద్గీత, పదునెనిమిదవ అధ్యాయము, శ్లో. 66.
57. పలనాటి వీరచరిత్ర, p. 385.

యుద్ధ వర్ణనలు చేయుట యందు నన్నెచోడ తిక్కనలు ఖ్యాతిగన్నవారు. శ్రీనాథుడును యుద్ధవర్ణనలయందు ఆకవుల కెంత మాత్రమును తీసిపోక చక్కని ఉపమానములతో వర్ణించెను.

ఇది మా జాతి, ఇది మా మతము, వీరు మా దేశమునందలి వీరులు అనెడు స్వాభిమానమును పెంపొందించి, చరిత్రను నిరంతరము స్మరణకుతెచ్చు స్వతంత్ర కావ్యము పలనాటి వీరచరిత్ర. ప్రజలలోనె పుట్టి, ప్రజల ఆదరమునకు పాత్రమైన ప్రజాకవిత. పండితపామర హృదయరంజకమైన చక్కని చారిత్రక కావ్యము. మహావీరుల చరిత్రను దేశిరచనలో స్వతంత్రకావ్యముగ మలచిన కావ్యము ఇది ఒక్కటే తప్ప ఆంధ్రసాహిత్యమున మరియొకటి లేదనుట సాహసము కాదు.

# 6. కాటమరాజు కథ

క్రీ.శ. 13 వ శతాబ్దమున చోడవంశీయుడైన నల్లసిద్ధిరాజు నెల్లూరు మండలమునకు పరిపాలకుడు. కనిగిరి పాలకుడు కాటమరాజు. ఈతడు యాదవుడు. కాటమరాజు నల్లసిద్ధిరాజుయొక్క అడవులలో తన గోవులను మేపుకొనుటకై పుల్లరి నిచ్చుటకు ఒడంబడిక చేసుకొనెను. కాని పుల్లరి విషయమై ఇరువురి నడుమ వైర మేర్పడెను. ఆ తగవు యుద్ధమునకు దారితీసెను. నల్లసిద్ధిరాజు, కాటమరాజుల నడుమ వైరమునకు కారణమును, పర్యవసానముగ సంభవించిన యుద్ధమును వర్ణించు కావ్యము కాటమరాజు కథ. ఈ కాటమరాజు కథకు అనుబంధముగ భట్టు రాయబారము, కోటిపాటి తాటివృక్షము తెచ్చేకథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట గలవు. ఇవన్నియు కాటమరాజు కథకు సంబంధించినవి.

మనుమసిద్ధి అవసాన కాలమున జరిగియుండునని ఊహింపబడుచున్న కాటమరాజు కథ మంజరీ ద్విపదలో నున్నది. ఈ కథయందు ఆనాటి రాజకీయ సాంఘిక స్థితిగతులు కొన్ని వర్ణింపబడినవి. ఈ కథకు పామర జనుల యందెంత ప్రసిద్ధి గలదో చారిత్రకముగ అంత తక్కువ ప్రమాణములు కనపడుచున్నవి.

ఈ కథలను యాదవరాజుల కథలనిగూడ వ్యవహరించుట కలదు. ఎఱ్ఱగొల్లలు, పిచ్చుకుంటలు, బీరన్నలవారు పంట సమయమున ఊళ్ళవెంట తిరుగుచు కాటమరాజు కథను చెప్పెదరు. ఈ కథలను గొల్ల సుద్దులనికూడ అనెదరు. ఒంగోలు, వినుకొండ, పలనాడు, నరసరావుపేట తాలూకాలోను, కృష్ణాజిల్లాలో నందిగామ తాలూకాలోని గండ్రాయి అను గ్రామములోను, నెల్లూరి జిల్లాలోని కనిగిరి సీమ లోను, రాయలసీమ ప్రాంతమున ఈ కథలను చెప్పు గొల్లజాతులవారు కలరు. పలనాటి వీరచరిత్రమునకు గుంటూరు మండలమున ప్రచారమున్నటుల, నెల్లూరు మండలమున కాటమరాజు కథకు ప్రచారమెక్కువ.

కాటమరాజు కథ పలనాటి వీరకథవలె పెద్దగ్రంథము. యాదవ శాస్త్రం ఎద్దుమోత ప్రమాణమని అందురు. అయ్యలరాజు నారాయణామాత్యుడు హంస వింశతియందు,

"కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడు వ్రాతల కృష్ణలీలలం
గ్రమ్ము గుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపముల్

బమ్మిన పుస్తకాలు ముఖపట్టిడి కట్టురుమాల లున్నె ఈా
సొమ్ములు నామములల్ వెలయు నుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్"[1]

అనుటవలన కాటమరాజు కథలు చాలా కలవని, గొల్లలు వచ్చి పాడెడివారని స్పష్ట మగుచున్నది. వల్లురాజు చరిత్ర, పోలురాజు కథ, కాటమరాజు కథ, అగు మంచి కథ, ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాట, కోటిపాటి తాటివృక్షము తెచ్చేకథ, పెద్దిరాజు చరిత్ర, బొల్లావు యుద్ధము, ఆవుల పరువు, ఉత్తరకాండము, దక్షిణకాండము, కరియావుల రాజు కథ, భక్తిరన్నకథ మొదలైనవాటితో యాదవ శాస్త్రము ఎద్దుమోత ప్రమాణ మని చెప్పవచ్చు.

ఈ కథలను వర్షాభావ మేర్పడినప్పుడు నుద్దుల గొల్లలచే చెప్పించుటకలదు. కథలను చెప్పిన పిదప వర్షములు పడునట. సంతానము కొరకు కాటమరాజు కథ లను చెప్పించు ఆచారమును కలదు. ఈ అంశము హంసవింశతి స్పష్టము చేయు చున్నది.

"కొలిచెం గాటమరాజులన్ నతులు సేకూర్చెన్ మహావీర్లకుం
బొలముం రాజుల కెంత భక్తి పరతం బూజించె నాగాంగకున్
వెలయన్ వేటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలియాలాగున సల్పదైవము కృపన్ సిద్ధించెఁద ద్వాంఛయున్"[2]

ఈ విధముగ ప్రజలలో బహుళ ప్రచారాన్ని పొంది యాదవ భారతమని ఖ్యాతి గాంచిన కాటమరాజు కథ, దాని అనుబంధ కథలు ఈ ప్రకరణమున పరిశీ లింపబడినవి.

## కాటమరాజు కథ—గంగుల పినఎల్లయ

కాటమరాజు కథను గంగుల పినఎల్లయ రచించెను.

"హరిపాద సేవకు డతిభక్తిపరుడు
గుణుతైన కొమనాల గోత్రాబ్ధి చంద్రు
డెనయంగ గంగుల యెల్లయ్య కూర్మి
తనయుఁడు సర్వన తగు సహోదరుడు
పినయెల్లయను వాడు ప్రియము దీపింప"[3]

అనుటవలన గంగుల పిన ఎల్లయ తండ్రి గంగుల ఎల్లయ్య, సహోదరుడు సర్వన్నయని, కొమనాల గోత్రీకుడని తెలియుచున్నది. ఈ గ్రంథమువలన ఇంత కంటెను ఈతని విషయము లేమియు తెలియుటలేదు. ఈతడే శతాబ్దమునకు

1. అయ్యలరాజు నారాయణామాత్యుడు, హంసవింశతి, ద్వి. ఆ., p. 88.
2. అయ్యలరాజు రామభద్రుడు, హంసవింశతి, ద్వి.ఆ., p. 91.
3. కాటమరాజు కథ అవతరణిక.

చెందిన వాడను అంశము కూడ తెలియుటలేదు. "చన్నపట్టణమేలు చంద్రశేఖ రుడు"[4] యని యుద్ధమునకు వచ్చిన రాజులలో చెన్నపట్టణమేలు రాజు కలడను టచే ఈ కవి క్రీ.శ. 17 వ శతాబ్దాంతము వాడైయుండును. క్రీ.శ. 1672 వ సంవత్స రమునకు పూర్వము, క్రీ.శ. 1632 వ సంవత్సరమునకు తరువాతను చెన్నపట్టణ సంస్థాపన జరిగియుండునని, చెన్నపట్టణ ముదహరింపబడుటచే క్రీ.శ. 17వ శతా బ్దాంతమున ఈ గ్రంథము రచింపబడి యుండవలెనని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నిర్ణయించిరి.[5]

"ప్రళయ కావేరి మైలాపురంబు గల్సి
బీరమున బోర నది మట్టుపెట్ట దండ్రి
పేర దన్మధ్య భూలనిప్పృథు విభూతి
నలవరిచె చెన్నపట్టణ మయ్యా నృపతి"[6]

అను పద్యము వలన పులికాటులోని డచ్చి వారికిని, మైలాపురమందలి పోర్చుగీసు వారికిని తగాదాలు రాగా ఆమధ్య ప్రాంతమున దామర్ల అయ్యారాజు తన తండ్రి చెన్న నృపతి పేర చెన్నపట్టణము నిర్మించెనని తెలియుచున్నది. పరిశోధకులును చెన్నపట్టణ నిర్మాణము క్రీ.శ. 1632–1672 ప్రాంతమని నిర్ణయించిరి. కనుక కవి క్రీ.శ. 17 వ శతాబ్దమునకు చెందినవాడని చెప్పవచ్చు. అంతేకాక నల్లసిద్ధిరాజు పక్షమున "తుపాకి ఎలుమూక, తొమ్మిది లక్ష" లున్నట్లు వర్ణింపబడినది. క్రీ.శ. 12, 13 శతాబ్దులనాడు తుపాకులు లేవు. పాశ్చాత్యులు వచ్చిన తరువాతనే మనకు తుపాకులు వచ్చినవి. కనుక కవి 17 వ శతాబ్దమువాడు కావచ్చును.

గంగుల పినఎల్లయ "పినయెల్లయనువాడు ప్రియము దీపింప, వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని, నలిపెను యదుశాస్త్ర చరితమంతయును"[7] అని వ్రాసికొనెను. ఈ వచన పద్ధతిని వ్రాయుటనుగూర్చి పలుచకములైన అభిప్రాయములు గలవు. 'వచన పద్ధతి' యనగా చెప్పిన పద్ధతియని యర్థము చేసికొనవచ్చును అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలిపిరి.[8] శ్రీనాథుని 'వచన పద్ధతి' యనగా శ్రీనాథుడు చెప్పిన విధముననుసరించి యనియే అర్థము చేసికొనవలసియున్నది. అంతియేకాని దీనిని బట్టి శ్రీనాథుడు కాటమరాజు కథను వ్రాసినాడనియు, దానిబట్టి యీతడు ద్విపదగా దీనిని రచించెననియు జెప్పగుదురదు అని తిమ్మావజ్జల కోదండరామయ్యగారు అనిరి.[9] ఈ విషయమునే చర్చించుచు డాక్టర్ బి. రామరాజుగారు " 'వచన పద్ధతిని'

4. కాటమరాజు కథ, p. 11.
5. కాటమరాజు కథ, పీఠిక, pp. XXX--XXXI.
6. దామర్ల అంక భూపాలుడు, ఉషాపరిణయం.
7. కాటమరాజు కథ, p. 1.
8. కాటమరాజు కథ, p. XXI.
9. ఆంధ్ర పత్రిక, 1953, p. 430,

అన్నమాటలు చిత్రములు. శ్రీనాథుడు వచించిన పద్ధతియని కొందరు సర్దుకొని నటుల కానవచ్చును. నాకు జూడగా వచన పద్ధతి యనగా పాడిన పద్ధతి యని తోచుచున్నది"[10] అని తమ అభిప్రాయమును తెలిపిరి. పాడిన పద్ధతి అనుటకంటె శ్రీనాథుడు 'వచించిన' అనగా చెప్పిన పద్ధతి అనుట సమంజసముగ నున్నది.

ఈ అంశమువలన మనకు శ్రీనాథుడు కాటమరాజు కథనుకూడ రచించినటుల తెలియుచున్నది. మార్గకవితా సంప్రదానుయాయియై మహాకావ్యములను రచించిన కవిసార్వభౌముడు దేశికథలమీది యాదరముతోనే, లేక ఆకర్షణవలనో దేశికథలను రచించి, దేశి రచనలకు మెరుగులు దిద్దినాడు. పలనాటి వీరకథను చెప్పినట్లే కాటమ రాజు కథను గూడ చెప్పియుండును. శ్రీనాథుని గ్రంథము నాధారముగా కొందరు కాటమరాజు కథను రచించి ఉందురు. గంగుల పినఎల్లయకూడ శ్రీనాథుని రచనము ననుసరించి వ్రాసియుండును. శ్రీనాథుడు వ్రాసిన కాటమరాజు కథ నేడలభ్యము.

కాటమరాజు కథ కనుబంధముగగల 'భట్టు రాయబారము,' 'కోటిపాటి తాటి వృక్షము తెచ్చే కథ,' 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' ఎవరు రచించిరో తెలియుట లేదు. కాటమరాజు కథ, నల్లసిద్ధిరాజునకును కాటమరాజునకును నడుమ జరిగిన యుద్ధ గాథ, నల్లసిద్ధిరాజు రాయబారియైన రాజశృంగావళికిని కాటమరాజు భట్టైన పశుపతి రాజునకును నడుమ జరిగిన సంభాషణను తెలుపుచున్నది భట్టు రాయబారము.

కోటిపాటి తాటివృక్షమును తెచ్చే భాగమున కాటమరాజు రాయబారము విఫలముకాగా, సోదరులకు జాబులు వ్రాయుటకై కమ్మను తెప్పింపుమన పద్మ రాముడు ఎఱ్ఱయ్యను పంపగా అతడు కమ్మలకు బదులుగా తాటివృక్షమును తెచ్చు గాథ వర్ణితమైనది.

నల్లసిద్ధిరాజుతో యుద్ధమునకు సన్నద్ధులై యాదవవీరులందరును పుగల్లపాడు నందు గుడారములను వేసికొను అంశము తెలియజేయుచున్నది ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట. ఈ నాలుగు గాథలును ఒకే కథకు సంబంధించినవి.

కాటమరాజు యాదవుడు. చంద్రవంశీయుడు. కాటమరాజు కథయందు, తదితర కథలయందు కాటమరాజు వంశక్రమము, వసుదేవుడు, శ్రీకృష్ణుడు మొదలగు పురాణపురుషులతో చేర్పబడినది. కాటమరాజు కథయందును తదితర కథలయందును పేర్కొనబడు వ్యక్తులనడుమ పరస్పర సంబంధబాంధవ్యములెట్టివో తెలిసికొనవలెనన్న కాటమరాజు వంశవృక్షమును తెలిసికొనవలెను.

10. డా॥ బి. రామరాజు, తెలుగు జానపదగేయ సాహిత్యము, p. 205, footnote.


యాదవుల వంశవృక్షము
ఆనందగోపాలుడు
వసుదేవుడు
శ్రీకృష్ణుడు
అనిరుద్ధుడు
ఇంద్రదేవుడు
శత్రుజవుడు
సాత్య
కురవలుడు
కవులావుల గంగరాజు (గంగమ్మ)
ఆవుల వలరాజు × వల్లమ్మ
హరిపాలుడు
నందగోవుడు
గోవర్ధనుడు


సింహాద్రిరాజు
(సింహాద్రి సీత)
పెద్దిరాజు
(పెద్దమ్మ)
ఎరనూకరాజు
(ఎరనూక సీత)
నలనూకరాజు
(నలనూక సీత)
పోలురాజు
(సిరిదేవి)
కొమరమ్మ
కరియావులరాజు
చిట్టినూక
భట్టావులరాజు
చట్టువారి యెఱ్ఱయ్య
కాటమరాజు
(ఇతడే కథానాయకుడు)
పాపనూక
భక్తిరన్న
(నల్లమేడ)
అయితమరాజు
అల్లు దాడెన్న
ముమ్మయ్య
అగుమంచి
ఉత్తమరాజు
పల్లికొండ
ఉత్తమరాజు
అగుమంచి
నాచకూళ్ల నాయుడు

నెల్లూరి నల్లసిద్ధిరాజునకు కాటమరాజు పుల్లరి యొడబడుట, పుల్లరి నెగగొట్టుట, భట్టురాయబారము, యుద్ధసన్నాహము, ఖడ్గతిక్కన విరుగు, బ్రహ్మ రుద్రయ్య యుద్ధము, చల్లవారిపోరు, బొల్లావు యుద్ధము, వీరినేని యుద్ధము, కాటమరాజు పద్మనాయుల యుద్ధము, నల్లసిద్ధి కాటమరాజుల ద్వంద్వ యుద్ధము, వీరు వీరశయనమందుట అను ప్రధాన విభాగములతో కాటమరాజు కథ వెలయు చున్నది.

కాటమరాజు కనిగిరి సీమలోని యెఱ్ఱగడ్డపాడునకు అధిపతి. పెద్దిరాజు పుత్రుడు. పెద్దిరాజు కనిగిరి సీమలోని ఆలవపాడునకు అధిపతి. దేశమున అనావృష్టి సంభవింపగా యాదవులందరును తమతమ ఆలమందలను తోలుకొని దక్షిణమునకు వచ్చిరి. నెల్లూరిని పరిపాలించు మనుమసిద్ధియొక్క పసుల బీళ్లను కొన్నింటికి పుల్లరికి తీసుకొనిరి. కొన్ని అడవులను సహితము తీసుకొనిరి. పశువులను మేపుకొని పుల్లరిని చెల్లించుటమానిరి. అందులకు కోపించి సిద్ధిరాజు అన్నంభట్టను బ్రాహ్మణుని కాటమరాజు కడకు పంపించి పుల్లరి నడిగించెను. కాటమరాజు పుల్లరిని చెల్లింప నిరాకరించెను. నిరాకరించుటయే కాక

"పుల్లరంటే కానుపుట్టదిచ్చోట
నామాట మీరాజు కెరిగింపవోయి
సమ్మతిగాదేని సరగ మామీద
దండెత్తిమీరాజు దరలిరమ్మనుము"11

అని రాయబారిని త్రిప్పిపంపెను. అంత మనుమసిద్ధిరాజు కాటమరాజును శిక్షించు టకై సైన్యమును కూర్చుకొని దండెత్తివచ్చెను. కాటమరాజు కూడా బంధు మిత్రులను కూర్చుకొని యుద్ధసన్నద్ధుడాయెను.

తిరునామాల తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవేగి చొక్కరాజు, పెదవరదరాజు, అర్లుకొండ అచ్చిరాజు, ఆదివన్నె మాదిరాజు, గయకొండ గంగరాజు, ఉర్లకొండ సోమన్న, ఉదయాద్రి ఉమ్మయ్య, చెన్నపట్టణము చంద్రశేఖరుడు, దేవముని వెంగళయ్య, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పాపతిమ్మరాజు, ప్రభగిరిపట్టణము పద్మశేఖరుడు మొదలగు వీరులంతా మనుమసిద్ధి పక్షము వహించిరి. మనుమసిద్ధి సేనలకు ఖడ్గతిక్కన సేనాధిపతి.

కాటమరాజు పక్షమున, పలనాటి ప్రభువు పద్మనాయుడు, పల్లికొండ ప్రభువు చల్ల పిన్నమనాయుడు, దోనకొండ అయితమరాజు, ఎఱ్ఱయ్య భట్టావులరాజు, కరియావులరాజు, వల్లభన్న, నాచకూళ్ల నాయుడు, ముమ్మయ్యనాయుడు, పుత్త రాజు, పాచయ్యనాయుడు, నేతి ముద్దయ్యనాయుడు మొదలగు వీరులు చేరిరి. కాటమరాజు సేనలకు సేనాధిపతి బ్రహ్మరుద్రయ్య అను ఆరాధ్య బ్రాహ్మణుడు.

11. కాటమరాజు కథ, p. 3.

ఇరుపక్షముల సైన్యములును పంచలింగాలకడ ఎదుర్కొన్నవి. యుద్ధము ఘోరముగ జరిగినది.

సిద్ధిరాజు సేనానియైన తిక్కన, తానొక్కడే యాదవులను జయించి వత్తునని, సిద్ధిరాజు అనుమతిగైకొని తన సైన్యములతో పోయి శత్రువులను ఎదుర్కొనెను. ఉభయసైన్యములకు యుద్ధము ఘోరముగ జరిగెను. తిక్కన సైన్యమంతయు హతమయ్యెను. తిక్కన ఒక్కడు మిగిలి పోయెను. అంత పిన్నమనీడు తిక్కనను గాంచి

"ప్రాణాలొసంగి కీర్తి ప్రబలియున్నాము
కడకు బ్రాహ్మణ హత్య కట్టుకోరాదు
దవ్వుననున్నాడు ధారుణీశ్వరుఁడు
యిచట నీ యుద్ధంబు నెవరుచూచేరు
పోరు నీ కేల పో బుధపుంగవుండ
యిట సిద్ధిరాజు దండెత్తిరమ్మనుమి"[12]

అని వారింపగా తిక్కన రణరంగము నుండి మరలి గృహమునకు వచ్చెను. తిక్కనను గాంచి తండ్రి రణరంగమున ఓడి వచ్చినందులకు

"కొడుక ! ఈ వంశంబు కడుదొడ్డదోయి
పెద్దకాలమునాడు పేరుమోసినది
పులికడుపున గొఱ్ఱెపుట్టు చందమునఁ
గలిగితి నాయింతి గర్భంబునందు"[13]

అని మగవాడవైపుట్టి పరవారికి వెన్నిచ్చి బ్రతుకుటెందులకని తూలనాడెను. పురజనులు కూడ "మారణాగ్నులు కాని మంత్రాలుకావు, బాణాలు గారెలుకావు, కత్తులరసెలుకావు, బల్లెములు పూర్ణములుకావు, కయ్యమన పాయసముకాదు"[14] అని హాస్యమాడిరి.

భార్య భర్తకు స్నానము చేయుటకు నీళ్లు బిందెలతో పెట్టి మంచము నడ్డము పెట్టి యర్ధశేరు పసుపుపెట్టి అత్తకడకేగి "గొబ్బున నీరాడి కూఁతురు వచ్చుఁ దీర్చి యడబొట్టు స్థిరముగాఁ బెట్టు" అని పలికెను.

తల్లి ఓడి వచ్చితివి భోజనము చేయుమని తిక్కనకు విరిగిన పాలను వడ్డించెను. పాలేల విరిగినవని తిక్కన ప్రశ్నింప తల్లి

"నరుణోదయమువేళ నది యెట్లోకాని
యావులు బెయ్యలు నటు మేయఁబోయి

12. కాటమరాజు కథ, p. 18.

13. కాటమరాజు కథ, p. 20.

14. కాటమరాజు కథ, p. 20.

యరులతోఁబోరాడి యటుమీఁద నీవు
విఱిగిన నినుఁ జూచి విఱిగెను బాలు"[15]

అని సమాధానము చెప్పెను. అంత తిక్కన తన తప్పు తెలిసికొని, రణరంగమున కేగి వీరోచితముగ పోరాడెను. బ్రహ్మరుద్రయతో పోరాడి మరణించెను. బ్రహ్మరుద్రయయు మరణించెను. తిక్కన మరణవార్త విని తండ్రి సిద్ధయ మిక్కిలి సంతసించెను. తిక్కన భార్య సహగమనము చేసెను.

తిక్కన మరణవార్తనువిని మిక్కిలి కోపముతో సైన్యసమేతముగ సిద్ధిరాజు రణరంగమున కేగెను.

యాదవుల బలగమున మొదట గోసంగులను వారు యుద్ధమునకు వచ్చిరి. ఇరుపక్షముల పోరు ఘోరముగసాగెను. నల్లసిద్ధిపక్షమున పిన్నమనీడు శూరులగు వీరులను ఏర్చి రోజుకొకరిని నాయకులనుచేసి, ఎవరు, ఎవరితో యుద్ధము చేయవలెనో నిర్ణయించెను. ఇది భారత యుద్ధమును పోలియున్నది. ఇరుపక్షములందు పెక్కుమంది వీరులు మరణించిరి. అంత యాదవులు పల్లికొండ అజ్ఞ ప్రకారము ఏకాదశి నాడు బొల్లావు నలంకరించి యుద్ధమున నిలిపిరి. బొల్లావు వీరవిహారముచేసి రణరంగమును నిర్ధూమధామ మొనర్చి పెక్కుమందిని చంపెను. అంత నల్లసిద్ధిరాజు పెక్కుమంది బోయలను పంపి బొల్లావును చంపించెను. అవు వైకుంఠము నలంకరించెను. ద్వాదశినాడు నాలుగువేల గోసంగులు, బీరన్న యుద్ధమున మరణించిరి. త్రయోదశినాడు రెండు బలగములకు అతి ఘోరముగ యుద్ధము జరిగెను. అందు గంగరాజు, చన్నపట్టణమేలు చంద్రశేఖరుడు, తిరుమల తిప్పయ్య, ముమ్మయ్య, గండ గోపాలరాజు, కస్తూరిరాజు, ఉండవెల్లి విరిగోపుడు, సిరిబాల ముమ్మయ్య మొదలగు పెక్కుమంది వీరులు మరణించిరి. చతుర్దశినాడు నల్లసిద్ధి తమ్ముడు పాపసిద్ధిరాజు పన్నెండుమంది దళవాయిలతో, గజాశ్వములతో, కాల్బలముతోవచ్చెను. యాదవుల బలగమున అవులు లేగలు వచ్చెను. పాపసిద్ధిరాజు మరణించెను. ఇరుపక్షముల బలగములు నాశనమాయెను.

అమావాస్యనాడు నల్లసిద్ధిరాజు స్వయముగ రణరంగమున కరుదెంచెను. కాటమరాజు నల్లసిద్ధి తలపడిరి. ఇరువురును 'రామభద్రుని బలము రావణుబలము' వలె దాకిరి. ఘోరమగు యుద్ధము జరిగెను. కాటమరాజు, సిద్ధిరాజు ఎదురు రొమ్మున పొడిచెను. భూమిపై వ్రాలుచూ సిద్ధిరాజు కాటమరాజు ఉరమున పొడిచెను. ఇరువురును మరణించిరి. నల్లసిద్ధి మరణించెనని తెలుసుకొని, సిద్ధిరాజు ప్రధాని కంచర్ల భీమన్న వీరావేశముతో పద్మరాఘవునితో యుద్ధముచేసి మరణించెను. యుద్ధము ముగిసెను.

నల్లసిద్ధి కాటమరాజుల నడుమ యుద్ధమునకు కారణము కాటమరాజు కథ

---

15. కాటమరాజు కథ, p. 22.

యందు లేదు. నల్లసిద్ధిరాజు పుల్లరికొరకు భట్టును పంపగా, కాటమరాజు యుద్ధమున కాహ్వానించినటుల కాటమరాజు కథయందు గలదు. యాదవులు తమ దేశమున కరవు సంభవింపగా నెల్లూరునకు వచ్చిరి. ఏమి అడిగిన అది పుల్లరిగ నిచ్చుటకు నల్లసిద్ధిరాజుతో ఒడంబడిక చేసుకొనిరి. నల్లసిద్ధిరాజు ప్రతి సంవత్సరము కోడెలను మాడలను (ఎన్నియో తెలియదు) ఇచ్చునటుల ఒడంబడిక చేసుకొని నెల్లూరు పరిసరములందు పశువులను మేపుకొనుటకు అనుమతి నిచ్చే రాగి శాసనము వ్రాయించెను. కాని యాదవుల పశువులు నల్లసిద్ధిరాజుయొక్క పండిన చేలను పాడుచేయగా, నల్లసిద్ధి సేనలు పశువులను అదలించెను. కాటమరాజు కోపించి పుల్లరి నీయక యుద్ధ సన్నద్ధుడాయెనని అనుబంధ కథయైన భట్టు రాయబారమున కలదు. కాటమరాజుయొక్క పశువులు నల్లమల ప్రాంతమున మేయుచుండగా పట్టపు రాణియైన కన్నమ్మ యొక్క పెంపుడు చిలుక అట కరుదెంచి కిచకిచలాడెను. గోవులు బెదరి బీళ్ళను పాడుచేసెను. దానిని గాంచి రామవుడు చిలుకను బాణముతో కొట్టెను. చిలుక బాణముతో సహా అంతఃపురమునకేగెను. బాణము తీయించగా చిలుక మరణించెను. పట్టపురాణి కోపించి గోపకులచేత కాటమరాజు గోవులను పొడిపించెను. కాటమరాజు కోపించి పుల్లరి నిచ్చుట మానెను. ఈ కారణము చేత యుద్ధము జరిగెననియు తెలియుచున్నది. ఈ కథయే Local Record నందు కొంత భేదముతో కలదు. పట్టపురాణి చిలుకయని కాక, నల్లసిద్ధిరాజు యొక్క ఉంపుడుకత్తె యొక్క చిలుకయని గలదు.[16] ఈ విషయముల సత్యాసత్య నిరూపణకు ఆధారము లేవియు లభించుటలేదు. రెండుకథలకును కొంత సారూప్యము కనపడుచున్నది.

ఈ కథయే గాక మరియొక కథను, తిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారు తెల్పిరి. మనుమసిద్ధి తన సోదరియగు కుందమాదేవికి, నల్లమల ప్రాంతములందు కొంత భూమిని అరణ మొసంగెను. కాటమరాజు, వర్షాభావము వలన, పద్మనాయుని ప్రోత్సాహము వలన, మనుమసిద్ధికడ కరుదెంచి సంవత్సరమున కింత పుల్లరి యిత్తునన్న ఏర్పాటుతో మనుమసిద్ధి బీడులయందు పశువులను మేపుకొనుటకు ఒడంబడిక నేర్పరచుకొనెను. మనుమసిద్ధి తన సోదరి పక్షమున తానే ఒడంబడిక చేసికొనెనట. ఈ విషయము తెలియని నల్లసిద్ధిరాజు సోదరి, తన భూములందు మేయుచున్న కాటమరాజు పశువులను బోయలచేత నష్టపరిపించు చుండెను. ఈ విధముగా సంవత్సరము గడచెను. తన పశువులు నష్టమయినవను కోపముతో కాటమరాజు పుల్లరిని చెల్లింపలేదు. మనుమసిద్ధి రాయశృంగాళిని రాయబారిగ పంపెను. కాటమరాజు నిరాకరించెను. ఈ విషయము తెలిసి మనుమసిద్ధి యుద్ధము ప్రకటించెను. ఇది వ్యవహారమునగల కథయట.[17]

16. పట్టపురాణి కైకీయతు.

17. "కాటమరాజు కథ" తిమ్మావఝ్ఝుల కోదండరామయ్య, ఆంధ్రపత్రిక, 1953-54, p. 33.

ఈ కథ అంత సత్యముగ కన్పించుట లేదు. తనరాజ్యమున జరుగు విష యములు తెలసికొనకుండ, తన సోదరి పక్షమున, తాను గావించిన ఒడంబడికను ఆమెకు తెలుపకుండ, రాజ్యమును చేయు రాజుండుననుట హాస్యాస్పదముగ నుండును. సామాన్యులయినను ఉపేక్షింపని విషయములను ఒక మహారాజు ఉపేక్షించుననుట నమ్మదగ్గ విషయముగ లేదు.

## చరిత్ర — కాటమరాజు కథ

కాటమరాజు కథ దానికనుబంధముగ నున్న కథల వలన కాటమరాజునకు నల్లసిద్ధిరాజునకు నడుమ సంభవించిన యుద్ధమెపుడు జరిగినదో తెలియుటలేదు. ఈ యుద్ధమేసంవత్సరమున జరిగినదో సరిగా చెప్పుటకు ఆధారములును లేవు. కాటమరాజు కథ యందు రెండు మూడు తావుల 'చిత్రభాను పగ సిద్ధముగ వచ్చు' అని గలదు. కాటమరాజు నల్లసిద్ధిరాజులు అమావాస్యనాడు యుద్ధముచేసి మరణించిరని కలదు. యుద్ధ మేతిథియందు ప్రారంభమైనది లేదు కాని బొల్లావు ఏకాదశినాడు యుద్ధముచేసెనని గలదు. తక్కిన నాలుగురోజులు ఎవరెవరు యుద్ధము చేసినది వర్ణింపబడినది. ప్రారంభము తెలియనప్పటికి యుద్ధము చిత్రభాను సంవత్సరమున అమావాస్యనాడు ముగిసినట్లు స్పష్టపడుచున్నది. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు గ్రంథావతారికయందు నెల్లూరి గుండ్లపాలెము శాసనమునందు శకవర్ష ములు 1170 కాళయుక్తి సంవత్సర కార్తీకశుద్ధ గురువారమని కలదని వ్రాసిరి. యుద్ధకాలమును గూర్చి శర్మగారు పీఠికయందు వివరముగ చర్చించిరి.[18]

"కందుకూరు సీమలోని గుండ్లపాలెములో భ్రమరేశ్వరాలయములో నొక రాతి పలకపై నీవిషయము సంగ్రహముగాఁ దెలుపఁబడియెనుగాని, యందుఁ జెప్ప బడిన కాలము వేఱుగను నాయకులు వేఱుగ నున్నారు. అందనందర్భ విషయము లెన్నియోగలవు" అని చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రము నందు తెలిపిరి.[19] నెల్లూరి మండలమున లభించిన క్రీ.శ. 1258 సంవత్సరము నాటిదగు శాసనమున, కాటమరాజునకు మనుమసిద్ధిరాజునకు జరిగిన యుద్ధ విషయము కానవచ్చుచున్నది. ఇందు సిద్ధిరాజు కాటమరాజుల నడుమ యుద్ధము సంభ వించుటకు కారణము, యుద్ధము ప్రారంభింపబడిన దినము మొదలగు వివరములు గలవు. "శాలివాహన శకము 1170 ప్రాంతముల కాటమరాజు నెల్లూరి నల్ల సిద్ధిరాజు మీదికి సర్వసన్నాహముతో దండెత్తిపోయినట్లు ఇందు గలదు" అని తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి అభిప్రాయము.[20]

18. మా. కాటమరాజు కథ, పీఠిక, p. xxix.
19. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 86.
20. ఆంధ్రపత్రిక 1953-1954.

మనుమసిద్ధి కాటమరాజులకు నడుమ ఎఱ్ఱగడ్డపాడు నందు జరిగిన యుద్ధము పామర జనులలో ప్రఖ్యాతమై ఉండగా, ఆనాటి శాసనములందు లేదు. ఆ కాలమున వెలసిన గ్రంథములలో దేని యందును పేర్కొనబడలేదు. నిర్వచనోత్తర రామాయణమున మనుమసిద్ధిని గూర్చిన పెక్కు విషయములున్నవి గాని ఈ యుద్ధ ప్రస్తావన లేదు. దశకుమార చరిత్రమున ఖడ్గతిక్కన ప్రశంస గలదు. కాని కాటమరాజు ప్రసక్తిలేదు. ఖడ్గతిక్కనతో యుద్ధము చేసిన బ్రహ్మరుద్రయ్య విషయమును కానరాదు. సమకాలిక గ్రంథములందు పేర్కొనబడక, జనవ్యవహారమున, జానపద గ్రంథరూపమున ఉన్న కాటమరాజు కథ చారిత్రక సత్యమగునా కాదాయని సందేహము కలుగును. జనవ్యవహారమున ఉన్నంతమాత్రమున చారిత్రకముగా జరిగిన విషయమని చెప్పలేము. ఇందు వర్ణింపబడిన మనుమసిద్ధి వృత్తాంతము సమకాలీన రచనలతో నేకీభవించుట లేదు. కనుక సందేహము కలుగును. కాని జనవ్యవహారమున ప్రసిద్ధిగాంచిన ఈ కథ సత్యము కాదనుటకును వీలులేదు. సత్యమని నిరూపించుటకు అంతగా అధారములు లేవు. కనుక చరిత్రకారులు కాటమరాజు కథను గూర్చి పరిశోధన గావింప వలసిన ఆవశ్యకతగలదు.

కాటమరాజు కథయందు వర్ణింపబడిన పాత్రలన్నియు చారిత్రకముగ సత్యమైన వనుటకు ఆధారములు లభించుట లేదు. నెల్లూరి నల్లసిద్ధిరాజు, తిక్కన, కాటమరాజులను గూర్చిన అధారములు కలవు.

**కాటమరాజు :**

కాటమరాజునకు సంబంధించిన విషయము నెల్లూరి మండలమున కందుకూరు తాలూకా గుండ్లపాలెమున గల బ్రహ్మేశ్వరస్వామి ఆలయమున గల ఒక శిలా శాసనమున గలదు.[21] ఇతడు యాదవ వంశీయుడు కనిగిరి సీమలోని ఎఱ్ఱగడ్డపాడునకు పాలకుడు. యాదవులు పశుసంరక్షణముతో కాలము గడుపు కొనెడివారు. అపారమగు గోధనముండుటచే కాటమరాజు యాదవులకు ప్రభువై ఉండును. నెల్లూరి శాసనమును బట్టి కాటమరాజు చారిత్రక పురుషుడని నమ్మవచ్చు. ఈతని కాలమును ఖడ్గతిక్కన, నల్లసిద్ధిరాజుల కాలమును బట్టి నిర్ణయింపవలెనే తప్ప సరియగు అధారములు లేవు.

**తిక్కన :**

నల్లసిద్ధిరాజు లేదా మనుమసిద్ధిరాజు నెల్లూరును పరిపాలించిన కాలము 13వ శతాబ్దము. ఖడ్గతిక్కన ఈతని ఆస్థానమున నుండెను. తిక్కన తండ్రి సిద్ధన. ఇతని సోదరులు భాస్కర, కేతనలు. పిన తండ్రి కొమ్మన. కొమ్మన

---

21. చూ. నెల్లూరి మండల శాసన సంచయము, రెండవ సంపుటము, బటర్వర్త్ మరియు వేణుగోపాలస్వామి సంపాదితము.

కుమారుడు భారతము వ్రాసిన తిక్కన. వీరందరును నెల్లూరిని పరిపాలించిన చోళుల ఆస్థానమునందుండిరి. కవి తిక్కన మనుమసిద్ధికి మంత్రి. నిర్వచనోత్తర రామాయణమును వ్రాసి మనుమసిద్ధికి అంకిత మొనంగెను. ఖడ్గతిక్కన మనుమ సిద్ధిరాజునకు సేనాధిపతి.[22] అతడు ప్రతిభా సంపన్నుడు. వీరుడు. ఇతని విషయము, కేతన దశకుమార చరిత్రయందు

వేడిన నర్థార్థి వృథపుచ్చ నేరని
దానంబు తనకు బాంధవుడు గాఁగ
నెదిరిన జముసైన బ్రదికి పోవఁగనీని
శౌర్యంబు తన కిష్ట సఖుడు గాఁగ
శరణుచొచ్చిన శత్రువరునైన రక్షించు
కరుణయె తనకు సంగాతి గాఁగ
బలికినఁబాండవ ప్రభునైన మెచ్చని
సత్యంబు తనకు రక్షకుఁడు గాఁగ
జగతి నుతికెక్కె రాయ వేశ్యాభుజంగ
రాజ్యరత్నాకరస్ఫూర్తి రాజమూర్తి
గంధవారణ బిరుద విఖ్యాత కీర్తి
దినపతేజుండు సిద్ధయ తిక్క శౌరి.[23]

అని వర్ణింపబడినది. ఈ పద్యము వలన ఈతని గుణగణములు, శౌర్య ధైర్యములు వెల్లడియగు చున్నవి.

ఇతడు సిద్ధిరాజు నొప్పించి అతని సమ్మతితో సైన్యమును తీసుకొని యాదవుల జయించి వత్తునని రణరంగమున కేగెను. అట తన సైన్యమంతయు నాశన మాయెను. తిక్కన గృహోన్ముఖుడాయెను. ఇతనిని గూర్చి కొన్ని చాటువులు కన్పడుచున్నవి. ఈ ఛాటువుల వలనగాని, కాటమరాజు కథ వలనగాని మనకు తెలియుచున్న విషయమొక్కటే. యుద్ధభూమి నుండి మరలి వచ్చిన ఈతనిని తండ్రి, పురజనులు, తల్లి, భార్య అందరును రణరంగమున నోడి వచ్చెనని పరిహసించుట.

"యుద్ధముననైన జావక యిటులేల పాఱి వచ్చితివి. కడుపు చెఱుప బుట్టితివ"ని తండ్రి నిందించెను. భార్య స్నానమునకు నీళ్లు పెట్టి మంచంబునడ్డుగ బెట్టి అట పసుపును గూడ నుంచ, అదిగాంచి బాధపడుచున్న భర్తనుగాంచి

"పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులందున్

22. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 68.

23. కేతన, దశకుమార చరిత్ర, ప్ర.ఆ., ప. 66.

ముగురాడువార మైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్"

అని అనెనట. కాటమరాజు కథయందు భర్తకు స్నానమునకు నీళ్లిచ్చి అత్తతో "గొబ్బున నీరాడి కూతురు వచ్చు తీర్చి అడ్డబొట్టు స్థిరముగా బెట్టు" అనినట్లు కవి వర్ణించెను. భోజన సమయమున తల్లి విరిగిన పాలను పోసి

"అసదృశముగ నరివీరుల
బనమీఱగ గెలువలేక పందక్రియస్నీ
వసివైచి తిరిగివచ్చిన
బసులు న్విఱిగినవి, తిక్క! పాలున్విఱిగెన్"

అని పలికెనట. కాటమరాజు కథయందును ఈ అంశము గలదు.

ఈ పలుకులన్నియువిని తిక్కన విచారించి చేసిన పనికి పశ్చాత్తాపము నొంది మరల సైన్యముతో యుద్ధభూమికేగి ఘోరముగ యుద్ధముచేసి వీరస్వర్గము నలంకరించెను.

ఈ గాథయందలి ఈ అంశములు యథార్థములైనప్పటికిని కానప్పటికిని, తిక్కన రణరంగమునుండి మరలిరాగా, తండ్రి, తల్లి, భార్య, కఠినోక్తులు పలికి యుందురు. అది సహింపలేక తిక్కన యుద్ధభూమికేగి, వీరోచితముగ పోరి వీరమరణము పొందుట సత్యమై ఉండును. తిక్కన శౌర్యపరాక్రమములను కేతన వర్ణించెను. కేతన దశకుమార చరిత్రకంటె ప్రమాణము మింకేదియు నుండదు. కనుక తిక్కన సిద్ధిరాజు సేనాని యనియు, చారిత్రక పురుషుడనియు స్పష్టపడు చున్నది. ఈ విషయమున నెట్టి సంశయమునకును తావులేదు. అదియునుకాక ఇతని సోదరుడును, సిద్ధనామాత్యుని రెండవ కుమారుడును అగు భాస్కరమంత్రి చోళరాజుల కొలువున నుండెను.

దశకుమార చరిత్రమున సేవణాధీశుని దండయాత్ర విషయము ప్రస్తావింప బడినది.[24] ఇతడు క్రీ.శ. 1210 మొదలు 1247 వరకు పరిపాలించిన సింహణ దేవుడు. ఇతని సైన్యాధిపతి లక్ష్మదేవ దండనాయకుడు. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున నీతనిని వర్ణించెను.[25]

చోడతిక్కరాజు, సిద్ధయభాస్కరుడు పాల్గొనిన యుద్ధమొక్కటియే. ఈ సేవణ దండయాత్ర క్రీ.శ. 1215 ప్రాంతమున జరిగినట్లు శాసనాదులవలన స్పష్టపడు చున్నది. కనుక కవి తిక్కన, ఖడ్గతిక్కన, భాస్కరమంత్రు లీకాలమువారని స్థిర పరుపవచ్చును.

ఖడ్గతిక్కన మనుమసిద్ధిరాజుయొక్క సేనాధిపతియని చరిత్రకారుల అభి

24. ఉరవడి నుగ్రసేవణ పయోనిధి...

25. లకుమయ గోరుము లూరికి నెత్తివచ్చిన
గొనుడె యాహవమున ఘోటకముల, నిర్వచనోత్తర రామాయణము, పీఠిక.

ప్రాయము. కాటమరాజు కథయందు ఈతడు సిద్ధిరాజుకడ కరణమనియు, కరణమునకు లెక్కలు వ్రాసికొనుట తప్ప యుద్ధము చేతగాదనియు వర్ణింపబడి యున్నది. కాని ఈతని శౌర్యధైర్య పరాక్రమాదులనుగూర్చి పెక్కు నిదర్శనములు కలవు. కథలును గలవు. ఈతని శౌర్యమును చాటుటకు ఖడ్గతిక్కన అను బిరుదమే చాలును.

నల్లసిద్ధిరాజు :

నెల్లూరునకు విక్రమసింహపురమని మరియొక నామము గలదు. ఈ నెల్లూరు పురమును చోళరాజులు పరిపాలించిరి. వీరికి నెల్లూరు చోళులని పేరువచ్చెను. వీరి మూలపురుషులలో ముఖ్యుడు చోళ బిజ్జన. చోళ బిజ్జన చాళుక్య చక్రవర్తియగు మొదటి సోమేశ్వరుని సామంతరాజు. తరువాత ప్రఖ్యాతిగాంచినవాడు తిక్క భూపతి. ఇతడు పెక్కు యుద్ధములు చేసి తన రాజ్యమును కాంచీపురమువరకు విస్తరింపచేసెను. వీరు చోళచక్రవర్తులకు పేరునకుమాత్రమే సామంతులుగ నుండిరి. ఈ తిక్కభూపతి కుమారుడు మనుమసిద్ధి. ఇతని మంత్రి కవితిక్కన. దండనాధుడు ఖడ్గతిక్కన. ఈ తిక్కన లిరువురు పెదతండ్రి పినతండ్రి కుమారులు. మనుమసిద్ధి రాజుకు కాటమరాజుతో పుల్లరి విషయమై చిన్న తగవు ప్రారంభమై చివరికి మహా యుద్ధముగ పరిణమించినది.

ఈ మనుమసిద్ధి మొదట చోడచక్రవర్తియగు మూడవ రాజరాజచోడునకు సామంతరాజుగ నుండి, అనంతరము మూడవ రాజేంద్రచోడ చక్రవర్తి కాలమున స్వతంత్రుడయ్యెను. తరువాత ఈతడు కాకతీయ చక్రవర్తియగు గణపతిదేవునకు సామంత రాజుగ నుండెను. ఇతడు క్రీ.శ. 1257–58 ప్రాంతమున కోడూరను గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసినటుల కడపమండలమునగల నందలూరున నొక అరవ శాసనమువలన తెలియుచున్నది.[26] ఈ శాసనమువలన, మనుమసిద్ధిరాజు, మూడవ రాజేంద్రచోళ చక్రవర్తికి సామంతుడైనప్పటికి స్వతంత్రముగ పరిపాలన చేయు చున్నటుల స్పష్టపడుచున్నది.

ఈ మనుమసిద్ధిరాజు ద్రావిడరాజును, విజయక్ష్మాధీశుని, రక్కెస గంగని మహారాష్ట్ర సామంతుడైన సారంగుని జయించినటుల తిక్కన నిర్వచనోత్తర రామాయణమువలన తెలియుచున్నది.

"ద్రవిడోర్వీపతి గర్వముందునిమి శౌర్యంబొప్పఁ గర్ణాట ద
ర్పవిఘాతంబు నొనర్చి వైరి మనుజేంద్ర శ్రేణికిన్ గొంగనా
నవనిం బేర్కొనియున్నయట్టి విజయక్ష్మాధీశ్వరుం గాసిగా
నెవిచెంజోళన మన్మసిద్ధియుని ప్రాయేటం బ్రగాఢోద్ధతిన్"
"రంగదుదార కీర్తియగు రక్కెస గంగనఁ బెంజలంబుమై
భంగమొనర్చి మన్మజనపాలుఁడు బల్విడినాఁచి కొన్నరా

తెలుగు చోళుల వంశవృక్షము
రెండవ కరికాళ చోళుడు
|
తెలుంగు విద్యన
|
దాయ భీమన
|
సిద్ధచోళ    బేత భూపతి
|
దాయభీమ    నల్లసిద్ధి    ఎఱ్ఱసిద్ధిరాజు
|
నల్లసిద్ధి    మన్మసిద్ధిరాజు    బేతన    తమ్ముసిద్ధిరాజు
|
చోడ తిక్కన (చోడ తిక్కభూపతి)
|
(పేరు తెలియదు)    మనుమసిద్ధిరాజు (కాటమరాజు కథయందలి నెల్లూరు పాలకుడు)
|
తిక్కభూపతి    నల్లసిద్ధ    గోపీనాథ
|
మనుమగండ గోపాలుడు

జ్యాంగము లెల్లనిచ్చి తన యాశ్రితవత్సలవృత్తి యేర్పడన్
గంగయ సాహిణింబదము గైకొనఁ బంచెఁ బరాక్రమోన్నతిన్"
"శృంగారంబు నలంగదేమియును బ్రస్వేదాంకుర శ్రేణిలే
దంగంబుల్ మెఱుఁగేదవించుకయు మహారాష్ట్ర సామంతు సా
రంగుందోలి తురంగముం గొనిన సంగ్రామంబునందృప్త స
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపంపై చన్న సైన్యంబునన్"[27]

అను పద్యములు ఈ విషయమును స్పష్టపరచుచున్నవి.

మొదటి పద్యమునగల "విజయక్ష్మాధీశ్వరుండు" త్రిభువన చక్రవర్తి

26. Annual Report on Epigraphy of 1907, No. 580.
27. తిక్కన, నిర్వచనోత్తర రామాయణము, ప్ర.ఆ., ప. 39, 41, 43.

బిరుదాంకితుడగు "విజయగండ గోపాలదేవుడని తోచుచున్న"దని చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రుల చరిత్రమున తెల్పిరి.[28] ఇతడు క్రీ.శ. 1250 మొదలు 1266 వరకు పరిపాలించినటుల తెలియుచున్నది.

పాండ్యరాజులలో ప్రముఖుడగు జటవర్మ సుందర పాండ్యరాజు, మనుమ సిద్ధి తండ్రియగు తిక్కరాజు, పాండ్యులను జయించెనను కోపముతో అతని మరణానంతరము నెల్లూరి ప్రాంతమును జయింప ప్రయత్నించుచుండెను. క్రీ.శ. 1249 వ సంవత్సరమున గణపతిదేవ చక్రవర్తి వీరిని పారద్రోలెను కాని క్రీ.శ. 1250 వ సంవత్సరమున తెలుగు చోడులను జయించి, మనుమసిద్ధిరాజును నెల్లూరునుండి తరిమివేసి, శత్రువులైన వీరులకు పట్టాభిషిక్తులను గావించెను[29] అను మరియొక విషయము తెలియుచున్నది.

రెండవ పద్యమునగల గంగయ సాహిణిని గూర్చి చిలుకూరి వీరభద్రరావు గారు వివరముగ చర్చించిరి.[30] ఇంక మూడవ పద్యమునగల సారంగుడు, గణపతి మహారాజునకు సామంతుడు. అద్దంకి పరిపాలకుడు.[31] సుందర పాండ్యుడు మనుమసిద్ధిని జయింపగా గణపతి దేవుడు నెల్లూరి సింహాసనమున మనుమసిద్ధిని తిక్కన ప్రోద్బలమున ఆసీనుని గావించెనని తెలియుచున్నది.[32]

ఈ నెల్లూరి నల్లసిద్ధి లేక మనుమసిద్ధిరాజును, కాటమరాజు కథయందు కవి పల్లవరాజని పేర్కొనెను. అనుబంధమునగల భట్టు రాయబారమును వ్రాసిన కవి కూడ మనుమసిద్ధిని పల్లవరాజుగ వర్ణించెను. "అల్ల ధరణికోట అమరలింగమునకు బ్రాహ్మణ కన్యకు ప్రభవించినాడు. మూడు కన్నులవాడు ముక్కంటి యనగ" అని చెప్పి, అతని కుమారుడు, జనోధీరుడు, ఆయన కుమారుడు మనోధీరుడు, మనోధీరుని పుత్రుడు మనుమసిద్ధిరాజు అని మనుమసిద్ధి వంశ క్రమమును పేర్కొనెను. ఈ వంశక్రమమునకును, చరిత్రకారులు తెలిపిన (పైన వ్రాయబడిన), వంశ క్రమమునకును, సామ్యము కనపడుట లేదు. ముక్కంటి పల్లవ వంశీయుడు. నల్లసిద్ధి చోళవంశీయుడు. కనుక నల్లసిద్ధి ముక్కంటి వంశీయుడు కాడనుట స్పష్టము.

చోళ వంశీయుడైన నల్లసిద్ధి రాజు నెల్లూరు పరిపాలించు కాలముననే పల్లవ వంశమున నొక నల్లసిద్ధిరాజుండెను. ఇతడు క్రీ.శ. 1250 ప్రాంతమున కాంచీపుర

---

28. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 72.
29. Nellore Inscriptions, Vol. II, No. 61.
30. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 74.
31. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 75.
32. When Sundara Pandya withdrew, Ganapathi, at the instance of the Poet Tikkana assisted Manuma Siddhi, the son of Choda Tikka, against his domestic enemies and seated him firmly on the Nellore Throne. Nilakanta Sastry, A History of South India, p. 212.

మును పరిపాలించెను. ఇతని విషయము లీతని శాసనముల వలన తెలియుచున్నవి. ఇతని శాసనములు కాంచీపుర పరిసరములందు గలవు.

ఈ ఇరువురు నల్లసిద్ధి రాజులలో నేరాజు కాటమరాజుతో యుద్ధము చేసెనను అనుమానము వచ్చుటకు కాటమరాజు కథ యందలి వ్రాయబడిన విషయములు అస్కారములుగ నున్నవి.

కాటమరాజు కథ యందు పలుతావులందు పల్లవ నల్లసిద్ధిరాజని వర్ణింపబడి యున్నది. అనుబంధమునగల 'భట్టు రాయబారము' నందును పల్లవ నల్లసిద్ధి రాజని గలదు. ఈతని వంశమును ముక్కంటి పల్లవునితో ముడి పెట్టుటయును జరిగినది. కాని గ్రంథము నందలి సంఘటనల బట్టి వ్యక్తులను బట్టి సమన్వయము కుదురుట లేదు.

నల్లసిద్ధిరాజు సైన్యమున మొదటి దినము యుద్ధము చేసిన ఖడ్గతిక్కన, నెల్లూరి నల్లసిద్ధిరాజు ఆస్థానమున దండనాధుడు. ఇతడు కాటమరాజుతో జరిగిన యుద్ధమున మొట్టమొదట పాల్గొని వీరోచితముగ పోరాడి, వీరస్వర్గము నొందెను. ఇతని పినతండ్రి కుమారుడయిన కవి తిక్కన నల్లసిద్ధిరాజుయొక్క మంత్రి. నిర్వచనోత్తర రామాయణమును వ్రాసి నల్లసిద్ధిరాజున కంకితమిచ్చెను. తిక్కన కుటుంబీకులు, నెల్లూరి చోళులకడ ఉద్యోగులుగ నున్నటుల మనకు ఆధారములు కలవు. కనుక కాటమరాజుతో యుద్ధముచేసిన రాజు నెల్లూరు పాలకుడైన నల్లసిద్ధి రాజు గానీ, కాంచీపుర పాలకుడైన పల్లవ నల్లసిద్ధిరాజుకాడు.

కాటమరాజు కథయందు 'పల్లవరాజు' అనుటకు కారణము, కవి సరియగు విషయ సేకరణ చేయక పోవుటయే. ఈ కావ్యము కథాకాలమునకు ఇంచుమించు నాలుగు శతాబ్దముల తరువాత వ్రాయబడినదగుట, కవికి విషయ గ్రహణమునందు సరియగు శ్రద్ధ లేకపోవుట ఇట్టి పొరపాటు చేయుటకు కారణము.

కాటమరాజునకు నల్లసిద్ధిరాజునకు యుద్ధము జరిగెనా అను విషయమున నెట్టి సంశయమునకును తావులేదు. ఈ విషయమున శాసన ప్రమాణము గలదని పైన వివరింపబడినది.

నెల్లూరి మండలమున లభించిన శాసనమున కాటమరాజునకును మనుమ సిద్ధికిని జరిగిన యుద్ధ విషయములు గలవు.[33] కాని కాటమరాజు కథయందు వర్ణింపబడినట్లు, మనుమసిద్ధిరాజు కాటమరాజుతో చేసిన యుద్ధమున మరణింప లేదు. క్రీ.శ. **1263** ప్రాంతమున ముత్తుకూరి రణరంగమున పాండ్యులతో పోరాడి మరణించెను.

ఇంత ప్రసిద్ధమగు సంఘటన ఒకటి రెండు శాసనములు, లోకలు రికార్డుల నందు, తప్ప, సమకాలీన సాహిత్యమునందుగాని, ఈ యుద్ధానంతరము పరిపాలిం

33. నెల్లూరి మండల శాసన సంచయము. రెండవ సంపుటము. బటర్వర్తు, వేణుగోపాల స్వామిచే సంపాదితము.

చిన రాజుల శాసనములయందుగాని వర్ణింపబడక కేవలము జనవ్యవహారమున మాత్రమే మిగిలిపోయి, కథా కాలమునకు నాలుగు శతాబ్దముల అనంతరము వ్రాయ బడుట విచారింప దగ్గ విషయము. కథ జరిగిన కాలమునకును, రచనా కాలము నకును, నడుమ కాలవ్యవధాన మెక్కువగుటచేతను, ఆనాటి విషయము యధా తథముగ తెలియజేయుట ప్రయాసతో కూడిన పని.

యుద్ధమున పాల్గొనినటుల ఈ గ్రంథమున వర్ణింపబడిన రాజులందరును ఆ కాలము నుండిన వారా అను విషయము మాత్రము సంశయింప వలసినది. ఏలయన కవి పెక్కుమంది రాజుల నామములను పేర్కొని "చెన్నపట్టణమేలు చంద్ర శేఖరుని" గూడ పేర్కొనెను. ఈ చెన్నపట్టణము క్రీ.శ. 1632, 1672 సంవత్స రము నడుమ దామర్ల చెన్నభూపతి కుమారుడయిన, అయ్యాపేంద్రుడు, తండ్రి పేరున కట్టించెనని తెలియుచున్నది.[34] ఈతడు క్రీ.శ. 13 వ శతాబ్దమున జరిగిన యుద్ధమున పాల్గొనుట అసంభవ విషయము. కనుక, ఈ కాటమరాజు కథయందు అనుబంధమున గల కథలయందును పేర్కొనబడిన వ్యక్తులకు ఆ యుద్ధముతో గల సంబంధము సంశయింప వలసిన విషయమని స్పష్టపడుచున్నది. కవికి తోచిన నామములను కల్పించి వ్రాసియుండును. సిద్ధిరాజు మంత్రి కవి తిక్కనయై యుండగ, ఈ కావ్యమున చింకర్ల భీమన అని గలదు. కనుక ఈ విషయమున సత్యాసత్య నిరూపణము కష్టము.

ఈ కథలయందు పెక్కు కాల్పనిక విషయములున్నవి. కాల్పనికమైనను, లోకసంబంధమైనవి కావు. అతిలోక కాల్పనికమే (Mythical Atmosphere) ఎక్కువ. అతిలోక కల్పనమును, వీర చరిత్రమును కలిపివ్రాసినవి ఈ కథలు. ఇందు ఒకటి రెండు సంఘటనలు తప్ప తక్కిన వర్ణనలన్నియు చరిత్రతో సంబంధము లేనివి.

కాటమరాజు పినతండ్రియగు పల్లికొండ మరణానంతరము లింగరూపమును దాల్చుట, నడుమ నడుమ బ్రతికివచ్చి కాటమరాజాదులకు సలహాలనిచ్చుట, విష్ణువు యొక్క అంశమున బొల్లావు జన్మించుట, యుద్ధమునందు పెక్కుమందిని సంహ రించుట, బీరన్న ప్రార్థింపగా కత్తి ఎగిరివచ్చి భుజముపై వ్రాలుట,[35] పోచయ్యా మరణించిన శిరములచేత మాటలాడించుట,[36] దేవతలు ఆకాశమునుండి యుద్ధ మును తిలకించుట,[37] పుష్పవర్షమును కురిపించుట, తాళపత్రమును తెచ్చుట కేగిన ఎర్రయ్యా, రాక్షసిని, పులివంటి పందిని, పెద్ద గండుచీమను చంపి, పత్రము లకు బదులు వృక్షమును తెచ్చి మరల యధాస్థానమున నుంచుట, జరగబోవు

34. కాటమరాజు కథ, పీఠిక. p. xxx — xxxi.

35. కాటమరాజు కథ, p. 36.

36. కాటమరాజు కథ, p. 113.

37. కాటమరాజు కథ, p. 143.

విషయములు మున్ముందుగ తెలుపుట, మొదలగు పెక్కు కల్పనలు ఈ గ్రంథమున గలవు. ఇంక ఈ గ్రంథమున వివరింపబడినట్లు పలుదేశముల నుండి రాజులరు దెంచి యుద్ధమున పాల్గొనుట అసంభవము, అతిశయోక్తి. ఇంతియేకాక గోవులు సహితము మాటలాడెడివనుట, జరుగబోవు యుద్ధమును గూర్చి ఆవులు, పెయ్యలెర్ర న్నతో చెప్పెడివనుట, చారిత్రకములన్న నమ్మశక్యముకాదు. ఇవి కేవలము అమాయకులైన జానపదులను రంజింప చేయునేగాని సరియగు చరిత్రను అందింపవు. పల్లెపట్టులలో రచ్చబండలకడ పనులన్ని ముగిసిన పిదప రాత్రులందు సమావేశమైన అమాయక పల్లె ప్రజల హృదయాలలో అద్భుతమైన భావనంచలనము కలిగించి, వీరావేశులను గావించు రసాత్మకమైన వీరగాథలివి. పురాణ గాథలకంటెను ఇట్టి వీరుల గాథలు ప్రజలను పరవశులను గావించును. ఇట్టి అతిలోక కల్పనతో నిండిన గాథలు సర్వదా సంభవమను నంత ఆవేశముతో జానపదులు గానము చేయుదు రనుట అతిశయోక్తి కాదు. ఇటువంటి కథలలో చరిత్ర కొలదిగ ఉండి, కల్పిత కథన మెక్కువగ నుండును. ఈ గ్రంథమున కొన్ని ఆనాటి రాజకీయ సాంఘికాది స్థితిగతులు తెలియుచున్నవి. మనుమసిద్ధి కాటమరాజుల నడుమ జరిగిన యుద్ధ మున పాల్గొనిన కొంతమంది మహావీరులను గూర్చి దేశములో పెక్కు చాటువులు కూడ ప్రచారములో ఉన్నవి. ముఖ్యముగ ఖడ్గతిక్కనను గూర్చిన చాటువులున్నవి.

**సాంఘిక ఆచారములు :**

కాటమరాజు కథ వలన మనకు ఆనాటి ప్రజలలో కొందరి ఆచార వ్యవహారములు తెలియుచున్నవి.

యాదవులు గంగను పూజించెడివారు. గంగ వారికి ఆరాధ్యదేవత. వారి ముఖ్యమైన సంపద గోవులు. వాటికి జలము, తృణము అవసరము. కనుక వారు గంగను ఆరాధించెడి వారేమో. వీరమరణము నొందిన కొందరు దేవతలుగా వెలయుదురని వారి నమ్మకము. అటుల మరణించిన వారిని పూజించు ఆచారము కలదు. కాటమరాజు పినతండ్రి పోలురాజు వల్లురాజునకు మల్లమ్మకు చంద్ర శేఖరుని వరప్రసాదమున జన్మించెను. పల్లవరాజు ఆనకట్ట నిర్మించుటకై జంగ ములు నిర్బంధింపగా వారు పోలురాజును శరణు కోరగా పోలురాజు పల్లవరాజుతో యుద్ధముచేసి మరణించెను. మరణించిన పోలురాజు పంచలింగాల కొండకడ గంగులరేవు క్రింద లింగమాయెనట. ఇతనిని కూడ కాటమరాజాదులు కులదైవ ముగ పూజించెడివారు. ఆ కాలమున యుద్ధము జరుగుచున్నపుడు మొక్కు బడులు చెల్లించుటకై జగన్నాథ క్షేత్రమునకు వెళ్లెడువారు. సొగటాలను ఆడు చుండెడివారు. రామాయణ భారతాదులను వినెడివారు. గుడారముల ముందు శరభశార్దూల గండభేరుండాది ముఖముల నెత్తించెడివారు. పలురకములైన గుడారముల నెత్తించెడివారు. ముఖ్యముగ వర్షములకు తడియకుండ జిడ్డుమైనపు

పూతపూసిన గుడారములను వేసెడి వారట.

రాజు స్వయముగ మాటలాడెడివాడు కాదు. రాజు స్వయముగ మాటాడ కుండుట రాచమర్యాద. యుద్ధమున కేగు వారికి గంధము కస్తూరిపూసి, పళ్లెరమున తాంబూలము పెట్టి ఇచ్చి పంపెడివారు. రణరంగమున ఓడి వచ్చిన వారిని ప్రజ లందరును అవమాన పరచెడివారు. ఓడిన భర్తలను భార్యలు గౌరవించెడి వారు కారు. సహగమనము చేయు ఆచార ముండెను. తిక్కన భార్య భర్తతో సహగ మనము చేసెను.

ఆ కాలమున శకునములనిన నమ్మకముండెడిది. సిద్ధిరాజు రణరంగమున కేగ సన్నద్ధుడైన సమయమున అతని సేనలపై తీతువలు ఎగిరెనట. అంత రాజు శకున ఫలమరయుటకు సంధ్యగోపాలుడను వానిని పిలిపించెను. (శకున ఫలము లను దెలుపుటకు ప్రత్యేకముగ ఒక వ్యక్తి ఉండెడివాడని తెలియుచున్నది). ఆతడు భవిష్యమును తెలిపెను. ఆనాడును శకునములనిన అపనమ్మకము కూడ నుండెడిది. సంధ్యగోపాలుడు ఆవు యుద్ధమునకు వచ్చి పెక్కుమందిని చంపునని శకునము తెలిపెను. అది విని పెక్కుమంది వీరులు ఆవునకు మేము వెరచెదమా, నీవిటులపలుకుట తగదనిరి రాజు కూడా 'శకున పంతముకల్ల సలుపంగరాద' ని వీరులను యుద్ధమునకు సన్నద్ధులను గావించెను.

ఆవులు లేగలు యుద్ధము చేసెడివట! ఇది విచిత్రముగ నున్నది. ఇది కవి కల్పనయో లేక ఆనాడు యాదవులు తమ బలగమైన ఆవులను రణరంగమునకు తీసుక వెళ్లెడివారో అనూహ్యముగ నున్నది.

బ్రాహ్మణులు మంత్రులుగను, సైన్యాధిపతులుగను, రాయబారులుగను, దండనాధులుగను ఉండెడివారు.

ఆనాడు సంఘమున శైవ వైష్ణవమతములు ప్రాచుర్యమున నుండెను. పెక్కు యుద్ధములకు, చిన్నచిన్న కలహములకు మతమే ప్రధాన కారణముగ కన్పట్టు చున్నది. అయినప్పటికి శైవులు వైష్ణవమతమును, వైష్ణవులు శైవమత మును ఆదరించినటుల స్పష్టపడుచున్నది. యాదవులు వైష్ణవులు. కాని కాటమ రాజు శివపురాణము వినినట్లు వర్ణింపబడినది.

కాటమరాజు కథవలన నాడు శైవవైష్ణవమతములు రెండును ప్రచారమున నున్నటుల తెలియుచున్నది. యాదవసేనలో వీరశైవులుండిరి. బ్రహ్మరుద్రయ్య వీరశైవాచారములను నెరపి యుద్ధమునకు వెళ్లెను. ఇతని వాహనము వృషభము. ఐతమ రాజాదులు పంచాక్షరీ మంత్రము పఠించి, శివపూజలు చేసి యుద్ధమునకు వెళ్లిరి. పల్లికొండ మొదలగువారు యుద్ధరంగమున శివపురాణము వినుచుండిరి. కాటమరాజు కృష్ణుని అవతారముగ వర్ణింపబడెను. దీని వలన యాదవులు హరి హరుల నిరువురను సమానముగ పూజించిరని స్పష్టమగుచున్నది.

నాడు వెట్టిచాకిరి ఉండెడిది. సిద్ధిరాజు వెట్టివాండ్రను పిలచి సైన్యములకు

కావలి కొరకు రాత్రులందు దివిటీలు పట్టుటకు నియమించెను.

శత్రుపక్షమున వచ్చిన రాయబారి మెడలో పట్టుబట్ట తాడుగావేసి శత్రురాజు నవమానించినట్లుల భావించెడివారు. బొమ్మకట్టు ఆచారము ఆనాడును నుండెను. యాదవుల భట్టు, సిద్ధిరాజు భట్టుతో సిద్ధిరాజును నిందించుచు 'పారిపోవగజంపు పోరబొమ్మగట్టు' 'మీ సిద్ధిరాజుకు మా యెద్దుకాతి బొమ్మ,' 'తల్లిరాని రాజుకు దరువు పాలిబొమ్మ, చెల్లనిరాజుకు చెడికాలిబొమ్మ' అనెను. శత్రువుల నవ మానించుటకు వారి ప్రతిమలు చేయించి కాలికి కట్టుకొనుట, గండపెండేరము లందు చెక్కించుట, బొమ్మలు చేయించి తమ్మపడిగలలో నుంచుట కలదు.

బ్రాహ్మణులను, పారిపోయెడి వారిని చంపరాదను నియమమును పాటించెడి వారు.

ఉత్తరములు వ్రాయుటకు రాజుల కడ ఛప్పన్న భాషలు తెలిసిన అధికారు లుండిరి. లేఖలను ఒకచోటి నుండి మరియొక చోటికి బహుభద్రముగ పంపెడివారు. కాటమరాజు రామచంద్రునితో కమ్మలు వ్రాయించి తన వ్రాలు చేసి ఆ లేఖలను భద్రముగ 'చెంద్రికల' లో (పెట్టెలు) పెట్టి 'యురువైన తన చేతి యుంగరంబునను లక్కముద్రలు జేసి గ్రక్కుననపుడు' కాలారి చేతికిచ్చిపంపెను. నాడు లేఖలను శత్రువులకు తెలియకుండ గుప్తముగ వ్రాయు చుండిరి. కాటమరాజు వ్రాయించిన లేఖను చూచి ఐతమరాజు మంత్రి 'సాద వ్రాతయుగాదు నన్నుచిన్నెలును నీ జాబు తెలియదు యదుకులాధీశ' అనెను. ఛప్పన్న భాషలు నేర్చిన నీ ముద్దు కూతురు సిరిదేవితో చదివింపుమని, ఐతమరాజునకు మంత్రి యిచ్చిన సలహా వలన ఆనాడు స్త్రీలు కొందరు బహుభాషలను నేర్చిరని తెలియుచున్నది.

ముఖమలు, పట్టు విరివిగా ఉపయోగించెడివారు. 'సొన్నటంకాల'ను నాణె ములు వాడుకలో నుండెను. పురుషులు కుడివైపు శిగలు వేసుకుని పూవులను ధరించెడి వారు.

రణరంగమునకు సర్వవస్తు సముదాయమును కూర్చుకుని వెళ్లెడివారు. అందు పట్టెమంచములు పరుపులు, దిండ్లు, చీరలు, తీవాసీలు, సన్నబియ్యాలు, చక్కెర, గందపొడి, పునుగు, జవ్వాజి, పోకలు, కంట్లాలు, పొన్నుటాకులు మొదలగునవి ఉండెడివి.

పుల్లరి క్రింద కోడెలను దూడలను తీసుకొను ఆచారము కలదు.

సంఘమునందు వీరులను మిక్కిలి గౌరవించెడివారనుటకు తిక్కనకథ ఆధారము. పిరికివారికి నాటి సంఘమున గౌరవము లేదు. పురుషులేకాదు నాటి స్త్రీలును వీర నారీమణులే అనుటకు నిదర్శనము తిక్కన తల్లి, భార్య. వారి వీరత్వముముందు పతి సుతులను బంధుత్వము కూడా పాటింపబడెడిదికాదు. వీరుడు భీరువై గృహోన్ముఖుడగుట వారు స్వప్నమున సహితము తలంపని విషయము.

వైష్ణవులు ఆవులకు సహితము తిరుమణి తిరుచూర్ణములను దిద్దెడివారు.

నాదుటందెలు, రత్నాలుతాపిన రావిరేకులు, బంగారు కుప్పెలు, గోమేధికపుగొలుసు, ముత్యాలమువ్వల పేర్లు, మురువుగజ్జెలు, జేదుపూకడియములు, రత్నాలమెడనూలు, డాకారిపెండెము, బిరుదులు మొదలగు ఆభరణములను పురుషులు ధరించెడివారు. ఆనాటి పురుషులు చెంగావిచీరలు ధరించి నలుబది మూరలదట్టి కట్టెడువారు. ఆవులను సహితము వీరు పెక్కు ఆభరణములతో అలంకరించెడివారు.

రచనా విశేషములు :

కథా కాలము, కథాపురుషుల కాలము మొదలగు చారిత్రక అంశములను విడచిన కాటమరాజు కథయందు చక్కని వర్ణనలు రూపుకట్టువిధముగ చిత్రింపబడినవి. రచనా సౌలభ్యము కలదు. నాటకీయత కలదు. రచనా సౌలభ్యమున్నప్పటికిని రచనయందు పేలవత్వము లేదు. పాత్రపోషణము వీరోచితముగ చక్కగనున్నది. అసలు పదకవులు పాత్ర చిత్రణమును చక్కగా చేయుదురు. ఈ గాథయందు మానవులేకాక జంతువులు సహితము వీరరసావేశము గలవి. యుద్ధమున పాల్గొనిన వీరులందరును విజయమో, వీరస్వర్గమో అని పోరాడినవారే. ఇది వీరుల గాథ. ముఖ్యముగ సామాన్య జనులలో ఖ్యాతి గాంచిన వీరగాథ. మంజరీ ద్విపదలో వ్రాయబడినది.

కాటమరాజు అసహాయశూరుడు. కడప, నెల్లూరు, సిద్దవటము, కందుకూర్తు, కనిగిరి సీమలలో కాటమరాజునకు గుళ్లు కలవు.

చక్కని నాటకీయతతోపాటు కథయందు రసస్ఫూర్తి కలదు. ఇందు వీర కరుణ హాస్యరసములు చక్కగా పోషింపబడినవి. తిక్కన యుద్ధ ఘట్టము, పిన్నయ్య కొమర సిద్ధితో యుద్ధము చేయు సన్నివేశము వీర రసమునకు ఆలవాలములు. బొల్లావు యుద్ధము, బీరన్న నల్లసిద్ధిరాజుల యుద్ధము, సిద్ధిరాజు కాటమరాజుల యుద్ధముకూడ వీరరసమునకు ఆటపట్టులు. యుద్ధవర్ణన, యుద్ధము ముగిసిన తరువాత రణరంగ వర్ణన కవి క్రమలకు కట్టునటుల వర్ణించెను. కొన్ని వర్ణనలు మనకు చిత్రములవలె కనులముందు కదలాడును. బొల్లావును యుద్ధమునకు పంపుటకు అలంకరించిన విధానమిట్టిదే.[38] ఇందు చలదీభావ చిత్రముతో పాటు వైష్ణవ మతాభిమానము వ్యక్తమగుచున్నది.

"ఆకొని బొల్లావు అలుగులు దినుచు
దాహంబుగొని రక్తధార గ్రావుచును".

అని బొల్లావు మరణించు ఘట్టమును కరుణరసపూరితముగ హృదయవిదారకముగ, హృదయములందు నాటుకొనునట్లు వర్ణింపబడినది. ఈ ఘట్టము చదివిన,

38. కాటమరాజు కథ, pp. 46 – 47.

బొల్లావు సైనికులందరిని ముప్పతిప్పలు పెట్టి పెక్కుమందిని సంహరించెనను భావము పోయి జాలి కలుగును.

బొల్లావు వెంట తరుమగా దానిధాటికి ఆగలేక
"పడలేక యాపదల్ పడఁతుల చేత
వస్తి మేమిటికని వగఁజెందువారు
నడ్డకత్తెలు భేడెలటు పాఱవైచి
మళ్లి చూచుచు వారు మరియు నుఱుకంగ
బడి వారి పాదాలఁబడి లేవలేక
హరి హరీ! మముగావు మనియెడివారు"[39]

మనకు కడుపుబ్బ నవ్వుపుట్టించెదరు. ఇట్టి ఘట్టములు ఈ గాథలో పెక్కులున్నవి.

"గ్రచ్చపొదజొచ్చె వేగంబె యతడు
పిట్టకీచురుమన్న బిట్టులిక్కిపడుచు
బోటుబంటగు నట్టి పొడబాల సోము
నన్నుల బొడువంగ గ్రచ్చముళ్ళుండె"[40]

బొల్లావు వచ్చునను భయముతో పారిపోయిన ఓ బళుడి అవస్థ ఇది.

ఈ కథలందు పెక్కుతావులలో రచన సంభాషణాక్రమమున సాగినది. తిక్కన బ్రహ్మరుద్రయ్యల సంభాషణ, సంధ్య గోపాల వీరనాయకుల ప్రలాపములు. ముఖ్యముగ భట్టురాయబారము ఎన్నదగిన రచన. భట్టు రాయబారమంతయు సంభాషణలతో నడచినది. సిద్ధిరాజు భట్టు, కాటమరాజు భట్టు తమతమ ప్రభువుల యొక్క గొప్పతనమును వ్యక్తపరచి అత్తకోడండ్రవలె చక్కగ నెత్తిపొడుచుకొనిరి. సంభాషణా చాతుర్యమిందు చక్కగచూపబడినది. ఇందు పద పదమునకొక సామెతగా సామెతలున్నవి. సామెతలుకూడ సందర్భానుసారముగ కథాగమనము కుంటుపోకుండ నిమడ్చబడినవి.

మంజరీద్విపదలో నడచిన ఈ వీరగాథ చక్కని నాటకీయతతో, సంభాషణా సరళితో, వర్ణనా వైచిత్రితో వీరధర్మ ప్రతిపాదనతో అలరారుతూ అద్వితీయముగ సాగి పాఠకులను రంజింపచేయును.

ఏ జాతి జీవిత విధానమందైన వీరులకు వీర కార్యములకు బాహుబల పరాక్రమమునకు గల ప్రాధాన్యము మిగిలినవాటికుండదు. సాహిత్యము జన జీవితమునకు ప్రతిబింబము కనుక వీరకథలు చోటుచేసుకున్నవి. సామాన్య జనులలో పాటలుగ, పదములుగ రూపు దిద్దుకొని అనేక కథలుగా జనసామాన్యమున అల్లుకొనిపోయి స్థిరముగా నిలచిపోయినవి. ఈ గాథకూడ జనసామాన్యమున కథలుగా అల్లుకొని మిక్కిలి ప్రాచుర్యము పొందినది అనుట అతిశయోక్తికాదు.

39. కాటమరాజు కథ, p. 56.
40. కాటమరాజు కథ, p. 60.

"రామాండ కతలంటె మీమెరుంగనివా
కాటమరాజుకు కర్ణుఁడోడె
భారత కతలోన బాలరాజొక్కఁడు
కుంబకర్ణునిఁ బట్టి గుద్దిజంపె
బాగోతకత కంట పాటమె అందులో
యిగినేశుఁ డర్జును నిసగఁబొడిచె
కందపురాండంబు కతపిల్ల కాటేరి
యారబద్రుని యిసియించి చంపె"[41]

రామాయణ భారతాది పురాణములతోపాటు, పలనాటి వీరచరిత్ర కాటమరాజు కథలును విని, నామమాత్ర పరిజ్ఞానమును మాత్రమే కలిగిఉన్న ఒక పల్లెటూరి వ్యక్తి అజ్ఞానమును తెలియజేయుచున్న మూర్ఖశతకములోని ఈ పద్యము కాటమరాజు కథకుగల ప్రాచుర్యమును తెలియ జేయుచున్నది. పల్లెజనులకు రామాయణ భారతాదులవలె, పలనాటి వీరచరిత్రవలె కాటమరాజు కథలు పరమ ప్రియములు, గౌరవార్హములు. ఈ గాథను విని ఎంతెంతమంది గుండెలుపండగా, బుజాలు పొంగగా ఆనందించి పరవశించిరో రచననుబట్టి ఊహింపవచ్చును. ఇట్టి అద్భుతమైన కథ అందించిన కవి ప్రశంసనీయుడు.

వీర రసాత్మకము అద్భుత రసపూరితము అయిన ఈ గాథ యాదవులకు సంబంధించిన దగుటచే యాదవులలో మిక్కలి ప్రచారమునకు వచ్చినది. ఇందు చరిత్ర యెంతయో కల్పన యెంతయో విడదీయరానంతగ పెనవేసికొని పోయినవి.

41. ఆంధ్ర పత్రిక, 1953-54, p. 33.

# 7. శ్రీకృష్ణదేవరాయలు

పదునాల్గవ శతాబ్దారంభమున దక్షిణాపథము యవనుల దండయాత్రా పరంపరలతో కల్లోలితమైనది. క్రీ. శ. 1307 వ సంవత్సరమున దేవగిరి రాజును మహమ్మదీయులు చెరపట్టిరి. ద్వారసముద్రమునందలి హొయసల రాజులను క్రీ. శ. 1310 వ సంవత్సరమున ఓడించి కప్పముగొనిరి. ఏకశిలానగరము రాజధానిగ రమారమి మూడువందల సంవత్సరములు మహోన్నతముగ వెలుగొందిన కాకతీయ మహాసామ్రాజ్యము యవనుల జైత్రయాత్రాపరంపరలకు తట్టుకొనలేక క్రీ. శ. 1323 వ సంవత్సరమునందు కూలిపోయినది. ఈ విధముగ పెద్దవైన మూడు హిందూరాజ్యములు కొలది కాలములోనే కూలి పోవుటచే తమను సరిగ చూచు నాథుడులేక, ప్రజలలో అలజడి చెలరేగెను. యవనులను తమ దేశమునుండి పారద్రోలవలెనను సంకల్పము కలిగెను. తెలంగాణమున, తూర్పుతీరప్రాంతమున ప్రోలయ, కాపయనాయకులు డెబ్బదియిద్దరు ఆంధ్రనాయకుల సహాయముతో తురుష్కులనోడించి తరిమి కొట్టిరి. రాయలసీమయందు ఆర్వీటి సోమదేవరాజు తురకలను పరాభవించి తరిమివైచెను. హైందవరాజ్య సంరక్షణమే లక్ష్యముగా, రెడ్లు, పద్మనాయకులు రాజ్యములను నెలకొల్పిరి. ఈ తరుణమున క్రీ.శ. 1336 వ సంవత్సరమున హరిహరుడు బుక్కరాయలను సోదరులు విజయనగర రాజ్యమును స్థాపించిరి. తమలోతమకు ఐకమత్యము లేనిచో మహమ్మదీయులను ప్రతిఘటించుట అసంభవమని తలంచి, ఆంధ్ర కర్ణాట, తమిళ ప్రాంతములను ఒకే త్రాటిక్రింద నడుపవలెనన్న వీరి ప్రయత్నమును యవనుల దండయాత్రలతో పెక్కు బాధలు అనుభవించుచున్న ప్రజలు బలపరచిరి. దానితో ఆంధ్ర కన్నడ దేశముల సరిహద్దులో తుంగభద్రానదీతీరమున హంపీ విరూపాక్షక్షేత్రమున సహజరక్షణగనున్న కొండలనడుమ హరిహరరాయలు విద్యారణ్యస్వామి సహాయమున విజయనగరమును నిర్మించెను. విజయనగరమును హరిహర, బుక్కరాయలు, వీరిసంతతివారు 150 సంవత్సరములు పరిపాలించిరి. వీరిలో చివరి రాజైన విరూపాక్షరాయలు విషయలంపటుడై, అసమర్థుడైనందువలన సేనానియగు సాళువనరసింహరాజు విజయనగర రాజ్యాధిపత్యమును చేజిక్కించుకొనెను. క్రీ.శ. 1480 నుండి 1494 వరకు చంద్రగిరి రాజధానిగ ఈతడు విజయనగరమును పరిపాలించెను. ఇతని తరువాత ఇతని

కుమారులిరువురు పది సంవత్సరములు పరిపాలించిరి. వీరు అసమర్థులగుటచే సాళువ నరసింహరాజు సేనానియగు తుళువనరసనాయకుడు రాజయ్యెను. విజయ నగరము రాజధానిగా పరిపాలించిన ఈతని తరువాత ఈతని కుమారుడు వీరనర సింహరాయలు రాజ్యమునకు వచ్చెను. క్రీ. శ. 1509 వ సంవత్సరమున వీర నరసింహరాయల మరణానంతరము, మంత్రి సాళువ తిమ్మరుసు సహాయ సహకారములతో అతని సవతి తమ్ముడు కృష్ణదేవరాయలు రాజ్యాధికారి అయ్యెను.

క్రీ. శ. 1509 నుండి 1530 వరకు విజయనగరము రాజధానిగ ఇంచు మించు దక్షిణభారతావని నంతటిని ఏకఛత్రాధి పత్యముక్రింద ప్రజానురంజకముగ పరిపాలించిన ఖ్యాతిగాంచిన మేటి ప్రభువు కృష్ణదేవరాయలు. కృష్ణదేవరాయలు ప్రతిభాశాలి. బాహుబలపరాక్రమములుగల మహా వీరుడు. రాజతంత్రజ్ఞుడు. యుద్ధతంత్రమున బహునేర్పరి. రామేశ్వరమునుండి కటకము వరకు జైత్ర యాత్రలుచేసి అస్తవ్యస్తముగనున్న సామ్రాజ్యమున సుస్థిరతను నెలకొల్పిన చక్రవర్తి. శౌర్యపరాక్రమములతో జగత్ప్రసిద్ధి గన్న మహాప్రభువు. సత్పరిపాలనతో విజయనగర సామ్రాజ్యమహౌన్నత్యమును దేశవిదేశీయుల ప్రశంసలకు పాత్ర మొనర్చినవాడు. ఆంధ్రభాషనాదరించి భువనవిజయ సభామంటపమున కవితా గోష్ఠులను నెరపి కవితాస్వాదనముచేసి. అష్టదిగ్గజములను పోషించిన కవిపండిత పోషకుడు. సంగీత విద్వాంసుడు. సాహిత్యప్రియుడు. బహుభాషావేత్త. విద్వత్కవి. కళాభిమాని. కృతికర్త. కృతిభర్త.

భువనవిజయ సభామంటపమున నెంతటి సరసముగ కవితాగోష్ఠులను నెరపెడివాడో సమరాంగణమున యంతటి ప్రతిభావంతముగ వ్యూహములను రచిం చెడి నేర్పరి. కత్తిపట్టిన చేతనే కలముపట్టి సాహితీ సమరాంగణ చక్రవర్తియైన రసవచ్చక్రవర్తి.

కటకమునుండి కన్యాకుమారివరకు ఏకచ్ఛత్రాధిపతిగా పరిపాలించిన కృష్ణ దేవరాయసార్వభౌముని, రాజ్యాభిషేకము, పరిపాలనాక్రమము, దిగ్విజయయాత్రలు, వివాహవైభవము, తీర్థయాత్రాసందర్శనములను వివరించిన 'రాయవాచకము', 'కృష్ణరాయవిజయము' లు ఈ ప్రకరణమున పరిశీలింపబడినవి.

## తుళువ వంశవృక్షము


చంద్రుడు
తురువసుడు
తిమ్మరాజు = దేవకి
ఈశ్వరరాయలు = బుక్కాంబ
నరసనాయకుడు
తిప్పాంబవలన
వీరనరసింహరాయలు
1505–1509
తిరుమలదేవరాయలు
నాగలాంబికవలన
శ్రీకృష్ణదేవరాయలు
1509–1530
ఓబాంబికవలన
రంగరాయలు భార్య
తిమ్మాంబ
అచ్యుతరాయలు
1530–1541–42
వేంకటదేవరాయలు
తిరుమలాంబ
అళియరామరాయలభార్య
వేంగలాంబ
తిరుమలరాయలభార్య
తిరుమలయ్య
దేవమహారాయలు
కుమారుడు
(పేరుతెలియదు)
సదాశివరాయలు
1542–67

# రాయవాచకము-విశ్వనాథనాయకుని స్థానాపతి
# కృష్ణరాయవిజయము-కుమార ధూర్జటి

**విశ్వనాథనాయకుని స్థానాపతి :**

రాయవాచక గ్రంథకర్త పేరేమియో తెలియుటలేదు. గ్రంథారంభమున "..........శ్రీ మన్మహామండలేశ్వర రాజమాన్య మహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథ నాయనయ్యవారి దివ్య పాదపద్మములకు దేవరవారి స్థానాపతి భక్తపరాధీనుండు సద్వినయభయభక్తుల నున్ను శాయంగల విన్నపం"[1] అని మాత్రమే గలదు. పేరేమియులేదు. ఈతని కాలమును గూర్చిగాని గ్రంథరచనాకాలమును గూర్చి గాని ఏమియు తెలుపలేదు. ఈ అంశములను తెలిసికొనవలె ననిన విశ్వనాథ నాయకుని పరిపాలనా దినములను తెలిసి కొనవలెను.

కృష్ణదేవరాయల చివరి దినములలో విశ్వనాథనాయకుడు మధురకు రాజాయెను. రాయల కాలమున మధుర విజయనగరమునకు సామంత రాజ్యము. విశ్వనాథనాయకుడు అతని వంశీయులు రెండు శతాబ్దముల పాటు మధురను పరిపాలించిరి. విశ్వనాథనాయకుడు క్రీ.శ. 1529 నుండి 1564 వరకు మధురను పాలించెను. ఈతడు అచ్యుతరాయల కాలమున మధుర పాలకుడైనటుల కొందరి అభిప్రాయము. కాని "Viswanatha Nayaka who was appointed to rule over the Madhura Country by Krishnadevaraya became the sole ruler of the Pandya and Chola Kingdoms and Krishnadevaraya died sometime after this and was suceeded by Achyutaraya"[2] అని తెలియు చున్నది. మధుర మండలమును క్రీ.శ. 1529 నుండి 1736 వరకు ఒక ఆంధ్రనాయక వంశమువారు పాలించిరి. వీరిలో మొదటి రాజు విశ్వనాథనాయకుడని ఖండవల్లి లక్ష్మిరంజనము బాలేందు శేఖరంల అభిప్రాయము.[3]

కృష్ణదేవరాయలు క్రీ.శ. 1530 వ సంవత్సరమున మరణించెను. "...but he fell too seriously ill to carry out his project, and died shortly afterwards at the age of from forty-two to forty-five years. It was then the year 1530 A.D.[4] ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి

1. రాయవాచకము. p. 2.
2. Dr. S. Krishnaswamy Aiyangar, Sources of Vijayanagar History, p. 323.
3. ఖండవల్లి లక్ష్మిరంజనం బాలేందు శేఖరం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 377.
4. Robert Sewell, A Forgotten Empire, p. 152.

కూడ ఈ అంశమునే స్పష్టము చేయుచున్నది.[5] కృష్ణరాయల మరణ విషయమున భిన్నాభిప్రాయములు కనపడుచున్నవి. నీలకంఠశాస్త్రిగారు 1529 వ సంవత్సర మనిరి.[6] కాని రోబర్ట్‌సీవెల్, నూనిజ్‌ల వ్రాతలు నమ్మదగ్గవి అని తెలియు చున్నది.[7] కనుక కృష్ణదేవరాయలు క్రీ.శ. 1530 వ సంవత్సరమున మరణించె ననుట స్పష్టము. విశ్వనాథనాయకుడు క్రీ.శ. 1529 నుండి మధురను పరిపాలించు చుండుటచే, కృష్ణదేవరాయల కాలముననే రాజైనటుల స్పష్టమగు చున్నది. కనుక పేరు తెలుపుకొనని అతని స్థానాపతి కృష్ణదేవరాయల అనంతరము కొలది సంవత్సరములలోనే ఈ పుస్తకమును వ్రాసి యుండును. అనగా క్రీ.శ. 16 వ శతాబ్దపు ప్రథమార్థమున వ్రాసి యుండుననుట స్పష్టము. విశ్వనాథ నాయకుని స్థానాపతి యగుటచే క్రీ.శ. 16వ శతాబ్దమున నుండెననుట సుస్పష్టము.

కుమార ధూర్జటి :

కృష్ణరాయ విజయ కర్తయైన కుమార ధూర్జటికి వేంకటార్యుడను మరియొక నామము గలదు. ఈతడు కోదండ రామరాజు కుమారుడైన ఆర్వీటి చిన వేంకట రాయని ఆస్థానమున నుండి, అతని ప్రోత్సాహముతో కృష్ణరాయవిజయమును రచించెను. ఆర్వీటి చిన వేంకటరాజు క్రీ.శ. 1650 ప్రాంతమున నుండెను. కనుక కుమార ధూర్జటి క్రీ.శ. 1650 ప్రాంతము వాడని చెప్పవచ్చు.

ఈ కవి శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమును రచించిన ధూర్జటి తన పెదతాతయని చెప్పుకొనెను. పెదతాతయనగా తాతకు అన్నగారు కావలయును. కాని కుమార ధూర్జటికిని, ధూర్జటికిని నడుమ 130, 140 సంవత్సరముల వారడి కనపడు చున్నది. కనుక ఇతడు ధూర్జటి మనుమనికి మనుమడై ఉండును. ధూర్జటి వంశీయుడై, ధూర్జటివలె తానును కవియగుటచే కుమార ధూర్జటియను బిరుదు నామమును పెట్టుకొనినట్లున్నది.

"స్తుతిమతియైన యాంధ్ర కవి ధూర్జటి పల్కులకెట్లు గల్గెనో
యతులితమాధురీ మహిమ నామును మీ పెదతాత చాలన
న్నుతిగనె కృష్ణరాయల మనోజ్ఞ సభన్ వినుమీవు నట్లు మ
త్కృత బహుమాన వైఖరుల గీర్తివహింపుము ధాత్రిలోపలన్"[8]

అని చినవేంకటపతిరాజు కుమార ధూర్జటిని ప్రోత్సహించెడి వాడట.

కుమార ధూర్జటి కాళహస్తినివాసి. తండ్రిపేరు కాళయ. పాకనాటి ఆర్వేల నియోగి. కుమార ధూర్జటి పిన్ననాటి నుండి కావ్యరచనగావించెను. పిన్న

5. ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం, ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి, p. 331.
6. K.A. Nilakanta Sastry, A History of South India, p. 273.
7. Robert Sewell, A Forgotten Empire, p. 132, footnote.
8. కృష్ణరాయ విజయము, పీఠిక. ప. 29.

వయస్సుననే 'గభీర మధురశృంగార కళాలాలిత చాతుర్యము'గల కవి అనిపించు కొనెను.

"చిత్రముగాగ జిన్నపుడె చేసితి వౌరసముల్ చెలంగసా
విత్రీ చరిత్రమున్ మిగులవేడుక నిందుమతీ వివాహమున్
స్తోత్రమొనర్ప నర్హమగు సూక్తిగతిన్ రచియించి తొగదా
ధాత్రి బ్రసిద్ధి గావించితివి ధన్యుడవౌర కుమార ధూర్జటీ"[9]

అని చినవేంకటరాయలీ కవిని ప్రశంసించెను.

సారరచనాధురీణుడైన కుమార ధూర్జటిచేత కావ్యమును వ్రాయింపవలెనను సంకల్పముతో చినవేంకటరాజు కుమార ధూర్జటిని సభకు రప్పించి అతని కవిత్వమును మెచ్చుకొని, కవితా శక్తిని పొగడి

"మాకరుణకుఁ బాత్రుడవు
ప్రాకటగతిఁ బద్యకావ్యపణితిం జెపుమా
శ్రీకృష్ణరాయ చరితము
నీ కవితా ప్రౌఢిసుకవి నికరము మెచ్చన్"[10]

అని బంగారు కడియములు, చౌకట్లు, ఉంగరములు మొదలైన ఆభరణములు, జాళువాతలపాగ, పట్టు పచ్చడములు, తళుకు జిగిగల మేలిమి వస్త్రములు, ఖర్జూర, కదళి, నారికేళ మొదలైన ఫలములు; కస్తూరి, సంకుమదము మొదలైన సుగంధ ద్రవ్యములతోకూడిన తాంబూలము నొసంగి గౌరవించి, శ్రీరామున కంకితముగ శీఘ్రముగ కావ్యరచన గావింపుమని ప్రోత్సహించెను. ఆరవీటి చినవేంకటరాయని ప్రోత్సాహముతో కుమార ధూర్జటి కృష్ణరాయ విజయమును రచించెను.

కుమార ధూర్జటి క్రీ.శ. 1550 ప్రాంతమున నుండినవాడనియు, ఆకువీటి రాజైన చినవేంకటాద్రి ప్రేరణతో కృష్ణరాయ విజయమును వ్రాసెననియు వీరేశ లింగము పంతులుగారు వ్రాసిరి. కాని కావ్యరచనకు కుమార ధూర్జటిని ప్రోత్సహించినది ఆర్వీటి చినవేంకటరాజుగాని ఆకువీటి చినవేంకటరాయడు కాడు. కుమార ధూర్జటి పెక్కు పద్యములందు 'అరవీటి' 'ఆర్వీటి' అని ప్రయోగించెనే తప్ప 'ఆకువీటి' యనలేదు. కనుక పొరపాటు పడుటకును వీలులేదు. ఆర్వీటి చినవేంకటరాయని తండ్రి కోదండరామరాజు. తల్లి నాంచారమ్మ. ఈ కోదండ రామరాజు అళియరామరాయల మనుమని మనుమడు. కవి తానే చెప్పుకొనుటచే ఆర్వీటి చినవేంకటరాయని ప్రోత్సాహముననే గ్రంథరచన జరిగెననుట సమంజసము.

రాయవాచక, కృష్ణరాయ విజయములు వంద సంవత్సరముల వారడితో రచింపబడిన గ్రంథములు. ఒకటి గద్యకావ్యము, మరియొకటి పద్య

9. కృష్ణరాయ విజయము, పీఠిక, ప. 24.
10. కృష్ణరాయ విజయము, పీఠిక, ప. 30.

గద్యాత్మకము. రెండు గ్రంథములందలి ఇతివృత్తము ఒక్కటే. కాని విజయనగర నిర్మాణ వృత్తాంతమున, శింగిరిభట్టు గాథ, వ్యాసదర్శనము, మండనమిశ్రునికడ విద్యారణ్యుడు సకల శాస్త్రముల నభ్యసించు అంశములు, వీరనృసింహరాయల దినచర్య, ప్రతాపరుద్రుని ప్రసక్తి, గజపతితో గోదావరి కడ తురుష్కుల ముట్టడి, గజపతికి విరోధులు విషప్రయోగము చేయుట మొదలగు రాయవాచకమునందలి అంశములు కృష్ణరాయ విజయమునందు లేవు. ఈ విషయములు తక్క రాయ వాచకమునకు పద్యరూపమే కృష్ణరాయ విజయము. కథావస్తువునే కాక కృష్ణరాయ విజయకర్త రాయవాచకమునందలి పద్యములను భావములను యథాతథముగ గ్రహించెను. గజపతి కుమార్తెను రాయవాచకము జగన్మోహిని యని పేర్కొనగా కృష్ణరాయ విజయము తుక్కాయని తెల్పినది. ప్రబంధ పద్ధతిని రచించుటచే కృష్ణరాయ విజయమున వర్ణనలు, చిలుక రాయబారము మొదలగు అతిశయోక్తులు చోటు చేసుకొన్నవి. రాయవాచకమున అశ్వాస విభజన లేదు. కష్ణరాయ విజయము నాలుగాశ్వాసముల కావ్యము.

## చరిత్ర — రాయవాచక కృష్ణరాయ విజయములు

రాయవాచక, కృష్ణరాయ విజయములు తుళువ వంశీయులైన వీరనృసింహ రాయ, కృష్ణదేవరాయల దినచర్యలను, విజయనగర నిర్మాణ వృత్తాంతమును, కృష్ణదేవరాయల దిగ్విజయ వివరములను, ఓఢ్రరాజకుమార్తెను వివాహము చేసుకొను వివరములను తెలుపుచున్నవి.

### వీరనరసింహరాయలు :

తుళువ నరసనాయకునకు తిప్పాంబిక, నాగలాంబిక, ఓబాంబిక అను ముప్వురు భార్యలు కలరు. తిప్పాంబిక వలన వీరనరసింహరాయలు, నాగలాంబిక వలన కృష్ణదేవరాయలు, మూడవ భార్య ఓబాంబికవలన అచ్యుత, రంగరాయలను పుత్రులు కలిగినట్లు వీరనరసింహరాయలు వేయించిన శాసనములవలన తెలియు చున్నది.

తుళువ నరసనాయకుని తండ్రి ఈశ్వరరాజు, తల్లి బుక్కాంబ. ఇతడు చంద్రగిరి పాలకుడైన సాళువ నరసింహరాయలకడ ప్రసిద్ధిబడసిన సేనానాయకుడు. సాళువ నరసింహరాయల ఆజ్ఞ ప్రకారము అతని మరణానంతరము పెద్దకుమారుడు తిమ్మరాజును రాజునుచేసి అతడు బాలుడగుటచే తాను రాజకార్యములను చేయు చుండెను. ఓర్వలేని ఒక సరదారు ఆ బాలుని చంపి ఆ నిందను నరసనాయకునిపై పెట్టెను. అపనిందను భరింపలేక నరసనాయకుడు నరసింహరాయల రెండవ పుత్రుడైన ఇమ్మడి నరసింహరాయలను క్రీ.శ. 1493 వ సంవత్సరమున సింహాసన

మెక్కించెను.[11] నరసనాయకుని అధికారమును సహింపలేని దళవాయి రాజునకు నరసనాయకునిపై కొండెములు చెప్పెను. ఇది తెలిసి నరసనాయకుడు రాజునకు నీతులు చెప్పి మార్చ ప్రయత్నించెను. అతడు వినకపోవుటచే, పెనుగొండ దుర్గమున అతనిని బంధించి విజయనగర సామ్రాజ్యమును హస్తగతము చేసికొనెను. ఇమ్మడి నరసింహరాయలు క్రీ.శ. 1505 ప్రాంతమున మరణించెను.[12]

తుళువ నరసరాయలు అస్తవ్యస్తమైన విజయనగర సామ్రాజ్యమును చక్కదిద్దెను. ఈతడు అద్వితీయ పరాక్రమశాలి. పెక్కు విజయములను సాధించెను. ఈతని విజయములు పారిజాతాపహరణమున వర్ణింపబడినవి.[13] ఈతడు ఆంధ్ర భాషాపోషకుడు. కవుల నాదరించి కృతిపతి యయ్యెను. ఈతడు క్రీ.శ. 1505 వ సంవత్సరమున మరణించెను. ఈతడు మరణించినతరువాత ఈతని పెద్దభార్య పుత్రుడైన వీరనరసింహరాయలు విజయనగర సింహాసనమును అధిష్ఠించెను.[14] సాళువ తిమ్మరుసు ఈతనికి మంత్రి. నరసనాయకునికడ కూడ తిమ్మరుసే మంత్రిగ నుండెను. నరసనాయకుని కోరికపైన వీరనరసింహరాయని రాజ్యాభిషిక్తుని గావించెను తిమ్మరుసు. నరసింహరాయలు కప్పములు కట్టక తిరుగబడిన పెక్కుమంది సామంతరాజులను తమ్ముల సహాయముతో నోడించి వారు కప్పములు కట్టునట్లు చేసి 'భుజబలరాయ'డను బిరుదమును గడించెను.

వీరనరసింహరాయలు ఒకనాడు బ్రాహ్మీ ముహూర్తమున నిదురలేచి ఆరాధ్యుల నామావళులు, పాండవ గీత భ్రమర గీతలు, భారత భాగవత రామాయణాది పురాణములు విని, సంజయ, విదుర, చాణుక్యాది నీతులను విని, అద్దమున మోము చూచుకుని, కపిల కామధేనువును స్పర్శించి, విప్రవరులను దర్శించి, కాలకృత్యములను తీర్చుకొని కొలువు తీరెను.[15] డెబ్బదిరెండు దేవస్థానములనుండి గంధప్రసాదాదులు రాగా స్వీకరించి వారి క్షేమసమాచారములను విచారించెను. అనంతరము ధర్మాసనం ధర్మయ్య వచ్చి దక్షిణ దేశమునగల అగ్రహారములందలి ప్రజల క్షేమసమాచారములను విన్నవించెను. దళనాయకులు వచ్చి రాజ్యమునందలి, అన్యదుర్గములందలి శాంతిభద్రతలను గూర్చి విన్నవించిరి. తలారి వచ్చి విజయనగరమున తలారుల జాగరూకతవలన అష్టాదశవర్ణముల ప్రజలు క్షేమముగ నున్నారని విన్నవించెను. కరణములు వచ్చి పదునెనిమిది రేవు పట్టణముల లెక్కలను తెల్పిరి. రాజు కమ్మకాకితములను (pass-port) యేకాంతముగ వినెను. తనను నగరి అల్లుండ్లు, దొరమన్నీలు, ప్రభువులు,

11. Epigraphical Collections for 1906, No. 516.
12. Epigraphica Indica, Vol. 7, No. 8.
13. నంది తిమ్మన, 'పారిజాతాపహరణము,' ప్ర.ఆ., ప. 13.
14. Dr. S. Krishnaswamy Aiyangar, 'A Little Known Chapter of Vijayanagar History,' p. 50.
15. రాయవాచకము, p. 2.

పాలెగాళ్ళు, ఆప్తులు, ఆశ్రితులు, విద్వాంసులు, పురోహితులు, రాజులు, వంది వైతాళికులు, పాఠకులు, శాస్త్రజ్ఞులు, నాటకాలంకారులు, విద్యాధికులు, వీణాధరులు మొదలగు డెబ్బదిరెండు వినియోగములవారు, వజీర్లు కొలువ, ఇరువురు వనితలు బంగారు వీవనలతో వీచుచుండ వీరనరసింహరాయలు కొలువు తీరెను.[16] వైష్ణవులు, శైవులు ఆరాధ్యులు తనను దర్శింపరాగ, వారి యోగక్షేమముల నరసెను.[17] అనంతరము విద్యారణ్యుని వృత్తాంతమున, విజయనగర నిర్మాణగాథను తెలుపమని ముల్లండ్ర డిండిమపుంభావ నరస్వతిని కోరెను.[18]

విద్యారణ్యుడు :

విద్యారణ్యుడు మాధవవిద్యారణ్యునిగ వ్యవహరింపబడెను. క్రీ.శ. 14 వ శతాబ్దమున మహమ్మదీయుల దండయాత్రలవలన వచ్చిన అనర్థములు గడచిన తరువాత, సనాతన మతమును, విజయనగర సామ్రాజ్యమును ఉద్ధరించుట జరిగినది. ఉద్ధరించుటకు ప్రయత్నించినవారిలో మాధవవిద్యారణ్యుడు ప్రథముడు. ఈతని మొదటి పేరు మాధవాచార్యుడు.

ఈతడు భరద్వాజ గోత్రుడు. బోధాయనసూత్రుడు. యజుశ్శాఖీయుడు. తండ్రి పేరు మాయణుడు, తల్లిపేరు శ్రీమతి. ఈతనికి సాయణుడు, భోగనాథుడు అను సోదరులు కలరు.

మాధవవిద్యారణ్యుడు క్రీ.శ. 1350 నుండి 1377 వరకు విజయనగర సామ్రాజ్యమును పాలించిన బుక్కరాయల మంత్రి, గురువు. ఉదయగిరి పాలకుడైన బుక్కరాయల అన్నయగు కంపరాయలకడ మాధవాచార్యుని సోదరుడైన సాయణాచార్యుడు గురువుగ, మంత్రిగ నుండెను.

మాధవాచార్యుడు ఏ కారణముచేతనో సన్యసించి విద్యాతీర్థుడను యోగికి శిష్యుడాయెను. ఈతడు సన్యసించిన తరువాత మాధవవిద్యారణ్యుడాయెను. మాధవాచార్యుడే విద్యారణ్యుడనుటకు పెక్కు నిదర్శనములు కలవు. ఈతడు విద్యాతీర్థుని కడనేకాక భారతీతీర్థునికడను ఆశ్రమ స్వీకారము పొందినట్లు తెలియుచున్నది. ఈతడు 'జీవన్ముక్తి,' 'వేదాంత పంచదశి' యను గ్రంథములను రచించెను.

విద్యారణ్యుడు ఎనుబదియైదేండ్లు జీవించెను. తన ఎనుబదియవ యేట శృంగేరీ పీఠము నలంకరించి, క్రీ.శ. 1387 ప్రాంతమున మరణించినట్లు తెలియుచున్నది.[19] కనుక ఈతడు క్రీ.శ. 1302 ప్రాంతమున జన్మించి యుండును.

16. రాయవాచకము, pp. 2–5, కృష్ణరాయ విజయము, ద్వి.ఆ., ప. 60–61.
17. కృష్ణరాయ విజయము, ద్వి.ఆ., ప. 1–10.
18. రాయవాచకము, pp. 5–6 ; కృష్ణరాయ విజయము, ద్వి.ఆ., ప. 12–17.
19. Dr. S. Krishnaswamy Aiyangar, Sources of Vijayanagar History, p. 3.

ఈశ్వరుడే శంకరునిగ జన్మించి చార్వాకాది మతములను ఖండించెనని, శంకరుడే వేదాంతశాస్త్ర రహస్యమును తెలుపుటకై విద్యారణ్యునిగ జన్మించెనని కృష్ణరాయ విజయము విద్యారణ్యుని ప్రభావమును తెల్పెను.[20] ఈతడు కవి. తర్క వ్యాకరణ వేదాంతాది శాస్త్రవేత్త. ఈతడు పదునాలుగు గ్రంథములను రచించెను. ఈ మహనీయుని పేరనే విజయనగరము వెలసెను. మాధవవిద్యారణ్యునిగూర్చి, విజయనగర నిర్మాణమును గూర్చి పలురకములైన కథలు ప్రచారమున నున్నవి. విద్యారణ్యుని గూర్చి పలుగ్రంథములు పలురకములైన అభిప్రాయములను వెలిబుచ్చుచున్నవి.[21] తుంగభద్రాతీరమున విజయనగర సామ్రాజ్య నిర్మాణకారకుడైన విద్యారణ్యు డీతడే అనుట స్పష్టము. ఈతని బుద్ధి విశేషమువల్లనే విజయనగర కీర్తిప్రతిష్ఠలు దేశవిదేశములకు ప్రాకెననుట అతిశయోక్తి కాదు.

విజయనగర నిర్మాణము :

విజయనగర నిర్మాణమును గూర్చి పలురకములైన అభిప్రాయములు గలవు. గురువైన జ్ఞానేంద్ర సరస్వతులు, జీవన్ముక్తికొరకు విద్యారణ్యుని భిక్షాటనము చేయుచు కాషాయ వస్త్రములను ధరించి నేలమీదనే నిదురింపుమని తెలిపెను. విద్యారణ్యుడు గురువాజ్ఞను ధిక్కరించి చరించెను. విద్యారణ్యు లే ఇంటికేగినను మృష్టాన్నమిడ అది గ్రహించి గురువుకడ కరుదెంచెను. గురువు సన్యాసులకు మృష్టాన్నయోగము లేదని తెల్పి జీవన్ముక్తి కొరకు భగీరథయాత్ర చేసి అచటనే నివసింపుమని చెప్పెను. విద్యారణ్యుడు గురువాజ్ఞ ప్రకారము భగీరథయాత్రకేగి మార్గమధ్యమున శింగిరిభట్టను బ్రహ్మరాక్షసుని చూసెను. ఆ బ్రహ్మరాక్షసుడు తనకు ఆగత అనాగత భూతభవిష్యద్వర్తమానములు తెలియుననని, 'మీరు జ్ఞానేంద్రులవారి శిష్యులు, మీ నామధేయం విద్యారణ్యులు, మిమ్ము భాగీరథీ స్నానము చేసి అచటనే నివసించి జీవన్ముక్తుడవు కమ్మని చెప్పి పంపిరి. కాని మీకు కాశీలో ఉండే యోగము లేదు. కాశీవిశ్వేశరుని, అన్నపూర్ణను, వేదవ్యాసుని దర్శించి, పంపాతీరమునకు వచ్చి అట ఒక పట్టణము నిర్మించి హరిహరులకు పట్టము కట్టి అచటనే నివసిచెందర'ని తెల్పెను. శింగిరిభట్టు చెప్పిన ప్రకారము విద్యారణ్యుడు కాశికేగి అట వ్యాసుని దర్శించెను. వ్యాసుని అనతి ప్రకారము

20. కృష్ణరాయ విజయము, ద్వి.ఆ., ప. 18.

21. వివరములకు చూ. Some Contribution of South Indian Culture by S.K. Aiyangar; Sources of Vijayanagar History by Dr. S. Krishna Swamy Aiyangar; జీర్ణవిజయనగర చరిత్ర, కుందూరు ఈశ్వరదత్తు; విద్యానగర చరిత్రము, సిరిపి ఆంజనేయులు.

పంపాతీరమునకు వచ్చెను. అచట విరూపాక్షుని దర్శించెను. నగర నిర్మాణార్థము స్థలనిర్ణయము కొరకు నలుదిశలు పరికించెను. అచటకు కొంత దూరమున ఒక శునకమును కుందేలు తరుముటగాంచి, అది వీరక్షేత్రమగునని నిర్ణయించి అచట శాశ్వతమగు నొక పట్టణమును నిర్మింపదలచెను. నగర నిర్మాణార్థము శా.శ. 1127 ప్రభవ నామ సంవత్సరమున చైత్ర శుద్ధ పౌర్ణమి స్థిరవారమునాడు ముహూర్తము నిర్ణయించెను. శంకుస్థాపనము చేయుటకు ముహూర్తము నిశ్చయించి, తాను శంఖము ఊదినపుడు వాస్తు పురుషుని నిక్షేపింపుమని శిష్యుని నియోగించెను. గురువు యొక్క శంఖనాదముకై వేచియున్న శిష్యుడు భిక్షాటనము నకు వచ్చిన జంగమువాడు ఊదిన శంఖనాదము విని గురువుగారే ఊదిరని తలంచి వాస్తుపురుషుని నిక్షేపించెను. విద్యారణ్యుడు పూరించిన శంఖనాదము విని శిష్యుడు సందేహించి గురువు వద్దకి వచ్చెను. విద్యారణ్యుడు జ్ఞానదృష్టిని విషయములను తెలిసికొని, ముహూర్తమునకు ముందుగనే వాస్తు పురుషుని నిక్షేపించినందున, 3,600 ఏండ్లు నిలచు నా పట్టణము 360 ఏండ్లే నిలచునని బాధపడి అట తన పేరిట నగరమును నిర్మించెను.[22] ఇది రాయవాచకము నందలి విజయనగర నిర్మాణ గాథ. కృష్ణరాయ విజయమున విద్యారణ్యుడు చింతామణి మంత్రసహాయమున తపస్సు చేసి లక్ష్మీకటాక్షము పొంది తన పేర నిర్మించు పట్టణమున ఆమెను నివసింపకోరి, ఆమె చెప్పినటుల తుంగభద్రాతీరము చేరి విరూపాక్షుని దర్శించి, అట ఒక కుందేలు కుక్కను తరుముటగాంచి ఆ స్థలము వీరక్షేత్రమగునని గ్రహించి తన పేరిట విద్యానగరమను ఒక నగరమును నిర్మించెను.[23]

హరిహరరాయలు ఆనెగొంది సింహాసనమెక్కిన తరువాత తుంగభద్రా తీరమునకు వేటకేగెను. అట కుందేలు కుక్కను తరుముట గని ఆశ్చర్యపడి విరూపాక్షాలయమున గల విద్యారణ్యుని కావిషయము తెల్పెను. విద్యారణ్యుడు ఆ స్థలము మహిమగలదని భావించి అచట నగరమును నిర్మింపుమని హరిహరుని కోరెను. క్రీ.శ. 1336వ సంవత్సరమున హరిహరుడు నగరమును నిర్మించెను అని 'శ్రీకృష్ణదేవరాయలు' అను గ్రంథమున గలదు.

'రాయవంశావళి' అను గ్రంథమున ఆనెగొందిని క్రీ.శ. 1117 నుండి 1156 వరకు పరిపాలించిన విజయధ్వజుడు తుంగభద్రానదికి దక్షిణభాగమున ఒక నగరమును నిర్మించి దానికి విజయనగరమని పేరిడెనని తెలియుచున్నది.[24]

హరిహరరాయలు తుంగభద్రాతీరమున వేటకేగి అచట కుక్కను కుందేలు తరుముట గాంచి, విద్యారణ్యుని అనతి ప్రకారము విజయనగరమును నిర్మించెనని,

22. రాయవాచకము, pp. 6–15.
23. కృష్ణరాయ విజయము, ప. 20–34.
24. B. Suryanarayana Rao, The Never to be Forgotten Empire, p. 15.

మొదటి హరిహరరాయల కాలమున క్రీ.శ. 1333–37 ప్రాంతమున వేయించిన కాపలూరు శాసనము, బాగేపల్లి శాసనము తెలుపుచున్నవి.

బుక్కరాయల కాలమున గల ఒక శాసనమున
"విద్యాభిదాన నగరీ విజయోన్నత శాలినీ
విద్యారణ్య కృతతస్యాం రత్నసింహాసనే స్థితః"

అని విజయనగరము విద్యారణ్యకృతమని గలదు.[25] మరియొక కన్నడ శాసనమునందు

'కుంతలదేశాధిపత్యకె నలువతుంగ భద్రాతీర దిం
పంపా విరూపాక్షలింగ ననిరూపదిం విద్యారణ్య
శ్రీపదంగల నామధేయదిం శ్రీహరిహరరాయ కట్టసి"[26]

అని గలదు. ఈ శాసనము వలన విజయనగరమును హరిహరరాయలు నిర్మించినటుల తెలియుచున్నది. విద్యారణ్యుని అనతి ప్రకారము విజయనగరము నిర్మింపబడినటుల న్యూనిజ్ అను చరిత్రకారుని అభిప్రాయము.[27] ఈ అంశముల వలన విజయనగరమును విద్యారణ్యుడు, హరిహరరాయలు, విజయధ్వజుడు నిర్మించిరను మూడభిప్రాయములు గలవని తెలియుచున్నవి. రాయవాచక, కృష్ణరాయ విజయములు తక్క పెక్కు చారిత్రక గ్రంథములు, శాసనములు విద్యారణ్యుని ప్రేరణవలన హరిహరరాయలు నిర్మించెనని తెలుపు చున్నవి. ఆనెగొంది రాజుల చరిత్రను తెలుపు రాయవంశావళి మాత్రము విజయనగరమును విజయధ్వజుడు నిర్మించినటుల దెలుపుచున్నది. రాయవంశావళి ఒక్కటె ఆనెగొంది రాజుల చరిత్రను తెలుపుచున్న గ్రంథము. ఓరుగల్లు రాజ్య పతనానంతరము, అచట నివసించిన ఒక కుటుంబమువారు తుంగభద్రాతీరమునకు పోయి అచ్చట ఒక సామ్రాజ్యమును స్థాపించినటుల ఈ గ్రంథమువలన స్పష్టమగుచున్నది. ఫెరిస్తా అను చరిత్రకారుడును ఈ అంశమునే వివరించెను.[28] హరిహరరాయలు, బుక్కరాయలు ఓరుగల్లు నుండి తుంగభద్రాతీరమునకేగి అచట సామ్రాజ్యమును స్థాపించినటుల పెక్కు గ్రంథముల వలన తెలియుచున్నది. సామ్రాజ్యమును స్థాపించుటకు ముందచట నగరముండవలయునుకదా ? కనుక విజయనగరము విజయధ్వజనిర్మితమని చెప్పవచ్చు. విజయధ్వజునిచే నిర్మింపబడిన విజయనగరము క్రమముగా హరిహర బుక్కరాయల వలన విస్తృతమై విద్యానగరముగ మారి యుండును. విజయనగర నిర్మాణవిషయమును తెలుపు

25. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, మూడవభాగం, p. 325.
26. Epigraphia Carnatica, Vol. XI, Cl. No. 54.
27. Robert Sewell, A Forgotten Empire, pp. 18-19.
28. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, మూడవభాగం, p. 315.

కొనుటకు మనకు పెక్కు గ్రంథములు గలవు.[29]

పంపాతీరమున నిర్మితమైన విజయనగరము అతిసుందరమైన పురము. అందమగు సౌధములతో, అమరావతిని, హస్తినాపురమును, భోగవతీనగరమును ధిక్కరించును. ఇందు నాలుగు వర్ణములవారును నివసించెడివారు. ప్రతి గృహాంగణము నారికేళ వృక్షములతో అలరారెడిది.[30] విజయనగర విపణి వీధులలో కుంకుమము, సంకుమదము, కర్పూరము, చందనము, అగరు, కస్తూరి మొదలగు సుగంధద్రవ్యములు రాసులుగ పోసి వైశ్యులు విక్రయించెడివారు. స్త్రీలు పుష్పములను విక్రయించెడివారు.[31] విజయనగర సామ్రాజ్యమున పదునెనిమిది రేవుపట్టణములు గలవు.[32]

విద్యానగరమునందలి వేశ్యలు మన్మథుని మోహనాస్త్రమును మించు అందము కలవారు. నాట్య శాస్త్రాది దేవతలు. ఇందు కొంత అతిశయోక్తులున్నప్పటికి, అనాటి వేశ్యలు బహుచక్కనివారై యుందురు. నాడు వేశ్యాగృహసందర్శనము విలాసముగ గన్పట్టుచున్నది. ఈ అంశమును నాడు విజయనగరమునకు వచ్చిన విదేశీయాత్రికులును తెల్పిరి.[33] అట్టి శోభాయమానమైన విజయనగరము తుళువ వంశ ప్రభువుల ముఖ్యపట్టణము.

## కృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1509 వ సంవత్సరమున అన్నయగు వీరనరసింహరాయలు మరణించిన తరువాత విజయనగర సింహాసనమును అధిష్ఠించెను. క్రీ.శ. 1530 వరకు ప్రజానురంజకముగా పరిపాలించెను.

కృష్ణదేవరాయల జన్మకాలమును గూర్చి పెక్కు అభిప్రాయభేదములు కన్పడుచున్నవి. క్రీ.శ. 1465 వ సంవత్సరమని కొందరు, క్రీ.శ. 1487 వ సంవత్సమనికొందరు వ్రాసిరి. కాని కృష్ణదేవరాయల సమకాలికుడైన పోర్చుగీసు చరిత్రకారుడు వీరనరసింహరాయలు మరణించునప్పటికి కృష్ణదేవరాయ లిరువది సంవత్సరముల వయస్సు వాడనితెలిపెను.[34] కృష్ణదేవరాయలు క్రీ.శ 1529 ప్రాంత

---

29. వివరములకు చూడుడు. హంపీ విజయనగరము, జీర్ణ విజయనగర చరిత్రము, విద్యానగర చరిత్రము, అంగీరస సంవత్సర ఆంధ్రపత్రికనందలి కురుగంటి సీతారామయ్యగారి 'మాధవ విద్యారణ్య'దను వ్యాసము.

30. కృష్ణరాయ విజయము, ప్ర. ఆ. వచనం, 56, p. 25.

31. కృష్ణరాయ విజయము, ప్ర. ఆ. వచనం, 56, p. 25.

32. రాయవాచకము, p. 5.

33. Robert Sewell, A Forgotten Empire, p. 234.

34. Robert Sewell, A Forgotten Empire, p. 315.

మున మరణించెనని శాసనాధారములుకలవు. ఈతడు మరణించునప్పటికి నలుబది ఏండ్లు వయసుగలవాడు. కనుక కృష్ణదేవరాయలు క్రీ. శ. 1487 వ సంవత్సరమున జన్మించియుండును.

తుళువ నరసనాయకుని ద్వితీయ భార్య నాగలాంబిక పుత్రుడైన శ్రీకృష్ణదేవ రాయలు సవతి అన్నయగు వీరనరసింహరాయల తరువాత రాజ్యమునకు వచ్చెను.

కృష్ణదేవరాయల పట్టాభిషేకము :

"... అనివిన్నపంజేశి ... ఈ రాజ్యపట్టం కృష్ణరాయల వారికి కట్టవలెనని దళనాయకులతో పలుకరించి, నందు... కృష్ణరాయలవారు తాము పెద్దలమైతె మితమ మర్యాదాగా రాజ్యపాలనం జేశేటందులకు పట్టాభిషేకం అధిష్ఠాన కర్తలు శేయమని మంచివేళ జూచి ముద్దుటుంగరమిచ్చినారు"[35] అని రాయవాచకము,

"తమరుపెద్దలైతెరిత్తఱిని(గృష్ణ
రాయలను పేరిమత్పుత్రరత్నమునకు(
దనర(బట్టంబుగట్టెద మనతమీఱ
ననుచు నప్పాజితోన మంతనము(జేసి"

పుత్రా! రమ్మని, బంగరు డాల్మిద్దమెరుంగు టుంగరమును కృష్ణరాయనికొసంగి[36] అని కృష్ణరాయవిజయము, వీరనరసింహరాయలు కృష్ణరాయనికి పట్టాభిషేకమొనర్చి నటుల వర్ణించినవి. రాయవాచకమున కొంతభాగము నష్టమగుటచే రాయలకు ఉంగరమిచ్చి పట్టాభిషేకము చేసినది ఎవరో తెలియుటలేదు. కథారంభము వీర నరసింహరాయల దినచర్యతో ప్రారంభమగుటతో వీరనరసింహరాయలే ఉంగరమిచ్చి నటుల భావింపవలెను. కాని రాయవాచక కర్త దృష్టిలో వీరనరసింహరాయలనిన, కృష్ణరాయని అన్నయనియో లేక తండ్రియనియో స్పష్టపడుటలేదు. రాయవాచక మునే అనుసరించిన కృష్ణరాయవిజయమున 'మత్పుత్రరత్నమునకు(దనర(బట్టంబు గట్టెద' అనుట చేతను, 'పుత్రా రమ్ము రమ్మంచు' ఉంగరమిచ్చుటచేతను కృష్ణ రాయవిజయకర్త ఉద్దేశము ప్రకారము తండ్రితరువాతనే కృష్ణదేవరాయలు రాజ్యము నకు వచ్చి నటుల తెలియుచున్నది. ఇది అసత్యము. కృష్ణదేవరాయలు వీరనర సింహుని సోదరుడని, నరసనాయకుని పుత్రుడని మనకు పెక్కు ఆధారములు గలవు. మనకు నమ్మదగ్గ ఆధారములు కృష్ణదేవరాయల ఆస్థాన కవులు రచించిన గ్రంథములు.

అన్నృసింహ ప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబిక వలన నందనులగాంచె

35. రాయవాచకము, p. 15.

36. కృష్ణరాయవిజయము, ద్వి: ఆ., ప. 38, 39, p. 37.

వీరనరసింహరాయవిభుని నచ్యు
తాంశసంభవుఁగృష్ణరాయక్షితీంద్రు[37]

అని మనుచరిత్రము తెల్పుచున్నది.

ఈ పద్యమునే శ్రీకృష్ణదేవరాయలు తాను రచించిన ఆముక్తమాల్యదనం దుద హరించెను. ఈ పద్యమువలన కృష్ణదేవరాయలు నరసనాయకుని పుత్రుడనుట స్పష్టము. నరసనాయకుని తరువాత వీరనరసింహరాయలు, ఆతనితరువాతనే కృష్ణరాయలు రాజ్యమునకు వచ్చెననుటకు ముక్కుతిమ్మన రచించిన పారిజాతాపహరణము నందలి

"వారలలోఁదిప్పాంబకు
మారుఁడు పరిపంథికంధిమంథాచలమై
వీరనరసింహరాఁయడు
వారాశిపరీత భూమివలయంబేలెన్"

"వీరశ్రీనరసింహశౌరి పిదప న్విశ్వంభరామండలీ
ధౌరంధర్యమునన్ జగంబు ముదమందన్నాగ మాంబాసుతుం
డారూఢోన్నతిఁగృష్ణరాయఁడు విభుండై రత్నసింహాసనం
బారోహించె విరోధులు న్గహన శైలారోహముంజేయఁగన్"[38]

అను పద్యములు సత్యమైన ఆధారములు. నరసింహ, వీరనరసింహరాయలు, శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1509 లో రాజ్యమునకు రాకముందు విజయనగరమును పరిపాలించినట్లు తెలియుచున్నది.[39] నరసనాయకుని తరువాత వీరనరసింహరాయలు రాజ్యమునకు వచ్చినటుల నీలకంఠశాస్త్రిగారు తెల్పిరి.[40] వీరనరసింహరాయలు గొప్పవీరుడని, శూరుడని తెలియుచున్నది. ఈతడు క్రీ.శ. 1505లో రాజ్యమునకు వచ్చినట్లు, కృష్ణదేవరాయాదిగాగల సోదరుల తోడ్పాటున రాజ్యమును పరిపాలించినట్లు, బ్రాహ్మణులకు అనేక దానములిచ్చినట్లు, తెలియుచున్నది.[41] 'కన్నడదేశరాజుల వృత్తాంతమ'ను గ్రంథమునందును ఈ విషయము గలదు.[42]

ఈ విషయములవలన వీరనరసింహరాయలు కృష్ణదేవరాయల కంటెను ముందు రాజ్యముచేసెననుట, ఈతడు కృష్ణదేవరాయని సవతిసోదరుడనుట స్పష్టమగుచున్నది. తనకు అందుబాటులోగల కావ్య, శాసనాదులను పరిశీలింపక,

37. అల్లసాని పెద్దన, మనుచరిత్రము, పీఠిక, ప. 31.
38. ముక్కుతిమ్మన, పారిజాతాపహరణము, ప్ర. ఆ., ప. 15, 16.
39. Robert Sewell, A Forgotten Empire, p. 107.
40. K. A. Nilakanta Sastry, A History of South India, p. 266.
41. Epigraphia Indica, Vol. I, p. 368; S. Krishna Swamy Aiyangar, A Little Known Chapter of Vijayanagar History, p. 50.
42. S. Krishna Swamy Aiyangar, Further Sources of Vijayanagar History, pp. 111-113.

సరియగు చరిత్రాంశములను తెలిసికొనక, కుమారధూర్జటి కృష్ణదేవరాయలు వీరనరసింహరాయని పుత్రుడనుట అసంగతము. నరసనాయకునే వీరనరసింహ రాయలుగా కవి పేర్కొనెనని కొందరి మతము.[43] కవి అశ్రద్ధ చూపినను పొరపాటు పడినను క్షమింపరాని నేరమే. ఇది కేవలము కావ్యము కాదు చారిత్రక కావ్యము. కుమార ధూర్జటి వ్రాసిన విధముగనే నరస నాయకుని తరువాత కృష్ణదేవరాయలే రాజ్యమునకు వచ్చినటుల వ్రాసిన ఒకటి రెండు చరిత్ర గ్రంథములును గలవు.[44] కాని ఇది నమ్మతగ్గ విషయముకాదు. ఈ అంశము ప్రకారము నరసనాయకుడు క్రీ.శ. 1509 వరకు బ్రతికిఉన్నటుల యగును. నరసనాయకుడు క్రీ.శ. 1505 వ సంవత్సరమున మరణించెననుటకు పెక్కు శాసనాధారములు గలవు. కనుక నరస నాయకుని తరువాత వీరనరసింహరాయలు రాజ్యమునకు వచ్చెననుట నత్యము.

నరస నాయకుడు మరణశయ్యమీద నున్నపుడు తన కుమారులను పిలచి తన వ్రేలికున్న రాజముద్రికను ఎవరు తీసికొనిన వారికి రాజ్యమిత్తు ననెను. వ్రేలు వాచి ఉండుటచే అందరు ఎంత ప్రయత్నించినను రాలేదు. అంత కృష్ణదేవరాయలు కత్తితో వ్రేలిని తెగగోసి ఉంగరమును తీసుకొనెను. అతని సాహసమునకు, సమయ స్ఫూర్తికి మెచ్చి నరసనాయకుడు కృష్ణరాయని రాజును జేసెనని వాడుకలో నొక కథయున్నది. బహుశః కుమార ధూర్జటి ఈ కథను ఆధారముగ గ్రహించి ఉండును. అయినప్పటికి కవి నరసరాజనుటకు బదులు వీరనరసింహరాయ లనెను.

వీర నరసింహరాయలు మరణావస్థయందున్నపుడు మంత్రియగు తిమ్మరుసును పిలచి, 'నా తండ్రి ఆజ్ఞ పాలించినట్లు నా ఆజ్ఞ పాలింపవలెను. నా కుమారుడు బాలుడు అతనిని నా అనంతరము రాజ్యమున నిలపి నీవు కార్యకర్తవై పాలింపుము. నా తరువాత నీ కత్యంత ప్రియుడగు కృష్ణరాయలకు రాజ్యమొన గెదవని నా నమ్మకము. కనుక నీ వాతని కన్నులను తీసి నాకు చూపింపుమని' ఆజ్ఞాపించెను. తిమ్మరుసు అది సహింపలేక కృష్ణరాయని దాచి, ఆడు మేక కన్నులు తెచ్చి రాజునకు చూపెననియు, వీరనరసింహరాయలు మరణానంతరము కృష్ణరాయని రాజాధికారిని గావించెననియు ప్రచారమునందున్న మరియొక గాథ. ఈ కథవలనకూడ వీరనరసింహరాయలు రాజ్యమును పాలించెనను అంశము తెలియుచున్నది. న్యూనిజ్ కూడ ఈ అంశమును తెలిపెను.[45] ఈ అంశములందలి సత్యాసత్యము లేవైనప్పటికి వీర నరసింహరాయలు సవతి తమ్ముడగు కృష్ణదేవరాయలను చంపుటకు ప్రయత్నించెనను సంశయమునకు తావిచ్చుచున్నది.

శ్రీ కృష్ణదేవరాయల పట్టాభిషేకమునకు దళనాయకులు, అయ్యమరసు,

---

43. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము, p. 200.
44. Dr. H.K. Mahatab, History of Orissa, p. 324.
45. K. A. Nilakanta Sastry, A History of South India, p. 267.

కొండమరసు, బాచరుసు, యల్లమరసు, వీరపురసు, అప్పాజి లక్కణదళనాయకులు, యెల్లనదళనాయకులు, అప్పరపిళ్ళ, మన్నారుపిళ్ళ, రాయసం రామచంద్రయ్య, బొక్కసం భాస్కరయ్య, అవసరం వెంకటయ్య, త్రియంబకయ్య, లక్ష్మిపతిప్రధాని, తిప్పరుసు దళవాయి, లింగరసుసాళువనారా ... కాదు ఆర్వీటి బుక్కరాజు, సాళువ మేకరాజు, శ్రీపతివారు, బూదహల్లివారు, నంద్యాలవారు, అవ్వకువారు...తొర గెంటివారు, రాచూరి తిమ్మరాజు, సంగరాజు, వెలుగొంటివారు...పెద్దసాని అక్కప్ప నాయుడు, కమ్మదొరలు, తుళువ దొరలు,[46] పండితులు అరుదెంచిరని రాయవాచకమున గలదు. కృష్ణరాయ విజయము చక్కెర విలుకాని చక్కదనము కల్గిన ఆర్వీటి బుక్కరాజు, జౌకువారు, నందేలవారు, వెల్గోటివారు, కురాసానివారు, బూదహలివారు అరుదెంచినట్లు తెలిపెను.[47] మంగళ స్నానానంతరము దశదానములు షోడశ మహాదానములు చేసెను. స్వర్ణతుల, రజితతుల రత్నతుల మౌక్తికతుల మేరువులు, కోటి గోదానములు చేసెను. సహస్ర కుటుంబ ప్రతిష్ఠలు చేసెను.[48] తరువాత బంగారు కలశములతో చతుస్సముద్రముల నుంచి, గంగా యమునా సరస్వతీ గోదావరీ నర్మదా సింధు కావేరీ తామ్రపర్ణి మొదలగు నదుల నుండి ఉదకమును తెచ్చి అష్ట వాద్యములు మ్రోగగా కృష్ణరాయలకు అభిషేకముచేసిరి. తరువాత కనకాభిషేకము నవరత్నాభిషేకము చేసిరి. సకల బంధుజన పరివారము కొలువగా కృష్ణరాయలు సింహాసన మలంకరించెను.

రాజ్యాధికారియైన తరువాత శ్రీ కృష్ణరాయలు మంత్రులకడ సకల రాజ నీతులు, సకల న్యాయములు, పరిపాలనా విధానము, సకల ధర్మములు నేర్చుకొనెను.[49] తన రాజ్యమునందు, పరరాజ్యము లందలి విశేషములను తెలిసికొనుటకు వేగులను నియమించెను. కరణీకులను పిలువనంపి రాజ్యమునగల గిరి దుర్గ వనదుర్గాదుల సంఖ్య, ఆదాయవ్యయముల లెక్కలు తెలిసికొనెను. కోశాధి వివరమును తెలిసికొనెను.[50] ప్రతిదినము ఎవరికిని చెప్పక రాత్రులందు స్వయముగ నగర పరిశోధనము చేయుచు

అన్నన్న యతడు సింహాసనం బెక్కిన
నిభరాజు తా కొండ లెక్కఁ దొడఁగె
నయ్యారె యతఁడు పట్టాభిషిక్తుండైన
సింధురా ణ్ణోత్రముల్ చెమ్మగిల్లె

46. రాయవాచకము, pp. 15 – 16.

47. కృష్ణరాయ విజయము, ద్వి. ఆ., ప. 44, pp. 38 – 39.

48. రాయవాచకము, pp. 15 – 16.

49. రాయవాచకము, pp. 18 – 27, కృష్ణరాయ విజయము, వ. 50 – 59.

50. రాయవాచకము, pp. 27 – 36, కృష్ణరాయ విజయము, ద్వి. ఆ., వ. 67 – 77.

హైసరే యతని పేరనిన మాత్రముననే
కురుదేశ మేల్రాజు గుండెలదరె
నోహెూ యతఁడు ఖడ్గ మొక్కింత ముట్టిన
సకలారి సంఘముల్సంచలించె
మాయురే నరసింహ కుమార రామ
చంద్ర శౌర్యనితాంత రాజత్సమాఖ్య
కృష్ణరాయాభిధాన వర్ధిష్ణుఁడేలు
ధర్మముల్ ధాత్రిలో యథార్థంబుగాఁగ.[51]

ప్రతి చిన్న విషయమును స్వయముగా నరయుచు, ఉద్యోగులు తల్లడిల్లగా, పర రాజుల గుండెలదరగా తిమ్మరుసాది మంత్రుల సహాయముతో సకలజన సమ్మతముగ, సుభిక్షముగ రాజ్యమునేలెను. దక్షిణదేశమున కృష్ణదేవరాయల పరిపాలనా కాలమును చరిత్రకారులు స్వర్ణయుగమనిరి.

## శ్రీకృష్ణదేవరాయలు - దిగ్విజయయాత్రలు :

కృష్ణదేవరాయలు సింహాసన మధిష్ఠించిన వెనువెంటనే మంత్రియగు తిమ్మరుసుతో ఆలోచించి, తురుష్కులను జయించవలెనని నిశ్చయించుకొనెను. చారుల వలన వార్తలను తెలిసిగొని యుద్ధ సన్నద్ధుడాయెను.

కృష్ణదేవరాయలు సింహాసన మధిష్ఠించు సమయమున, దేశమంతయు అల్లకల్లోలముగ నుండెను. ఉత్తరమున గజపతులు బలవంతులైరి. బలవంతులగుటయేకాక సామ్రాజ్యమున కొంతభాగము నాక్రమించుకొనిరి. దక్షిణమున ఉమ్మత్తూరు నాయకులు స్వతంత్రులైరి. మరియొక ప్రక్క బీజపూర్, గోల్కొండ సుల్తానులు ఏ నిముషమునైనను విజయనగర సామ్రాజ్యమును ధ్వంసము చేయవలెనని దృఢసంకల్పముతో నుండిరి.

దేశమిట్టి పరిస్థితి యందుండగా కృష్ణరాయలు రాజ్యమునకు వచ్చెను. వచ్చిన వెంటనే సైన్యములను సమకూర్చుకొనెను. ఒక్కమారే అందరిని జయించుట కష్టము కనుక మొట్టమొదట దక్షిణ దేశమునకు దిగ్విజయ యాత్ర వెడలెను. చతురంగ బలములను సమకూర్చుకొని ఉమ్మత్తూరు గంగరాజు పై దండెత్తెను. త్రోవలో కొంపల్లి దుర్గమును స్వాధీన పరచుకొనెను. శరణన్న దుర్గనాయకులను కరుణతో ఆదరించి వారి దుర్గములను స్వాధీనము చేసుకొనెను. గంగరాజు నోడించి, ఉమ్మత్తూరు, శివసముద్రములను స్వాధీన పరచుకొనెను. తరువాత శ్రీరంగపట్టణమును ముట్టడించెను. ఆ తరువాత విజాపుర గడిదుర్గముల ముట్టడికి బయలు దేరెను. త్రోవలో ముద్గల్లు, రాచూరు దుర్గములను జయించెను. ఈ

51, కృష్ణరాయ విజయము, ద్వి. ఆ., ప. 44.

విషయములు తెలిసి, తురుష్క ప్రభువులు కళవళ పడిరి. బీజపూర్, గోల్కొండ, గడిదుర్గ నవాబులు ముగ్గురును ఏకమై కృష్ణవేణీనదీతీరమున రాయలను ఎదుర్కొనుటకు సన్నద్ధులైరి.

ఈ విషయములు తెలిసికొని కృష్ణరాయలు సభచేసి సామంత నృపతులను పిలిపించి అన్ని విషయములు చర్చించి యుద్ధమునకు సన్నద్ధుడాయెను.

అరులక్షల భటులు, అరువది అరువేల హయములు, రెండువేల గజములతో రాయలు తురష్కులపై దండు వెడలెను. లక్ష భటులు, వేయి ఏనుగులు, లక్ష గుఱ్ఱములు బలముగల తురష్కప్రభువులు యుద్ధముచేయ వెనుకాడిరి. కృష్ణరాయలే స్వయముగా రణరంగమున ప్రవేశించెను. ఆతని ధాటికోర్వలేక తురుష్క సైన్యమంతయు చెల్లాచెదురై కృష్ణానదిని దాటి పారిపోయిరి. కృష్ణరాయలు ఘన విజయమును సంపాదించెను.

తరువాత, ఉదయగిరి ముట్టడికి బయలు దేరెను. దుర్భేధ్యమగు దుర్గమగుటచే ఆర్వీటివారు, ఓరుగంటివారు, గొబ్బూరివారు, నంద్యాలవారు, తుళువ దొరలు, బోయలు, జౌకువారు, వెలుగోటివారు, రావెలవారు మొదలగు రాజులందరును, పెక్కు దినములు ముట్టడించినను దుర్గము స్వాధీనము కాలేదు. అంత కృష్ణదేవరాయలే స్వయముగా బయలుదేరి దుర్గమును ముట్టడించి వశపరచుకొనెను. తరువాత కొండవీడు, కొండపల్లి, వినుకొండ, దుర్గాధిపతులు భయపడి పారిపోగా, ఆయా దుర్గములను వశపరచుకొనెను.

అనంతరము గజపతిని జయింప నిశ్చయించి ముందుకు పోవ నిశ్చయించుకొనెను. తిమ్మరుసు, 'మార్గము దుర్గమము, కనుమలు, అరణ్యములు దాటవలయును. అదియునుకాక, గజపతి సైన్యము ఆహార పానీయములను అందనీయక ఆటంక పరుప వచ్చునని తెలిపినను,' వీరుడగు కృష్ణరాయలు యుద్ధ సన్నద్ధుడాయెను. మార్గమధ్యమున చితాపుఖాను అరువదివేల విలుకాండ్రతో రాయల సైన్యమును ముట్టడించెను. చితాపుఖానుని జయించి, రాయలు సైన్యములను పొట్నూరు సింహాద్రియందు విడియించెను.

రాయల దండయాత్ర విషయము తెలిసికొని గజపతి బలపరాక్రమవంతులగు పదహారుగురు పాత్రులను రావించి మంతనములుచేసి, యుద్ధ సన్నద్ధుడాయెను. పదహారుగురు పాత్రుల శౌర్యాధికములను వినిన రాయలు, తిమ్మరుసు, గజపతిని జయించుట దుర్లభమని తలంచి, మాయోపాయముల వలన జయించవలయునని నిశ్చయించిరి. పదహారుగురు పాత్రులకు, పదహారు పేటికలందు కానుకలను, వాటితోపాటు, పదహారు లేఖలను వ్రాసి, అవి సేవకుల ద్వారా గజపతికి అందునటుల యేర్పాటులను గావించిరి. ఆ లేఖలయందు, పదహారుగురు పాత్రులును గజపతి రాష్ట్రదుర్గ విషయములను తెలియజేయుటచే సంతోషించి, వారు కోరినవిధముగనే కానుకల నంపినటుల గల అంశములను చదివి, గజపతి

మిక్కిలి ఆశ్చర్యమొంది, ఎవరిని నమ్మరాదని విచారించి నగరము విడిచి పారి పోయెను. రాజు నగరము విడిచి పోయెనను విషయమును తెలిసికొని, పదహారుగురు పాత్రులును, రాజు లేనిదే యుద్ధమేలయని మరలిపోయిరి. కృష్ణదేవరాయలు మిక్కిలి సంతోషించి, పొట్నూరు సింహాద్రియందు జయస్తంభమును పాతించెను. తరువాత గజపతి నగరమున ప్రవేశించి, తన రాజ్యమును తానే పరిపాలించుకొనవచ్చునని, గజపతికి వర్తమాన మంపెను. అంత గజపతి, కానుకలతో రాయల కడ కరుదెంచి, తన కుమార్తెయగు తుఖ్కాదేవిని వివాహమును చేసికొమ్మని కోరెను. గజపతితో స్నేహమునే కోరుకొనుచున్న తిమ్మరుసు, కృష్ణరాయలు అందులకు అంగీకరించిరి. రాయలు గజపతి కుమార్తెను వివాహము చేసికొనెను. గజపతి కృష్ణ కావలి ఒడ్డున నున్న రాజ్యమును రాయలకు అరణముగ నిచ్చెను. రాయలు తిరుగు ప్రయాణ మున కల్బరిగ కోటను ముట్టడించి జయించెను. తరువాత శ్రీకాళహస్తి, కంచి, చిదంబరము, శ్రీరంగము మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించి విజయనగరమునకు చేరెను. ఇవి రాయవాచక కృష్ణరాయ విజయము నందలి రాయల దండయాత్రా వివరములు.

కృష్ణదేవరాయలు రాజ్యమునకు వచ్చుసరికి రాజ్యమున పరిస్థితులు అస్త వ్యస్తముగ నుండెను. ఉత్తరమున గజపతులు బలవంతులై రాజ్యమునందలి కొన్ని ప్రాంతములను స్వాధీనపరచుకొనిరి. దక్షిణమున ఉమ్మత్తూరు నాయకులు స్వతంత్రులైరి. రాయలకు మొదటినుండి పక్కలో బల్లెమువలె నున్న తురష్కులను జయింపవలెనను కోర్కెకలదు. దిగ్విజయ యాత్రలుచేయు తలంపుతో కృష్ణరాయలు రాజ్యమునకు వచ్చిన తరువాత వెంటనే యుద్ధముమాట తలపెట్టక రెండు సంవత్సరములపాటు తిమ్మరుసు సహాయముతో సైన్యమును సమకూర్చుకొనెను. క్రీ.శ. 1512 నందు కృష్ణదేవరాయలు దక్షిణదేశ దిగ్విజయమునకై బయలు దేరెను. మొదట ఉమ్మత్తూరును ముట్టడించి కోటగోడలను నేలమట్టము జేసెను. తరువాత శివసముద్రమును ముట్టడించి అందు దాగిన ఉమ్మత్తూరు రాజగు గంగరాజు నోడించెను. గంగరాజు పారిపోయి గంగశుచియను మడువులో పడి మరణించెను. తరువాత కృష్ణదేవరాయలు శ్రీరంగపట్టణమును వశపరచుకొనెను.[52] అందు చిక్కరాయని తనకు ప్రతినిధిగా నిల్పెను. తాను జయించిన పాళెములకు కెంపగౌడ, వీరప్పగౌడ అను పాళెగాండ్రను తనకు సామంతులుగ నియమించి స్థానిక పరిపాలకులను చేసెను.[53]

క్రీ.శ. 1513 లో ఉదయగిరిని ముట్టడించెను. అప్పుడు ఉదయగిరి ప్రతాప రుద్ర గజపతి క్రింద నుండెను. తిరుమల రాహుత్తరాయడు పాలకుడుగ నుండెను. ఇంచుమించు సంవత్సరముపాటు యుద్ధముచేసి ఉదయగిరి దుర్గమును కృష్ణదేవ

---

52. Robert Sewell, A Forgotten Empire, p. 126.
53. ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 320.

రాయలు రాయసము కొండమురుసయ్యా సహాయమున చివరకు సాధించెను. ఆ దుర్గాధ్యక్షుని పినతండ్రి ప్రహరేశ్వరపాత్రుని, అతని మేనత్తను చెరపట్టి విజయ నగరమునకు గొనిపోయెనని నూనిజ్ వ్రాసెను.[54] కొండవీటి విజయానంతరము కొండపల్లికేగి మూడు మాసములు యుద్ధముచేసి దుర్భేధ్యమగు ఆ దుర్గమును వశపరచు కొనెను. అచట ఒరిస్సారాజు యొక్క భార్యాపుత్రులను సహితము చెరపట్టినట్లు తెలియుచున్నది.[55] తరువాత రాజమండ్రిని కైవసము చేసికొనెను. అచట ఆరుమాసము లుండెను. ఉత్కళ రాజుతో సంధి సమకూరెను. ఒరిస్సా రాజకుమార్తెను వివాహము చేసికొనెను.[56] ఇవి నూనిజ్ అను విదేశీ యాత్రికుడు తెల్పిన విషయములు. కృష్ణరాయలు కటకము వరకు వెళ్లిన విషయ మీతడు తెలుపలేదు. రాజమండ్రిలోనే సంధి జరిగినట్లు, కటక రాజకుమార్తెను వివాహ మాడినట్లు ఈతడు తెలిపెను. కొండపల్లి విజయానంతరము రాయలు కొండవీటిని ముట్టడించి జయించెను. దుర్గాధ్యక్షుడైన వీరభద్ర గజపతిని రాయలు చెరపట్టి తరువాత మైసూరు నందలి చిట్టలదుర్గ ప్రాంతములకు పాలకునిగ చేసినట్లు శాసనా ధారముల వలన తెలియుచున్నది.[57] ఈ దుర్గమునకు తిమ్మరుసు తన సోదరుని పాలకునిగ నియమించెను.[58] ఈ సమయముననే కృష్ణదేవరాయలు బెల్లంకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు, తంగేడు, కేతవరము మొదలగు దుర్గములను వశపరచు కొనెను. ఈ దండయాత్రా సమయమున రాయలు, అమరా వతి యందలి అమరేశ్వరుని దర్శించెను. విజయవాడకు వెళ్లి అచటి దేవాలయములకు దానములు చేసి శాసనములు వేయించెను.[59] శ్రీకాకుళక్షేత్రమును దర్శించెను. తరువాత ఉత్తరముగ పోయి తెలంగాణమునందలి గజపతుల పాలనము క్రింద నున్న దుర్గములను స్వాధీన పరచుకొనెను. అనంతరము తీరాంధ్రదేశము నంతటిని వశపరచుకొని, విశాఖపట్టణము జిల్లాలోని పొట్నూరుకడ జయస్తంభమును నాటించి, సింహాచలమున కేగి స్వామిని దర్శించి కటకమువరకు పోయి ఆ పట్టణమును నష్టపరచి క్రీ.శ. 1515 లో విజయలక్ష్మీసమేతుడై మరలివచ్చెను.[60] రాయలు కటకము వరకు వెళ్లి, గజపతి సంధిచేసుకొన కోరగా అంగీకరించి గజపతి కుమార్తెను వివాహము చేసికొని విజయలక్ష్మీసమేతుడై విజయనగరమునకు వచ్చినటుల నీలకంఠశాస్త్రిగారును తెల్పిరి.[61] కృష్ణరాయల కాలమున వచ్చిన

---

54. Robert Sewell, A Forgotten Empire, p. 127.
55. Robert Sewell, A Forgotten Empire, pp. 127-128.
56. Robert Sewell, A Forgotten Empire, p. 128.
57. Epigraphia Indica, Vol. VI, pp. 117 - 233.
58. Robert Sewell, A Forgotten Empire, p. 131.
59. ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం, ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, p. 330.
60. ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 331.
61. K.A. Nilakanta Sastry, A History of South India, p. 271.

విదేశీయాత్రీకులైన Paes, Fernao Nuniz మాత్రము రాయలు రాజమండ్రితో మరలివచ్చినట్లు వ్రాసిరి. కాని రాయలు కటకము వరకు వెళ్లినటుల రాయవాచక కృష్ణరాయ విజయములే కాక పెక్కు శాసనములు తెలుపుచున్నవి. సింహాచలము నందలి శాసనము, బాపట్ల తాలుకా కొమ్మూరు గ్రామము నందలి రికార్డులు, చోళ సముద్రమునందలి దానపట్టికలు ఈ విషయమును స్పష్టపరచుచున్నవి.

కృష్ణదేవరాయలు కటకము వరకు వెళ్లెననుటకు
"ఇది నీలాచల నిలచేలక సుభద్రేందీవరాభాక్షికో
ఐదృగం చద్భుజవీర్య జయసన్నాహార్భటీ వాద్యభీ
త్యుది తేభేశ్వర కృష్ణరాయ మహిజాన్యుత్పాది తాముక్తమా
ల్యద నాశ్వానము సప్తమంబలరు హృద్యంబైన పద్యంబులన్"[62]

అను ఆముక్తమాల్యదనందలి పద్యము మరియొక నిదర్శనము.

కృష్ణరాయల విజయములలో ముఖ్యమైనది రాయచూరు దుర్గమును వశపరచుకొనుట. బీజపూరు సుల్తాను దీనిపాలకుడు. క్రీ.శ. 1520లో రాయలు పెద్ద సేనతో వెళ్లి ఆదిల్‌షాతో ఘోరముగ యుద్ధముచేసి కోటను స్వాధీనపరచు కొనెను. బీజపూరునకు పోయి ఆ పట్టణమును ధ్వంసముచేసెను. రాయచూరు దండయాత్రను Fernao Nuniz విపులముగ వివరించెను.[63] Firisthah కూడ ఈ అంశము వివరముగ తెలిపెను.[64] కలుబరిగ కోట స్వాధీన పరచుకొని అందు బంధితుడై ఉన్న బహమని రాజపుత్రుని విడిపించి అతనికి రాజ్యమొసగి 'యవన స్థాపనాచార్య' అను బిరుదు పొందెను. ఈ దిగ్విజయములతో దక్షిణావనినంతటిని తన ఏలుబడి క్రిందికి తెచ్చుకొనెను.

రాయల దిగ్విజయముల విషయమున రాయవాచక కృష్ణరాయ విజయముల లోని అంశములు పెక్కు చారిత్రక గ్రంథములందలి అంశములతో సరిపోవు చున్నవి. కాని వీరు సంవత్సరములను తారీఖులను వివరింపలేదు. ఈ అంశములే కాక చితాపుఖాను అను వీరుడు రాయలతో యుద్ధము చేసినటుల ఈ రెండు గ్రంథములు వర్ణించినవి.[65] కష్ణరాయలు గజపతిపైకి దండయాత్రకు వెడలు నపుడు మార్గమధ్యమున చితాపుఖాను 66 వేల విలుకాండ్రతో రాయలతో యుద్ధమునకు తలపడెను.

**చితాపుఖాను :**

ఇతడు సీతాపతి యను హిందూ వీరుడు. చితాపుఖాను అను బిరుదు వహించెను. ఇతడు క్రీ.శ. 1450–1520 నడుమ బహమనీ రాజులకడను

62. శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద, స.ఆ., ప. 75.
63. Robert Sewell, A Forgotten Empire, pp. 131–134.
64. Robert Sewell, A Forgotten Empire, pp. 145–147.
65. రాయవాచకము, p. 94, కృష్ణరాయ విజయము, తృ. ఆ., ప. 70–73.

తరువాత ఓరుగల్లునందు స్వతంత్రుడుగను, తరువాత పురుషోత్తము, ప్రతాపరుద్ర గజపతులకడను ఉండెను.[66] ఏకాశిలా నగరమున కోటయందు క్రీ.శ. 1504 సంవత్సరమున ఇతడు చెక్కించిన శాసన మొకటి గలదు. దీనిని బట్టి ఈతని వంశము భోగి వంశమని,స్వతంత్ర ప్రభుడని, మహావీరుడని తెలియుచున్నది. ఈతడు మహమ్మదీయులు పెరికివేసిన విగ్రహములను పునఃప్రతిష్టించినటుల, అనేక దాన ధర్మములను చేసినటుల తెలియుచున్నది. ఇతడు హిందూ మతాభిమాని. ఇతడు రాచకొండ, దేవరకొండ, కొండవీడు రాజ్యములు పతనమై, విజయనగర, బహమనీ రాజ్యములందు కలసిపోయిన సమయమున బహమనీ సుల్తానుల కడ సరదారుడుగా నుండెను.[67] ఇతడు కుతుబుల్‌ముల్కు చేతిలో ఓడిపోయి గజపతి శరణు కోరెను. ఈతడు రాయలతో యుద్ధము చేసిన కాలము క్రీ.శ. 1515–1516 సంవత్సరముల నడుమ కాలము. ఈ రెండు గ్రంథములందును ఈతడు, ఇతని పరివారము విలువిద్యయందు నేర్పరులుగ వర్ణింపబడిరి.

చరిత్రందు మరియొక చితాపుఖాను కలడు. ఇతనిని గంగాధర కవి తన 'తపతీ సంవరణము'న వర్ణించెను. ఇతడు క్రీ.శ. 1550-1580 ప్రాంతము వాడు. వీరిరువురిలో రాయలతో యుద్ధ మొనర్చినది ఎవరను సంశయము కలుగును. కాని రాయలతో చితాపుఖాను యుద్ధము క్రీ.శ. 1515–1516 సంవత్సరముల నడుమ నగుటచే, క్రీ.శ. 1504 సంవత్సర ప్రాంతమున ఓరుగల్లును పరిపాలించిన సామంత రాజగు చితాపుఖాననుట స్పష్టము.

చితాపుఖాను వృత్తాంతము కాక, రాయవాచకమున సాళువ తిమ్మరును ప్రశంస, విజాపుర వృత్తాంతము, అశ్వపతి గజపతి నరపతుల తారతమ్యము, తురుష్కుల శీలము, అహమదాబాదు గోలుకొండల వృత్తాంతము, తురుష్క రాజ్యములో దండనవిధానము, దక్షిణ హిందూరాజ్యములైన అమపురము, కేరళ, కళింగ రాజ్య విషయములు, గజపతికి విరోధులు విషప్రయోగము చేయుట, షోడశ పాత్రుల వివరములు మొదలగు పెక్కు విషయములు వివరముగ గలవు.[68] కృష్ణరాయ విజయమున ఈ అంశములు లేవు.

ఈ రెండు గ్రంథములందు రాయల కటక విజయము వివరముగ గలదు. గజపతులను జయించుట కష్టమని తిమ్మరుసు తెల్పినను వినక రాయలు గజపతులపైకి యుద్ధమునకు సిద్ధమైనతరువాత వారి బలగమును, షోడశ పాత్రుల బలపరాక్రమమును విని గజపతులను జయించుట కష్టమని తలంచెను. అప్పాజీతో మంతనము చేసి పదహారుగురు పాత్రులకు పెట్టెలలో కానుకలు పెట్టి, పదహారుగురు పాత్రులు రాయలకు గజపతి విషయములను తెలిపినందులకు రాయలు కానుకలు

66. ఖండవల్లి లక్ష్మీరంజనం, చితాబుఖాను, పీఠిక.

67. ఖండవల్లి లక్ష్మీరంజనం, చితాబుఖాను, పీఠిక.

68. రాయవాచకము. pp. 45–82.

పంపుచున్నటుల లేఖలను వ్రాసి ఆ పెట్టెలలో పెట్టి గజపతికడ కంపెను. ఆ లేఖలను చూసి గజపతి పదహారుగురు పాత్రులు తనను మోసగించిరని తలంచి నగరము విడిచి పారిపోయెను. రాజు తమ్ము మోసగించెనని పదహారుగురు పాత్రులు తమ నివాసములకు పోయిరి. కృష్ణరాయలు నగరమును జొచ్చి విజయమును ప్రకటించెను.[69] పదహారుగురు పాత్రులను ఉపాయముతో మోసగించి కటకమును జయించినటుల ఈ రెండు గ్రంథములందు తప్ప చరిత్ర గ్రంథములందు కానవచ్చుటలేదు. ఒకటి రెండు విషయములు తక్క రాయల దిగ్విజయముల విషయమున చరిత్ర గ్రంథములు రాయవాచక, కృష్ణరాయ విజయములతో ఏకీభవించుచున్నవి. రాయచూరు ముట్టడి విషయమున చరిత్రతో వీరి రచనకు సమన్వయము కుదురుటలేదు. క్రీ.శ. 1515 లో గజపతిని జయించివచ్చి ఐదు సంవత్సరముల తరువాత క్రీ. శ. 1520 లో రాయచూరును జయించెను. కృష్ణరాయ విజయమున గజపతితో యుద్ధమునకు ముందే రాయచూరును ముట్టడించి నటుల కలదు. రాయలచే ఓడింపబడిన ఉత్కళ దేశాధిపతి ముకుందగజదేవుడని కృష్ణరాయ విజయకర్త చెప్పెను. రాయవాచకమున గజపతియని గలదు.[70] కాని రాయలు యుద్ధము చేసినది ముకుందగజదేవునితో కాదు, ప్రతాపరుద్ర గజపతితో. ప్రతాపరుద్ర గజపతిని ఓడించి రాయలు అతని కుమార్తెను వివాహము చేసి కొనెననుట చారిత్రక సత్యము. ముకుందగజదేవుడు ప్రతాపరుద్రుని తరువాతివాడు.

రాయచూరు యుద్ధము గజపతిని జయింపకముందు జరిగినదని చెప్పిన విశ్వనాథనాయకుని స్థానాపతి, కుమార ధూర్జటి, కలుబరిగ ముట్టడి ప్రతాపరుద్రుని జయించినతరువాత జరిగినట్లు వర్ణించిరి.[71] పూర్వాపరములను సరిగ తెలిసికొనకయే ఈ రచయిత లిరువురును ఈ అంశమును వ్రాసిరనుట స్పష్టము.

### కృష్ణదేవరాయల వివాహము :

కృష్ణదేవరాయలకు తిరుమలదేవి, చిన్నాదేవి అను భార్యలున్నట్లు రాయల కాలమునాటి కవుల కావ్యములవలన స్పష్టమగుచున్నది.

"..........కృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియనుం దనకుఁగూర్చు దేవేరులుగాన్"[72]
"తిరుమలదేవీవల్లభ"[73]

69. రాయవాచకము, pp. 96–110, కృష్ణరాయ విజయము, చ.ఆ., ప. 84–114.
70. కృష్ణరాయ విజయము, తృ.అ., ప. 86.
71. రాయవాచకము, p. 111, కృష్ణరాయ విజయము, చ.అ., ప. 139.
72. అల్లసాని పెద్దన, మనుచరిత్రము, పీఠిక, ప. 33.
73. నంది తిమ్మన, పారిజాతాపహరణము, ప్ర.ఆ., ప. 104.

"శ్రీ వేంకటగిరి వల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక కవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయ మహీశా."[74]

మనుచరిత్ర, పారిజాతాపహరణ గ్రంథములవలన రాయలకు ఇరువురు భార్యలనుట స్పష్టము. కలుబరిగ కోటను ముట్టడించిన తరువాత పుణ్యక్షేత్రములు సందర్శించిన రాయలు, తిరుపతిలో ఇరుపార్శ్వములా తిరుమలదేవీ చిన్నాదేవీ సహితముగా ఉండే విధముగా తామ్రప్రతిమలను చేయించి స్వామికి ఎదురుగా నిలిపెను.[75] కనుక రాయల కిరువురు భార్యలనుట స్పష్టము. ఈ ఇరువురుకాక రాయల కింకెంతమంది భార్యలుండిరో తెలియుటలేదు. కాని రాయలు గజపతిని జయించి, సంధి షరతుగ ఆ రాజకుమార్తెను వివాహము చేసికొనినట్లు తెలియు చున్నది. కాని ఈ విషయము స్పష్టపరచుటకు, రాయవాచకము, కృష్ణరాయ విజయము ఆముక్తమాల్యదాది కొన్ని గ్రంథములు తప్ప తగు శాసనాధారములు లేవు. గజపతి కుమార్తెను వివాహము చేసికొనినతరువాత, పొట్నూరువద్ద శిలా శాసనములు వేయించి రాయలు విజయనగరమునకు తరలిపోయెను అని కోరుకొండ కైఫీయతునందు గలదు. సామర్లకోట కైఫీయతు కూడ ఈ అంశమును స్పష్టము చేయుచున్నది. కాని గజపతి కుమార్తె రాయల భార్యయైనటుల శాసనములందు కానవచ్చుటలేదు. రాయలు కటకమును జయించిన తరువాత పొట్నూరుకడ వేయించిన శాసనమందును రాయల భార్యలు చిన్నాదేవి తిరుమలదేవులనియే తెలియుచున్నది.[76]

తిరుమలదేవి శ్రీరంగపట్టణాధీశుని తనయ. రాయల పెద్ద భార్య. చిన్నాదేవి విషయమున పలువురు పలురకములైన అభిప్రాయములను వెలిబుచ్చిరి. రాయలు రాజ్యమునకు రాకముందు ఒక యువతిని ప్రేమించెననియు ఆమెయే చిన్నాదేవి యనియు కొందరి అభిప్రాయము.

ఉత్కళాధీశుని కుమార్తెను వివాహమాడు విషయము శాసనములందు లేనంతమాత్రమున అసత్యమనలేము. రాయలు ఉత్కళాధీశుని తనయను వివాహము చేసికొనినట్లు రాయవాచక కృష్ణరాయ విజయములు తెల్పుచున్నవి. కృపాసింధుమిశ్ర వ్రాసిన ఉత్కళ ఇతిహాసమున ఈ అంశము గలదట.[77] నీలకంఠ శాస్త్రిగారుకూడ ఈ వివాహ విషయమును ప్రస్తావించిరి.[78]

---

74. నంది తిమ్మన, పారిజాతాపహరణము, ఉ.ఆ., ప. 1.
75. రాయవాచకము, p. 111-112.
76. Col. Mackenzie Collections, No. 11.
77. నూతలపాటి పేరరాజు, శ్రీకృష్ణదేవరాయలు, p. 192.
78. K.A. Nilakanta Sastry, A History of South India, p. 271.

గజపతి కుమార్తె పేరు విషయమున పలురకములైన అభిప్రాయములున్నవి రాయవాచకము ఈమెను 'జగన్మోహిని' యనెను.[79] కుమార ధూర్జటి 'తుఖ్కా' యనెను.[80] విజయనగర సామ్రాజ్యమను గ్రంథ మీమెను 'లక్ష్మిదేవిగ' పేర్కొనెను.[81] నరపతి రాజుల చరిత్ర మీమెను 'లఖ' యని వర్ణించెను.[82] టేలర్ ఈమెను 'పచీదేవి' యనెను.[83] ఇన్ని పేర్లలో ఈమె అసలు పేరేమియో తెలియుటలేదు. ఓఢ్ర బాషలో లక్ష్మిని 'లఖి' యందురనియు, ఆ 'లఖి' యొక్క రూపాంతరమే 'లఖ,' 'తుఖ్కా' కావచ్చునని నేలటూరి వేంకట రమణయ్యగారు నిర్ణయించిరి.[84] రాయల మూడవ భార్యయని చెప్పబడుచున్న ఈ ఓఢ్రరాజు కుమార్తె విషయమున కొన్ని కథలుగూడ ప్రచారమున నున్నవి.

గజపతి భార్య, రాయలు నీచ కుల సంభవుడని రాయలకు తన కుమార్తె నిచ్చుటకు అంగీకరింపలేదు. గజపతి అమె సలహా పాటింపక వివాహము చేయగా, గజపతి భార్య రాయలను చంపుమని కుమార్తెను ప్రోత్సహించెను. తిమ్మరుసు దూర దృష్టి వలన తెలిసికొని ఆ ప్రయత్నము సాగనీయలేదు. ఈ విషయము తెలిసి రాయలామెను విడిచిపెట్టెనట. అమె పశ్చాత్తప్తురాలుకాగా రాయలామెను పరిగ్రహించెను. ఇది ఒకగాథ. గజపతి కుమార్తెకు తెలియకుండ అమె చెలికత్తెలు ఆమె వస్త్రములందు ఖడ్గము నుంచిరని, అది గాంచి రాయలు కోపించి ఆమెను విడిచెనని, నిజమును తెలుసుకొని తిమ్మరుసు, ఆమెను పరిగ్రహింపుమని రాయలను కోరగా రాయలామెను పరిగ్రహించెనని మరియొక గాథ. ఇట్టి కథలు సత్యమనుటకు మన కాధారములు లేవు. చరిత్రకారులెవ్వరును ఈ విషయములను అంగీకరించలేదు. కాని తుఖ్కా పంచకమని కొన్ని శ్లోకములు ప్రచారమున గలవు. ప్రచారమున గల కథలేవైనప్పటికి రాయలు గజపతి కుమార్తెను వివాహము చేసికొనెననుట స్పష్టము. గజపతిని జయించు విషయము, గజపతి కుమార్తెను వివాహము చేసికొను విషయము శాసనస్థము కాలేదనుట నమ్మదగ్గ విషయముగ లేదు. ఈ విషయమై ఒక్క శాసనమును లేకపోవుట, కృష్ణరాయల అనంతరము, రాయలనిన కోపముగల ఓఢ్ర రాజులు ఆ శాసనములను ధ్వంసము చేసిరేమో అను అనుమానము కలుగుటకు ఆస్కార మిచ్చుచున్నది.

---

79. రాయవాచకము, p. 109.

80. కృష్ణరాయ విజయము, చ. ఆ., ప. 12.

81. భారతి 1949 డిసెంబరు సంచిక (కృష్ణదేవరాయల దేవేరులు).

82. S. Krishna Swamy Aiyangar, Further Sources of Vijayanagar History.

83. గురజాడ శ్రీరామమూర్తి, కవిజీవితములు, p. 55.

84. భారతి, 1949, డిసెంబరు సంచిక (కృష్ణదేవరాయల దేవేరులు).

**రాజుల దినచర్య - పరిపాలనా విధానము :**

ఉదయముననే లేచి, ఇరువురు బ్రాహ్మణులను చూచి, నామావళులు, అధ్యాత్మ సంకీర్తనలు, పాండవ గీతలు, భ్రమర గీతలు, భారత, భాగవత, రామాయణాది పురాణములు విని, మోముకద్దమునందు చూచుకొని, ఇరువురు కన్యలను, కపిల కామధేనువులను స్పర్శించి కాల కృత్యములను తీర్చుకొనుట విజయనగర రాజుల ఆచారము.

సభతీర్చిన తరువాత, సభకు వచ్చిన శైవారాధ్యులను, వైష్ణవాచార్యులను, గౌరవించి, వారుచెప్పిన దేవాలయముల నిర్వహణ విషయములు తెలిసికొని వారిని తగురీతిని సత్కరించెడివారు.

దళనాయకుల పిలపించి, సర్వ దుర్గముల విషయములు, వాటి నిర్వహణ విషయము, సామంత రాజుల చర్యలు తెలసికొనెడివారు. తలారుల ద్వారా పట్ట ణమునందలి జనుల క్షేమముల తెలిసికొనెడివారు.

రాజ్యమునందుగల పదునెనిమిది రేవు పట్టణముల నిర్వహణ విషయము లెక్కలు, తెలిసికొని, ప్రయాణము కొరకివ్వబడిన కాగితములను (కమ్మకాకితము లను ; Passports) స్వయముగ చూచెడివారు. గజాశ్వములకు భటులకు అయ్యెడి వ్యయమును తెలిసికొనెడివారు. రాజ్యమునందు, పర రాజ్యములందు జరుగు విషయములను తెలుసుకొనుటకు వేగులుండెడివారు. రాజులే స్వయముగ నగరమును శోధించెడివారు. విజయనగర రాజులు పండితులు, కవి పండిత పోష కులు, కళాభిమానులు. యుద్ధభూమికి సహితము, కవులను, రాణులను కూడ తీసుకొని వెళ్ళెడివారు.[85]

పట్టాభిషేకమైన తరువాత, రాజు పాటించవలసిన నియమములు, రాజ్యనిర్వహణ పద్ధతులు, శత్రువుల నిర్జించు విధానము, మిత్రాదరణము, సప్తాంగములు, సప్త మహోపాయములు, సప్త వ్యసనములు, సప్త సంతా నములు, సప్త ధాతువులు, సప్తత్యాగములు, పదునాలుగు రాజ దోషములు, తర్క విద్యాశాస్త్ర రహస్యము, అశ్వగజారోహణము, ధర్మత్రయము, శక్తి త్రయము, త్రిసంధ్యానియమము, నాయక లక్షణములు, పురుషార్థములు, ఆగమములు, ఆశ్రమ విధులు, స్త్రీ లక్షణములు, చతుర్విధ మదన మార్గములు, పంచాంగ, పంచ మహావాద్య పంచవిధ ఆహారములు, ఆర్గురు చక్రవర్తుల చరిత్రలు, షడ్దర్శనములు మొదలగు అంశములన్నియు మంత్రులు, రాజులకు బోధించెడివారు.

ఇవికాక రాజు ఆరు శాస్త్రములు తెలిసికొనవలెను. అష్ట భోగములు అనుభ వింపుచు, శృంగార, వీర, కరుణ అద్భుత హాస్య భయానక బీభత్స రౌద్రావేశుండై ఉండవలెను. నవరత్నపరీక్ష తెలిసికొనవలెను. ఇరువదివడుల భేదములు, అష్టాదశవర్ణ

85. రాయవాచకము, p. 85, కృష్ణరాయ విజయము, తృ. ఆ., ప. 48.

నలు, సంస్కృత ప్రాకృత, శూరసేన, మాగధ, పైశాచి, చూళిక, అపభ్రంశ తెలుగు భాషలు తెలిసికొని, కవులను రక్షించుచు, దశ అవస్థలను, షోడశావస్థా భేదములను, షోడశ కళాస్థాన మర్మములను, దుష్టశిక్షణ, శిష్టరక్షణ మొదలగు సర్వ విషయము లను తెలిసికొని రాజ్యమును పాలించవలెనని మంత్రులు, కృష్ణ దేవరాయలకు బోధించిరి.[86] ఈ విషయముల వలన పూర్వము రాజులు సర్వ విషయములను తెలిసికొని రాజ్యపాలన చేసినటుల కన్పడుచున్నది.

కోశాది వివరణము: విద్యారణ్యులు విజయనగరమును నిర్మించి నిక్షేపించిన ధనము—తొంబదితొమ్మిది కోట్ల ఆరు లక్షలు, నగలు నాలుగు కోట్లు, నవరత్నములు ఆరుకోట్లు అని రాయవాచకమున, తొంబది ఆరుకోట్లు ధనము, నాలుగు కోట్ల మణి విభూషణములు అని కృష్ణరాయ విజయమున కలదు. కుమార ధూర్జటి తప్పు వ్రాసినటుల కన్పడుచున్నది. మునుపు పాలించిన రాజులు నిక్షేపించినది పందొమ్మిది కోట్ల యాభైయారు లక్షలు, ఇది కాక కర్ణాటక రాజ్యం పదికోట్ల యెనభై నాలుగు లక్షలు. దేవాదాయములకు బ్రాహ్మణులకు అరువది లక్షలు వ్యయము కాగా మిగిలి నది పదికోట్ల ఇరువది నాలుగు లక్షలు.

సైన్యమునకు అయ్యెడి ఖర్చు: రోజు ఒక్కొక్క గుఱ్ఱమునకు నూరు పుట్ల లెక్కన వెయ్యి గుఱ్ఱములకు లక్ష పుటులు, ఏనుగు వక్కంటికి వెయ్యేసి పుట్ల చొప్పున నూట యిరువది ఏనుగులకు, పంద్రెండు లక్షలు, ఒక్కొక్క భటునకు నెలకు ఒక పుట్టి రెండు వరహాలు లెక్క వెయ్యిమంది భటులకు రెండు వేల వంతున, రెండు లక్షల భటులకు నాలుగు లక్షలు వ్యయము చేసెడివారు.[87]

సేన: ఇరువది నాలుగు వేల గుఱ్ఱములు, నూటయిరువది ఏనుగులు, కాల్బలము రెండు లక్షలు. ఈ విషయములు Salatore విపులముగ వ్రాసెను.[88] కృష్ణరాయ విజయమున సరియగు సంఖ్య యివ్వబడలేదు.

తురష్క రాజ్యమున దండన విధానము: రంపముతో మనుష్యులను కోయుట; గోనెలందు మనుష్యులను వేసి ఇనుప గురియలతో కొట్టుట; చెవులకు, ఇనుము కాల్చి తగిలించుట; రెండు తూముల బరువుగల రాళ్ళను రెండు కాళ్ళకు కట్టి పాడు గోడలకు రెండు ప్రక్కల దిగవేయుట; మూటగా కట్టి ఎండలో దొర్లించుట; కాలు, చేయి, చెవి, ముక్కు ఖండించుట; ఏనుగుల కాళ్ళక్రింద

---

86. రాయవాచకము, pp. 18 - 25; కృష్ణరాయ విజయము, ద్వి. ఆ., ప. 49 – 58, వచనం, 59.

87. రాయవాచకము, p. 34, 35.

88. Salatore - Social and Political Life in Vijayanagar Empire, Vol. II. Paes కూడ రాయల సేన విషయము విపులముగ వ్రాసెను. Oxford Indian History, Vincent Smith.

దొర్లించుట.[89] మొదలగు దండన విధానములను పదునారవ శతాబ్దపు తురష్క ప్రభువులు అవలంబించిరి.

అయుధములు : ఈటెలు, బల్లెములు, శరములు, ఖడ్గములు, తుపాకులు, ఫిరంగులు నాడు ఉపయోగించిన ఆయుధములు.[90]

రాజోద్యోగులు : మంత్రులు, దొరమన్నీలు, పాళ్యగాళ్లు, అమరనాయకులు దళనాయకులు, సంప్రతులు (పెద్దకరణము) స్థానాపతులు, (స్థానాపతి ఈనాటి embassador వంటి ఉద్యోగము), తలారులు, వేగరులు, గణికులు, కొత్వాలు, మావత్తులు, రౌతులు, బంట్లు, వందీవైతాళికులు, పాటకులు, పరాణీకులు, నగరి విద్వాంసులు మొదలగు ఉద్యోగములుండెను. నాడు ప్రతి రాజ్యమునకు రాజ ప్రతినిధులను పంపెడి పద్ధతి అమలులోనుండెను.[91]

రాజులు రాజ్యమునకు వచ్చిన వెంటనే తన పరిపాలనక్రింద నున్న రాజ్యములను, దుర్గములను, కోటకొత్తళములను (సరిహద్దులు), పుణ్యభూములను, విష్ణుస్థలములను చూచివచ్చు అచారముండెను.[92]

వేషభాషలు, వస్త్రాలంకారములు :

వైష్ణవులు, ఫాలభాగమున, తిరుమార్ణము పెట్టుకొనెడివారు. చెవులకు బంగారు కుండలములు ధరించెడివారు. కంఠమునందు తులసి పూసలుధరించి, హస్తమున పద్మాక్షమాలికలు త్రిప్పెడివారు.

శైవులు శిగలయందు శివలింగములు ధరించెడివారు. ఫాలభాగమున విభూతి, కంఠమున రుద్రాక్షమాలికలు ధరించెడివారు.

నాడు ప్రజలు చిత్రవస్త్రములు, నీర్కావిధోవతులు, పదహారు మూరల కంచి ధోవతులు ధరించెడివారు.

రాజులు యుద్ధముల కేగునపుడు, అతి రమ్యమైన, విలువైన గుడారములను నిర్మించెడివారు. కృష్ణదేవరాయలు కళింగ జైత్రయాత్రకు వెళ్ళినపుడు, పాట్నారు సింహాద్రికడనట్టి గుడారములను వేయించెను. అవి

"కెందమ్మి చెంగల్వ చందమ్ములంగెల్వ
జెల్వైన కెంబట్టు జిగిగుడార్లు
రంగారు బంగారు సింగారము లెసంగు
మేలైన తెలిపట్టు మిహిగుడార్లు
చిగురాకు తెగసారు నగరాజిలు హుశారు
వగమీఱు రత్నాల వహిగుడార్లు

89. రాయవాచకము, p. 55.
90. రాయవాచకము, కృష్ణరాయ విజయము.
91. రాయవాచకము, కృష్ణరాయ విజయము.
92. రాయవాచకము.

హెచ్చైన వెలువ మేల్పచ్చడాల్ పచ్చడాల్
పచ్చడాల్ గలజీని పని గుడార్లు
గొప్ప హురుమంజి నుప్పాణి కూర్పడంపు
డంబు పగడంబు జగడంబు నంబరంబు
లెసగిన గుడార్లు గలుగు నవ్య సువతీశు
పాళెమీక్షించి గజరాజు భయము మించి.[93]

రకరకములైన పట్టు వస్త్రములతో, పచ్చడములతో, అలరారినవి.

ఈ అంశములు మనకు ఆనాటి ప్రజల ప్రాభవము, రాజుల వైభవము వారవలంబించిన మతము, మొదలగు విషయములను తెలియజేయుచున్నవి.

రాజుల అలంకారములు : వెన్నముద్ద కంఠమాల, నవరత్నపు చిలుకతాళి, వైడూర్యతాళి, వజ్రాలసరిపెణ, మరకత కంకణం, హురుమంజి ముత్యాల పచ్చసరం, ఇంద్రనీల మకుటం, వజ్రపు బిళ్లల మొలతాడు, కెంపుజమదాడి, ముత్యాలకాలి పెండ్యం, వజ్రాలబాహుపురి, దొడ్డముత్యాల అడ్డకత్తి, నవరత్న ఖేడం, నవరత్నపు సింహతలాటం, ముత్యాల ముంగర[94] మొదలగు నగలు కృష్ణదేవ రాయలు ధరించినటుల తెలియుచున్నది. ఆకాలమున నవరత్నములనెక్కువగా ఉపయోగించిరి. వజ్రాలకమ్మలు, వైడూర్యపు పతకములు, పచ్చల కమ్మలు, ముత్యపు ముక్కర, కెంపుల వడ్డాణం, బంగారు నూపురములు, తాళిచౌకట్లు, పచ్చలపోంట్లు (ఇవి బహుశః పురుషులు చెవులకు ధరించెడి నగలైయుండును), ముత్యాల తురాయి, వజ్రాల కంఠసరములు, కెంపుల ఉంగరములు ఆనాడు ధరించిన నగలలో కొన్నిరకములు.

నాడు ప్రభువులు, రాజోద్యోగులు, ధనికులు గంధము, కస్తూరి, పునుగు, జవ్వాజి మొదలగు సుగంధద్రవ్యములను వాడెడివారు. కుంకుమము, సంకు మదము మొదలగు సుగంధద్రవ్యములు విపణివీధులందు విరివిగా దొరుకు చుండెను.[95] పట్టువస్త్రములను బజారులందు తోరణములుగ వ్రేలాడవేసి విక్రయించెడివారు.[96] పుష్పములను మాత్రము ప్రత్యేకముగ స్త్రీలే విక్రయించెడి వారు.[97] విదేశీవ్యాపారము విరివిగా జరుగుచుండెను. రాయల రాజ్యమున పదునెనిమిది రేవుపట్టణములుండెను.[98]

---

93. కృష్ణరాయ విజయము, తృ. ఆ., ప. 75.
94. రాయవాచకము, p. 105.
95. కృష్ణరాయ విజయము, ప్ర. ఆ., వచనం 56, p. 25.
96. కృష్ణరాయ విజయము, ప్ర. ఆ., వచనం 56, p. 25.
97. కృష్ణరాయ విజయము, ప్ర. ఆ., ప. 55, p. 23.
98. రాయవాచకము,

**మతము :**

ఆనాటి రాజులు అవలంబించిన మతము వైష్ణవము. అయినప్పటికి, అన్యమతములను సహితము వారాదరించెడి వారు. ముఖ్యముగ, వైష్ణవులకు విరోధులగు శైవులనుకూడా వారు ఆదరించిరి. కృష్ణదేవరాయలు, వైష్ణమత సంబంధియైన 'ఆముక్తమాల్యద' యను గ్రంథమును వ్రాసెను. ఆనాటి, శైవ, వైష్ణవ మతావలంబుల వేషభాషలు :

"అందంబుగ నలికమందొప్పు తిరుమణి
    తిరుచూర్ణమును వింతమెఱుగుతీర
సిద్ధంపు బెక్కుల ముద్దుగుల్కు కడాని
    కుండలంబుల కాంతి మెండు కొనగ
శంఖచక్రాకీర్ణ సౌవర్ణ మకుటముల్
    ధళధళ ద్యుతులు దిక్తటుల నించ
బదియారు మూర దంబపుటంచు కమ్మిడాల్
    కంచి దోవతి చెల్వు మించు లెసగ
కంఠ వలమాన నవ మాలికల్ రహింప
గేల బద్మాక్ష మాలికల్ గీలు కొల్ప
వియ్యమందంగ ధారళశయ్య నత్ప్ర
బంధరావంబు నెఱయంగ బ్రౌఢి వెలయు."
"కడువేడుక నడుగడుగున
బుడమిన్ సాష్టాంగమునగు భుజముద్రలతో"
నడుగులకు మ్రొక్క జనముల
నడియం దాసోహమనెడి యార్భటు లెసఁగన్."
"వెంట నిజశిష్యగణములు వేలు గొలువ
వైష్ణవులు వచ్చిరపుడు భూవరుని సభకు"[99]
ఇవి వైష్ణవుల వేషభాషలు : ఇంక శైవులు రాజసభకు వచ్చెడి విధము :
"చిత్రవస్త్రములతో సిగలపై గట్టిన
    శివలింగముల్చాల జిందులాడ
కర్ణాంత విశ్రాంత ఘనఫాలభసిత త్రి
    పుండ గంధాక్షతస్ఫూర్తు లమర
స్ఫటిక ప్రవాళవిస్ఫుట భుజాంతర నట
    ద్భద్రరుద్రాక్ష నైపథ్య మలర

99. కృష్ణరాయ విజయము, ద్వి.ఆ., ప. 2, 3, 4.

గటిని గట్టిన నీరు కావి ధోవతి చాయ
లెజ్జిగస్వేదపూల నీనడింప
హరమహదేవ పార్వతీశ్వర యటంచు
వెంట శైవద్విజుల్ గొందఱంటిరాగ
నధ్యయన ధుర్యులైన యారాధ్యవరులు
సరగ నరుదెంచిరి నృపాలు సముఖమునకు"[100]

వేలకొలది శిష్యులు, వైష్ణవులకును, కొందరు శైవులకును అనుటయందే, అనాటి వైష్ణవ మతప్రభావము తెలియుచున్నది. రాయలు వైష్ణవుడైనప్పటికి పరమతముల నాదరించెను. ఈతని ఇష్టదైవము వేంకటేశ్వరుడు. అయినప్పటికి, ఈతడు వైష్ణవాలయములనేకాక శివాలయములును దర్శించెడివాడు. రాయలు రాజ్యవ్యవహారములన్నియు, మంత్రుల సహాయముతో తానే స్వయముగ పరిశీలించెడివాడు. రాజకార్యములన్నింటియందు, మంత్రులను ముఖ్యముగ అప్పాజీని సంప్రదించెడివాడు. స్వయముగ ప్రచ్ఛన్నవేషమున నగరశోధన చేసెడివాడు.

ఈతడు భక్తుడు. పెక్కు క్షేత్రములను దర్శించి, నవరత్నములు, ఆభరణములు, గ్రామములు కానుకల నొసంగెను. షోడశ మహాదానములను చేసెను.[101]

కృష్ణదేవరాయలు, కవీంద్రులతో గోష్ఠి సలుపుచు కావ్యములను కృతినందుచు రాజ్యపాలనము చేసెను.

రాయలు దర్శించిన పుణ్యక్షేత్రములు: తిరుపతి, కాళహస్తి, త్రిపురాలు, నందీశ్వరము, అళగరుగుడి, మధుర మీనాక్షి, చొక్కనాథుడు, శ్రీవిల్లపుత్తూరు, కరువనల్లూరు, శంకరనారాయణ దేవళము, నాగతీర్థము, దక్షిణ కాశి, త్రికూటాచలము, చిత్రసభ, అగస్త్య పర్వతమునందలి కల్యాణతీర్థము, గజేంద్రమోక్షము, శాలవటపురము, కురుంగుడి కన్యాకుమారి, కందుకూరు, నవతిరుపతులు, అదిసేతువు, ధనుష్కోటి, చతుర్వింశతి తీర్థములు, శ్రీరంగపట్టణము.

కృష్ణదేవరాయలు గావించిన దానధర్మములు: (శ్రీముఖ సంవత్సరము ఆశ్వయుజ శుద్ధఏకాదశినాడు) తిరుపతియందు అంజలిపుటులై ఇరుపార్శ్వముల తిరుమలదేవి, చిన్నాదేవుల సహితముగ, తాను నడుమనుండునటుల తామ్రప్రతిమలను వేంకటేశ్వరస్వామి సన్నిధిని పూర్వద్వారమున చేయించెను. తిరుపతి వేంకటేశ్వరునకు, సకల భూషణములను యిచ్చెను. షోడష మహాదానములను చేసెను. కాళహస్తి స్వామికిని, కానుకలు, నవరత్నాభరణములను యిచ్చెను. శ్రీముఖ సంవత్సర అశ్వయుజ శుద్ధఏకాదశినాడు వస్త్రములను, గ్రామములను షోడష మహాదానములను చేసెను. అళగరునకు ముత్యాల కిరీటము, పచ్చల

100. కృష్ణరాయ విజయము, ద్వి.ఆ., ప. 6.

101. రాయవాచకము, pp. 111–117, కృష్ణరాయ విజయము, చ.ఆ., p. 117.

పతకము నిచ్చెను. మధుర మీనాక్షికి వజ్రాల కమ్మలు, ముత్యపు ముక్కెర, వైడూర్యపు పతకము, పచ్చల కమ్మలు సమర్పించెను. చూడుకుడత, సంపంగి మన్నారు స్వాములకు (శ్రీవిల్లిపుత్తూరు) తిరుముక్కు, కెంపుల వడ్డాణము, బంగారు నూపురములు, నవరత్నములతో చేయబడిన సింహముఖముగల ప్రభలు యిచ్చెను. రాతి కట్టడములకొరకు మంటప నిర్మాణముకొరకు లక్ష మాడలిచ్చెను. శాలి వటమున, రాగి మంటపము నిర్మించుకొరకు ధనమొసంగి, కృష్ణరాయ సముద్రమని తన పేర అగ్రహారము నొసంగెను. నవతిరుపతులయందు, నవరత్న భూషణాదుల నొసంగెను. ధనుష్కోటియందు తులాపురుష దానము చేసెను. చతుర్వింశతి తీర్థములందు, కోటి గోదానములను, కోటిమంది బ్రాహ్మణులకు అన్నదానము చేసెను. పర్వతవర్ధని అమ్మవారికి, స్వామి సాన్నిధ్యములో తనను మూడుమారులు తూచుకొని, ఆభరణములను నవరత్నములను యిచ్చెను. మంకణ తీర్థమున అమ్మ వారికి సకలాభరణముల నొసంగెను. విజయనగరమునందలి విరూపాక్షస్వామికిని, పెక్కు కానుకల నిచ్చెను.[102] రాయలు ఆలయములకు కానుకలిచ్చుటయేకాక ఆలయములకు గోపురములను నిర్మించెను.

కళాభిమానము :

విజయనగర ప్రభువులకు కవిత్వమనిన ప్రీతి. వీరు పెక్కుమంది కవులను, పండితులను పోషించిరి. కావ్యరచనమును చేపట్టిరి. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్త మాల్యదాది గ్రంథములను రచించెను. ఈతడు రణరంగమునకు వెళ్లునపుడు కవులను వెంటతీసికొని వెళ్లెడివాడు. రాయవాచక కృష్ణరాయ విజయకర్తలు కృష్ణదేవరాయలను గ్రంథకర్తగ, గ్రంథభర్తగ వర్ణించిరేతప్ప ఏవి గ్రంథములను రచించెనో తెలుపలేదు. రాయలు కవియేకాక గాయకుడు. లలితకళాభిమాని. ఈతడు కవి పండితులను పోషించి ఆంధ్రవాఙ్మయ వికాసమునకు దోహదముచేసి 'ఆంధ్రభోజు'[103] డను బిరుదు వహించెను. ఈతని ఆస్థానమున అష్టదిగ్గజములను కవులుండిరి. ఇవి చరిత్రకు అనగా, రాజకీయ, సాంఘిక, మత చరిత్రకు సంబంధించిన విషయములు. ఇందు కొన్ని చరిత్రాంశములు, చరిత్రకు భిన్నముగ కొలది వ్యత్యాసముతో వ్రాయబడినది. దీనికి కారణములు (1) చారిత్రక సత్యము నందు కవికి శ్రద్ధలేకపోవుట, (2) కొన్ని సంఘటనలందు, కొన్ని కార్యములు సామాన్య మానవులు చేసిరనుటకంటే తపస్సంపన్నులు, దైవాంశసంభూతులు చేసిరనిన, సామాన్య మానవులు సులభముగ విశ్వసింతురను నమ్మకముండుట, (3) కావ్యము వ్రాయవలెననిన కావ్యమునకు కొన్ని లక్షణములుండవలయునని

102. రాయవాచకము, pp. 111–114.

103. Epigraphia Indica, Vol. 13, p. 366.

లాక్షణికులు నిర్ణయించుటచే తమ కావ్యములందీ లక్షణములుండునటుల వ్రాయ ప్రయత్నించి, అతిశయోక్తులు జరుగని సంఘటనలను చేర్చుట.

రచనా విశేషములు : కృష్ణరాయ విజయకర్త తాను వ్రాయునది కావ్యమగుటచే అందు కావ్యలక్షణముల నన్నింటిని చేర్చ ప్రయత్నించెను. నాయిక అంగాంగ సౌందర్య వర్ణన, చంద్రోదయాస్తమయములు, సూర్యోదయాస్తమయములు, ఉద్యానవన వర్ణన, విరహవర్ణన మొదలగునవి కలవు. ఇందు ముఖ్యముగ చెప్పుకొనదగినది చిలుక రాయబారము.

గజపతి కుమార్తె తన అందచందములు తెలుపుమని తనను చూడవచ్చిన అప్పాజీద్వార రాయలకడకొక చిలుకను పంపు ఘట్టమును కవి ప్రవేశపెట్టెను – ఈ కథకు చారిత్రకముగ ఎట్టి ఆధారమును లేదు. ఇది కేవలము కావ్యధోరణికై ప్రవేశ పెట్టినటుల స్పష్టపడుచున్నది. ఈ రాయబార ఘట్టములు ఆంధ్ర వాఙ్మయములో కన్పడుచునే ఉన్నవి. ఈ పద్ధతి మనకు సంస్కృత కవులనుండి సంక్రమించినది. నాయికా, నాయకుల సంధానము కొరకు ఇట్టి రాయబార ఘట్టములను కవులు ప్రవేశపెట్టిరి. కొందరు కవులు మనుష్యులను, కొందరు పక్షులను ఉపయోగించిరి. శ్రీనాథుడు హంసను ప్రవేశపెట్టెను. కుమారధూర్జటికి ఇట్టి రాయబార ఘట్టమును తన కావ్యమునందు వ్రాసిన చక్కగ నుండునను భావము కలిగియుండును. అందుచే ఒక రాయబార ఘట్టమును వ్రాసెను. ఈ కవి కూడ శ్రీనాథునివలె హంసను కాక, చిలుకను రాయబారము కొరకు వినియోగించుట కొంత ఔచిత్యముగ కన్పించుచున్నది. నేడుకూడ చిలుకలు మాటలాడుచున్నవి కనుక ఆనాడు చిలుక రాయబారము నడిపెనన్న నమ్మవచ్చును. అదియే ఏ హంసయో అనిన మనకు అసలు సమ్మకము కలుగదు. నలుని కాలము కృతయుగము. అనాటి స్థితి గతులు మనకు తెలియవు. హంసలేకాదు, వృక్షములు మాటలాడిన వనినను మనము నమ్మవలెను. కాని కృష్ణరాయల కాలము కలియుగము. హంసలు, వృక్షములు మాటలాడిన వనిన నమ్మదగిన విషయముకాదు కనుక కవి రాయబారమునకు చిలుక నెన్నుకొనుట ఔచిత్యముగనే యున్నది. ఇది చారిత్రక విషయము కాక పోయినప్పటికి, కావ్యమున ఇట్టి సంఘటన అనౌచిత్యముగ నుండదు. కాని ఇది చారిత్రక కావ్యమగుటచే సత్యదూరమగుచున్నది.

వర్ణనములు — రసము :

రాయవాచకము నందు వర్ణనము లేమియునులేవు. కృష్ణరాయ విజయము నందు పెక్కువర్ణనలు కలవు. కుమార ధూర్జటి వర్ణనలు మిక్కిలి సహజముగ నున్నవి. ఈతడు చక్కని కల్పనలతో, పరిశీలనా దృష్టితో మనోరంజకముగ వర్ణనలు చేసెను. పురవర్ణన, తరులతాదుల వర్ణనము చక్కగనున్నవి.

తొలుదొల్త బండుటాకులు రాలె మహిమీఁద
విలసల్లె మలయాద్రి మలయునీఁద

యొక్కొక్క కెందలి రుదుయించెఁ దరురాజి
దోరమై తనరెఁగంతుని వరాజి
చెలఁగె దిక్తటులఁ గోయిల రావముల గౌరు
మెదలాడె గండు తుమ్మెదల బాఱు
రహి మీఱె నపుడు మరంద ధారల చెన్ను
పొలపొందె మెఱుఁగుఁ బుప్పొడుల వన్నె
పొన్న గున్నలు సుర పొన్న లన్నువలగు
కొన్ననల చెన్ను లలరిన విన్న నెనఁగె
నెన్న నన్నన్న యాచైత్ర మెంత వింత
సంతస మొనర్చె రమ్యమై జనులకెల్ల.[104]

ఈ పద్యమునందు మనకు వసంతకాలమున ప్రకృతి కనుల ముందు క్రమ క్రమ పరిణామము పొందుచున్నటుల కన్పడుచున్నది.

చంద్రోదయ అస్తమయములు, సూర్యోదయ వర్ణనములందు కవియొక్క రచనా నైపుణ్యము, భావుకత, నిశితమగు పరిశీలనా తత్త్వము విశదమగుచున్నది. చీకటులను ఛేదించుకొని, క్రమ క్రమముగా, వర్ణములు మారుచు నుదయించెడి సూర్యుని వర్ణనము, చిత్రకారుని చేతియందలి తూలికా విన్యాసమును ధిక్కరించు చున్నది.

ఈతని స్త్రీ వర్ణనము పూర్వకవుల కెంతమాత్రమును తీసిపోలేదు. చతుర్థా శ్వాసమున తుక్కా అంగాంగ సౌందర్యమును పదునొకండు పద్యములలో వర్ణిం చెను. ద్వితీయాశ్వాసమున లక్ష్మిదేవి స్వరూప వర్ణనము చక్కని పదముల కూర్పుతో రమ్యముగ సాగినది. చంద్ర దూషణ మన్మథ దూషణాదుల వర్ణనలు సందర్భము నకు సరిపడు వృత్తముల నందముగ సాగినవి.

ఈ కవి రసపోషణమునుకూడ మేలుగనున్నది. సర్వసాధారణముగ చారి త్రక కావ్యములందు వీరరసముండును. ఈ వీరము యుద్ధవీరము, దానవీరము, దయావీరము, ధర్మవీరము మొదలగు ఇరువదినాలుగు వీరములుగ విభజింప బడినది.[105] ఇందు ఏదేని ఒక వీరము అంగముగ ఉండును. కొన్ని కావ్యములు వీరము అంగిగను శృంగారము అంగముగను రచింపబడినవి. కుమార ధూర్జటి ఈ కావ్యమున వీర రసమును అంగిగ పోషించెను. ఈ కావ్యమునందలి నాయకుడైన కృష్ణదేవరాయలు వీరుడు. అతనికడ నున్న సామంత నృపతులు వీరులు. విష్వ చ్చుని ధిక్కరించు అసహాయశూరులు. విజయనగరము వీరక్షేత్రము. నాయకుడైన కృష్ణరాయలనిన శత్రురాజులకు సింహస్వప్నము. కృష్ణరాయుని పాత్రపోషణము

104. కృష్ణరాయ విజయము, చ. ఆ., ప. 42.

105. జి.వి. సుబ్రహ్మణ్యం, వీరరసము, pp. 69 – 103.

నందు త్యాగవీరమును, దయావీరమును, దానవీరమును చక్కగపోషించెను. యుద్ధ వర్ణనయందు శబ్దాదులను భయాలాపాదులను వ్యక్తముచేయుటకు ప్రాసలను అను ప్రాసలను సమ యానుకూలముగ ఉపయోగించి చమత్కారమగు భావ ప్రకటనము గావించెను. ఈ కవి వీర రసపోషణకై ఎక్కువగ పంచచామర వృత్తము నెన్నుకొనెను. ఈ వృత్తము కదను త్రొక్కునటులుండును కనుక యుద్ధ వర్ణనలకు అతికినట్లు సరిపోవును.

"పరాకు రాకు రాకు మంచుఁబారసీక భూపతుల్
చిరాకుమీఱ దట్టమైన సింగిణీల కోరులన్
జిరాగుజాల వేసిడాసి చిల్లుపొల్లు జేయుచున్
నిరాకరించి మించివచ్చు నేర్పుఁ జూచితే నృపా"[106]

ఈ పద్యమున కదనోత్సాహము, ప్రతాపము వెల్లడియగుచున్నవి. ఈతని రచనయందు కొంత హాస్యరసమునుగలదు. కృష్ణరాయలు రణరంగమునకు రాగా తురుష్కులు పడిన పాట్లు నవ్వుపుట్టించును.

శృంగార రసపోషణమునందును ఈ కవి ప్రబంధ కవులకు తీసిపోలేదు. సర్వసాధారణముగ కవులు ఒడలుమరచి శృంగార వర్ణనలు చేయుట మనకావ్యము లందు కనిపించును. ఈ కవి కూడ అదను చూచుకొని కృష్ణరాయల వివాహ సంద ర్భమున శృంగార రసమును చిప్పిలజేసెను.

ఇట్టిరమణీయములైన వర్ణములతో, సరళమైనశైలితో, సరసమగు భావములతో అతి రమ్యముగ రచించి

... ... ...

... ... ....

"సార సాహిత్య సౌహిత్య సరణివెలయ
వర్ణనలొనర్తురమణీయ వాక్యములను."[107]

అను మాటలు సత్యములని నిరూపించు కొనినాడు కుమారధూర్జటి.

"కృష్ణరాయవిజయము" చరిత్ర దృష్టితో వ్రాయబడినది కాదు, ప్రబంధ దృష్టితో వ్రాయబడినది అని కవితరంగణికారుని అభిప్రాయము. అదియేకాక, "కృష్ణరాయవిజయము నందలి యంశములు సత్యములని చరిత్రకారులు భావింప రాదని తలంచుచున్నాడను[108] అనికూడా శ్రీ శేషయ్యగారు తెల్పిరి. దానికి ఉదాహరణముగ "కృష్ణరాయల తండ్రి నరసరాయలని శాసనములందున్నది. ఇందు వీరనరసింహరాయలని చెప్పబడినది. నరసరాయలనే యాతడు వీరనరసింహ

106. కృష్ణరాయ విజయము, తృ.ఆ., ప. 30, p. 68.

107. కృష్ణరాయ విజయము, పీఠిక, ప. 11, p. 10.

108. చాగంటి శేషయ్య, కవితరంగిణి, సంపు. 12.

రాయలని చెప్పియుండవచ్చును. కాని నరసరాయలకు వీరనరసింహరాయలను తనయుడున్నప్పుడాభేదమును గన్పరుపవలసియుండును కదా !"[109] అనిరి.

ఇట్టి అభిప్రాయమునే ఆరుద్రగారును వెలిబుచ్చిరి. శేషయ్యగారివలె నిరాఘాటముగ చెప్పక రాజకీయ చరిత్రకిది తోడ్పడకపోవచ్చునుగాని సాంఘిక చరిత్రకు కొంతపనికి వస్తుంది[110] అని వ్రాసిరి.

ఏవో ఒకటి రెండు చారిత్రక విషయములు చరిత్రకు భిన్నముగ నున్నంత మాత్రమున, ఈ కావ్యము చరిత్రకారులకు ఉపయోగపడదని ఘంటాపథముగ చెప్పుట, కావ్యమును వీరు చరిత్ర దృష్టితో కాక, కావ్యదృష్టితో పరిశీలించినటుల తోచుచున్నది. చరిత్రదృష్టితో చూచిన కృష్ణరాయ విజయమునందును మనకు పెక్కు రాజకీయ, సాంఘిక, విషయములు తెలియును.

కృష్ణదేవరాయలు పరిపాలనాక్రమము, రాజకీయపరిజ్ఞానము, యుద్ధ తంత్రము, దండయాత్రలు మొదలగు పెక్కు రాజకీయ విషయములతోపాటు, పెక్కు సాంఘికవిషయములు, మతమును గూర్చిన విషయములును ఈ గ్రంథము మనకు తెలియజేయుచున్నది.

ఆరుద్రగారు అనినటుల, 'చరిత్రకు సైతం అంతంతమాత్రంగా' కాక ఈ గ్రంథము, విజయనగర చరిత్రను తెలుసుకొనుటకు, చరిత్రకారులకు మిక్కిలి తోడ్పడును.

రాయవాచకము, చారిత్రకవిషయములపట్టిక (chronicle) అగుటచే వర్ణనలేమియు లేవు. కవి కేవలము చరిత్రాంశములను వరుసక్రమముగ చెప్పెను. ఇది గద్యకావ్యము. పదునారవ శతాబ్దపు తమిళదేశమునందలి వ్యావహారికాంధ్ర భాషలో వ్రాయబడినది. ఈనాటి మనభాషకంటెను భిన్నమైనది. ఉదాహరణమునకు "వీరనృసింహరాయలవారు సింహాసన పరభారకం వహించి నడిపించిన దారభ్యం యీవరకు అచ్యుతరాయలు చంద్రమౌళిన్ని మేమున్ను కూర్చుండ్డుక వుంట్టిమి, యిప్పుడు మమ్మున రాజ్యపరభారకం వహించమన్నారు గనుక తమకు ... సింహాసనస్థులు నడిపించేదేరీతు ......[111].

ఈ గ్రంథము వచనమున వ్రాయబడినప్పటికిని, చక్కని గ్రంథము. పెక్కు చారిత్రక విషయములను క్రమముగ తెల్పుటచే విజయనగరచరిత్రను తెలిసికొనగోరు చరిత్రకారులకిది మిక్కిలి తోడ్పడును. విశ్వనాథనాయకుని స్థానాపతి చరిత్ర చదివిన కలుగు ప్రయోజనమును

"బాలుడు చదివిన బుద్ధివి

శాలురు గావలయు శాస్త్రజాలంబులలో

109. చాగంటి శేషయ్య, కవితరంగిణి, సంపు. 12, p. 86.

110. ఆరుద్ర, సమగ్రాంధ్రసాహిత్యము, సం. 10. p. 202.

111. రాయవాచకము, p 17.

లోలురు నరిపథచింతా
శీలురుగావలయు భక్తిశీలతనెపుడున్"[112]

అని తెలియచేసెను.

"విజయనగర వృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకుఁదేట పడంగా
సృజయించితిఁగృష్ణరాయశేఖరుచరితల్"[113].

అనిన విశ్వనాథనాయకుని స్థానాపతియొక్క వచనరచనయైన రాయవాచకమునకు సాహిత్యమున ప్రత్యేకస్థానమున్నది.

వచనచారిత్రకగ్రంథమగు 'రాయవాచకము, చంధోబద్ధమగు చారిత్రకకావ్యమగు 'కృష్ణరాయవిజయము, శ్రీకృష్ణదేవరాయల చరిత్రను ఆంధ్రులకు అందచేయు అపూర్వగ్రంథములు.

అత్యంత ప్రతిభాశాలి, రాజతంత్రజ్ఞుడు పరాక్రమశాలియునై, తనభుజబల పరాక్రమములతో రాజ్యవిస్తరణము చేయుచు, సుస్థిరమైన పరిపాలన కవసరమగు అనేక సంస్కరణలు గావించి ప్రజానురంజకముగ పరిపాలించి, తన పరిపాలనా కాలమును స్వర్ణయుగముగ మార్చి, భువనవిజయసభామంటపమున సాహిత్యగోష్ఠులను నెరపి, కవిపండితపోషకుడై, ఆంధ్రసాహిత్యాభివృద్ధికి కారకుడై 'ఆంధ్రభోజుడ' ని కీర్తింపబడి,

"తెలుగదేలయన్నదేశంబుతెలుగేను
తెలుగురేడనేను తెలుగుకండ
ఎల్లవారు వినగ ఎరుగవేబాసాడి
దేశభాషలందు తెలుగులెస్స"[114]

అని తెలుగుభాషగొప్పతనమును చాటిచెప్పిన సాహితీసమరాంగణ చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయల చరిత్రను తమ రచనలద్వార అందించిన, విశ్వనాథనాయకుని స్థానాపతి, కుమారధూర్జటి మిక్కిలి అభినందనీయులు.

---

112. రాయవాచకము, అవతారిక, ప. 4.
113. రాయవాచకము, అవతారిక, ప. 1.
114. శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద, ప్ర. ఆ., ప. 15.

# 8. ఆరవీటిరాజులు

వీరు ఆరవీటి నగరము ముఖ్యపట్టణముగ పరిపాలించిరి. పట్టణనామమె వంశనామముగ స్థిరపడి ఆరవీటి రాజులైరి. తొలుత వీరు సామంతులు. వీరిలో పెక్కు మంది విజయనగర రాజుల కడ పెద్దపెద్ద ఉద్యోగములను చేసిరి. పెక్కు యుద్ధములందు విజయనగర రాజులకు తోడ్పడి వారికి విజయమును చేకూర్చిరి. తాము కొలచిన ప్రభువులు శత్రువులచే పరాజితులై రాజ్యములను కోలుపోయి నపుడు, వీరు శత్రువులతో పోరాడి జయించి తమ ప్రభువులను మరల గద్దె నెక్కించిన ప్రభు భక్తిపరాయణులు. సాళువ నరసింహరాయని కడ సేనానిగ నున్న ఆరవీటి బుక్కరాజు 'సాళువ నరసింహరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్యుడు.'

వీరి వంశము అభివృద్ధి చెందినంతగ ఏ ప్రభు వంశము అభివృద్ధి చెంద లేదనుట అతిశయోక్తికాదు. ఈ వంశీయులు తామరతంపరగ అభివృద్ధి పొంది ఆంధ్రదేశమున పెక్కు సామంత రాజ్యములను దాదాపు ఐదు శతాబ్దముల పాటు పరిపాలించిరి. వీరిలో కొందరు నంద్యాలను పరిపాలించి నంద్యాలవారైరి. ఈ రాజులలో పెక్కు మంది మహాపరాక్రమ వంతులు. రాజకీయ చతురులు. కవిపండితపోషకులు. దాన శీలురు. కొందరు కవులును గలరు.

క్రీ.శ. 12వ శతాబ్దము నుండి పేరు ప్రఖ్యాతులను గడించిన ఆరవీటి రాజులు, విజయనగర రాజులైన సాళువ వంశీయులకు తోడ్పడుచు, తరువాత విజయనగరాధీశులైన తుళువ వంశీయులకడ పెద్ద ఉద్యోగములు చేయుచు, యుద్ధములందు, రాజకార్యములందు తోడ్పడుచు, శ్రీకృష్ణదేవరాయల తరువాత విజయనగర భాగ్యవిధాతలైరి.

ఆరవీటి వంశీయులలో ప్రసిద్ధులు అళియ రామరాయలు, అతని సోదరుడు తిరుమలరాయలు. విజయనగరాధీశ్వరులైన తుళువవంశీయులలో అతి భీరువు, అదృష్టహీనుడు అయిన సదాశివరాయల తరువాత విజయనగర సామ్రాజ్యమును సలకము తిమ్మయాది శత్రువుల బారినుండి కాపాడి హస్తగతము గావించుకొని అళియరామరాయలు తానే రాజై విజయనగర సామ్రాజ్యమును పరిపాలించెను. అతి సమర్థతతో ధర్మపరిపాలన గావించి, అపజయమెరుగని ఈ వీరాధి వీరుడు, దక్కను సుల్తానుల యెడ ఆలోచనలేక తాను నెరపిన రాజకీయమునకు తాను

బలియగుటయేకాక, విజయనగర సామ్రాజ్యవిచ్ఛిత్తికి కారణమాయెను. ఈతడు గొప్పవైణిక విద్వాంసుడు. కవిపండిత పోషకుడు. దేవాలయాదులను కట్టించెను. తిరుమలరాయలును పెక్కు యుద్ధములు చేసి వీరుడనిఖ్యాతి గడించెను.

ఇంచుమించు ఆరవీటి వంశమునందలి రాజులందరును వీరులు. వీరాగ్రేసరులు. వీరి కాలమున సంగీతసాహిత్యములు వృద్ధిపొందినవి. భట్టుమూర్తి పింగళిసూరన, తాళ్లపాక తిరువేంగళనాథుడు, రాయసం వేంకటపతి, మట్ల అనంతయ్య, తెనాలి రామలింగకవి, అహోబలపతి, తరిగొప్పుల మల్లన, దోనేరు కోనేరు కవి మొదలగు పెక్కు మంది కవులుండిరి. శాస్త్రాలంకార నాటకాదుల రచన గూడ జరిగినది. రామయామాత్యుడు 'స్వరమేళ కళానిధి' అను సంగీత గ్రంథమును రచించెను. నేటికిని సంగీత విద్వాంసులకి గ్రంథ మతిముఖ్యమైనది.

ఆరవీటిరాజులు శైవవైష్ణవ మతములను ఆదరించిరి. కాని వీరి శాసన మందు 'శ్రీ విరూపాక్ష'యని కలదు. బహుశః సాళ్వ వంశీయుల ఆనవాయితీని వీరు అవలంబించినట్లున్నది. రెండవ వేంకటపతిరాయలు మాత్రము శ్రీరామ ముద్రను ధరించెను. ఆరవీటి వంశీయులలో స్త్రీలును దేవాలయములను నిర్మించి, పెక్కు దానముల నొనర్చిరి.

పరిపాలనాదక్షులగు అళియ రామరాయ, తిరుమలరాయల వంశమునకు చెందిన ఆరవీటిరాజులు క్రీ.శ. 1100 నుండి 1700 వరకు నుండిరి. వారి ప్రతాపాదులను వర్ణించిన "రామరాజీయము" ఈ ప్రకరణమున పరిశీలింపబడినది.

## రామరాజీయము — అందుగుల వెంకయ్య

అందుగుల వెంకయ్య :

అందుగుల వెంకయ్య తండ్రి సూరనామాత్యుడు. ఇతడు రామ రాజీయమును క్రీ.శ. 1630 సంవత్సరమున వ్రాసెను.[1] కోదండరామరాజునకు అంకిత మిచ్చెను. నియోగి బ్రాహ్మణుడీతడు. ఇంతకు మించి ఈ కవి విషయములేవియు తెలియుట లేదు.

అందుగుల వెంకయ్య వ్రాసిన రామరాజీయమును అంకితము తీసుకొనిన కోదండరామరాజు ఆర్వీటి బుక్కరాజు వంశీయుడు. ఈతడు అళియ రామరాయల మనుమనికి మనుమడు. (ఆర్వీటి బుక్కరాజు మనుమడైన శ్రీరంగ రాజు కుమారుడు అళియరామరాయలు. ఈతడు శ్రీకృష్ణదేవరాయల కుమార్తె తిరుమల దేవిని వివాహము చేసుకొనెను.)

## చరిత్ర — రామరాజీయము

రామరాజీయము ఆరవీటి రాజుల వంశ చరిత్ర. ఇది చారిత్రక గ్రంథము.

1. చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి. సం. 11, p. 198.

ఈ గ్రంథమునందు రామరాజీయ లేక నరపతి విజయ కృతిభర్తయైన కోదండ రామరాజు యొక్క వంశావళి వర్ణింపబడినది.

ఈ కవి చారిత్రకాంశమునే కావ్య వస్తువుగ గ్రహించినప్పటికి, కొన్ని చరిత్ర కందని విషయములను సహితము వ్రాసెను. ఈతడు అరవీటి వంశావళిని, విష్ణువుతో ప్రారంభించెను.

ఈ గ్రంథమును రెండు భాగములుగ విభజింప వచ్చును : (1) ఐతిహాసిక యుగమునకు పూర్వము గల రాజుల చరిత్ర; (2) ఐతిహాస్య యుగమునకు చెందిన రాజుల చరిత్ర.

కృతి భర్తయైన కోదండరామరాజు, కవియైన అందుగుల వెంకయ్యను, తన వంశ కర్తల చరిత్రను వ్యాసుడు వ్రాసిన విధముగా, నన్నయ మొదలగు కవులు తన వంశీయులను వర్ణించిన విధమంతయు సమగ్రముగ తెలిసికొని, గ్రంథమును రచింపుమని, కొలువుకూటమున కోరెను. రాజు కోరెను కనుక కవి వ్రాసెను. రాజును మెప్పించుటకు అతని వంశమును విష్ణువుతో ప్రారంభించెను. కనుక ఈ గ్రంథమున పై చెప్పిన విధముగా రెండు భాగములు చేయ వచ్చును.

### ఐతిహాసయుగమునకు పూర్వముగల రాజుల చరిత్ర

నారాయణునికి నాభియందు బ్రహ్మ జన్మించుటతో ఈ రాజుల చరిత్ర ప్రారంభమైనది. బ్రహ్మ పదాంగుష్ఠమునుండి దక్షుడు, ఊరువుల నుండి నారదుడు, నాభినుండి పులహుడు, కర్ణములనుండి పులస్త్యుడు, త్వక్ నుండి భృగువు, చేతుల నుండి క్రతువు, ముఖముల నుండి అంగీరసుడు, నాసిక నుండి వశిష్ఠుడు, మనస్సు నుండి మరీచి, నేత్రముల నుండి అత్రి జన్మించిరి. అందు అత్రికి అనసూయ వలన చంద్రుడు, దూర్వాసుడు జన్మించిరి. చంద్రునకు రోహిణి యందు బుధుడు జన్మించెను. బుధునకు పురూరవుడు జన్మించెను. పురూరవు నకు ఊర్వశి యందు, ఆయువు, ధీమంతుడు, వసువు, దృఢాయువు, చిరాయువు, శతాయువు అను నార్గురు పుత్రులుదయించిరి. వారిలో ఆయువు రాజ్యాధికారి అయ్యెను. ఆయుపుత్రుడు నహుమునకు ప్రియవాన అను నామెకు, యయాతి, సంయాతి, ప్రయాతి అను వారు జన్మించి అందు యయాతి రాజయ్యెను. ఈతనికి దేవయాని యందు యదు, తుర్వసులు, శర్మిష్టయందు ద్రుహ్యు, అను, పూరువు అను పుత్రులుదయించిరి. అందు పూరుడు తండ్రి కోరిన యౌవనము నిచ్చి అతని ప్రేమకు పాత్రుడై రాజ్యాధికారమును పొందెను. ఈతని పుత్రుడు జనమేజయుడు. జనమేజయుని కుమారుడు ప్రాచీశుడు. ప్రాచీశునికి వృషభుండు జన్మించెను. ఈతని కుమారుడు నహుయాతి, నహుయాతి పుత్రుడు సార్వభౌముడు. ఈతని తనయుడు జయత్సేనుడు. జయత్సేనుడు సురాచిని కనెను. సురాచికి మహాభౌముడు, మహాభౌమునకు నయుంతానియుతుడు, ఈతనికి

అక్రోధనుడు, అక్రోధనునకు దేవాపి, దేవాపికి రుచికుడు, రుచికునకు ఋక్షుడు, ఋక్షునకు మతివరుడు, మతివరునకు ద్రనువు, ద్రనువునకు నీలుడు, నీలునకు దుష్యంతుడు జన్మించిరి. దుష్యంతునకు శకుంతల యందు భరతుడు, భరతునకు భూమన్యుడు, అతనికి సుహోత్రుడు, ఈతనికి హస్తికుమారుడు (ఈతని పేరనే హస్తినాపురము నిర్మింపబడెను), హస్తికుమారునకు నికుంభుడు, నికుంభునకు అజామీఢుడు జన్మించిరి. అజామీఢునకు మైరి, కౌశల్య, శిక్ష, ఎనాయువు అను భార్యల వలన నూటయిరువదినలువురు పుత్రులుదయించిరి. అందు సంవరణుడు రాజయ్యెను. ఈతనికి తపతి వలన కురురాజు ఉదయించెను. కురురాజునకు పరీక్షిత్తు జన్మించెను. ఈతనికి భీమసేనుడు, భీమసేనునకు ప్రదీపుడు జన్మించిరి. ప్రదీపునకు సునందవలన దేవాపి, శంతనుడు, బాహ్లికుడను వారుదయించిరి. అందు శంతనుడు రాజయ్యెను. శంతనునకు గంగాదేవి యందు భీష్ముడు పుట్టెను. సత్యవతి యందు చిత్రాంగద విచిత్ర వీర్యులుదయించిరి. వారిలో విచిత్ర వీర్యుడు రాజయ్యెను. అతనికి అంబిక అంబాలికల యందు ధృతరాష్ట్ర, పాండురాజులు జన్మించిరి. అందు పాండురాజు రాజయ్యెను. పాండురాజునకు కుంతివలన ధర్మరాజ భీమార్జునులు, మాద్రివలన నకుల సహదేవులును జన్మించిరి. వారిలో అర్జునుడు పరాక్రమ వంతుడై ధనంజయుడని ప్రఖ్యాతిగాంచెను. అతడు సుభద్ర వలన అభిమన్యునిగాంచెను. అభిమన్యునకు ఉత్తర యందు పరీక్షిత్తు జన్మించెను. అతనికి జనమేజయ, శ్రుతసేన, భీమసేన, ఉగ్రసేనులు ఉదయించిరి. వారిలో జనమేజయుడు రాజయ్యెను. ఈతడు తక్షకుని చంపుట కొరకు సర్పయాగ మొనర్చెను. వైశంపాయనునిచే భారతమును వినెను. ఈతనికి వపుష్టయందు శంఖ, శతానీకులు జన్మించిరి. ఇందు శతానీకుడు రాజయ్యెను. ఈతని పుత్రుడు సహస్రానీకుడు. అతనికి కృష్ణాఖ్యుడు, కృష్ణాఖ్యునకు చక్రుడు, చక్రునకు చిత్రరథుడు జన్మించిరి. చిత్రరథునకు వృష్టిమద్వాయుడు, అతనికి సుక్షేణుడు, అతనికి సునిభుడు జన్మించిరి. సునిభునకు నృచక్షుడు, వాసవిభుడు జన్మించిరి. వాసవిభునకు నలుడు, నలునకు పరిప్లవుండు, అతనికి మేధాటి, మేధాటికి సునయుడు, సునయునకు నృపంజయుడు, అతనికి దూర్వ, దూర్వునకు నిమి, ఈ నిమికి బృహద్రథుడు, వీనికి విహీన కరుడు, విహీన కరునకు దండపాణి, ఈతనికి నిమి, ఈ నిమికి క్షేముడు, క్షేమునకు బృహతక్షత్రుడు, బృహద్రథుడు జన్మించిరి. బృహద్రథునకు పురంజయుడు, ఈతనికి శిశునాగ వర్ధనుడు, వానికి శృంగుడు, శృంగునకు కాచవర్ణుడు, అతనికి క్షేమవర్ణుడు, క్షేమవర్ణునకు సుక్షేత్రుడు, అతనికి విధిసారుడు, విధిసారునకు బర్బకుడు, వానికి వాజనేయుడు, వాజనేయునకు నందివర్ధనుడు, వానికి మహానంది, మహానందికి శిశునాగుడు జన్మించిరి. శిశునాగునకు సుజ్యుడు, అతనికి వసువు, వసువునకు భద్రక వసుమతీశుడు, వానికి పుళిందుడు, అతనికి ఘోషుడు, ఘోషునకు ద్విపమిత్రుడు,

వానికి భగవంతుడు, అతనికి దేవభూమి, దేవభూమికి భరామిత్రుడు, ఆ రాజునకు నారాయణుడు, ఆతనికి సుశర్మ కృష్ణులు జన్మించిరి. వీరిలో కృష్ణునకు శ్రీశాంత తనుడు, వానికి పౌర్ణమాసుడు, వానికి లంబోధరుడు, అతనికి బలిశుడు, వానికి మేఘుడు, మేఘునకు స్వాతి, స్వాతికి దండమానుడు, అతనికి అరిష్ట కర్ముడు, అతనికి హలేయుడు, వానికి తిలకుడు, తిలకునకు ఋషితోరుడు, ఆ రాజునకు సునందుడు, సునందునకు వృకుడు, వృకునకు జటకుడు, ఆతనికి వివసాతి, అతనికి అరిదమనుడు, అరిదమనునకు గోమతి, గోమతికి పురిముడు, ఈతనికి శ్వేతుడు, శ్వేతునకు వేతాసితుడు, ఆయనకు స్కందుడు, స్కందునకు యజ్ఞశాంతుడు, ఆతనికి విజయుడు, విజయునకు చంద్ర బీజుడు, అతనికి మనువు, మనువునకు నందుడు, నందునకు భూత నంది, ఆయనకు నంది, నందికి శిశునంది యశోనందులు జన్మించిరి. వారిరువురకు పదునాల్గురు పుత్రులు జన్మించిరి. వారు పుత్రమిత్రుడు, దుర్మిత్రుడు అను వారితో యుద్ధము చేసిరి. అందు ఏడుగురు కోసలాధిపతులైరి. తక్కిన ఏడుగురు ఆంధ్రదేశమునకు అధిపతులైరి. వారిలో నందుడను నాతడు తనపేర నందపురమను నొక పురమును నిర్మించి, దానిని రాజధానిగ చేసికొని గోదావరి పర్యంతము గల భూభాగమును నిష్కంటకముగ పరిపాలించు చుండెను.

ఇంతవరకు చెప్పబడిన విషయములు ఐతిహాసయుగమునకు పూర్వము జరిగినవి. విష్ణు బ్రహ్మాదులు కలరో లేరో ఊహాతీతము. ఇక యయాతి, పూరువు, దుష్యంతుడు మొదలగువారు పురాణ పురుషులు. భారతమునందలి అర్జునుడు మొదలగు వారు, సందేహాస్పదులయిన వారు. కనుక మన కింతవరకు కవి వ్రాసిన వంశావళియందలి విషయములకు చారిత్రక ఆధారములు లభించవు. అందరి నామములను పట్టిక వలె ఏరాజున కెవరు పుత్రులుగా పుట్టిరో, వారి పుత్రులెవరో కవి తెల్పెను. రాజుల వంశమును పురాణపురుషులతో ముడి పెట్టుట ఒక సంప్రదాయము.

## ఐతిహాస యుగమునకు చెందిన రాజవంశావళి

**నందరాజు :**

నందపురాధిపతి. ఈతడు సేతువునుండి గోదావరి పర్యంతము రాజ్యముచేసెను. ఈతడు మహిమాన్వితుడు. యోగపాదుకల మహిమతో ప్రతిదినము గంగానదికి వెళ్ళి స్నానముచేసి వచ్చెడివాడు. ఒకనాడు భార్య తానును వత్తుననెను. గంగాతీరమున నందరాజు భార్య రజస్వల అయెను. యోగపాదుకల మహిమపోయెను. రాజచట గల బ్రాహ్మణుల నర్థించి వారి సహాయమున రాజధానికి చేరెను. కాని వారు ప్రతిగ నందపురి నిమ్మని కోరిరి. రాజు రాజధానికి వచ్చిన తరువాత నందపురిని బ్రాహ్మ

ఖుల కిచ్చి తాను మరొక పురమును నిర్మించుకొనెను. ఈ నందపురము విశాఖ జిల్లా యందలి నందాపురమనిరి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.[2] నందరాజు కిష్కిందను (ఆనెగొంది) క్రీ శ. 1014 మొదలు పరిపాలించెనని రాయవంశావళి యందు గలదు. ఈ నందరాజు కాకతీయుల మూలపురుషునిగను పేర్కొనబడినాడు. ముక్కంటి మహాజనపతికి అన్వయించు యిట్టిగాథకలదు. ఈ అంశము 'ఆంధ్ర మహావిష్ణువు' అను ప్రకరణమున చర్చించుట జరిగినది. ఈ కథయందలి సత్యా సత్యములు తెలియుటలేదు. కాని ఈ అంశము గంగాతీరమున నున్న ఆంధ్రులు కృష్ణాతీరమునకు తరలి వచ్చిరని తెల్పుచున్నది. ఇందలి సత్యానత్యము లేవై నప్పటికిని ఈ నందరాజు అటు కాకతీయులకు ఇటు ఆరవీటి వంశీయులకు మూలపురుషుడని ఈ గ్రంథము వలన తెలియుచున్నది. నందరాజునకు తొమ్మిది మంది కుమారులుదయించిరి. అందు తొమ్మిదవ వాడు చాళుక్య భూపాలుడు. చాళుక్య భూపాలుడు క్రీ.శ. 1076 మొదలు 1117 వరకు రాజ్యము చేసెనని రాయవంశావళి యందుగలదు. ఈ చాళుక్య వంశమునందు పెక్కుమంది రాజు లుదయించిరి. అందు ఖ్యాతిగాంచినవారు బిజ్జలుడు, విజయధ్వజుడు.

బిజ్జలుడు :

బిజ్జలుడు చాళుక్యుని జేష్ఠపుత్రుడు. కల్యాణపురాధిపతి. అత్రేయ గోత్రజుడు. ఈతనికి చాళుక్య నారాయణ, చాళుక్య చక్రవర్తి, మండలీకర ధరణీవరాహ, క్షత్రి యాచార కులపవిత్ర, వెంగత్రిభువనీమల్ల, శ్రీ రాజరాజేశ్వర దివ్యశ్రీ పాదపద్మారాధ కాది పెక్కు బిరుదములు కలవు.[3] ఈ కల్యాణ బిజ్జలుని వర్ణించుచు కవి ఒక బిరుద గద్యను చెప్పెను. ఈ బిరుద గద్యయందలి భాష తెలుగుకాదు.

బిజ్జలుడు క్రీ.శ. 1162 – 66 వరకు కల్యాణి నగరమును పరిపాలించు చుండిన చాళుక్యుల కడదళవాయిగ నుండి, ఆ వంశీయులను తొలగించి తానే రాజాయెను.[4] బిజ్జలుని తమ్ముడగు విజయధ్వజుడు ఆనెగొందిని పరిపాలించుచు తనపేరిట విజయనగరమును నిర్మించెనని తెలియుచున్నది.[5] దీనినిబట్టి "బిజ్జలుని వంశమువారు కల్యాణపురమును, విజయధ్వజుని వంశమువారు ఆనెగొంది పుర మును కొంతకాలము పరిపాలించి, ఢిల్లీ చక్రవర్తియగు మహమ్మద్‌బీన్ తుగ్లక్ దక్షిణ హిందూ స్థానముపై పలుసార్లు దండయాత్రలు సాగించిన సంక్షోభ కాలమున దమ రాజ్యములను పోగొట్టుకొని యుందురు"[6] అని తెలియుచున్నది.

2. Mallampalli Soma Sekhara Sarma, History of Reddy Kingdoms, p. 137.
3. రామరాజీయము, p. 21.
4. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 226.
5. B. Suryanarayana Rao, The Never to be Forgotten Empire, p. 15.
6. చిలుకూరి వీరభద్రరావు, అళియరామరాయలు, p. 7.

అందుగుల వెంకయ్య బిజ్జలుని తరువాత అతని మనుమడగు వీరహొమ్మాళి రాయలను పేర్కొనెను.

వీర హొమ్మాళి రాయలు :

ఈతడు పరాక్రమవంతుడు, వీరుడు. జనావళి మెచ్చునట్లుగ రాజ్యము చేసెను. ఈతడు గంగాపురమున చెన్నకేశవ దేవాలయమును నిర్మించెను.[7] వీర నారాయణదేవ చరణాంభోరుహారాధనాను సంప్రాపిత సకల సామ్రాజ్య విశేష భోగ ములు కలిగి పెక్కు సంవత్సరములు రాజ్యపాలనము చేసెను. ఈతడు చాళుక్య రాజగు నాలుగవ సోమేశ్వరుని సైన్యాధ్యక్షుడని తెలియుచున్నది.[8] క్రీ.శ. 12 శతాబ్ది చివరి హొయసల రాజైన వీరబల్లాలుడు కల్యాణపురముపైకి దండెత్తి నాలుగవ సోమేశ్వరుని సైన్యాధ్యక్షుడైన బొమ్మరాజును ఓడించినట్లు తెలియుచున్నది. ఈ బొమ్మరాజే హొమ్మాళిరాయలు. కన్నడ భాషలో ప, బ, లు 'హ' వలె ఉచ్చరింప బడును.

తాత పిన్నమరాజు :

అందుగుల వెంకయ్య హొమ్మాళిరాయని కుమారుడు తాతపిన్నమ రాజని తెల్పెను. కవి తాతపిన్నమరాజు పెక్కుమంది రాజులను జయించెనని వ్రాసెనేతప్ప ఆ రాజులెవరో తెలుపలేదు. ఈతని బిరుద గద్యయందు 'సమస్త దురాచార చెఱుకు రాచనాయకరాజ సప్తాఙ్గహరణ'[9] అనుటవలన ఈతడు చెరుకు నాయకుడను వానిని జయించినట్లు భావింపవలెను. ఈతనికి 'మన్యపులి' అని మరియొక బిరుద మున్నది. మహామణ్డలాధిగతకణ్టక శాసన, వైభవపాకశాసన అను బిరుదులు కలవు. ఈతనిని గూర్చి దోనేరు కోనేరునాథుడు—

"సమితిలోఁ జెఱకు రాజనరేంద్రు గెలిచి
అలవుగా సప్తాంగహరణం బొనర్చి
పొలుపొందె భువి మన్నెపులియనుపేర
బిరుదాంచితుఁడు తాతపిన్నభూవరుఁడు"[10]

అని తాతపిన్నమరాజును గూర్చి వర్ణించెను. తాతపిన్నమరాజు జయించిన ఈ చెరుకునాయకుడెవ్వరో తెలియుటలేదు.

క్రీ.శ. 1576 నాటి శ్రీరంగరాయల శ్రీ విరూపాక్ష శాసనమువలన తాతపిన్నమ

7. రామరాజీయము, p. 21. వచనం 171.

8. చిలుకూరి వీరభద్రరావు, అళియరామరాయలు, p. 8.

9. రామరాజీయము, p. 22.

10. దోనేరు కోనేరునాథుడు, ద్విపద బాలభాగవతము, పీఠిక.

రాజు వీరహెమ్మాళిరాయల మనుమడని, మాయాపూరీశ్వరుని పుత్రుడని తెలియు చున్నది. ఈతని వర్ణన వసుచరిత్రయందు గలదు.[11]

సోమదేవరాజు :

సోమదేవరాజు తాతపిన్నమరాజు పుత్రుడు. అతడు నీతిశాస్త్రమున బృహస్పతి, ధర్మమునందు ధర్మజుడు. బ్రాహ్మణులకు పెక్కు దానములను చేసెను. యజ్ఞము లను గావించెను. అరవీటి పురాధ్యక్షుడు.

ఈతడు బాలనాయకుని, గుజ్జల వీరుని, రుద్రపుని, గౌరారెడ్డిని, గంగినాయకుని ఓడించెను.

సీ. "కదనరంగంబునఁ గరితురంగమ వీర
తతితోడ బలుమాఱు విఱుగఁదోలి
యమితోగ్ర శౌర్యుమహమ్మదుఁ బట్టి నీ
పేరుఁ బెట్టెదను గుమారున కది
గాక భవత్పాద కమలంబు నుదురంట
దండంబుఁ బెట్టెదఁ దన్నుఁగాచి
విడువుమన్ననుగాచి విడిచి యర్థులకును
షష్టిశతంబు నశ్వములవాని
తే. చేతనిప్పించి శరణన్నఁ బ్రీతిగాచు
బిరుదు తగునీతని కెయని ధరణి పతులు
సన్నుతింపఁగ నాది రాజన్య చర్యఁ
దేజరిలె సోమదేవధాత్రీవరుండు"[12]

ఈ పద్యమువలన సోమదేవరాజు మహమ్మదు మలక అను నాతనిని పెక్కు మారులు జయించుటయే కాక 'నీ పాదములకు నమస్కరించుచున్నాను, నా కుమారునకు నీపేరు పెట్టెదను. నన్ను రక్షించుమని వేడగా,' దయతో వానిని విడిచిపెట్టి, అతనిచేత అడగినవారికి అరువేల అశ్వముల నిప్పించినటుల తెలియు చున్నది.

సోమదేవరాజు జయించిన మహమ్మదు క్రీ.శ. 1325 వ సంవత్సరమున ఢిల్లీ సామ్రాజ్యమును పరిపాలించిన మహమ్మద్ బీన్ తుగ్లక్ అని "చిలుకూరి వీరభద్ర రావుగారు" తమ 'అళియ రామరాయల'ను గ్రంథమున వ్రాసిరి. ఈ సోమదేవ రాజును గూర్చి చిలుకూరి వీరభద్రరావుగారు సవిస్తరముగ చర్చించిరి. సోమదేవ రాజు తాతపిన్నమనీని ప్రథమభార్య పుత్రుడు కాడని, ఇతని ప్రథమభార్యయగు

11. రామరాజభూషణుడు, వసుచరిత్రము, ప్ర.ఆ., ప. 25.

12. రామరాజీయము, ప. 181, p. 23.

నూకాంబికకు రాఘవరాజు జన్మించెననియు, సోమదేవరాజు రెండవ భార్య గొంకల దేవికి జన్మించెనని తెల్పిరి.[12a]

"హరికాంతఁబోలు నూరాంబికయందు
ఘనశౌర్యుఁడౌ కొటిగంటి రాఘవుని
గనియె నతండు సంగ్రామంబునందు
రాజిల్లు కంపిలిరాయ సైన్యములఁ
దేజంబు మెరయంగఁ దెగువమై గెలిచి
గరిమ గైకొనియె నగ్గండపగూళి
బిరుదంబు సరినృపుల్ పేర్కొని పొగడ"

అని ద్విపద బాలభాగవతమున తాతపిన్నమరాజునకు నూరాంబికయందు కొటిగంటి రాఘవరాజను పుత్రుడున్నటుల వర్ణింపబడినదని చిలుకూరి వీరభద్రరావుగారు తెలిపిరి. ఈ కొటిగంటి రాఘవరాజు జయించిన కంపిలి రాయలను గూర్చి ఈయన విశదముగ చర్చించిరి.[13] రామరాజీయమున ఈ కొటిగంటి రాఘవరాజు విషయము గాని, తాత పిన్నమనీని భార్యల విషయముగాని వివరింపబడలేదు. వెంకయ్య, తాత పిన్నమనీని తరువాత సోమదేవరాజును వర్ణించెను.

సోమదేవరాజు హరిహర, బుక్క, రెండవ హరిహరుల సేనానులలో ఒకడై యుండునని తెలియుచున్నది.[14] ఈతడు మహమ్మదునేకాక గంగినేని కొండ కందనవోలు, కలుపకోలు, రాచూరు, మొసలి మడుగు, యాతగిరి నగరము, సాతానికోట మొదలైన దుర్గములను సాధించెను. స్థల, జల, గిరి, వన దుర్గములను సాధించెను. ఈతనికి ఆకులపాటి వీరక్షేత్ర భారతీమల్ల, ముదుగంటి వీరక్షేత్ర, ఆనెగొంది వీరక్షేత్ర భారతీమల్ల, కుంతి వీరక్షేత్ర భారతీమల్ల, వీరక్షేత్ర భారతీమల్ల, బిరుదభరితానుభావ, సకలనరదేవ చూడామణి, అసిభరణపటిమసహదేవ, మొనబిరుదరగండ, వీరప్రతాప బిరుద, బిరుదు మన్నెరగండ, పురిగొలసురత్రాణ, శరణాగతత్రాణ, రాయరణరంగ భీభత్స, రాయరాహుత్తుపగండ, వైెవరగండ, గండరగండ అను పెక్కు బిరుదములున్నవి.[15] ఈతనికి రామచంద్రరాజను తనయుడుదయించెను. సోమదేవరాజు విషయములను, ఆతని బిరుదములను గూర్చి చిలుకూరి వీరభద్రరావుగారు విశదముగ చర్చించిరి.[16]

12a. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, p. 10.

13. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, pp. 10–14.

14. S. Krishna Swamy Aiyangar, Sources of Vijayanagar History, Introduction.

15. రామరాజీయము, ప. 182, గద్య. 183.

16. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, pp. 14–29.

రాఘువేంద్రరాజు :

ఈతడు మహావీరుడు. సకలగుణ సంపన్నుడు. నీతి విశారదుడు. ఈతడు తుళువంశీయులను, యవనులను, శబరులను జయించినటుల బిరుద గద్యనందు గలదు.[17] ఈతడు కవికుల సరస కవితా కర్ణన కర్ణాభరణుడు. యజ్ఞములుచేసి బ్రాహ్మణులకు అగ్రహారములను, సువర్ణమును దానము చేసెను.

తరచు ఒకప్రక్క బహమనీసుల్తానులతోను మరియొక ప్రక్క బుక్కరాయల తోను పోరాడుచు తుదకు ఏ యుద్ధముననో మరణించి యుండును. వీని అవసాన కాలమున ఈతని రాజ్యముయొక్క ఉత్తర భాగమును బహమనీసుల్తానులు, దక్షిణ భాగమును బుక్కరాయలు తమ తమ సామ్రాజ్యములలో చేర్చుకొని యుందురు. కనుకనే ద్విపద బాలభాగవతమున, నరపతి విజయమున ఏమియు వక్కాణింపబడ లేదని చిలుకూరి వీరభద్రరావుగారి అభిప్రాయము.[18] ఈతడు యజ్ఞములనుచేసి, దానముల నొసర్చి పిన్నశౌరియను పుత్రుని బడసెను.

రామవేంద్రరాజు వరకు మనకు చరిత్ర కాధారములంతగా లేవు. నరపతి విజయము, ద్విపద బాలభాగవతము, పద్య బాలభాగవతము, వసుచరిత్రల వలననే వీరి చరిత్ర కొంత తెలియుచున్నది.

పిన్నశౌరి :

పిన్నశౌరి మిక్కిలి పరాక్రమవంతుడు. ఈతడు యుద్ధమునందు శత్రువుల నందరిని జయించెనట. ఈతని విషయము లన్నియు, సమగ్రముగ కవి తెలుప లేదు. కాని ఈతని గుణగణాదులను

"అనఘుడు పిన్నశౌరి సుజనావన దక్షత రూపరేఖలన్
వినుత పరాక్రమంబునను విశ్రుతదాన గుణంబు పెంపునన్
వనజదళాక్షు దత్తనయు వాని విరోధిని వానిమిత్రుఁడా
నెనయగు దీటు వచ్చుమకో యెంతయు సాటగుఁజూడఁ జూడఁగన్"[19]

అని అందుగుల వెంకయ వర్ణించెను.

అందుగుల వెంకయ, పిన్నశౌరి తల్లిపేరు వ్రాయలేదు. కాని బాలభాగవతము నందు

"అతనికి బిన్న భూపాగ్రణి యొదవె
సతత సౌభాగ్య బాచల దేవియందు
అపిన్న భూపాలుఁడారెపీడనఁగ
నేపారుపురి దన కిరవుగా నిలచి

17. రామరాజీయము, గద్య. 189, p. 26.

18. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, p. 30.

19. రామరాజీయము, ప. 196, p. 26.

సకల మహీపాల జాలంబుగొలువ
ప్రకటిత తేజుఁడై రాజ్యంబుఁజేసె"

అని గలదు. ఈతడు "కర్ణాట సామ్రాజ్యాధీశ్వరుడగు దేవరాయ మహారాయలకు సామంతుడుగ నుండెనని యూహింప దగును."[20] ఇతని పుత్రుడు బుక్కరాజు.

**బుక్కరాజు :**

ఈతని గొప్పతనమును గూర్చి కవి
"అడుగనిచ్చితి నిప్పుడంతియు లేదను మాటదాఁబుట్ట దేనాఁటనైన
గెలిచి వచ్చుటె కాని కలననోటమియను మాట దాఁబుట్టదేనాఁటనైన
మనవెంత చెప్పిన విని పరాకుగఁజేయుమాట దాఁబుట్టదేనాఁటనైన
మొదటన చనివిచ్చి తుదనది వేఱగుమాటదాఁబుట్టదేనాఁటనైన
ననుచు జనులెల్లఁబొగడఁగ నారవీటి
పురము నేలుచుఁదన కులమును దనాఖ్య
నలర వెలసెను సతత కృతాధ్వరుండు
రాజపరమేశ్వరుఁడు బుక్కరాజవిభుఁడు"[21]

అని వర్ణించెను. ఇతడు దానశీలి. పరాక్రమవంతుడు. రణరంగమున జయమునే తప్ప అపజయమును పొందని మహావీరుడు. ఇతనికి "సాళువ నరసింహరాయ రాజ్య ప్రతిష్ఠాపనాచార్యశౌర్యగరిష్ఠ, అసహాయశౌర్య, సుమేరుధైర్య, అష్టాదశవిద్యా ప్రజ్ఞాప్రవీణ" అను బిరుదములున్నటుల బిరుదగద్య వలన తెలియుచున్నది. ఈతడు కామదుర్గపాలకుడైన కామపాలుని జయించెను. మూడు పురముల నొక్క పెట్టున జయించెననెను కవి. ఆ పురములేవియో తెలుపలేదు. అవి మునల్మానుల వైన, అహమ్మదనగర్, బీజపూర్, గోల్కొండ పురములే అయి యుండును. ఏలన వీరికిని విజయనగర రాజులకును, నిరంతరము యుద్ధములు జరుగుచునే ఉండెను.

ఈ అరవీటి బుక్కరాజు కడనుండి అరవీటి వంశ చరిత్రకు చారిత్రకాధారములు కనబడుచున్నవి.

"అరవీటి వంశావళియందు,
ప్రభవించె నతని కౌబళదేవియందు
ప్రభుమణి బుక్కభూపాల చంద్రుండు
యెక్కువగుణముల నియ్యారవీటి
బుక్కనరేంద్రుండు భువి బుట్టినంత

20. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, p. 31

21. రామరాజీయము, ప. 202, p. 26.

వారిజాప్తోదయ వర్ణిత వేళ
దారలగతియయ్యెఁ దక్కురాజులకు
నరనాథమణి సాళ్వ నరసింగరాయ
వరసఖుండయి బుక్కవసుధేశుఁడమరె
బుక్క భూపాలుండు బుధులకు నెల్ల
దిక్కతండె యనంగఁదేజంబు నందె"

అని అభివర్ణింప బడియుండెను. "ఇతడు నరనాథమణియైన సాళ్వనరసింగారాయ భూపాలునకు వరసఖుండుగా" నుండెనని చెప్పుటవలన నితని కాలమును మనము సరిగా గుర్తించుటకు సాధ్యమగుచున్నది. సాళ్వనరసింహరాయలు క్రీ.శ. 1447 మొదలుకొని 1465 వరకు కర్ణాట సామ్రాజ్యమును బరిపాలించిన మల్లికార్జున రాయలకును, 1465 మొదలు 1478 వఱకు బరిపాలన చేసిన విరూపాక్ష రాయలకును సమకాలికుడై, వారలకు సామంతుడై యుండి కర్ణాట సామ్రాజ్యము లోని చంద్రగిరి రాజ్యమును పాలనము సేయుచు దరువాత సామ్రాజ్యము క్షణించి దురవస్థపాలై యున్న కాలమున స్వతంత్రుడై క్రీ.శ. 1437 న సామ్రాజ్యము నంతయు దానే యాక్రమించుకొని శత్రువుల నడంచి పట్టాభిషిక్తుడై బలిమిచే క్రీ.శ. 1493 వరకు బరిపాలించిన వాడగుటచేత నాతని విజయయాత్రలందు నార్వీటి బుక్కరాజు పాల్గొని యుండెనని విశ్వసింప వచ్చును.[22] "సాళువ నరసింహరాయరాజ్యస్థాపనాచార్య' అనుటచే రాజ్య ప్రతిష్ఠాపనమున సాళ్వనరసింహ రాయలు, ఈ బుక్కరాజుయొక్క సహాయమును పొంది యుండెననుట స్పష్టమగు చున్నది.

ఈ అరవీటి బుక్కరాజు, శ్రీ కృష్ణదేవరాయల పట్టాభిషేకమునకు వచ్చినటుల పేర్కొని, కృష్ణరాయవిజయమున కుమారధూర్జటి

"చక్కెర విలుకాని చక్కఁదనము గల్గి
చుక్కమౌ నార్వీటి బుక్కరాజు"[23]

అని వర్ణించెను. ఈతడే అరవీటి వంశమునకు మూలపురుషుడు. ఈతనికి అబ్బళ దేవి, బల్లాదేవి అను భార్యలు కలరు. అబ్బళదేవియందు, సింగభూపతి మొదలగు పుత్రులను గాంచెను. సింగభూపతి నంద్యాల రాజధానిగ చేసికొని పరిపాలించెను. ఆతని సంతతికి నంద్యాల రాజులను నామము స్థిరపడెను. బుక్కరాజునకు బల్లా దేవియందు రామభూపాలుడు జన్మించెను.

రామభూపాలుడు కందనవోలును జయించి రాజధానిగ మార్చెను. ఈతని పరాక్రమమునకు సహింపలేక, బంధువులీతనికి విషము పెట్టిరట. కవి, పై అంశమును తెలిపెనేతప్ప వివరములేవియు తెలుపలేదు.

22. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, pp. 32-34.

23. కుమారధూర్జటి, కృష్ణరాయ విజయము, ప, 44, p. 38.

మగటిమి కోర్వలేక దయమాలటు జ్ఞాతి నియుక్త బుద్ధిచే
నగరత గన్న తీర్థమిడ జాలక నర్భకు డున్న జూచి శ్రీ
నగధరనీవె దిక్కని జనంబులు గన్గొననంత గ్రోలియా
నగరుని బోలి రామనృపచంద్రుడు చెందడు తద్వికారమున్.[24]

ఈతనికి రామరాజను పేరును గలదు. ఈ రామభూపాలుడు—

మదకరి కొకటి కిర్వది గుఱ్ఱములు గుఱ్ఱ
మునకును విలుకాండ్రు మగురు విచ్చు
కత్తులవా రీటెకాండ్రట్ల వర్తిల్ల
నిట్టి యేనుఁగులును జుట్టు మూడు
వేల యేనూరు నుద్వృత్తితో నడవంగ
గందనోల్సాధింపఁగాఁదలంచి
మొనఁద్రుంచి గట్టిగాముట్టడి దిగిన నా
బిబ్బని మిక్కిలి యుబ్బణంచి
ప్రకట సప్తాంగములఁగొని రామ విభుఁడు
కందనోల్రాజధానియుఁ గాఁగ వసుమ
తీయును నేలి మహాహవదీక్షఁబూనె
బలిమి కలిమి నాశావనీపకులఁబెనుప"[25]

3,500 గజములు, 70,000 అశ్వములు, 6,30,000 వేల కాల్బలముతో కందనవోలు ముట్టడించిన, బిజాపూరు సుల్తానును, యుద్ధమునందు ఓడించెను.

ఇతనికి 'దుర్వారతర నవాయి సైనికహరణ, నవాబిబ్బి, రాజనప్తాజ్ఞ హరణ మార్గశరణ' అను బిరుదములున్నటుల బిరుదగద్య వలన తెలియుచున్నది. ఈ బిరుదములు రామరాజు వహించుటకు గల కారణము, విజాపుర సుల్తానగు ఆదిల్ ఖానును జయించుట యని చిలుకూరి వీరభద్రరావుగారి అభిప్రాయము. "నివాపాదవనీ దుర్గనివాసి కాని పొదయ దుర్మదఖల నిర్మథన, హల్లీనుసేనోల్లాసిత సప్తశత సైంధవ గ్రహణ, పరాక్రమధుర్య" అను బిరుదముల విషయమున మొదటి దానిగూర్చి ద్విపద బాలభాగవతమునందు

---

24. రామరాజీయము, ప. 209, p. 27.
బాలభాగవతమునందును ఈ విషయము కలదు.
"హరిపాదతీర్థంబునందు బాంధవులు
గరళంబుపెట్టిన గతి యెఱింగియును
తెలుకొప్ప తత్తీర్థంబు నాని
యరంగించుకొనియె రామావని విభుఁడు" (అళియరామరాయలు, p. 35)

25. రామరాజీయము, ప. 208, p. 27.

"వినుతింపఁదగునాదవేని దుర్గమున
ననతుడై యుండు కాచాధీశుగెలిచి
అరుదుగా సప్తాఙ్గహరణంబు సేసి
గరిమోన్నతుండు బుక్కయరామ విభుడు"

అని యాదవేని దుర్గాధీశుడైన కాచాధీశుని జయించి, వాని సప్తాఙ్గములను హరించె నని దెలుపబడియుండెను. అదివేని దుర్గము మిక్కిలి బలాఢ్యమైనది. ఈ దుర్గాధిపతి యైన కాచాధీశునిపై రామరాజేల దండెత్త వలసి వచ్చెనని సంశయము పుట్టగలదు. కాని రామరాజు కాలమునుబట్టి విచారించిన దగినట్టి కారణమగుపించక పోదు. కాచయొడయడు, విజయనగర సామ్రాజ్యమును మొదట బరిపాలించిన సంగమవంశీయుల పక్షమువాడై క్రీ. శ. 1487 వ సంవత్సరప్రాంతమున సాళ్వ నరసింహరాయలు విజయనగర సామ్రాజ్యమాక్రమించుకొన్నప్పు డాతనికి వ్యతిరేకముగ బ్రవర్తించి యుండును. అరవీటి రామరాజు సాళ్వనరసింహరాయని పక్షమును వహించి యాదవేనిపై దండయాత్ర సాగించి యాతని సప్తాంగములను హరించి ఆ దుర్గమునకు దన రెండవ కుమారుడైన కొండ్రాజును అధికారిగ నియమించి యుండును. ఇంక రెండవ బిరుదమునుగూర్చి "క్రీ. శ. 1492 మొదలుకొని 1528 వఱకు కళింగదేశముపై ప్రభుత్వము నల్పిన ప్రతాపరుద్రగజపతి తన "సరస్వతీవిలాసము" లో జమునా పురాధీశ్వరుడగు హుసేనసాహి యను తురుష్కుడు శరణాగతుడు కాగా, శత్రువులనుండి వానిని రక్షించితినని చెప్పుకొని యుండెను. ప్రతాపరుద్రగజపతి క్రీ. శ. 1492 లో సింహాసనము నధిష్ఠించి 1500 లో దక్షిణ దిగ్విజయ యాత్రకు బయలు వెడలెను. పైదానివలన అరవీటి రామరాజుచే నిర్జితుడైన హల్లీసుసేనుడును, ప్రతాపరుద్రగజపతికి శరణాగతుడై సంరక్షింపబడిన 'హుసేనసాహి' యునేక కాలమువారగుట నిజము."[26]

అయినను వీరొక్కరా, భిన్నపురుషులాయనునది చింతింపదగిన విషయమని వేంకటరమణయ్యగారనుచున్నారు. కాని వీరు భిన్నపురుషులు కారనియే నా యభిప్రాయము. క్రీ. శ. 1500లో ప్రతాపరుద్ర గజపతి దక్షిణ దిగ్విజయ యాత్రకు బయలువెడలిన వాడగుటచే నాదండయాత్ర సందర్భమున నా విషయము జరిగి యుండును. బిరుద గద్యములో వేంకటరమణయ్యగారు వ్రాసినట్లు, 'సప్తదశసైంధవ గ్రహణ' గాక రంగస్వామి సరస్వతిగారి పాఠమున వక్కాణింపబడినట్లు 'సప్తశత సైంధవ గ్రహణ' మనియె గ్రహింపదగియుండును. రామరాజు హల్లీసుసేనుని జయించి 700 గుఱ్ఱములను గైకొనినాడని చిలుకూరి వీరభద్రరావుగారు తమ అభిప్రాయమును వ్యక్తపరిచిరి.[27] ఈతడు అవనగిరి, కందనవోలు జయించినటుల

26. భారతి, సం. 6. సంచిక. 6.

27. చిలుకూరి వీరభద్రరావు, అళియరామరాయలు, pp. 38-40.

Henry Heras తెలుపుచున్నాడు[28] అరవీటి రామరాజు లక్కమాంబను వివాహము చేసికొనెను.[29] బాలభాగవతమునందీతనికి నలుపురు భార్యలని వర్ణింపబడియున్నది.

"ఆరామభూపతి కంగనామణులు
పేరైనయౌబళాంబిక లక్కమమ్మ
యంబుజనేత్ర రంగమ్మయు నమల
మాంబయు నల్గురై రందులోన."[30]

ఇతనికి తిమ్మరాజు, కొండరాజు, రంగరాజు జన్మించిరి.[31]

ద్విపద బాలభాగవతము, వసుచరిత్ర ఈ విషయమున రామరాజీయముతో నేకీభవించుచున్నవి.

ద్విపద బాలభాగవతమునందు రామరాజునకు లక్కమాంబయందు—

ఆరామనృపులక్కమాంబ పుణ్యమున
ధీరత హేమాద్రి తిమ్మభూవరుని
వరకీర్తి కొండ భూవరుని శ్రీరంగ
ధరణీశు ముప్వురు తనయుల గాంచె" అనియు వసుచరిత్రమునందు,

"ఆరామక్షితి భర్తకుంబ్రథితసత్యాలాపధర్మోద్భవ
శ్రీరమ్యుండగు తిమ్మరాజు బలలక్ష్మిధామభీమప్రధా
పారీణుండగు కొండశౌరి విజయప్రఖ్యాత చారిత్రుఁడా
శ్రీరంగేంద్రుఁడు గల్గి రైందవకులక్షేమంక రాకారులై"[32]

అని గలదు. కనుక రామరాజునకు ముగ్గురు పుత్రులను విషయము స్పష్టమగుచున్నది. ఈ ముగ్గురిలో తిమ్మరాజు ఔకు అను పురమును రాజధానిగా చేసుకొని పరిపాలించెను. ఈతని సంతతివారికి ఔకురాజులను పేరు స్థిరపడెను. ఈతడు వీరునిగా, దాతగా మిక్కిలి ఖ్యాతిగాంచెను.

తిమ్మరాజు :

తిమ్మరాజు విషయమున, ద్విపద బాలభాగవతమునందొక వింత కథచెప్పబడినది. "వేంకటేశ్వరుడు కన్నులు లేని ఒక గోపకునకు ఒక కన్నునిచ్చి, తిమ్మరాజునకు స్వప్నమున సాక్షాత్కరించి గోపకునకు మరియొక కన్నునీవొసంగవలయునని అజ్ఞాపించగా, తిమ్మరాజు తనకన్నొసంగెనని కలదు.[33] ఈ కథ తిమ్మరాజు

28. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, p. 19.
29. రామరాజీయము, ప. 215.
30. దోనేరు కోనేరు నాథుడు, ద్విపదబాలభాగవతము.
31. రామరాజీయము, ప. 216, p. 28.
32. రామరాజభూషణుడు, వసుచరిత్రము, ప్ర. ఆ., ప. 31.
33. దోనేరుకోనేరునాథుడు, ద్విపదబాలభాగవతము.

యొక్క దానగుణమును తెలుపుటకు సృష్టించబడియుండును.

ఈతని తమ్ముడగు కొండమహీనాథుడు అదవేనికి పరిపాలకుడయ్యెను. అతని సంతతికి అదవేని నామము స్థిరపడెను. మరియొక సోదరుడైన శ్రీరంగరాజునుగూర్చి పెక్కుయుద్ధములు చేసెననియు, అజాతశత్రువనియు, వసుధసింగారాజన వల్లభు డేలెడి యాదినంబుల్, అని కవి వర్ణించెనేతప్ప సవిస్తరముగ ఈతని చరిత్ర తెలుప లేదు. ఈ గ్రంథమున ఈ ముగ్గురు సోదరుల విషయములు సవిస్తరముగ లేవు.

వసుచరిత్ర, ద్విపద బాలభాగవతము, రామరాజీయము రామరాజునకు ముగ్గురు పుత్రులని స్పష్టముగ తెలియచేసెను. కాని, Heras తన Aravidu Dynasty of Vijayanagar అను గ్రంథమునందు, రామరాజీయమునందు రామరాజునకు ఐదుగురు కుమారులని వ్రాయబడియున్నదని వ్రాసెను.

"According to the poem mentioned above, he had five sons: Sriranga, Channa, Venkatapati, Timma or Tirumala (who distinguished himself in the service of Krishnadevaraya) and lastly Venkatapati of these the first Sriranga become the father of Ramaraya the Regent of Sriranga Raya."[34]

ఈ విషయమెచ్చటను రామరాజీయమునందు లేదు.

రామరాజీయమునందు,

ఆరామనృపతికి మహెూదారుండగు తిమ్మరాజు ధన్యుఁడు కొండ
క్ష్మారమణుఁడు బుధనుతస చ్చారిత్రుఁడు రంగవిభుఁడు జనించిరొగిన్[35]

అని గలదు. ఈ పద్యమువలన రామరాజునకు ముగ్గురు పుత్రులనియు అందు రంగరాజు జ్యేష్ఠపుత్రుడు కాడనియు స్పష్టమగుచున్నది.

Heras పద్యమును సరిగా అర్థము చేసికొనకపోవుటచేతనో, లేక పొరపాటు వలననో ఆ విధముగా వ్రాసియుండును.

ఈ విషయమున, వసుచరిత్ర బాలభాగవతములును, రామరాజీయముతో ఏకీభవించుచున్నవి.

దోనేరు కోనేరునాథకవి రచించిన పద్యబాలభాగవతమున ఈ తిమ్మరాజును గూర్చిన కొన్ని విషయములు తెలియుచున్నవి. ఇతడు క్రి.శ. 1505 మొదలు 1542 వరకు, ఆ తరువాతకూడ విజయనగర ప్రభువుల పక్షముననుండి పెక్కు యుద్ధములలో పాల్గొనెనని తెలియుచున్నది. ఈతడు పెక్కు విచిత్రమగు పనులు చేసినట్లు తెలియుచున్నది. ఈతనికి

"గండరగూళికి గండర
గండని కుద్దండరాయగణవారణస్త్రీ

34. Henry Heras, Aravidu Dynasty of Vijayanagar, p. 19.
35. రామరాజీయము, ప. 216, p. 28.

గండాంకున కెంతెంబర
గండనికిన్ బట్టవాడ గజసింహునకున్"

అను బిరుదములున్నవి. ఈతనికి 'మన్నెపులి,' 'మళవరాయాత్యున్నత మస్తక శూలా,' 'మన్నెమరత్రాణ' అను బిరుదములుకూడ నున్నవి.[36] ఇందు 'మన్నెపులి' అను బిరుదు తాతపిన్నమరాజుకు, 'గండరగూళి' అను బిరుదు కొటిగంటి రాఘవ రాజునకు, 'మాళవరాయాత్యున్నత మస్తకశూలా' అను బిరుదు సోమదేవరాజునకు గలవు. కనుక వీరి పూర్వుల బిరుదులు వీనికి చేర్చినట్లు కనపడుచున్నది. తిమ్మరాజు పట్టవాడరాజును, ఉద్దండరాయడనువానిని జయించినట్లు తెలియుచున్నది. కళింగదేశాధీశ్వరుడైన ఒడ్డిరాయని జయించుటయేకాక మహమ్మదు మలకకు ప్రాణదానము చేసినట్లు తెలియుచున్నది. ఈతడు పూర్వదిగ్విజయ యాత్రలందు శ్రీకృష్ణదేవరాయలకు తోడ్పడినట్లు తెలియుచున్నది. ఈతడు క్రీ.శ. 1542 ప్రాంతమున విజాపుర సుల్తాను అలీ ఆదిల్‌షాను జయించెను. వీరనృసింహరాయలచే 'స్వామిద్రోహరగండ నూపురము' బహుమానముగ గ్రహించెను. ఈ స్వామిద్రోహి ఆదవేని దుర్గాధిపతి, తిమ్మరాజు తమ్ముడునగు ఆదవేని కొండరాజట. ఈ అంశమును చిలుకూరి వీరభద్రరావుగారు విపులముగ చర్చించిరి.[37]

శ్రీరంగరాజు :

శ్రీరంగరాజెచట రాజ్యము చేసెనో తెలియుటలేదు. ఇతడు
గాఁగనవదృశ బాహువిక్రమ నిరూఢిఁ
దనరెఁ గర్ణాట రాజ్యపదస్థుఁడగుచు
దుర్జయాహితరాజవిధుంతుదుండు
రామరాజేంద్రు | శ్రీరంగరాజవిభుఁడు[38]

అను నరపతి విజయమునందలి పద్యమువలన విజయనగరాస్థానమున నున్నటుల తెలియుచున్నది. ఇతర చారిత్రకాంశము లేవియు తెలియుటలేదు.

"We know from Ferista that he was one of the Ministers of Krishnadeva Raya and was succeeded in this place by his son Rama Raya."[39]

అను అభిప్రాయము ప్రకారము శ్రీరంగరాయలు, కృష్ణదేవరాయల కడ మంత్రిగ నుండెనని తెలియుచున్నది. ఇంతకంటెను ఆధారములు దొరకుటలేదు.

36. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, pp. 45–46.
37. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, pp. 46–50.
38. రామరాజీయము, ప, 222, p. 29.
39. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, p. 19.

రామరాజీయమువలన వసుచరిత్రమువలనను, శ్రీరంగరాజు విజయనగరరాయల ఆస్థానమున నుండినట్లు తెలియుచున్నది. శ్రీరంగరాజు, కృష్ణదేవరాయల మంత్రిగ నుండెనని "హెరాసు" వ్రాసిన విషయము సప్రమాణముకాదని చిలుకూరి వీరభద్ర రావుగారు వ్రాసిరి.[40] కర్నూలునందలి ఒక శాసనము నందీతడు, మహామండలేశ్వరునిగ తెలుపబడినది.[41] సమకాలీన రచనలవలన ఈతడు కృష్ణదేవరాయల ఆస్థానమున నుండెననియే తప్ప మంత్రియను విషయమును లేదు. సప్రమాణమగు చరిత్ర కాధారములేవియు లేవు.

ఈతడు అనేక రాజ్యములను జయించినట్లు, అత్యంత సాత్వికభావముతో రాజర్షిగా వెలుగొందినట్లు, క్రీ.శ. 1594లో రామయామాత్య తోడరుమల్లు వ్రాసిన స్వరమేళకళానిధివలన తెలియుచున్నది. ఈతడు తిమ్మాంబను వివాహము చేసి కొనెను. ఈతనికి కోనభూపతి, తిమ్మరాజు, రామరాజు, తిరుమలరాజు, వేంకటపతిరాజు జన్మించిరి. వీరందరును మిక్కిలి పరాక్రమవంతులు.[42] ఇందలి రామరాజే అళియ రామరాయలన్న పేరుగాంచిన శ్రీకృష్ణరాయల అల్లుడు. తిరుమలరాజును రాయల అల్లుడే.

**తిరుమలరాజు :**

తిరుమలరాజు మిక్కిలి పరాక్రమశాలి అని కవి వర్ణించెను.

"సతఁడు నృతమాత్రుఁడేయరయను సపాద
కుతప శాహినిజామాది కుతలపతులఁ
జెందదోర్గర్వఖర్వితాఖండలుండు
రణజయవిహారి తిరుమలరాయ శౌరి"[43]

ఈ పద్యమువలన కుతపశాహిని జయించినట్లు తెలియుచున్నది.

ఈతడు వెంగళాంబను వివాహము చేసికొనెను. ఈతనికి, రఘునాథరాజు, శ్రీరంగరాజు, రామరాజు, వేంకటరాజను పుత్రులుదయించిరి. వెంగళాంబ శ్రీకృష్ణదేవరాయల రెండవ కుమార్తె.

---

40. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, pp. 52-54.

41. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, p. 19, "Accordingly in an inscription at Karnul he is called Mahamandaleswara Ramaraju Peda Sriranga Deva Maharaju."

42. ఇందు కోన భూపతి, తిమ్మరాజుల విషయములేవియు తెలియుటలేదు. ద్విపద బాల భాగవతమునందు, వసుచరిత్రనందు, రామరాజీయమునందు, నరసభూపాలీయము నందు, వీరు శ్రీరంగరాజు పుత్రులనియే తప్ప తక్కిన వివరములేవియు లేవు. మిగిలిన ముగ్గురి చరిత్ర తెలియుచున్నది.

43. రామరాజీయము, ప. 235, p. 31.

రఘునాథరాజు :

తిరుమలరాజు పుత్రుడగు రఘునాథరాజును పరాక్రమవంతుడే. ఈతడు తురుష్కులను జయించెను.

"సమరోర్వి సఘునాథరాజవరు డశ్వంబుద్ధతిస్థోలిశౌ
ర్యమృగేంద్రుండన నొప్పె త్రుంచెను దురుష్కాధీశుల న్రౌతుఁ బ
ల్లము గుఱ్ఱంబును నాఱుతుంటలయి డొల్లన్వ్రేటు వేటట్లుగా
నమరుల్గన్గొని మేల్సెబాసు భళి యౌనౌనంచు వర్ణింపగన్"44
ఈతనికి "బిరుదకేతనుడ"ను బిరుదము కలదు.

శ్రీరంగరాజు :

శ్రీరంగరాజు ఆర్వీటిపురమునకు అధ్యక్షుడయ్యెను. ఇతడు జీర్ణకర్ణాట రాజ్యమును పునరుద్ధరించెను. గడి, విజాపురము, గోల్కొండ మొదలగు రాజ్యములతో యుద్ధముచేసెను. ఈతడు తిమ్మాంబను వివాహము చేసికొనెను.

రామరాజు :

రామరాజు కూడా శూరుడు, రణరంగమునందు, నిజాము సేనలను జయించెను. ఈతడు నరసింగమ్మ అను నామెను వివాహము చేసుకొనెను. ఇతనికి తిరుమల రాజు, శ్రీరంగరాజు జన్మించిరి. ఈ శ్రీరంగరాజు, వేంకటపతి రాయలచే యువరాజ్యాభిషేకమును చేయించుకొనెను. ఇతనికి చికదేవరాజు జన్మించెను.

చికదేవరాయలు :

చికదేవరాయలు జిల్లేళ్ళ నారసింహరాజపుత్రి అయిన ఓబమ్మను వివాహము చేసుకొనెను. ఈతనికి రామదేవరాయల్లు జన్మించెను. ఈతడు రఘునాథ నాయకుని తోడను, సింగరాజు, రాయప్ప, అయ్యానరాజు, చెన్నరాజు మొదలగు రాజులతోకూడి, జంగరాజును వధించెను. వీరప్రతాపోజ్వలుడు :- ఈతడు పోచిరాజు తనయ ఓబమ్మనే కాక గొబ్బూరి యతిరాజు కుమార్తెయయిన కొండమనుకూడ వివాహము చేసికొనెను. ఈతడు తులా, పురుష, కన్య, అశ్వ, గజ, గో, హిరణ్య, వస్త్ర, అన్న, భూదానములను చేసి ఖ్యాతి గడించెను.45

వీరవేంకటపతి రాయలు :

వీర వేంకటపతి రాయలు, వేలూరును పరిపాలించెను.46 ఈతని

44. రామరాజీయము, ప. 240, p. 31.

45. రామరాజీయము, ప. 254 – 257, p. 33.

46. వీర వేంకటపతి రాయలు, వెల్లూరు, చంద్రగిరి, రెండునగరములను ముఖ్యపట్టణములుగ చేసికొని రాజ్యము చేసినట్లు చరిత్ర వలన తెలియుచున్నది. Herry Heras, The Aravidu Dynasty of Vijayanagara, p. 320.

గుణగణాదులను కవి

"వాఙ్మహా విభవంబు వర్ణింతునంటినా
భావింపఁబన్నగ భర్తయతఁడు
గుణముల చెలువుఁ బేర్కొనియెద నంటినా
వీక్షింప శేషాద్రి విభుఁడతండు
అతిధర్మవర్తన నుతి యింతునంటినా
రెండవ యాధర్మజుండతండు
నీతిమార్గ స్ఫూర్తి రీతిట్టిదంటినా
పరికింపఁగా బృహస్పతి యతండు
గాన బుధజన సన్నుతిఁ గన్నయార,
వీర వేంకటపతిరాయ విభుని నితర
మనుజనాథుల రీతిని వినుతి సేయ,
నలవియే యా ఫణుండు కేవలుఁడెతలప"[47]

అని వర్ణించెను. ఈతడు క్రీ.శ. 1586 లో రాజ్యమునకు వచ్చెను.

ఈతడు వెంకటమ్మను, జిల్లేళ్ళ రంగరాజు కుమార్తెయైన ఓబమ్మను, జిల్లేళ్ళ కృష్ణరాజ తనయయైన కృష్ణమ్మను, గొబ్బూరి ఓబయ కుమార్తెయగు కొండమ్మను వివాహము చేసికొనెను. వీర వేంకటపతి రాయలు గోలుకొండ కుతుబ్‌షాహిని జయించెను.

"బలముగూడినఁ జూదోల నిలువనియిభరాము
కొడుకు భీతికి గోలుకొండ సాక్షి
వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును
బృథురక్తమున నుబ్బు పెన్న సాక్షి
నీవాఁడ ననఁబ్రోచి నిర్భయంబుగ వాని
కిని మేరయిడుటకుఁ గృష్ణ సాక్షి,
యెదిరించు వైరుల మతమెల్ల నవలీలఁ
దూలించుటకును నందేల సాక్షి
గాఁగన సదృశ బాహు విక్రమ విభూతి
దనకు వేలూరు వర రాజధానిగాఁగ
వీర వేంకటపతి రాయ విభుఁడు మిగుల
ధరణిఁబాలించె ధర్మ తత్పరతఁ జెలఁగి"[48]

47. రామరాజీయము, ప. 261, p. 34.
48. రామరాజీయము, ప. 260, p. 34.

ఆంధ్ర కవులచే పొగడబడిన మల్కిభ రాముడే ఇందు వర్ణితమయిన (ఇభరాము కొడుకు) ఇబ్రహీం కుతుబ్‌షా, వేంకటపతి రాయ లీతనిని పెన్నానది వరకు తరుముటయు, శరణుకోరగా, కృష్ణను దాటి రాకుండు నటుల ఒడంబడిక నేర్పరచుకొనుట సత్యమని Heras అభిప్రాయము.[49]

పై పద్యమున వర్ణింపబడిన నంద్యాల పరిపాలకుడు కృష్ణమరాజు కావచ్చు ననియు, వీర వేంకటపతి రాయల పక్షమున సామంత రాజైన మట్ల అనంతుడు కృష్ణమరాజును జయించినటుల తెలియుచున్నది.[50] ఈ మట్ల అనంతపాలుడు కాకుత్స విజయ కర్త. ఇతనిచే పరాభవింప బడిన కృష్ణమరాజు కళాపూర్ణోదయ మును వ్రాయించిన కృష్ణమరాజు. మట్ల వారికిని నంద్యాల వారికిని నడుమ యుద్ధ ములు జరిగినట్లును, వీర వేంకటపతి రాయల పక్షమున మట్ల వంశీయులు నంద్యాల కృష్ణమ రాజుపై విజయమును సాధించినటుల తెలుపు పెక్కు కైఫీయ తులు కలవు.[51]

వీర వేంకటపతి రాయల గుణగణాదులను కీర్తి ప్రతాపములను, అందచంద ములను రామరాజభూషణుడు వర్ణించెను. ఈతడు స్ఫురద్రూపి, కవిపోషకుడు, దానశీలి.

"హరుఁడా తారకశైల దుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి వహించుఁ జంద్రగిరి దుర్గబందు శ్రీ వేంకటే
శ్వరుఁడొప్పెన్ బహురాజశేఖర దానంసేవ్యుఁడై యౌరయి
ద్ధర బంటేలిక వాని తద్గిరుల కుందద్వల్లభ శ్రీలకున్"[52]

అనుటచే వేంకటపతి దేవరాయల పరాక్రమాదులు తెలియుచున్నవి. ఈతనికి పుత్రులున్నటుల కనిపించదు. ఈతడు క్రి.శ. 1614 లో మరణించగా ఈతని అన్న శ్రీరామరాయల చిన్నకుమారుడైన శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చెను.

వెంకటాద్రి :

తిరుమలుని సోదరుడయిన వెంకటాద్రి కందనవోలును పరిపాలించెను. ఈతడు గంగమాంబను, కృష్ణమ్మను వివాహము చేసికొని, వేంకటాద్రిరాజు, రంగప రాజులను పుత్రులను గాంచెను.

రంగపరాజు :

రంగపరాజు కోనేటమ్మను, తిమ్మమ్మను, చెవ్వమ్మను వివాహము చేసికొనెను.

49. Henry, Heras, The Aravidu Dynasty of Vijayanagara, pp. 327–328.
50. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagara, p. 309.
51. చాగంటి శేషయ్య, ఆంధ్రకవి తరంగిణి, సం. 11, p. 75.
52. రామరాజభూషణుడు, వసుచరిత్ర, ప్ర. ఆ., ప. 81.

ఈ రంగపరాజునకు కోనేటమ్మకును వేంకటాద్రి జన్మించెను. తిమ్మాంబ వలన గోపాలరాజు జన్మించెను. ఈ గోపాల రాజు కందనవోలునకు రాజయ్యెను. ఇతడు గొబ్బూరి రాజపుత్రియగు వెంగమ్మను, జిల్లెళ్ల రంగరాజ పుత్రియగు తిమ్మమ్మను, వివాహము చేసుకొనెను.

ఈ విధముగా పుత్ర పౌత్రాదులతో వర్ధిల్లుచున్నట్టి సహోదరులు తిరుమలరాయ, వేంకటాద్రులు తన్ను కొలువ, వారి సహాయముతో సలకము తిమ్మరాజు సేనలు జయించి, గుత్తి, పెనుగొండ, గండికోట, కందనవోలు పురము, అదవేని దుర్గములను జయించెనని రామరాయల శౌర్యమును కవి వర్ణించెను. ఈతడు సేతువునుండి కాశీ వరకు గల భూభాగమునంతటిని, జయించినటుల కవి వర్ణించెను. కుకుర, కోసల, మత్స్య, కురు, కరూశాది దేశాధిపతులీతనికి కానుకల నొసంగిరట.[53]

రామరాయలు :

కవి ఈతనిని కర్ణాట రాజ్యరమాధినాధునిగ వర్ణించెను. కాని ఈతడు కర్ణాట రాజ్యము నెట్టుల హస్తగత మొనర్చుకొనెనో సవిస్తరముగ తెలుపలేదు. ఈతనిని గూర్చి రమారమి రెండు పుటల బిరుద గద్యను చెప్పెను. ఈ బిరుద గద్య వలన ఈతడు సమస్తసద్గుణోపేతుడని, కన్యాకుమారి నుండి భీమరథి తటము వరకు విజయస్తంభములు వేయించెనని, గుత్తి, అదవేని, మంద్రగిరి, ఉద్దగిరి, కాయదుర్గ, రాయదుర్గ, జూటూరు, కొండవీడు, రాచూరు, ముదుగల్లు, ఓరుగల్లు, కల్యాణనగరము, అహమ్మదునగరము, యాదగిరి, కలుబరిగ, రామగిరి, గోలుకొండ, పానుగల్లు, కొండపల్లి, వినుకొండ, నాగార్జునకొండ, రాజమహేంద్ర వరము మొదలగు దుర్గములను జయించెనని, పురములను సాధించెనని, బూదల ఖాను, ఏదులఖాను అను వారి సప్తాంగములను హరించెనని తెలియుచున్నది.[54] ఈతనికి చాళుక్యనారాయణ, ధానిష్క చక్రవర్తి, నానామండలీకరగండ, దైత్యేభరగండ, హస్తింబరగండ, భాసురభుజాదండ, జయ బిరుదరగండ, అనమ శూరరగండ, హొసబిరుదరగండ మొదలగు బిరుదములున్నవి.

ఈతడు శ్రీకృష్ణదేవరాయల కుమార్తెయగు తిరుమాలాంబను వివాహము చేసికొనెను. ఈమెనేకాక జిల్లెళ్ల పెద్దనంది రాజపుత్రియగు అప్పలాంబను, పోచిరాజు తిమ్మరాజు కుమార్తెలగు కొండమ్మ, లక్ష్మమ్మలను వివాహము చేసికొనెను. ఇతని కడనే వసుచరిత్రకారుడు రామరాజభూషణుడుండెను.

---

53. రామరాజీయము, ప. 283, p. 37, ఈతడే శ్రీకృష్ణదేవరాయల అల్లుడు. వీనికి అళియ రామరాయలని పేరు గలదు.

54. రామరాజీయము, pp. 37-39.

అరవీటి వంశీయులలో పేరెన్నిక గన్నవారు, విజయనగరమునకు పరిపాలకులైన వారు, ఈ అళియరామరాయలు, ఇతని సోదరుడు తిరుమలరాయలు.

అళియరామరాయలు, కృష్ణరాయలకడ ఏ యుద్యోగముననుండెనో తెలియుటలేదు. ఇతనికి కృష్ణరాయలు తన కుమార్తెయగు తిరుమలాంబనిచ్చి వివాహమెప్పుడు గావించెనో కూడ మనకు తెలియుటలేదు. రామరాయలు, తిరుమలరాయలు మంత్రులుగ నుండిరని Heras వ్రాసెను.[55] తరువాత వీరిరువురును విజయనగర పరిపాలకులైరి.

క్రీ.శ. 1530 వ సంవత్సరమున విజయనగర సామ్రాజ్యాధిపతియైన, కృష్ణదేవరాయలు మరణించెను. కృష్ణదేవరాయల మరణానంతరము, అతని తమ్ముడగు అచ్యుతదేవరాయలు విజయనగరాధిపతి అయ్యెను. అచ్యుతదేవరాయల కాలముననే సాళువ నాయకుడు మంత్రిగ నియమింపబడెను.[56] కృష్ణదేవరాయలే అచ్యుతదేవరాయలను రాజుగ నియమించెను.[57]

కృష్ణదేవరాయలు మరణించు సరికి అతనికి ఒక చిన్న కుమారుడు గలడు. అర్వీటి వంశీయుడగు రామరాజు కృష్ణదేవరాయల అల్లుడు. అల్లుడగుటచే అళియ రామరాయలు అను పేరితనికి స్థిరపడినది. అళియ అనగా అల్లుడని అర్థము. ఈ అళియ రామరాయలకు అచ్యుతరాయలు రాజ్యము చేయుట ఇష్టములేదు. కనుక కృష్ణరాయల చిన్నకుమారుని వెనుక నిడుకొని, విజయనగర సామ్రాజ్యమును కైవసము చేసికొనవలెనని ప్రయత్నించెను. రామరాయలకు సామ్రాజ్యము హస్తగతము కాకుండ మంత్రియగు సాళువ నాయకుడు ప్రయత్నించెను.

అచ్యుతరాయలు రాజగుట ఇష్టము లేక, కృష్ణదేవరాయల దేవేరులగు తిరుమలదేవి, చిన్నాదేవులు, తమ కుమారునకు ప్రతినిధిగ రామరాయలను నియమించ ప్రయత్నించిరను వాదమును గలదు.[58]

రామరాయలు, కృష్ణరాయల ఆజ్ఞప్రకారము, రాయల రెండవ పుత్రునకు ప్రతినిధిగ రాజ్యము పాలింపదొడగెను అని మరియొక అభిప్రాయము గలదు.[59]

అభిప్రాయములు ఎట్టివయినప్పటికిని, ముఖ్యముగ తెలియుచున్నది రామరాయలు, విజయనగర రాజ్యమును హస్తగతము చేసికొనుటకు ప్రయత్నించుట.

---

55. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, p. 5.
56. Robert Sewell, A Forgotten Empire, p. 159.
57. K. A. Nilakanta Sastry, History of South India, p. 273; A Forgotten Empire, p. 159, Epigraphica Carnatica, Vol. IX, Dod. Ballapur, No. 20.
58. S. Krishna Swamy Aiyangar, Sources of Vijayanagar History, pp. 178-181.
59. Briggs Ferishta, Vol. III, p. 381.

ఈ ప్రయత్నమునందీతడు సఫలుడయ్యెను. అచ్యుతరాయల పరిపాలన కాలమంతయు, ఈ విధమగు సమస్యలతోను, పరరాజుల దాడులతోను ముగిసెను.

అచ్యుతరాయల తరువాత (క్రీ.శ. 1542 న అచ్యుతరాయలు మరణించెను) అతని కుమారుడగు మొదటి వేంకటపతిరాయలు రాజయ్యెను. ఈతడు చిన్నవాడగుటచే, మేనమామయగు సలకము తిమ్మయ్య ప్రతినిధిగ నుండి రాజ్యము చేసెను. అధికారమంతయు తన చేతియందుండుటచే, క్రమక్రమముగ రాజ్యమును వశపరచుకొనెను. తానేరాజయ్యెను. తనకు సహాయముగ నుండునని, బీజపూరు సుల్తానులతో స్నేహము చేసెను. వేంకటపతిరాయలు రాజ్యమునకు వచ్చిన కొద్దిరోజులకే మరణించెను.[60] సలకము తిమ్మయ్య రాజయ్యెను. సలకము తిమ్మయ్య రాజగుట రామరాజున కిష్టములేదు (సలకము తిమ్మయ్యయే వేంకటపతిరాయలను చంపించెను).[61] కావున సలకము తిమ్మయ్యపై యుద్ధము ప్రకటించి తుంగభద్రాతీరమున వానిని, వధించెను.[62] క్రీ.శ. 1543 వ సంవత్సరమున సదాశివరాయలకు (కృష్ణరాయల తమ్ముని కుమారుడు) రాజ్యాభిషేకము చేసెను. సదాశివరాయలు రాజైనప్పటికి రాజ్యమును ఇరువది మూడు సంవత్సరములు అవిచ్ఛిన్నముగ రామరాయలే పరిపాలించెను. అచ్యుతరాయలు అనంతరము తుళువ వంశము వెనుకపడి, అర్వీటి వంశము విజయనగరాధిపత్యము వహించెను.

సదాశివరాయలు రంగరాయల కుమారుడని, అచ్యుతరాయల కుమారుడని, కృష్ణరాయల కుమారుడని పెక్కు అభిప్రాయములు కనబడుచున్నవి.[63]

సాళువ నరసనాయకుని కాలమునుండియు ఈ అర్వీటి వంశీయులు విజయనగర రాజులకు యుద్ధములందు తోడ్పడుచుండిరి.[64]

రామరాయలు క్రమక్రమముగ, రాజ్యమునందు తన బలమును సుస్థిరము చేసికొనెను (పాత ఉద్యోగులను తొలగించి, తన బంధువులను పదవులందు నిలిపెను).[65]

రామరాజు విజయనగర సామ్రాజ్యమును, హస్తగతము చేసుకొను కాలమున దక్షిణదేశమునగల శత్రురాజులయిన మహమ్మదీయులకు విజయనగరమనిన సింహస్వప్నముగ నుండెను. ఎటులయినను విజయనగర సామ్రాజ్యమును కబళింపవలెననియే తలంచుచుండిరి. అట్టి తరుణమున, రామరాయలు, నూతన విధానమనుస

60. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar. p. 7.
61. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, p. 7. ; Robert Sewell, A Forgotten Empire, p. 316.
62. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, pp. 10-12.
63. Robert Sewell, A Forgotten Empire, pp. 175-176.
64. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 334.
65. K. A. Nilakanta Sastry, A History of South India, p. 286.

రించి, విజయనగర పతనమునకు కారకుడయ్యెను. ఈతడు రాజ్యతంత్రము నిర్వహించుటయందు, మిక్కిలి నిపుణుడు, శూరుడు. మొదట తనకు శత్రువు లయిన మహమ్మదీయులలో కొందరికి సహాయము చేసి, ఎదిరి పక్షము వారిని జయించి, వారి నడుమ వైరభావమును కలుగునటుల ప్రయత్నించెను. భారత దేశమున అడుగు పెట్టిన పోర్చుగీసువారితో సంధిచేసికొని, మహమ్మదీయులతో యుద్ధమునకు తలపడెను.

రామరాయలు, రాజ్యాధికారమును హస్తగతము చేసికొనునప్పటికి, విజాపుర రాజ్యమున ఇబ్రహింఅదిల్‌షాహ సుల్తానుగ నుండెను. అహమ్మదు నగరమునకు బుర్‌హాన్ నిజాంశాహ, గోలుకొండనకు జమషిద్‌కుతుబ్‌శాహ, బేదర్‌నకు అలీబెరీద్ అనువారు పాలకులుగ నుండిరి. వీరిలో వీరికి ఐకమత్యము లేదు. ఇందు విజాపుర రాజ్యమునకును, విజయనగరమునకును, రాచూరు, ముదగల్లు దుర్గముల విషయమై ఎల్లప్పుడును యుద్ధములు జరుగుచుండెను.

రామరాజు క్రీ.శ. 1543 సంవత్సరమున, నిజాంశాహ, అదిల్‌షాహలకు జరిగిన యుద్ధమున, నిజాంశాహకు సహాయము చేసెను.[66] క్రీ.శ. 1547 వ సంవత్సరమును, సదాశివరాయల తరపున, పోర్చుగీసువారితో సంధిచేసికొనెను.

గోలుకొండ నవాబు తమ్ముడు (ఇబ్రహీం) అన్నయగు కుతుబ్‌శాహతో పోరాడి, అన్నకు భయపడి రామరాజుకడకు రాగా, అతనిని చేరదీసెను. అన్న మరణానంతర మీతడు 'ఇబ్రహింకుతుబ్‌షా' అను పేరుతో గోలుకొండ సింహాసన మెక్కెను.[67]

రామరాయలు నిజాంషాతో స్నేహముచేసి, అతడు పంపిన కానుకలను తీసుకొనెనని తెలిసి, ఆదిల్‌షా రామరాజు రాయబారుల నవమానపరచెను. ఇది తెలసికొని రామరాజు, నిజాంశాహను, అదిల్‌షాతో యుద్ధమునకు ప్రోత్సహించెను. క్రీ.శ. 1557 సంవత్సరమున, రాచూరును ముట్టడించి ముదగల్లు, అంతర్వేది జయించెను.[68] మరల విజాపుర సుల్తానుతో స్నేహముచేసి, నిజాముతో యుద్ధము చేసెను. అందు ఓడిపోయెను.[69] విజాపుర సుల్తాను పుత్రుడగు అలీఅదిల్‌షాను పుత్రునిగ స్వీకరించెను. అలీఅదిల్‌షాకును అహమ్మదునగర సుల్తానుకు నడుమ జరిగిన యుద్ధమున పాల్గొనెను. ఈతడు తురుష్కుల స్త్రీలను అవమానపరచి, మసీదుల పడగొట్టెనట.[70] నిజాంశాహ రామరాజుతో సంధి చేసికొనెను.

ఈ విధముగా తురుష్కుల నడుమ కలహముల రేకెత్తించి వారి రాజ్యములను హస్తగతము చేసికొన నిశ్చయించెను. ఈ విషయములను తెలసికొని

66. Robert Sewell, A Forgotten Empire, p. 184.
67. Robert Sewell, A Forgotten Empire, p 189.
68. Robert Sewell, A Forgotten Empire, pp. 189–190.
69. Robert Sewell, A Forgotten Empire, p. 190.
70. Robert Sewell, A Forgotten Empire, pp. 194–196.

తురుష్కులు, వారిలో వారు సంబంధ బాంధవ్యముల నెరపికొని, నాలుగు రాజ్యములవారును ఏకమై, రక్షన తంగడికడ యుద్ధము చేసిరి. ఇందు మొదట రామరాయలే జయమొందెను.[71] కాని శత్రువులు హఠాత్తుగా మరల వచ్చిరి. ఇందు రామరాయల తమ్ముడు వెంకటాద్రికి కన్నుపోయెను.[72] తిరుమల రాయల పుత్రుడు రఘునాధుడు మరణించెను. రామరాయలును ఈ యుద్ధమున మరణించెను. ఈతని మరణమును గూర్చి Ferista, Buhan-I-Massir మొదలగు చరిత్ర కారులు పలురకములుగ వ్రాసిరి.

తిరుమలరాజు :

రామరాజు మరణించిన తరువాత, అతని సోదరుడగు తిరుమలరాయలు విజయనగర రాజైన సదాశివరాయలను, ధనమును, తీసుకొని పెనుగొండకు పారిపోయెను.[73] మహమ్మదీయ సుల్తానులు, విజయనగరమును ధ్వంసముచేసి వెడలిపోయిన తరువాత, తిరుమల రాయలు మరల విజయనగరమును రాజధానిగ చేయ ప్రయత్నించి, విఫలుడై, పెనుగొండనే రాజధానిగచేసి, తానే పరిపాలించెను. క్రీ.శ. 1570 ప్రాంతమున ఈతడు సింహాసన మెక్కెను.

తన రాజ్యమును, మూడు భాగములుచేసి, మిగిలిన ముగ్గురు పుత్రులకు యిచ్చెను. రెండవ కుమారుడు శ్రీరంగరాయలు పెనుకొండ రాజధానిగ ఆంధ్ర ప్రాంతమును, రామరాయలు శ్రీరంగపట్టణమును రాజధానిగ జేసికొని కర్ణాట మండలమును, వేంకటపతి దేవరాజు చంద్రగిరి రాజధానిగ తమిళ మండలమును పరిపాలించిరి.

తిరుమల రాయల మరణానంతరము, శ్రీరంగరాయలు రాజయ్యెను. (క్రీ.శ. 1572–1585). ఆతని తరువాత, అతని సోదరుడు వేంకటపతిరాయలు రాజ్యమునకు వచ్చెను. ఇతడు క్రీ.శ. 1585 నుండి 1614 వరకు రాజ్యము చేసెను. ఇతని చరిత్ర ముందు తెలుపబడినది. ఇతని తరువాత అన్నకుమారుడగు శ్రీరంగరాయలు రాజయ్యెను.

శ్రీరంగరాయలు :

ఈతని శౌర్యపరాక్రమాదులను
పాటిదారిపుకదంబము బెడాబెడలుగా
నురువడి మొనలపై నుఱిమినపుడె
భయమందదా పద్మబాంధవు మండలం
బరిఖండనోత్సాహ మలరినపుడె

71. Chandarkar, The Destruction of Vijayanagar, p. 771.
72. Purchas, Chp. X, p. 93.
73. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి, p. 338.

మోహంబు చెందదా ముగ్ధాంగనారాజి
సోయగంబొక్కింత చూచినపుడె
సమ్మోదమందదాక్ష్మా జనానీకంబు
కరుణార్ద్రదృష్టిచే గనినయపుడె
యౌరయ సహాయశూరుడు నరికృతాంతుఁ
డంగనాజన నూత్నలతాంత శరుడు
ధర్మతత్పరుఁడను భూధవులన వినుతిఁ
గనియె శ్రీరంగ చికరాయ మనుజ విభుడు.[74]

అని వర్ణించెను. నిజమున కీతడు విజయనగర పరిపాలకులలో అతిదురదృష్ట వంతుడు, బీరువు, అసమర్థుడు. ఇట్టివానిని అసహాయశూరుడు అని కవి వర్ణించుట హాస్యాస్పద మనిపించును. ఈ అంశము కవులకు సంప్రదాయమనగల మక్కువను తెలుపుచున్నది.

శ్రీరంగరాజు రాజ్యమునకు వచ్చిన తరువాత, వెంకటపతిరాయల బావమరది యైన గొబ్బూరు జగ్గరాజు శ్రీరంగరాయలపై తిరుగుబాటు చేసి, సకుటుంబముగ చెరయందు పెట్టి తరువాత చంపించెను.[75] ప్రజలయొక్క సామంతులయొక్క విముఖత్వము నెదుర్కొనలేక, తాను నిరాకరించినప్పటికిని, వేంకటపతిరాయలు తనపైమోపిన రాజ్యభారమును మోయలేక, రాజద్రోహుల కుట్రలకు అన్యాయముగ బలియయ్యెను.

ఇతని కుటుంబము మరణించుటకు ముందుగనే ప్రభువంశమన గౌరవము గల సామంతరాజైన యాచమనాయకుడు శ్రీరంగరాయల కుమారులలో ఒకడైన రామదేవరాయలను రక్షించి, తంజాపుర పాలకులకడ నుంచెను.[76]

రఘునాథనాయకుడు యాచమ నాయకుని పక్షమవలంభించి జగ్గరాజును తోపూరుకడ నోడించెను. ఈ యుద్ధమును కవి భారతముతో పోల్చెను.

"సింగనృపతి భీమసేనుడు రాయప్ప
శ్వేతాశ్వ డయ్యెనచెన్న నృపులు
మాద్రేయులితర భూమండలేశ్వరులు వి
రాట పాంచాలాది రథికవరులు
రఘునాయకాగ్రణియను కృష్ణ స
హాయమ్ముగాగను నాజిఁజెంచు
వీరప్ప యాచన విభుమాక భూప దు
శ్శాసనసౌబల శల్య కర్ణ

74. రామరాజీయము, ప. 253, p. 33.

75. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి, p. 340.

76. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి, p. 341.

యుక్తముగ జంగరాజు దుర్యోధనుని వ
ధించి సంతసమున రామదేవరాయ
ధర్మ తనయుండు ప్రజల మోదంబెలర్ప
ధరణిబాలించె ధర్మవిస్ఫురణ మెరయ"[77]
యాచమ నాయకుడు రామదేవ రాయలకు పట్టము కట్టెను.[78]

**రామదేవరాయలు :**

రామదేవరాయలు రాజ్యమునకు వచ్చిన వత్సరము క్రీ.శ. 1614. ఇతడెంత కాలము రాజ్యపాలనము చేసెనో తెలియుటలేదు. క్రీ.శ. 1630 వరకు అని History of South India పేర్కొనినది.

ఇతని తరువాత రామరాయల మనుమడైన పెద వేంకటపతిరాయలు రాజయ్యెను. ఇతడు క్రీ.శ. 1642 వరకు రాజ్యము చేసినటుల తెలియుచున్నది. ఇతని తరువాత మూడవ శ్రీరంగరాయలు రాజయ్యెను. (క్రీ.శ. 1642–9–1672) ఈతనితో విజయనగర సామ్రాజ్యము తన ప్రాభవమును గోలుపోయి, మహారాష్ట్ర రాజ్యమున గలసిపోయెను. ఈతని అన్నకుమారుడే కోదండరామరాజు. ఇతడే రామరాజీయ కృతిపతి.

విజయనగర సామ్రాజ్యాధిపతులను కాదని తామే ప్రభువులై పరిపాలించి విజయనగర సామ్రాజ్య చరిత్రను మార్చివేసిన రామరాయల యొక్కయు, తిరుమలరాయల యొక్కయు చరిత్రను అందుగుల వెంకయ్య సమగ్రముగ తెలుపక ఏదో సామాన్యముగ తెలిపెను.

రామరాజు సంతతి వారు మండలాధిపతులుగ నుండి, కొంతకాలము స్వతంత్రులై, తరువాత మహమ్మదీయులకు మహారాష్ట్రులకు లోబడిపోయిరి.

రామరాయలకు తిరుమలాంబయందు కృష్ణరాజు, పెద తిరుమలరాజు పుట్టిరి (వీరిలో కృష్ణరాజు మిక్కిలి పరాక్రమవంతుడు). కొండమాంబకు గొండరాజును, లక్ష్మాంబకు సింగరాజును జన్మించిరి. వీరిలో పెదతిరుమలరాజు అహమ్మదు నగర పరిపాలకుడైన నిజాంషాను జయించెను.[79]

కొండరాజు అనెగొందిపాలకుడాయెను. ఈతడు నిజాంషాను ఓడించెను. సూరప రాజపుత్రియగు తిరుమలాంబను వివాహము చేసుకొనెను.

ఈతని కుమారుడు రామరాజు. ఈతడు గొబ్బూరి రాజకన్య నరసింగమ్మను,

77. రామరాజీయము, ప. 256, p. 33 ; ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి, p. 341.

78. K. A. Nilakanta Sastry, A History of South India, p. 302.

79. ఈ విషయము కడప మండలములోని బొల్లవరం శాసనమున గలదు.

సూరపరాజు తనయ ఓబమ్మను, పోచిరాజుకుమార్తె జానకమ్మను పరిణయ మాడెను.

చిన్న తిమ్మరాజు :

రామరాయల నాల్గవ కుమారుడగు చిన్న తిమ్మరాజు, రామరాజు నిజాం శాహతో కలసి, రాచూరు ముట్టడించినపుడు క్రీ.శ. 1551లో తానును తండ్రితో పాటు యుద్ధమున పాల్గొని, మిక్కిలి బలపరాక్రమమును చూపెను. తరువాత ఈతడు రాచూరుకు అధిపతి అయ్యెను.[80] పాణె రాజపుత్రికయగు పోచమదేవిని వివాహము చేసికొనెను.

శ్రీరంగరాజు :

రామరాజునకు లక్ష్మాంబవలన కలిగిన శ్రీరంగరాజు మిక్కిలి శౌర్య ప్రతాపములు కలవాడు. దానశీలి. ఆశ్రిత పక్షపాతి. ధర్మమూర్తి. అరిభయంకరుడు. ఈతని పరాక్రమాదులను వర్ణించుచు, ఈతడు, భగీరథ, నగర, రామ, పురూరవ, పురుకుత్స, అంబరీష, భరత, పురు, నలమహారాజులవలె రాజ్యమును పరిపాలించె నని వర్ణించెనే తప్ప, ఏప్రాంతమును పరిపాలించెనో కవి తెలుపలేదు. ఈతడు రాచూరు పాలకుడైయుండును. ఈతడు పోచిరాజు తనయ యగు లక్ష్మమ్మను వివాహము చేసుకొనెను. ఈతనికి పెదవేంకటపతి, చినవేంకటపతియను కుమారులు జన్మించిరి.

పెద వేంకటపతి :

పెదవేంకటపతి రాయలు, కృష్ణకు, సేతువునకు నడుమగల భూమిని పరిపాలించెను. ఈతడు గొబ్బూరి ఓబరాజుకుమార్తెయగు బంగారమ్మను వరించెను. ఈతడు పరిపాలించిన ప్రదేశమేదో కవి నిర్దుష్టముగ తెలుపలేదు.[81]

చిన వేంకటపతి :

చినవేంకటపతి, సుగుణశీలి, పరాక్రమవంతుడు, దానశీలి. ఈతనికి వీర ప్రతాప రాజాధిరాజ రాజపరమేశ్వర అను బిరుదములు గలవు. పెద్ద వేంకటపతికి, సంతానము లేని కారణమున ఈతడు రాజయ్యెను. ఈతడు జిల్లేళ్ళ నారపరాజు కుమార్తెయగు తిరువెంగళాంబను వివాహము చేసికొనెను.

చిన్నవేంకటపతి రాయలొకనాడు విరూపాక్షుని సేవించి మార్గమధ్యమున విశ్రాంతి

80. రామరాజీయము, ప. 311, p. 411.

81. రామరాజీయము, ప. 326, p. 45.

తీసుకొను సమయమున రామభద్రుడాతనికి సాక్షాత్కరించినటులాయెను. గృహంబునకు మరలివచ్చి, హరిని తలంచుకొనుచు నిద్రించెను. అంత ఆతనికి స్వప్నమునందు, దివ్యభూషణములు, దివ్యవస్త్రములు, దివ్య గంధమును దాల్చి కోదండపాణియైన రామభద్రుడు సాక్షాత్కరించెనట. అంత చిన్నవేంకటపతిరాజు, రాముని భక్తితో, స్తుతించెను. కవి యిచట చక్రబంధ, నాగబంధ, గోమూత్రికాబంధ చతుశ్చరణ గర్భకంద, ద్వికందగర్భ క్రౌంచపదవృత్తము, నవగ్రహాష్టదిక్పాలక దశావతార నామగర్భకందము, మొదలగు వృత్తములందు, రాజుచే, రాముని స్తుతింపచేసెను. ఈ ప్రక్రియలు చాలక కవి ఒక దండకమును సహితము రచించెను (ఇది కవికున్న రామభక్తిని తెల్పుచున్నది).

చిన్నవేంకటపతి భక్తికి మెచ్చి రాముడు, నీ పుత్రుడగు వీరవెంకటరాజునకు, నా అంశమున పుత్రుడొకడు జన్మించునని తెల్పి అంతర్ధానమొందెను. అంత చిన్నవేంకటపతి తన స్వప్న వృత్తాంతమును బంధుజనులకు తెలిపెను. ఈతడు చక్రతీర్థమున గల కోదండరామాలయమునకు కనక ప్రాకారములను కట్టించెను.[82]

ఈతనికి తిరువేంగళాంబయందు, తిరుమలరాజు, వేంకటరాజు, శ్రీరంగరాజు అను ముప్వురు పుత్రులుదయించిరి. తిరుమలరాజు, చరణాగత వత్సలుడు, కవిజనాశ్రయుడు.

శ్రీరంగరాజు :

శ్రీరంగరాజు వేటూరునకధిపతి. ఈతడును కవిజనాశ్రయుడు. ఈతడు చక్కనివాడు. గొబ్బూరి వెంగళరాజు కుమార్తె బాపమ్మ, పోచిరాజు వంశీయుడైన వెంగభూనాయకుని పుత్రి రామవమ్మ, పోచిరాజు వేంకటరాజతనయ యగు వెంగలమ్మను వివాహము చేసికొనెను.

**వేంకటపతిరాయలు :**

వేంకటపతిరాయలు (వేంకటరాజు) ఆరవీటి పురమును పరిపాలించెను. ఈతడు నిరతాన్నదాత, దాతృత్వమునందు సాటిలేనివాడు. సోదరులగు తిరుమలరాజు, శ్రీరంగరాజు కొలువ, ప్రజారంజకముగ రాజ్యమును పరిపాలించెను. ఈతని పరిపాలనలో ప్రజలు సర్వసంపదలతో సుఖముగానుండిరి.[83]

ఈతడు యజ్ఞముల నొనరించెను. బ్రాహ్మణులకు భూరిదానముల నొసంగెను. సత్రములను కట్టించెను. కనక గోపురములతో దేవాలయములను నిర్మించెను. ఈతని కీర్తి ప్రతాపములు దశదిశలందు వ్యాపించెను. ఈతడు సూరపరాజు

82. రామరాజీయము, pp. 45–48.

83. రామరాజీయము, ప. 370, p. 51.

కుమార్తె అప్పలాంబను, పోచిరాజ వంశీయుడగు రఘునాథరాజు కుమార్తెలు వెంగమ్మ, కోనేటమ్మలను వివాహము చేసికొనెను. ఈ ముగ్గురియందు అన్నపూర్ణకు సాటియగు అప్పలాంబయనిన వేంకటపతిరాయలకు ప్రీతి. ఈతడు అప్పలాంబవలన రామరాజు, తిమ్మరాజు, వేంకటాద్రిరాజను ముగ్గురు పుత్రులను బడసెను.[84]

తిమ్మరాజు :

తిమ్మరాజు ఆర్వీటి పాలకుడాయెను. ఇతడు తిరుమలరాజను నామమున కూడ వ్యవహరింపబడెను. ఈతడు దాతృత్వమున శిబిచక్రవర్తిని మించెను. ఈతడు పెక్కుమంది రాజులను జయించెను (జయింపబడినరాజులెవ్వరో కవి తెలుపలేదు). ఈతని పరాక్రమము విని శత్రురాజులు భయపడెడివారు. ఇతని పరాక్రమమును కవి అయిదు పద్యములందు ఘనముగా వర్ణించెను.[85]

ఈతడు విరూపాక్షాలయమునకు తూర్పుదిశను గోపురమును కట్టించెను. రామచరిత్రను ద్విపద కావ్యముగ రచించి, దానిని విరూపాక్షునకు అంకితమిచ్చెను. తుంగభద్రాతీరమున ఒక ఉద్యానవనమును వేసి, అందు శ్రీరంగధాముని ప్రతిష్ఠ గావించెను.[86] ఈతడు జిల్లేళ్ల కొండమహీవరుని కుమార్తె కోనేటమ్మను వివాహము చేసికొనెను. ఈమె దానపరురాలు. ఈమె పెక్కుమంది కవులను పోషించెను. కవులచే స్తుతింపబడెను.[87]

తిమ్మరాజు, కోనేటమ్మను కాక పోచిరాజు రామరాజు కుమార్తె తిరువేంగళాంబను వివాహము చేసుకొనెను. తిరుమలరాజునకును కోనేటమ్మకును శ్రీరంగరాజు, చినవేంకటరాజు జన్మించిరి. వీరిరువురిలో శ్రీరంగరాజు,

"ఎలమినిఁదిమ్మరాయ వసుధేశు సిరంగ నృపాల వర్యుఁడు
జ్వాల విజయాతి శౌర్యవరవైభవ వర్ణిత రూప చండదో
ర్బల మహనీయ దానగుణ రాజిత కాంతులఁగేలి సేయునా
బలరిపు పుత్ర సింహసురపాల రతీశబలాబ్ద చంద్రులన్"[88]

అని కవి తెల్పెను.

చినవేంకటపతిరాయలు :

తిమ్మరాయని రెండవపుత్రుడగు చినవేంకటపతిరాయలు మిక్కిలి పరాక్రమ

84. రామరాజీయము, ప. 378, p. 52.
85. రామరాజీయము, ప. 385–389, pp. 53–54.
86. రామరాజీయము, ప. 395, p. 55.
87. రామరాజీయము, ప. 403, p. 56.
88. రామరాజీయము, ప. 407, p. 56.

వంతుడు. ఈతని పరాక్రమమునకు శత్రువులు భయపడి గజములను, అశ్వములను కానుకలుగా నిచ్చి నమస్కరించెడి వారట.[89] ఆర్తత్రాణ పరాయణుడీతడు.

కోదండరామరాజు ;

ఇట్లు పుత్రపౌత్రాదులతో విరాజిల్లు చున్న సోదరుడగు తిమ్మరాజు కొలువగా, కోదండరామరాజు, కర్ణాటకదేశమును పరిపాలించెను. కవి ఈతనిని రాముని అవతారముగా వర్ణించెను.

"జగములు గంపింప సాహస వృత్తిని
వనితకై ధర్మవిధ్వంసి యగుట
పట్టాభిషేక విఫలత నొందియు జటి
వేషియై వనము ప్రవేశమగుట
యపరాధియగు వాని ననిలోన ద్రుంప లే
కర్కతనూజతో డాసపడుట
చెలరేగి మదిని వచింపక మిగులంబు
ణ్యాజనౌమ వంశ సంహారియగుట
పరిహరముగాఁగ ధర్మతత్పరతరాజ్య
మేలియ సహాయ శూరతనెనగి పుణ్య
జనుల రక్షింపగోరి దాశరిధి వేంక
టాధిపేంద్రుని రామరాజై జనించె"[90]

కవి ఈతని గుణగణాదులను, శౌర్య పరాక్రమములను పదునాలుగు పద్యములందు వర్ణించెను.[91] ఈతడు పెక్కు యుద్ధములొనరించి, శత్రువుల జయించెనని తెల్పెనేతప్ప, ఏ ఏ రాజులను ఏ ఏ రాజ్యములను జయించెనో తెలుప లేదు. కాని విజయసీసమాలికయందు, జూటూరు యుద్ధమున శత్రువులను జయించెనని కలదు. ఈ సీసమాలిక యందే, మైసూరు దళవాయి కుమారయ్యతో, కోదండరామరాజు చేసిన యుద్ధమును వర్ణించెను. కోదండరామరాజు, కానరకోట తిమ్మయ్య, నబినీ కృష్ణయ్య, మట్టి వేంకటపతిరాజుల సహాయముతో మైసూరు దళవాయితో యుద్ధము చేసి జయించెను.

ఈతనికి కోసల, సాళ్వ, పాండ్య, ద్రవిడి, చోళ, కళింగ, మగధ రాజ్యములు లోబడియుండెనని తెలియు చున్నది.[92]

89. రామరాజీయము, ప. 410, p. 56.

90. రామరాజీయము, ప. 415, p. 57.

91. రామరాజీయము, ప. 416–429, pp. 57–59.

92. రామరాజీయము, ప. 16, p. 3.

ఈతడు పోచిరాజు కృష్ణరాజు కుమార్తె నాంచారమ్మను, జల్లేళ్ల తిర్మాధరాజపుత్రి వెంకమదేవిని, నూరపరాజ వంశీయుడయిన ఓబరాజు కుమార్తె ఉగ్గమదేవిని, పోచిరాజు అచ్చిరాజపుత్రి రాగమాంబను, జల్లేళ్ల తిరువేంగళనాథుని తనూజలయిన ఉగ్గమాంబా, నాంచారమ్మలను, చోళ వంశీయుడయిన వరదరాజు అప్పలరాజు పుత్రికయయిన తిరువేంగళాంబను వివాహము చేసికొనెను.

ఈతనికి ఉగ్గమదేవివలన పెదవేంకటపతి, నాంచారమ్మవలన చినవేంకటపతి, కోదండమహీపతి; రామదేవివలన వేంకటపతి కల్గిరి.

ఈ కోదండరామరాజే రామరాజీయ గ్రంథకృతిభర్త. కోదండరామరాజు కుమారుడయిన పెదవేంకటపతి పరాక్రమవంతుడు గుణవంతుడు. కోదండ రామరాజు తరువాత ఈతడు రాజ్యమునకు వచ్చెను. ఈతడు సంగీతసాహిత్యాది విద్యలయందు భోజునంతటివాడు. ఈతడు పోచిరాజు చినవేంకటరాజ పుత్రియగు కోనమాంబను వివాహము చేసికొనెను. కవి ఈమెను మిక్కిలి గుణవంతురాలిగ వర్ణించెను. మిక్కిలి వినయము గలది. ఈమె అత్తమామలను భక్తితో సేవించి, తోటికోడండ్రతో, మరదులతో, మరదండ్రతో మిక్కిలి స్నేహముతో ప్రేమతోమెలగి, పుట్టినింటికి మెట్టినింటికి కీర్తితెచ్చెను.[93] కోదండరామరాజు జ్యేష్ఠపుత్రుడయిన పెదవేంకటపతి పరాక్రమమును తెలుపు—

"ఆలములోన రామమనుజాధిపుమా పెదవేంకటావనీ
పాలుడు శత్రులంద్రును మ్రుబల్వీర దద్రుధిర ప్రవాహముల్
చాలగ వార్ధినించెనటు చాలునె భార్గవరాము సాహసా
భీలత యెంత దొడ్డయని పేర్కొన నేను మదుంగులే కదా"[94]

అను ఈ పద్యముతో ఈ గ్రంథము అంతమగుచున్నది. ఈ గ్రంథము నందు ఆశ్వాస విభజనగాని, ఆశ్వాసాంత పద్యములు గాని లేవు. అన్ని ఆంధ్ర గ్రంథములవలె చివర సంపూర్ణమనిగాని, సమాప్తమనిగాని లేకపోవుటచే ఇందు కొంత భాగము పోయియుండునను భావమున కాస్కారమగుచున్నది.

రామరాజీయము లేక నరపతి విజయము, ఆరవీటి రాజుల వంశచరిత్ర తెలియచేయు పద్యరూపమునగల (Chronicle) చారిత్రక పట్టిక. సమగ్రముగ కాకపోయినప్పటికిని, ఈ గ్రంథమున పదిహేడవ శతాబ్దమువరకు (1630 ప్రాంతము) గల ఆరవీటి రాజులందరి విషయములు గలవు. ఈ గ్రంథము చరిత్ర కారులకు మిక్కిలి ఉపయోగపడును. కొందరు చరిత్రకారులు ఈ గ్రంథమునందలి విషయములను గ్రహించియే ఆరవీటి వంశచరిత్రమును, విజయనగర చరిత్రమును, అళియ రామరాయల చరిత్రను వ్రాసిరి.[95] ప్రామాణికమగు చారిత్రకాంశము

93. రామరాజీయము, ప. 457, pp. 64–65.

94. రామరాజీయము, ప. 460, p. 65.

95. చిలుకూరి వీరభద్రరావుగారు, Henry Heras వ్రాసిన రచనలు ఇట్టివే.

లీ గ్రంథమున గలవనుటలో విప్రతిపత్తి లేదు.

ఆరవీటి పాలకులందరును వీరాధివీరులు, శౌర్యప్రతాపవంతులు, శత్రు భయంకరులు, దానశీలురు. బుక్కరాజువంటి కొందరు అష్టాదశవిద్యాప్రవీణులు. ఇంచుమించందరును విష్ణుభక్తులు. ఆరవీటి పాలకులలో కొందరు యజ్ఞములను చేసిరి. కొందరు దానములు చేసిరి. కొందరు కవులను పోషించిరి. కాని అందరూ యుద్ధనిపుణులే, రణరంగ ధీరులే.

ఈ గ్రంథమువలన రాజకీయ విషయములు తప్ప, మత, సాంఘిక, ఆర్థిక విషయములేవియు తెలియుటలేదు. గ్రంథమంతయు ఆరవీటి వంశావళి, ఆ వంశీయులు గావించిన యుద్ధములతో జయాపజయములతో కూడియున్నది. ఇది కావ్యదృష్టితో వ్రాయబడలేదు. శృంగార వర్ణనలుగాని, కావ్యములందుండు మరియెట్టి యితర వర్ణనములుగాని ఇందులేవు.

రచనా విశేషములు :

ఒక ప్రభువంశమును దృష్టియందుంచుకొని వారి ఘనకార్యములను, గుణ శీలములను, జయాపజయములను వర్ణించు కావ్యమగుటచే కవి, వర్ణనాదులకు ప్రాముఖ్యము నిచ్చినటుల లేదు. ఇందలి కవిత్వము రమ్యముగ నున్నది. ఈ కవి చిత్రకవిత్వమునందు, గర్భకవిత్వమునందు, బంధకవిత్వమునందు పద్యములు రచించి తన నేర్పును చూపెను. చిత్రకవిత్వమున నవగ్రహాష్టకము, దిక్పాలక దశావతారనామ గర్భకందము, గర్భకవిత్వమున ద్వికందగర్భక్రౌంచపదవృత్తమును, బంధకవిత్వమున చక్రబంధ, నాగబంధ, గోమూత్రికా బంధములను వ్రాసెను. ఒక దండకము సహితము వ్రాసెను.

ఈ గ్రంథమునందు వీరరసము రమ్యముగ పోషింపబడినది. వీరులను వారి వీరకార్యములను వర్ణించునపుడు చక్కని పదముల కూర్పుతో అందముగ రచింప బడినది. ఈ గ్రంథావతారికను గూర్చి ఒకమాట చెప్పవలయును. గ్రంథమునకు పీఠిక వ్రాసిన Gustov Oppert అళియ రామరాయల ఆస్థానకవియైన వెంకయ్య క్రీ.శ. 16 వ శతాబ్దపు ఉత్తరార్ధమున రామరాజీయమును వ్రాసినట్లు పీఠికనందు వ్రాసిరి.[96] ఈ విషయమున ఈయన పొరపాటు పడిరి. శ్రీకృష్ణదేవరాయల అల్లుడు అళియ రామరాయలు. రామరాజీయ కృతిపతి కోదండరామరాజు. అందుగుల వెంకయ్య ఈ కోదండరామరాజాస్థానకవి. కృతిపతి అళియ రామరాయలు కాక

96. "The Ramarajiyamu was composed at the beginning of the second half of the 16th Century by Surayya's son Venkayya, the court poet of Kodandaramaraja. This prince better known as Ramaraja and son-in-law of the famous king Krishnaraja was like his father-in-law a great patron of Telugu Literature." face. Ramarajiyamu.

కోదండరామరాజను అంశము కవి ఇష్టదేవతాస్తుతి చేయు సందర్భమున వ్రాసిన

"శ్రీరామామణి నిస్తులస్తనయుగ శ్రీగంధపంకాంకవి
స్తారోరస్స్థలు డార్తరక్షణ చమత్కార ప్రచారుండు స
త్కారుణ్యాంబుధి యౌరమాపతి కృతార్థత్వ ప్రభావంబుచే
కూరంజేయుచు బ్రోచు గాత గృపచే గోదండరామాధిపున్"[97]

అను పద్యమువలన స్పష్టమగుచున్నది.

ఇదియేకాక "Venkataraja had three sons named Kodanda Ramaraja or briefly Ramaraja, Timmaraja and Venkataraja, the eldest son of whom Kodandaramaraja became the son-in-law of the famous Krishnaraja of Vijayanagar."

"This Kodandaramaraja the son-in-law of King Krisnaraja fell as has already been mentioned previously in the battle Talikota, but Venkayya closes his Ramarajiyamu previously to this event."

అని Gustov Oppert వ్రాసెను. ఈయన ఈ గ్రంథాంశ విషయమున ఇంతగా పొరపాటు పడుటకు కారణమేమియో తెలియుటలేదు. బహుశ ఈయనకు తెలుగురాక ఎవరిచేతనో చదివించి వినుట వలననో, లేక ఎవరయిన ఇతనికి బోధ పరచినపుడు అళియరామరాయలను, కోదండరామరాజును ఒకరిగనే చెప్పుటచేతనో యిట్టిపొరపాటు జరిగినదనిపించుచున్నది.

ఈ గ్రంథమీతడు చెప్పినటుల తాళికోట యుద్ధమునకు ముందు ముగియ లేదు. తాళికోట యుద్ధముతరువాత, అరువది అయిదు సంవత్సరముల చరిత్రను తెలుపుచున్నది. క్రీ.శ. 1565 సంవత్సరమున జరిగిన తాళికోట యుద్ధవివరములు గాని, రామరాయల మరణముగాని కవి పేర్కొనలేదు. రామరాజు పెక్కు యుద్ధములు చేసి శత్రువులను జయించెననియే వ్రాసెను కాని సమగ్రముగ ప్రతి అంశమును తెలుపలేదు. అదియునుకాక, ఈ ఆరవీటి వంశమునందు పెక్కు మంది రామరాజులు, తిరుమలరాజులు, శ్రీరంగరాజులు, వేంకటపతిరాజులు కలరు. తాత, తండ్రుల నామములు, పిల్లలకు పెట్టు ఆచారమెక్కువగా ఈ వంశీయుల కున్నటుల విశదమగుచున్నది. ఇందువలన కూడ భ్రమపడుటకవకాశమున్నది.

అళియరామరాయల మనుమని, మనుమని వరకు గల ఈ గ్రంథమును, తాళికోట యుద్ధమునకు పూర్వమే కవి ముగించెనని వ్రాయుట, అళియరామరాయలను, కోదండరామరాజుగను, అళియరామరాయల మామగారగు విజయనగర ప్రభువయిన శ్రీకృష్ణదేవరాయలను, కోదండరామరాజు మామయగు పోచిరాజు కృష్ణరాజుగను భ్రమపడుట అసమంజసముగ నున్నది.

97. రామరాజీయము, ప. 1.

గ్రంథ పరిష్కర్తలే యిట్టిపొరపాటులు చేయుట, వారికి సహాయపడిన కొక్కొండ వేంకటరత్నము పంతులుగారుగాని, డి. రామయ్య పంతులుగారుగాని, దీనిని సరిదిద్దకపోవుట, శోచనీయముగ నున్నది. ఇట్టి వ్రాతలు గ్రంథమంతయు చదువక (prefaces) గ్రంథావతారికలను చదివి, గ్రంథాంశములను తెలిసికొను పాఠకులకు అసత్య విషయములనే తెలియజేయును.

రామరాజీయమున ప్రసిద్ధులైన పెక్కుమంది రాజులకు సంబంధించిన బిరుదగద్యములు కలవు. ప్రభువుల పరిపాలనాకాలమున వారి వివిధములగు చర్యలను కీర్తించునవి బిరుదగద్యములు. వందిమాగద వైతాళికులచే కీర్తింపబడునవి. ఈ భట్రాజులు తమ ప్రభువులను కీర్తించునపుడు తత్పూర్వపు రాజుల బిరుదములు కొన్ని చేర్చుట జరిగినది. కనుకనే బిరుద గద్యములందు వర్ణితమైన ఘనకార్యములను చేసిన వారెవ్వరో గ్రహించుట కష్టమగును. కాని ఇవి రాజుల వంశ చరిత్రను తెలునుకొనుటకును పనికివచ్చును.

అరవీటి వంశమునందలి రాజుల చరిత్రను వర్ణించిన రామరాజీయము చరిత్రకారులకత్యంతోపయుక్తమగు గ్రంథము. అందుగుల వెంకయ్య గావించిన వంశప్రశస్తి సత్యమేయని పెక్కు అధారముల వలన తెలియుచున్నది.

ఒక ప్రభువంశమును దృష్టిలోనుంచుకొని ఆయా ప్రభువులకు సంబంధించిన బిరుదావళులను నడుమనడుమ చేర్చుచు వారివారి గుణశీలాదులను, ఘనకార్యములను, పరిపాలనా దక్షతను, యుద్ధవిజయములను అలంకారిక శైలిలో పద్యరూపమున ప్రశంసించు గ్రంథము రామరాజీయము. రామరాజీయమునకు నరపతి విజయమను మరియొక నామముగలదు. అరవీటి రాజులకు పదాతిసైన్యమెక్కువ ఉండుటచే నరపతులని పేరుగలదు. కనుక కవి ఈ గ్రంథమునకు నరపతి విజయమని పేరిడినట్లున్నది.

# 9. తంజాపురాంధ్ర నాయక రాజులు

విజయనగర సామ్రాజ్యము అత్యున్నతస్థితియందున్నపుడు దక్షిణదేశమున రెండుసామంత రాజ్యములు స్థాపింపబడెను. అందొకటి తంజాపురము, రెండవది మధుర. ఈ రెండును తమిళ దేశమునందుండినప్పటికి విజయనగర రాజ్యమునకు సామంతరాజ్యములగుటచే, వీనిని పరిపాలించుటకు ఆంధ్రనాయకులు నియమింపబడిరి. ఈ నాయకులతోపాటు పెక్కుమంది తెలుగువారు, అన్నికులముల వారు ఈ దేశములకుపోయి అచ్చట స్థిరనివాసముల నేర్పరచుకొనిరి. విజయనగరాధీశ్వరులచే నియమింపబడిన ఈ సామంతరాజులు ఆంధ్రకవులను పోషించిరి. సంగీత నాట్యాది లలితకళలను ఆదరించిరి.

తంజాపురము ప్రాచీన చోళమండలమునకు రాజధాని. కృష్ణరాయల మరణానంతరము అచ్యుతరాయని కాలమున చోళరాజ్యమున అరాచకము ప్రబలుటచే శాంతినెలకొల్పుటకొక సమర్థుడైన నాయకుని అవసరము కల్గెను. అచ్యుతరాయలకడ సామాన్యదండనాయకునిగనున్న చెవ్వప్పనాయకుని అచ్యుతరాయలు క్రీ.శ.1532లో తంజాపురమునకు రాజును గావించెను. చెవ్వప్పనాయకుడు విజయనగర ప్రభువుల కడ అడపము నాయకుడైనప్పటికి అచ్యుతరాయల దేవేరులలో నొకతెయైన తిరుమలాంబయొక్క సోదరియగు మూర్తెమ్మను ప్రేమించి వివాహము చేసుకొనుట వలన, చెల్లెలి భర్తకు పదవినిప్పింపగోరి తిరుమలాంబ భర్తనుకోరగా, అచ్యుతదేవ రాయలు, అరాచకస్థితిలోనున్న చోళ రాజ్యమందలి తంజాపురమునకు చెవ్వప్పనాయకుని ప్రభువుగ నియమించెను. చెవ్వప్ప క్రీ.శ. 1580 వరకు తంజాపురమును మిక్కిలి శాంతియుతముగ పరిపాలించెను. ఇతని తరువాత ఈతని కుమారుడు అచ్యుతప్పనాయకుడు క్రీ. శ. 1580–1600 మధ్యకాలమున రాజ్యముచేసెను. ఆ తరువాత అచ్యుతప్పకుమారుడగు రఘునాథనాయకుడు క్రీ. శ. 1631 వరకు రాజ్యమేలెను. క్రీ.శ. 1633 లో రఘునాథనాయకుని పుత్రుడు విజయరాఘవుడు రాజై క్రీ. శ. 1673 వరకు పాలించెను. ఈతని కుమారుడగు మన్నారుదాసు యుద్ధమున మరణించుటచేత, ఈతని మనుమడగు చెంగమలదాసు రాజై క్రీ.శ. 1674 నుండి సంవత్సరకాలము మాత్రమే పాలించెను. తరువాత తంజాపుర నాయక రాజ్యము అంతరించెను.

నాయకరాజులందరును కవిపండిత పోషకులు. సంగీత నాట్యాది కళాపోషకులు. వీరిలో రఘునాథ విజయ రాఘవనాయక మన్నారుదాసులు, కవులు సంగీత నాట్యాది కళాకోవిదులు. భువనవిజయ సభామంటపమున శ్రీకృష్ణదేవరాయలు కవితాగోష్ఠులను నెరపినట్లు వీరు ఇందిరామందిరమున కవితాగోష్ఠులను నెరపెడివారు. కవులనే కాక కవయిత్రులను పోషించి వారికి కనకాభిషేకమును గావించిన ఘన గౌరవము, నాటక ప్రక్రియయైన యక్షగాన వాఙ్మయమును ఉద్ధరించిన ఘనత వీరికే దక్కినది. వీరి ఆస్థానమునందలి పెక్కుమంది కవులు కవయిత్రులు అష్టభాషా ప్రావీణ్యముగలవారు.

వీరు సంపూర్ణముగ వైష్ణవ మతానుయాయులు. వీరి గురువు తాతాచార్యులు. అయినను వీరందరును పరమత సహిష్ణువులు. చెవ్వప్ప నాయకుడు క్రీ.శ. 1560 సంవత్సరమున పోర్చుగీసు క్రైస్తవ పాదరీలకు తంజాపురమున చర్చిని, గృహములను నిర్మించుకొనుటకు అనుమతినిచ్చెను.

తమిళ దేశమును పరిపాలించిన ఈ నాయక రాజుల ఆంధ్ర భాషాభిమానము మెచ్చతగ్గది. భువనవిజయ సభా మంటపమును అలరించిన కవితా సరస్వతి తంజాపుర ఇందిరా మందిరమునకు తరలిపోయి ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున ఒక ప్రత్యేక యుగము నేర్పరచినది.

వీరి రాజకీయ చతురత, భాషాపోషణము, కవి పండిత గాయక సమాదరణము ఎన్నదగ్గవి. వీరులు, రాజకీయ చతురులు, కవిజనాశ్రయులునైన నాయక రాజులలో ఘనులు రఘునాథ నాయక విజయ రాఘవ నాయకులు. రఘునాథ నాయకుడు నాయకరాజ శిరోమణి. దక్షిణ దేశ సారస్వత చరిత్రలో శ్రీకృష్ణదేవ రాయల తరువాత ప్రసిద్ధుడు. రఘునాధుని తనయుడైన విజయ రాఘవుడు తండ్రికి దీటువచ్చు పుత్రుడు.

ఈ ప్రకరణమున వీరిరువురి జీవితాంశములు చర్చనీయాంశములు. రఘునాథ నాయకాభ్యుదయ, రఘునాథాభ్యుదయ ద్విపద యక్షగానములు, రఘునాధుని దినచర్యలను, అభిరుచులను, అనుభవములను, కవితాగోష్టులను, సంప్రదాయములను, యుద్ధాది విశేషములను, తంజాపుర వర్ణనమును, సాంఘిక వాతావరణమును ప్రతిఫలింపచేయు గ్రంథములు. వీని గ్రంథకర్త విజయరాఘవ నాయకుడు.

రంగాజమ్మ రచించిన 'మన్నారుదాసవిలాస' ప్రబంధ యక్షగానములు, కోనేటి దీక్షిత చంద్రుడు రచించిన 'విజయ రాఘవ కల్యాణము' కామరుసు వేంకటపతి సోమయాజి రచించిన 'విజయ రాఘవ చంద్రికా విహారము' విజయ రాఘవ నాయకుని జన్మ వృత్తాంతమును, దినచర్యను, రాజ వ్యవహారములను, రాజచంద్రుని పుత్రియైన కాంతిమతిని, మదన మంజరియను మరియొక రాజకుమార్తెను, లీలావతి యను వేశ్యను వివాహము చేసికొనిన అంశములను వివరించు గ్రంథములు.

## తంజాపురాంధ్రనాయక రాజవంశ వృక్షము

తిమ్మనాయకుడు — బయ్యాంబిక




## రఘునాధనాయకాభ్యుదయ, రఘునాధాభ్యుదయములు
## విజయరాఘవనాయకుడు

**విజయరాఘవనాయకుడు :**

ఈతడు రఘునాథాభ్యుదయము, రఘునాధనాయకాభ్యుదయము అను చారిత్రక కావ్యములను వ్రాసెను. తంజాపురము నేలిన నాయకరాజులలో నాలుగవ వాడు. రఘునాధనాయకుని పుత్రుడు. క్రీ.శ. **1633** నుండి **1673** వరకు తన తండ్రి తరువాత తంజాపురమును పరిపాలించెను. ఈతనికి అత్యుత విజయరాఘవ నాయకుడు, మన్నారు దాసను పేర్లును గలవు. ఈతడు వైష్ణవుడు.

విజయరాఘవ నాయకునకు అన్నలున్నట్లు, వారి నామములు అచ్యుతుడని, రామభద్రుడని తెలియుచున్నది.[1] పెద్దవారగు అచ్యుతరామభద్రులుండగా విజయ

1. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్రనాయక రాజచరిత్రము, p. 263.

రాఘవనాయకునకు రాజ్యమెట్లువచ్చెనో ఆ విషయములు స్పష్టముగ తెలియు ఆధారములు లేవు. రామభద్రుడున్నటుల మాత్రము సమకాలీన సాహిత్యమునందు ఆధారములు కలవు.[2] విజయరాఘవునకు రామభద్రుడు కాక మరియొక సోదరుడు కలడనియు, వీరిరువురకు కళ్లుపీకించి, వల్లందుర్గమునందు బందీలుగ విజయ రాఘవు డుంచెననియు, నాయకరాజుల దైవమయిన మన్నారుదేవుని వరమువలన విజయరాఘవుడు, రఘునాథునకు, కళావతికి జన్మించెననియు పలురకములయిన కథలు గలవు.[3]

ఈయన ప్రవర్తన విషయమున కూడ "The Nayakas of Tanjore" "తంజావురాంధ్ర నాయకరాజ చరిత్రము" పలురకములయిన అభిప్రాయములను వెలిబుచ్చెను.

రాజకీయ విషయములెటుల ఉన్నప్పటికిని ఈ విజయరాఘవనాయకుడు సాహిత్యమునందు మాత్రము, రఘునాథనాయకుని కుమారుడనిపించుకొనెను. రాజ్యాధికారముననే కాక కవిత్వమున కూడ వారసుడాయెను. ఈతడు కవి, కవి పండిత పోషకుడు. తంజావురాంధ్ర నాయకరాజుల సాహిత్యప్రక్రియయందు ప్రత్యేకముగ చెప్పదగినది యక్షగానము. వీరి కాలమున యక్షగానములు విరివిగ వచ్చినవి. ముఖ్యముగ విజయరాఘవుని రచనలయందు యక్షగానములు ఎక్కువగ కన్పడుచున్నవి.

ఈతడు పెక్కు గ్రంథములను రచించెను.

"శ్రీలొంద రాజగోపాల విలాస నా
టకము సందర్భించు సుకవి వంద్య
మధురోక్తులను జంగమవల్లి పరిణయం
బానతిచ్చిన ప్రతిభానిధాన
కోవిదుల్ గొనియాడ గోవర్ధనోద్ధర
ణము రచించిన కల్పనాధురీణ
రతిమన్మథ విలాస కృతి లాజమొనరించి
పరగు ప్రాబంధిక పట్టభద్ర
భువిని రాసక్రీడ నవనీతచోరంబు
హవణించి వెలయు మహానుభావ
చాతురిచే బారిజాతాపహరణంబు
రచన చేసిన మృదువచనధుర్య
మనమైన రుక్మిణీ కల్యాణమను కృతి
నిర్వహించిన బుధసార్వభౌమ

2. V. Vridhagirisan, Nayakas of Tanjore, p. 127.
3. V. Vridhagirisan, Nayakas of Tanjore, pp. 127 – 129.

వరుస రాధామాధవ వివాదము మనాభి
రామంబొనర్చు సర్వజ్ఞతిలక
పాండిత్యమున సత్యభామావివాహ వ
ర్ణన మొనర్చిన కవి రాజరాజ
ప్రాజ్ఞులౌనన నుషాపరిణయ నాటకం
బమరజేసిన శారదావతార
దక్షిణ ద్వారకాస్థల వర్ణనాభాగ
ముద్ధరించిన సుప్రసిద్ధ చరిత
మహిమచే గాళియమర్ధనంబొనరించు
సరిలేని రాజుల చక్రవర్తి
ధర రఘునాథాభ్యుదయము నాటకముగా
ద్విపదగా రచియించు ధీరవర్య
అలమోహినీ విలాసాఖ్య ద్విపద కృతి
నాటకం బొనరించు నలసమాన
అతి పవిత్రంబు ప్రహ్లాద చరిత్రంబు
నపరించు ఘనమనీషాధురీణ
హరువున పూతనాహరణంబనెడు నాట
కం బొనరించు శృంగారలోల
తగు మంజరీ ద్విపద ప్రబంధము నాట
కంబుగా హవణించు గాన చతుర
విప్రనారాయణ విద్వత్కథా నంవి
ధానమొనర్చిన ధీనిధాన
బుధులు మెచ్చ సముద్రమధన నాటకరాజ
మొనరించు భువన మోహనచరిత్ర
లలితమౌ కృష్ణవిలాస నాటకమణి
నల్పిన యష్టభాషాధురీణ
ఘనతరంబగు పాదుకాసహస్రంబెల్ల
ద్విపదజేయు కళావతీ తనూజ
రసికులు ప్రస్తుతింప ప్రణయ కలహమును
కృతి యొనర్చిన చమత్కృతి ధురీణ
యతులిత ప్రౌఢిచే నలకంఠ విజయంబు
ఘటియించు భువనవిఖ్యాత శీల
ఘనమైన జానకి కల్యాణనాటకం
బమరించు వావదూకాగ్రగణ్య.

నవపుణ్యక వ్రతనాటకవైఖరి
సేకరించిన వాగ్విశేష శేష
కేళిమై గోపికాగీతలు భ్రమర గీ
తలు తెనిగించు సద్యతన భాజ
సరిలేని ఫాల్గుణోత్సవ మెల్లరగడ చౌ
పదములొనర్చిన భవ్యచరిత
ధర రాజగోపాల దండక సందర్భ
వైదర్భిఁగన్న విద్వత్కవీంద్ర
సారమౌ వీరశృంగార సాంగత్యంబు
మెఱయించు రసికుల మేలుబంతి
సంపంగిమన్నారు సాంగత్యము నమర్చి
జగతికిచ్చిన నెరజాణ రాయ
గోపాలునకు వేడుకోలు విన్నపములు
దరువులొనర్చు నౌదార్యధుర్య
యేలలు విడిపదాల్ హెచ్చు సంకీర్తన
లాధ్యాత్మలొనరించు నతుల చర్య"[4]

పైనపేర్కొనబడిన గ్రంథములను రచించినట్లు విజయరామవుడు ప్రహ్లాద చరిత్రము నందు చెప్పుకొనెను. ఇందు నాటకములు (యక్షగానములు) ద్విపదలు, గద్యములు, పద్యములు, గోపికా గీతములు, భ్రమర గీతములు, విన్నపములు, రగడలు, పదములు మొదలగు ప్రక్రియలు గలవు. ఇందు చాల గ్రంథములు నేడలభ్యములు. కాళియమర్దనము, ప్రహ్లాదచరిత్రము, విప్రనారాయణ చరిత్రము, పూతనా హరణము, రఘునాధనాయ కాభ్యుదయ ద్విపద, రఘునాధాభ్యుదయ యక్షగానము నేడు లభించు గ్రంథములు.

రఘునాధనాయ కాభ్యుదయ, రఘునాధాభ్యుదయ ద్విపద యక్షగానములు రెండు రఘునాధనాయకుని ఒకనాటి దినచర్యగా రచింపబడినవి. దినచర్యను వివరించుచు కవి తంజాపుర వర్ణనము, ఆనాటి సాంఘికాచారవ్యవహారములు, రాజ వంశీయుల అలవాట్లు, ఆచారములు, వారి వస్త్రధారణాలంకారాది వివరములు, రాజుల భోజనపదార్థముల వర్ణన, వారి పరిపాలనా విధానము, నాయకరాజుల వంశక్రమము, కవిపండిత పోషణము మొదలగు అంశములను వివరించెను.

విజయరామవనాయకుడు ఒకనాడు అరుణోదయ సమయమున తనకు స్వప్నమున మన్నారుదేవుడు సతీసమేతముగ ప్రత్యక్షమై రఘునాథనాయకుడు

4. విజయరాఘవనాయకుడు, ప్రహ్లాద చరిత్ర.

తనయొక్క అవతారమేయని తెల్పి ఆతని చరిత్రను ద్విపదగా వ్రాసి తన కంకిత మిమ్మని చెప్పెననియు, తాను గురువైన తాతాచార్యులతో ఈ విషయమును తెలుపగా, ఆతడు మిక్కిలి సంతోషించి 'నీ తండ్రి మన్నారుదేవుని అవతారమే' యని తెల్పి కావ్యము వ్రాయ ప్రోత్సహింపతాను ఈ కావ్యమును వ్రాసితినని తెలిపెను.

స్వప్నమున దైవము సాక్షాత్కరించి గ్రంథరచన చేయ ప్రోత్సహించు అంశమునకు శ్రీకారము చుట్టినవాడు తిక్కన. ఏ ముహూర్తమున తిక్కన ఆ స్వప్నమును కనెనో కాని తరువాత తరతరములుగ స్వప్నసాక్షాత్కార కథ సాహిత్య సంప్రదాయమై నిలచినది. తిక్కన ఇట్టి సంఘటనమును సృష్టించుటకు కారణమున్నది. అది ఆనాటి సంఘమునగల శైవ వైష్ణవ మతకలహములు. కాని తరువాత కవులకిది పరిపాటియైనది. కలలు కవులను వెంబడించుట, కవులు రచనలు చేయుట సాగుచునే యున్నది. విజయరాఘవుడును కలగనెను.

## చరిత్ర — రఘునాథనాయకాభ్యుదయ, రఘునాథాభ్యుదయములు

### తంజాపురము :

భరత ఖండమున అయోధ్యపురివలె చోళమండలమున తంజాపురము కావేరీ తీరమున వెలసినది.[5] సోమసూర్యవాస్తు సిద్ధాంతము ననుసరించి ఈ పురమునందలి గృహ, సౌధ, మందిరములు, పురవీథులు నిర్మింపబడినవి. ఈ నగరమున రామభద్రశాల (రామచంద్రుని చిత్ర పటమున్న శాల. ఇది రామాలయము వంటిదై యుండును). రాజులు, దొరలు, రాణులు మొదలగు రాజపరివారముండు లక్ష్మీవిలాసభవనము, పున్నాగతరువులతో అలరారు చలువ రాతితో నిర్మించిన అచ్యుతరంగ కూటము, మన్నారుదేవుడున్న మదనగోపాల విలాస మందిరము, చలువరాళ్లతో నీలములుతాపి బంగారపు చెక్కడపు పనులతో రెండవ పుష్పక విమానమువలె నుండి పట్టాభిరాముని చిత్రపటముతో నున్న శ్రీరామ సౌధము, చంద్రకాంత శిలలతో నిర్మించి, కెంపులు, పచ్చలు, ముత్యములు, పగడములు, వైడూర్యములతో తాపడము చేసిన ఇందిరామందిరము, విజయరాఘవ విలాసము, దేవలోకమును పోలు విలాస గృహము, గరిడి కూటము, నవరత్న ఖచితమైన నాటక శాల, పెద్దకరణములు వ్రాసుకొను విశాలమగు శాల విరాజిల్లు చున్నవి.[6]

ఇందిరామందిరమున రఘునాథనాయకుని విజయ పరంపరలను చిత్రములుగ రచించి అలంకరించిరి. ఇందు రఘునాథుడు చోళగుని గెలచిన

5. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర. ఆ. p. 14.
6. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర. ఆ. pp. 14–19.

వివరము, నేపాళ భూపాలునకు రాజ్యమిప్పించిన వైనము, పాండ్య తుండీర పతుల జయించిన విషయము, రామదేవరాయలను సింహాసనమున నిల్పిన వివరములు చిత్రములుగ వ్రాసి అలంకరించిరి.[7]

కులగురువగు తాతాచార్యులు విజయరాఘవనాయకునకు తెలిపిన
నాయకరాజుల వంశవృక్షము

కృష్ణభూవరుడు
|
తిమ్మభూపాలుడు — బయ్యాంబిక
|
పెదచెవ్వ భూపాలుడు | పినచెవ్వభూపాలుడు మూర్తిమాంబ | పెదమల్ల భూపాలుడు | పినమల్ల భూపాలుడు

పినచెవ్వభూపాలుడు మూర్తిమాంబ
|
అచ్యుతేంద్రుడు
|
రఘునాథనాయకుడు
కళావతి
|
విజయరాఘవనాయకుడు

నాయకరాజుల వంశ క్రమమును గూర్చి పలురకములైన అభిప్రాయములు కనపడు చున్నవి. విజయరాఘవుడు వంశ వృక్షము నొక విధముగ తెల్పి, గ్రంథమున మరియొక విధముగ వర్ణించెను. గ్రంథాంశములవలన రఘునాథునకు, అచ్యుతనాయకుడను సోదరుడు; విజయరాఘవునకు అచ్యుతరామభద్రులను సోదరులు ఉన్నటుల తెలియుచున్నది. సమకాలీన రచయితలు సహితము నాయకరాజుల వంశ చరిత్రమును వివరముగ తెలుప లేదు.

## నాయక రాజవంశ వివరణము

నాయక రాజులలో కీర్తిని గాంచిన వారిలో కృష్ణభూవరుడొకడు. తంజాపురమును పరిపాలించిన ఆంధ్రనాయక రాజవంశమునకు మూలపురుషుడితడు. ఇతని పుత్రుడు తిమ్మభూపాలుడు. ఇతడు బయ్యాంబిక అనునామెను వివాహము చేసికొనెను. వీరిరువురకు పెదచెవ్వ భూపాలుడు, పినచెవ్వ భూపాలుడు, పెదమల్ల భూపాలుడు, పినమల్ల భూపాలుడు అను నలువురు పుత్రులుదయించిరి. వీరిలో

7. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర. ఆ., p. 19.

ద్వితీయుడగు పినచెవ్వ భూపాలుడు తంజాపురమునకు రాజయ్యెను. ఈతడే తంజాపురమును పరిపాలించిన ప్రథమనాయకరాజు. ఈతని విషయమున కొన్ని అభిప్రాయ భేదములు కన్పించుచున్నవి.

ఈతడు మొదట సామాన్య దండనాయకుడు. విజయనగర ప్రభువగు అచ్యుతరాయల భార్యయగు వరదాంబికకు, మూర్తిమాంబయను సోదరిగలదు. ఆమెను పినచెవ్వనాయకున కిచ్చి వివాహము చేసి, అచ్యుతరాయలు మూర్తి మాంబకు స్త్రీ ధనముగా తంజాపుర రాజ్యమునిచ్చి, పినచెవ్వనాయకుని ఆ రాజ్యమునకు రాజుగా నియమించెను.[8]

పినచెవ్వ నాయకుడు, అచ్యుత రాయలకడ తాంబూల కరండ వాహకునిగా నుండెననియు, అతనిని అచ్యుతరాయల యొక్క మరదలగు మూర్తిమాంబ ప్రేమించెనని వారిరువురకు వివాహమొనర్చి అచ్యుతరాయలు తంజాపుర రాజ్యము నొసంగెననియు మరియొక అభిప్రాయము గలదు.[9] కాని యిది సరియగు అభిప్రాయము కాదనియు, నమ్మతగ్గ విషయము కాదనియు వృద్ధగిరీశంగారే తెల్పిరి.[10]

పినచెవ్వ నాయకునకు చెవ్వప్పనాయకుడను మరియొక నామము గలదు. ఈతని తంజాపుర రాజ్య స్థాపనముగూర్చి చరిత్రకారులలో అభిప్రాయభేదములున్నవి. Heras క్రీ.శ. 1541 అని, కురుగంటి సీతారామయ్యగారు క్రీ.శ. 1535 అని, కుప్పుస్వామి శాస్త్రిగారు క్రీ.శ. 1549 అని, తంజావూరు గెజెట్‌లలో క్రీ.శ. 1544 అని పలురకములైన అభిప్రాయములు కనపడుచున్నవి. ఈతని రాజ్యారంభమును గూర్చి రఘునాథ, విజయరామవులుగాని, వారి ఆస్థానకవులుగాని, కవయిత్రులు గాని తెలుపలేదు. అచ్యుదేవమహారాయల కాలమునాటి కొన్ని శాసనములవలన నాయకరాజ్య స్థాపన క్రీ.శ. 1542 తరువాతనే జరిగియుండుననుటకు హేతువులు కలవని, రఘునాథ నాయకాభ్యుదయ రఘునాథాభ్యుదయముల పీఠిక యందు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెల్పిరి.[11] చెవ్వప్ప క్రీ.శ. 1580 వరకు రాజ్యము చేసెను. ఈతడు మూర్తిమాంబయందు అచ్యుతప్పనాయకుని గనెను.

అచ్యుతప్ప నాయకుడు క్రీ.శ. 1580 లో రాజ్యమునకు వచ్చెను. కాని ఈతడు అంతకు ముందునుండి తండ్రికి చేదోడువాదోడుగ రాజకార్యములందు పాల్గొను చుండెను. క్రీ.శ. 1563 నుండి ఈతని శాసనములు కనపడుచున్నవి. ఈతడు శ్రీరంగ దేవాలయమునకు బంగారు సజ్జలు నిర్మించెను. ప్రాకరమును నిర్మించి స్వామికి కిరీటమును సమర్పించెను. శృంగారవనముల వేయించెను.[12] ఈతనికి

8. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్ర నాయకరాజు చరిత్రము, p. 75.
9. V. Vridhagirisan, Nayaks of Tanjore, p. 10.
10. V. Vridhagirisan, Nayaks of Tanjore, p. 10.
11. రఘునాథ నాయకాభ్యుదయ. రఘునాథాభ్యుదయములు, పీఠిక, pp. 14 – 23.
12. రఘునాథ నాయకాభ్యుదయము, ప్ర.ఆ., p. 10, రఘునాథాభ్యుదయము, pp. 7–8.

మూర్తిమాంబయందు రఘునాథుడుదయించెను.[13] ఈతడే ఈ కావ్యములందలి నాయకుడు. ఈతని పట్టపురాణి కళావతి. రఘునాథునకు, అచ్యుత, అచ్యుత, రామభద్ర విజయరాఘవ నాయకులను పుత్రులుదయించిరి. వీరిలో విజయ రాఘవ నాయకుడు రఘునాథుని తరువాత తంజాపురమునకు ప్రభువాయెను. ఈతని పుత్రుడు మన్నారుదేవుడు. మన్నారుదేవుని కుమారుడు చెంగమలదాను. చెంగమలదానుతో తంజాపురాంధ్ర నాయకరాజ్యము శత్రువుల హస్తగతమాయెను. ఈ రెండు గ్రంథములును విజయరాఘవుని చరిత్రతో అంతమగుచున్నవి. గ్రంథ కర్త విజయరాఘవ నాయకుడగుటయే దీనికి కారణము.

## రఘునాథనాయకుడు

తంజాపురమును పరిపాలించిన ఆంధ్రనాయక రాజులలో అగ్రగణ్యుడు రఘునాథ నాయకుడు. ఈతనిని సమరమునందును, సాహిత్యమునందును విజయ నగర చక్రవర్తియయిన శ్రీకృష్ణదేవరాయలతో పోల్చవచ్చును. కృష్ణరాయల తరువాత ఆంధ్ర సరస్వతి, విజయనగరమునుండి తన పీఠమును తంజాపురమునకు మార్చు కొనినదని చెప్పవచ్చును.

రఘునాథునికి అభినవ భోజుడను బిరుదమున్నది. ఈతడు కవి, కవిపండిత పోషకుడు. సంస్కృతాంధ్ర భాషాప్రవీణుడు. కృష్ణదేవరాయల తరువాత, సంస్కృ తాంధ్ర భాషలయందు పండితులయి, రెండు భాషలయందు కావ్యరచన చేయుచు, కవి పండితులను పోషించి సన్మానించిన రాజులు, తంజావూరు నాయక రాజులు. వారిలో పేరెన్నిక గన్నవాడు రఘునాథుడు. కృష్ణదేవరాయలకు లేని గౌరవమును రఘునాథుడు పొందగలిగెను. రచయిత్రులను సన్మానించి, పోషించిన గౌరవము రఘునాథునిదే. రఘునాథుడు కవయిత్రులకు, వారి వైదుష్యమునకు మెచ్చి తన కొలువునందు స్థానమిచ్చుటయే కాక, మధురవాణి అను నామెకు కనకాభిషేక మును చేయించెను. ఆంధ్ర వాఙ్మయమున నాయకరాజుల కాలమువరకు కవయి త్రులు, తాళ్లపాక తిమ్మక్క, మొల్ల మొదలగు కొలదిమంది గలరు. నాయకరాజుల కాలమున కవయిత్రులు, విదుషీమణులు పెక్కుమంది ఉండిరి. రాజాస్థానమున గల కవయిత్రులు బహుభాషా ప్రావీణ్యము గలవారు. స్త్రీ విద్యను ప్రోత్సహించి నది రఘునాథనాయకుడే యని చెప్పవచ్చును. ఈతడు స్వయముగా కనకాభిషేక మున గౌరవమును పొందెను. ఆంధ్ర సాహిత్యమున ఏ రాజకవియు నిట్టి గౌరవమును పొందలేదు. ఈతడు వ్రాసిన అచ్యుతనాయకాభ్యుదయ ద్విపద రచనకు గోవింద దీక్షితులు మొదలగు పండితులు అబ్బురపడిరి. ఆ కవిత్వమునకు మెచ్చి తండ్రి అచ్యుతనాయకుడు రఘునాథునకు కనకాభిషేకమును చేసెను.[14]

13. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర.అ., p. 10, రఘునాథాభ్యుదయము, pp. 7–8.
14. యజ్ఞనారాయణదీక్షితులు, సాహిత్యరత్నాకరము.

రఘునాథనాయకుని విజయములు :

రాజ్యము అల్లకల్లోల పరిస్థితులలో నున్నపుడు అచ్యుతనాయకుడు తానాక్లిష్ట పరిస్థితులను చక్కబరచలేనను ఉద్దేశముతో రఘునాథునకు రాజ్యాభిషేకము చేసెను. అచ్యుతనాయకుని పరిపాలన చివరిదశలో పోర్చుగీసువారు చోళగుడను చోరనాయకుని ప్రోత్సహించి రాజ్యమున దొంగతనములు, బందిపోటులు చేయించుచుండిరి. చోళగుడు కావేరి వద్దనున్న దేవికోటనాక్రమించుకొని, దానిని కేంద్రముగ చేసికొని దుండగములు చేయుచుండెను. పోర్చుగీసువారు సింహళమునగల జాఫ్నారాజును పదభ్రష్టునిచేయ అతడు తంజాపుర నాయక రాజుల శరణుకోరెను. మరియొకప్రక్క విజయనగర ప్రభువైన శ్రీరంగరాయలను చంపించి అతని బంధువగు గొబ్బూరిజగ్గరాజు విజయనగర సింహాసనమాక్రమించెను. శ్రీరంగరాయల కుమారుని యాచమనాయకుడను సేనాని రహస్యముగ తంజాపురమునకుగొనిపోయెను. ఈ జగ్గరాజు పక్షమున పోర్చుగీసువారు, మధుర, జింజినాయకులు నిలచిరి.

రాజ్యమిట్టి పరిస్థితులలో నున్నసమయమున క్రీ.శ. 1614 వ సంవత్సరమున రఘునాథనాయకుడు తంజాపురమునకు పట్టాభిషిక్తుడయ్యెను. అగుటయేతడవుగ యుద్ధసన్నద్ధుడయ్యెను. రాజ్యమునకు రాకముందునుండి రఘునాథుడు పెక్కు యుద్ధములలో తండ్రికి సహాయపడి పేరుగాంచెను. మధురనాయకునకు, విజయనగరరాజగు వెంకటపతిరాయలకు పళ్లంకోటవద్దజరిగిన యుద్ధమున వెంకటపతి రాయలకు సహాయమొనర్చెను. మరల గోలుకొండనవాబుతో జరిగిన యుద్ధమున విజయనగర ప్రభువు పక్షమున యుద్ధముచేసి గోలుకొండ నవాబు సైన్యము నోడించెను. విజయనగరరాజు బంధించిన జింజిరాజగు కృష్ణప్పనాయకుని వేంకటపతిరాయలతో చెప్పి బంధవిముక్తుని గావించెను. నవాబుసైన్యమునోడించినందులకు సంతసించిన రాయలు రఘునాథుని మాటపై కృష్ణప్పనాయకుని విడుదల చేసెను. అంత కృష్ణప్పనాయకుడు భార్యతో సహ రఘునాథునకు మ్రొక్కి తన కుమార్తె నిచ్చి వివాహముగావించెను.

పట్టాభిషిక్తుడైన తరువాత రఘునాథుడు దేవికోటను ముట్టడించి చోళగుని జయించెను. తరువాత జాఫ్నారాజును మరల రాజ్యమున ప్రతిష్ఠించెను. జగ్గరాయుని యుద్ధమునందు చంపి, బాలుడగు రామదేవరాయలను విజయనగరమునకు పట్టాభిషిక్తుని గావించెను.

చోళగుని జయించుట, సింహళరాజును రాజ్యమున నిల్పుట, పాండ్యతుండీర రాజులను జయించుట, రామదేవరాయలను, విజయనగర సింహాసనమున నిలుపుట,[15] మధుర రాజకుమార్తెను వివాహముచేసికొనుట, గొబ్బూరు జగ్గరాజుతో చేసిన యుద్ధవిషయములు, తుండీరపతితో గావించిన యుద్ధవివరములు రఘు

15. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర. ఆ. p. 19.

నాథాభ్యుదయమునందు కొంత వివరముగ గలవు.[16]

రఘునాథనాయకాభ్యుదయ కావ్యమునందు, రఘునాథుని విజయములు, చిత్రములుగ వ్రాయబడి ఇందిరామందిరమునందు గలవని కవితెలిపెను. కాని ఆ యుద్ధములెప్పుడు జరిగినవో, అందు పాల్గొనిన సామంతులు, స్నేహితులు ఎవరో, ఆ విషయములేవియు లేవు. కాని రఘునాథాభ్యుదయమునందు మాత్రము, జగ్గరాజుతో యుద్ధమొనరించుటకు తోపూరునకు పయనమయిన రఘునాథ నాయకునికి సహాయమొనర్చుటకు, రఘునాథుని జ్యేష్టపుత్రుడగు రామభద్రుడు, రామదేవ రాయలు, కోనేటి కొండ్రాజు, కట్టరంగపు రాజు, కస్తూరిరాజు, మిట్టపాళెంపు సంపెట నాగరాజు, రామరాజు, జౌకు రఘునాధరాజు, శ్రీగిరిరాజు, వీరరామవరాజు, వితలరాజు నందేల చిట్రాజు, నారపరాజు, కందనవోలు రాజు, గడి తిమ్మరాజు, కాలువ రాజులు, కడపరాజులు, పాలేలరాజులు, పంటరాజులు, శ్రీపతివారు (శ్రీపతి రాజుపాఠాంతరము) జూపల్లివారు, దేసూరిరెడ్లు, మాదు మూర్తెప్ప, కుమార రంగయ్య, పామినాయని వారు, బలమూరివారు, మండువవారు, కంబమువారు, కొండవీటివారు, కొండపల్లి వారు, అంకుశరావు, మొదలగువారు, వెంటవెళ్ళిరి అని తెలిపెను. ఈ యుద్ధమున గొబ్బూరిజగ్గరాజు మరణించెను.

గొబ్బూరి జగ్గరాజు క్రీ.శ. 1588 నుండి 1614 వరకు వియనగరమును పరిపాలించిన వేంకటపతి రాయల బావమరది. వేంకటపతి రాయలకు సంతానము లేదు. అతని భార్య ఒక బ్రాహ్మణ స్త్రీకి జన్మించిన బాలుని దెచ్చి, తనకు జన్మించిన బాలుడేయని, వేంకటపతి రాయలను నమ్మించెను. అతడును నమ్మినటులే నటించి తన అవసానకాలమున, తన అన్న కుమారుడగు శ్రీరంగ రాయలను రాజును చేసెను. ఈ విషయము తెలిసికొని, గొబ్బూరి జగ్గరాజు, శ్రీ రంగ రాయలపై తిరుగుబాటొనరించి, అతనిని సకుటుంబముగ చెఱనందుంచెను. విజయనగర సామంతుడగు యాచమ నాయకుడు, శ్రీరంగ రాయల పుత్రులలో నొకనిని చెరనుండి రహస్యముగ తీనుకొనిపోయి, రఘునాథరాయలనాశ్రయించెను. అంత రఘునాథరాయలు, యాచమనాయకుని పక్షమవలంభించి, జగ్గరాజుతో యుద్ధము చేసెను. జగ్గరాజునకు, పాండ్య తుండీర రాజులు సహాయమొనర్చిరి.[17] జగ్గరాజు యుద్ధమున మరణించెను. తుండీర విభుడు చెంజినగరమునకు పారి పోయెను. సూకరాజు, దళవాయి చెంచు, రావిళ్ళ మాదన్న, కృష్ణప్పనాయకుడు పలాయనము చిత్తగించిరి. మధుర రాజగు ముత్తువీరప్పయును హస్తమునందలి ఖడ్గమున పారవైచి పారిపోయెను. పారిపోయెడి వీరప్పను తన సైనికులు బంధించి తీసికొనిరాగా రఘునాథుడు వీరపురుషోచితముగ వానిని మందలించి ప్రాణదానము

---

16. రఘునాథాభ్యుదయము, pp. 22–26.

17. Robert Sewell, A Forgotten Empire, pp. 224–229.

చేసెను.[18] ఈ యుద్ధవిషయములను విజయరాఘవుడు వివరముగ దెల్పెను.[19] రఘునాథుడు తోపూరునందు జగ్గరాజును జయించెనని విజయరాఘవుడు పేర్కొనెనే దప్ప ఆ యుద్ధమునకు కారకుడైన యాచమ నాయకుని విషయమేమియు తెలుప లేదు. యాచమనాయకుని విషయము తెలుపక పోవుటయేకాదు, కనీసమాతని నామమును సహితము తెలుపలేదు. యాచమనాయకుడు విజయనగరసామ్రాజ్యమున ఒక సామంతరాజు. గొబ్బూరి జగ్గరాజు శ్రీరంగరాయలను సకుటుంబముగా చెరయందుంచ, స్వామిభక్తి పరాయణుడగు యాచమనాయకుడు, మాయోపాయముతో శ్రీరంగరాయలపుత్రులలో నొకనిని చెఱనుండి విడిపించి, తంజాపురమున కేగి, రఘునాథునాశ్రయించెను. ఈ విషయము తెలిసి, జగ్గరాజు యాచమ నాయకునిపై యుద్ధము ప్రకటించెను. విజయరాఘవుడీకారణముల తెలుపక పోవుటయే కాక, యుద్ధమునకు ముఖ్యకారకుడయిన యాచమనాయకుని నామమునైనను తెలుపక పోవుటకు కారణము, తన తండ్రి విజయ పరంపరలను మాత్రమే, తెలుప వలయునని భావించుటయే కావచ్చును.

"నళవత్సరాషాఢ శుద్ధ పంచమీ పుష్యార్క పరిఘ యోగమున"

రఘునాథుడు తోపూరు యుద్ధమునకు పళవానేరి గ్రామమునుండి బయలు దేరెనని తెలిపినాడు విజయరాఘవుడు. ఈ సంవత్సరము ప్రకారము, తోపూరు యుద్ధము క్రీ.శ. 1616 వ సంవత్సరము జూన్ నెల 27 వ తేదీ యగునని, కురుగంటి సీతారామయ్యగారు వ్రాసిరి. రఘునాథుడు పళవానేరి గ్రామమున, నళనామ సంవత్సర అషాఢ శుద్ధపంచమినాడు తోపూరునకు బయలు దేరుటచే, ఆ మరునాడు అనగా షష్ఠినాడు యుద్ధము జరిగెనని నిర్ణయించిరి.[20]

ఈ తోపూరు యుద్ధమును Heras, The Great Civil war of Vijayanagara of 1614–1618 అని వర్ణించెను.[21] ఈ యుద్ధమును కృష్ణస్వామి అయ్యంగారు మహాభారతయుద్ధముతో సరిపోల్చిరి.[22]

రఘునాథనాయకుని ఈ విజయ విషయములేకాక, రఘునాథుని తరువాత తంజాపురాధిపతియైన విజయరాఘవనాయకుడొనర్చిన కొన్ని ఘనవిజయములు ఈ గ్రంథములవలన తెలియుచున్నవి. విజయరాఘవుడు చిన్నతనముననే యుద్ధమున పడమటిదొరను గెల్చెను. పట్టాభిషేకము జరిగిన సంవత్సరమున పదియారు దానములొనర్చెను. సవరము వేంకటపతిని గెలిచెను. శ్రీరంగరాయలను బంధించిన పాండ్యతుండీరపతులను ఖండించెను. మృష్టాన్నదాన సత్రములను

18. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్రనాయక రాజచరిత్రము, p. 223.
19. రఘునాథాభ్యుదయము pp. 22–25.
20. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్రనాయకరాజ చరిత్రము, pp. 216–217.
21. Journal of Indian History, Vol. V, 1927, pp. 164–188.
22. S. Krishnaswamy Aiyangar, Sources of Vijayanagara History, p. 244.

కట్టించెను. రాజగోపాలదేవునకు సకల కైంకర్యములు చేసెను. రఘునాథపురాది వివిధాగ్రహారములను నిర్మించెను. నెల్లూరు పట్టణమును కట్టించెను.[23]

ఈ విషయములేకాక రఘునాథుడు "నిజలీలా విలాస శృంగాటకంబుగా నాటకంబు హవణించిన తన ముద్దుపట్టియగు విజయరాఘవ పట్టభద్రునకు బట్టంబుగట్టి యతడు కావించు వివిధోపచారంబులను హర్షించుచు"[24] నుండెనని తెలియుచున్నది.

క్రీ.శ. 1642వ సంవత్సరమున విజయనగరాధీశ్వరుడైన శ్రీరంగరాయలు (మూడవ శ్రీరంగరాయలు) విజయరాఘవ నాయకుని సమకాలికుడు. విజయనగరమునకు సామంతరాజులయిన, మధురరాజగు తిరుమల నాయకుడు, చెంజిరాజగు కృష్ణప్పనాయకుడు విజయనగరమునకు కప్పముకట్టుట మాని స్వతంత్రులగుటకు ప్రయత్నించుచుండిరి. శ్రీరంగరాయలు రాజ్యమునకు వచ్చిన వెంటనే దక్షిణరాజ్యములపై దండయాత్రవెడలెను. ఈ విషయము తెలిసి, మధురరాజగు తిరుమలనాయకుడు, చెంజి తంజాపుర నాయకులతో స్నేహముచేసి, శ్రీరంగరాయలతో యుద్ధమునకు సిద్ధపడెను. కాని శ్రీరంగరాయలు సమీపమునకు వచ్చినతరువాత, విజయరాఘవనాయకుడు మధుర, చెంజి నాయకుల పక్షమునుండి విడివడి, శ్రీరంగరాయల పక్షమువహించి మధుర, చెంజి నాయకులనుఓడించెను. ఈ సంఘటన క్రీ.శ. 1643–44 ప్రాంతమున జరిగినది.[25]

విజయరాఘవనాయకుడు క్రీ.శ. 1633వ సంవత్సరమున రాజయ్యెను. పట్టాభిషేక సమయమున విజయరాఘవుడు పదహారు మహాదానములు చేసినటుల గలదు. అనగా ఈ దానములను క్రీ.శ. 1633 వ సంవత్సరమున చేసియుండును. ఈ విషయమునే చెంగల్వకాళకవి తన రాజగోపాల విలాసమున గ్రంథావతారిక యందు వ్రాసెను. ఇందు విజయరాఘవనాయకుడు పదహారు దానములను శ్రీముఖ సంవత్సరము శ్రావణమాసమున చేసెనని గలదు. అనగా క్రీ.శ. 1633 వ సంవత్సరము, ఆగష్టు–సెప్టెంబరు మాసములు. విజయరాఘవుడు, సింహాసనారూఢుడైన సంవత్సరమున ఈ దానములు చేయుటచే అతడు క్రీ.శ. 1633 వ సంవత్సరమున పట్టాభిషిక్తుడయి యుండును అనుట నిశ్చయము.[26]

విజయరాఘవుని విషయములు తెలియజేయు పైన ఉదహరించిన పంక్తుల యందు పరస్పరవిరుద్ధభావములు కన్పట్టుచున్నవి. రఘునాథాభ్యుదయాంతమున

23. రఘునాథనాయకాభ్యుదయము, pp. 12-13, రఘునాథాభ్యుదయము, pp. 9–10.

24. రఘునాథాభ్యుదయము p. 56.

25. R. Satayanadha Aiyar, History of the Nayaks of Madura, p. 127.

26. విజయరాఘవుడు క్రీ. శ. 1633 వ సంవత్సరమున రాజ్యాభిషిక్తుడయినటుల Nayakas of Tanjore నందు వృద్ధగిరీశముగారును వ్రాసిరి.

గల "నిజలీలావిలాస శృంగాటకంబుగా నాటకంబు హవణించిన తన ముద్దుపట్టి యగు విజయరాఘవ పట్టభద్రునకు బట్టంబుగట్టి" అనుదానికిని, రఘునాథాభ్యుదయ, రఘునాథనాయకాభ్యుదయములందు తాతాచార్యులు చెప్పినటుల విజయరాఘవుడు చెప్పిన "పట్టాభిషేక వైభవము గైకొన్న యట్టి సంవత్సరమందొకనాట,

నవలీలగా బదియాఱు దానములు
నవరించి ద్విజుల కొసంగితి వీవు"...

అను విషయమునకును ఏకతాభావము కన్పట్టుటలేదు. ఈతడీ కావ్యములను పట్టాభిషేకానంతరము వ్రాసియుండవలెను. ఈతని రచనమును మెచ్చుకొని, రఘునాథుడు రాజ్యాభిషేకము చేసెనను విషయముకంటెను, పట్టాభిషిక్తుడైన వెనుక కావ్యరచనము చేసియుండెననుట సమంజసము. ఏలన పట్టాభిషిక్తుడైన సంవత్సరమున గావించినపదునారు దానముల విషయము, ముందుగ చేసెనని తెలుపుట అసంభవము. అదియునుగాక,

"శ్రీరంగరాయల జేపట్టి నిల్పి
యారాయ కార్యంబు లొగాదటంచు
దుండగించిన పాండ్యతుండీరపతుల
ఖండించి వాకిలి గావజేసితివి."[27]

అనుటవలనగూడ పట్టాభిషేకానంతరమే కావ్యము రచించెననుట స్పష్టమగుచున్నది. పైన పేర్కొనిన శ్రీరంగరాయలకును పాండ్యతుండీరపతులకును నడుమ జరిగిన యుద్ధము క్రీ.శ. 1643–44 ప్రాంతమున జరుగుటచే, ఈ సంఘటనమును విజయరాఘవుడు తన కావ్యములందు పేర్కొనుటచేతను, తన కావ్యరచనమునకు మెచ్చి తండ్రి రాజ్యాభిషేకమొనర్చెనను విషయము అసత్యమని నిరూపితమగుచున్నది తానే స్వయముగా వ్రాసిన కావ్యములయందు విజయరాఘవనాయకు డిట్టి విరుద్ధ విషయములను సత్యదూరమని నిరూపితమగుచున్న విషయములను ఏల పొందుపరచెనో అర్థమగుటలేదు.

తండ్రి గాథను గ్రంథస్థమొనర్ప నమకట్టిన కుమారుడు, తండ్రియొక్క వీర కార్యములను, జయాపజయములను సమగ్రముగ, విపులముగ వర్ణింపక సూచన ప్రాయముగ తెలుపుట శోచనీయముగ నున్నది.

విజయరాఘవనాయకుడు తన తండ్రి యొనర్చిన వీరకార్యములన్నింటిని తన గ్రంథములందు పేర్కొనలేదు. తోపూరు యుద్ధమును గూర్చి కొంత వివరముగ తెల్పెను. పాండ్యతుండీరపతులతో, చోళగునితో, పోర్చుగీసువారితో, రఘునాథ నాయకు డొనరించిన యుద్ధముల విషయము రేఖామాత్రముగ తెల్పెను. రఘునాథుని యొకనాటి దినచర్యను మాత్రము విపులముగ తెలిపి, రఘునాథుడు

27. రఘునాథాభ్యుదయము, p. 10.

కళావతియను వేశ్యగృహమున కేగు విషయమును శృంగారముగ వర్ణించెను. ఈ విషయమై సత్యాసత్యములు తెలుపుట కెట్టి ఆధారములును లేవు. రాజులు వేశ్యాలోలురగుట జగద్విదితము. రాజులనియే యేమి ప్రజలయందును అట్టి ప్రకృతి పెక్కుమందికి గలదు. శ్రీకృష్ణదేవరాయల విషయమునగూడ నిట్టి కథ యొకటి గలదు. అది సత్యమనుటకు మనకెట్టి ఆధారములును లేవనియే చెప్ప వచ్చును. కవులు శృంగారపరమగు విషయములకు ప్రాధాన్యము నొనగుటవలన ఇట్టి సంఘటనలు గ్రంథస్థమగుట గలదు. కల్పితనాయకుని విషయమున ఇట్టి ఘట్టముల రచించుట సామాన్యమయిన విషయమే. కాని విజయరాఘవుడు తన తండ్రియొక్క అంతరంగిక విషయములను గ్రంథస్థమొనరించుట సాహసముగ గన్పట్టుచున్నది. రాజులకు పెక్కుమంది ఉంపుడుగత్తెలుండవచ్చును. ఉండుట సహజమనియే చరిత్రయందు చెప్పబడినది. ఆయినంతమాత్రమున వేశ్యాగృహమున కేగు విషయము గ్రంథమునందు ఘనముగ రచించు సంఘటనముగ కన్పడుటలేదు. విజయరాఘవుడు తన తండ్రి శృంగారపురుషుడనియు, ఒక వేశ్య రాయబారము నంపగా ఆమెయొక్క కోరికను తీర్చుటకు ఆమె గృహమున కేగునంతటి ఉదార హృదయము కలవాడనియు, తెలుపుటకే తన గ్రంథములందు కళావతీ వృత్తాంతమును రచించినటుల కన్పట్టుచున్నది.

రఘునాథనాయకుడు గొప్ప పరిపాలకుడు. వీరుడు. పండితుడు. పండిత పోషకుడు. ఈతని కీర్తిప్రతాపములను సాహిత్యరత్నాకరము, విజయవిలాసము చక్కగ పేర్కొనినవి. ఈ గ్రంథములవలన ఈతనికి అభినవభోజ, సల్లోగమాన భంజన, సాధితసముద్రాంతర ద్వీప నేపాల నృపాల స్థాపనాచార్య, సమరనిశ్శంక, కర్ణాటక ప్రభుశుఖప్రధాన, శౌర్యధైర్య మరియు సాహిత్యభోజ అను బిరుదము లున్నటుల తెలియుచున్నది. ఈతని పరాక్రమమునకు శత్రురాజులు భయపడు చుండిరని, The Nayakas of Tanjore, తంజావురాంధ్ర నాయకరాజ చరిత్రము తెలుపుచున్నవి. ఈతడు తాను గాయపడకుండ యుద్ధముచేయు నేర్పరి. బొమ్మ పెట్టుటయను వీరసంప్రదాయమును అనుసరించెడివాడు.

"చికిలి వైడూర్యంపుఁ జేయంబు పూని
పరఁగఁబాండ్య నృపాలఫాల పట్టమున
మురువైన నవరత్నములఁ దీర్చినట్టి
బిరుదు పెండేరంబు పెరిమదీపింపఁ"[28]
చరణాంబుజమున సవరించుకొనెడివాడు.

బొమ్మ పెట్టుట యన విజయమును పొందిన వీరుడు తానోడించిన శత్రురాజుల యొక్క బొమ్మలను చిన్నవి చేయించి కాలికి వేసికొను పెండేరమున ఆ బొమ్మను వేసికొనెడివారు. అంతియేకాక శత్రురాజుల కిరీటములందలి నవరత్నములను

28. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర.ఆ., p. 25.

పెండేరమున తాపడము చేయించుకొనెడివారు. శత్రువులను అవమానించు ఈ పద్ధతి, ఆంధ్రదేశమున ప్రాచీనకాలమునుండి గలదు. కృష్ణదేవరాయాది విజయనగర రాజు లందరును ఈ పద్ధతి ననుసరించిరి. అన్ని విషయములందు విజయనగర రాజులను అనుసరించిన నాయకరాజులు వారి ఆచార సంప్రదాయములనుకూడ అనుకరించిరి.

మహావీరుడు, మహాభక్తుడు, సౌమ్యశీలి, సుగుణసంపన్నుడు అని పేరుగాంచిన రఘునాథుడు అన్నను చంపి రాజ్యమునకు వచ్చెనని కొందరి అభిప్రాయము.[29] ఈ విషయమై మనకు ఇతర ఆధారములేమియు తెలియుటలేదు. కొందరు పోర్చుగీసువారు వ్రాసిన ఉత్తరములవలన రఘునాథునకు అన్న ఉన్నటుల తెలియుచున్నది. ఈతడు మేటి రాజులలోకెల్ల మేల్బంతియై, కృతయుగమున ఉన్నటుల ధర్మపాలన నెరపుచు, పరమ దయాళువై ప్రజలను పరిపాలించెను.

రఘునాథనాయకుని ఒకనాటి దినచర్య :

రఘునాథనాయకుడు ప్రతిదినము రెండుమారులు కొలువు తీరెడివాడు. నిదుర మేల్కొనిన తరువాత నొకసారి స్నానాదులు ముగిసినతరువాత మరొకసారి.

మొదటిమారు తీర్చిన కొలువునందు రఘునాథుని బంధుమిత్రులకు మాత్రమే ప్రవేశము. ఇందు పరిపాలనా విషయములు చర్చింపబడెడివి కావు. ఇది కేవలము రాజునకు, బంధుమిత్రులకు వినోదము కూర్చుటకు నేర్పరుపబడిన సభ. ఇందు రఘునాథరాయలు, సుందరాంగు లొనర్చిన వివిధ నాట్యములను తిలకించి, తాను రచించిన అచ్యుతాభ్యుదయము, నలచరిత్రము, పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్ర, జానకీకల్యాణము మొదలగు కృతులను కొందరు సుందరీమణులు వినిపింపగా విని, ఆనందించి, వారందరిని తగువిధముగ కనకాంబరములతో సత్కరించెడివాడు. ఈ సభ తీరునపుడు రఘునాథనాయకుడు మెరుపుల మంచముపై కూర్చొనెడివాడు. ఈ మంచము పచ్చరాచిలుకల పాదపీఠముతో, రత్నాల గద్దియతో, ముత్యముల దిండ్లతో, బంగారు సరిగతో ప్రతిమలు కుట్టిన కుడారముతో,[30] అలంకరింపబడినది. (ఈ మంచ మొకవిధమగు 'సోఫా' వంటిదయి యుండును.)

సభ ముగిసినతరువాత, రఘునాథనాయకుడు స్నానమాచరించి, దువ్వలువలు ధరించి, రంగు రుమాలు చెరంగులు జార దుప్పటి చారిగట్టి, ముద్రికాభరణములు, ముత్యాలయొంట్లు, శ్రీరామభద్రతాళి మొదలగు ఆభరణములు ధరించి, లక్ష్మీనివాస మందిరమున కేగి, అచట గురువుగారికి పాదసేవ యొనరించి, అతనికడ సెలవు తీసికొని కపిలధేనువునకు గ్రాసము సమర్పించి, తిరుచూర్ణము, ద్వాదశపుండ్రములు ధరించి, అష్టాక్షరి జపించి, తిరువారాధన చేసి, రామాయణ భాగవతాది గ్రంథము

29. Henry Heras, The Aravidu Dynasty of Vijayanagar, p, 401.
30. కుడారమనిన బాలీసు అని ఇందిరామందిర సందర్శనమున శె. జోగయ్యశర్మగారు వ్రాసిరి.

లను భాగవతులు పఠించగా విని, వారిని తాంబూలాదులతో సత్కరించి, దానముల నాచరించి, మంత్రాక్షతలను శిరస్సున ధరించెడివాడు.

పూజాదులు ముగిసిన తరువాత రఘునాధుడు, శిరమున సంపంగిపూల మాలను ధరించి, వస్త్రాలంకారములను ధరించి ఇందిరామందిరమున కొలువు తీరెడివాడు. శక, సింధు, గాంధార, సౌవీర, చేర, కుకుర, కాశ, కరూశ, కోసల, అవంతి, నేపాళ, పాండ్య, తుండీరాది దేశాధిపతులు తనను కొలుచుటకై రాగా, వారందరిని వేరువేరుగ పిలచి వారు తెలిపెడి విషయములను వినెడివాడు.

అనంతరము రఘునాధుడు కెంపులతో చెక్కిన కమ్మకట్లు, తలమాళిగ, ముత్యపుసరలు, చెవుల జల్లులు, గంటలబారు, ముత్యములతోను, వైడూర్యములతోను చేయబడిన మెడగంట గొలుసులు, రవలఅందెలు మొదలగు అభరణములతో అలంకరించిన ఐరావతమను భద్రగజము నెక్కి, ఇరుప్రక్కలను అచ్యుతావని విభుడు, రామభద్రుడు మొదలగు ముగ్వురు పుత్రులు తనను కొలువ ఊరేగెడి వాడు. ఇట కవి, అచ్యుతుడు రామభద్రుడు మొదలగు ముగ్వురు పుత్రులని చెప్పెను. మూడవ పుత్రుడెవరో పేర్కొనలేదు. బహుశ విజయరాఘవుడే ఆ మూడవ పుత్రుడై యుండును.

ఊరేగింపు ముగిసినతరువాత, రామభద్రుని సేవించి, లక్ష్మివిలాస మందిరమున ప్రవేశించి, అట రంగనాయకుని సేవించి, శ్రీరామసౌధమునగల రాజగోపాలుని సేవించి వచ్చి చలువరాతి పలకపైగల కెంబట్టు గద్దియపై ఆశీనుడై సరసవిద్వత్కవిసార్వభౌములను సరసకు పిలచి కొంత సమయము కవితాగోష్ఠుల నెరపి అనంతరము నారణప్ప అనునాతడు చదివిన విన్నపముల నాలించి కరణీకులు తెలపిన మణియపు లెక్కలను (State accounts) విని మంత్రులతో ఏకాంతమున మంత్రాలోచనము గావించి సభ ముగించెడివాడు.

అనంతరము అంతఃపురమునకేగి, ఆభరణములను తీసివేసి, 'సరిగంచు చలువను కట్టి,' 'చిన్నారి యొంట్లు' శ్రీరామతాళి, సన్నవజ్రముల వేసరులు ధరించి, విశాలమగు భోజనశాలకేగి, అట తన భార్యలగు కళావతి, విశ్వనాధుని కుమార్తె (ఇట పేరున్న భాగము పోయినది) లక్ష్మాంబ, వేంకటమ్మ మొదలగువారితో పప్పులు, శాఖాహారములు, మాంసాహారములు, పిండివంటలు, పాయసములు మొదలగు వంటకములను, ఫలములను ఆరగించెడివాడు. ఇది రఘునాధుని దినచర్య. ఒకనాడు తన భార్యలతోకూడి విందారగించిన అనంతరము తన భార్యల నందరను, వారివారి గృహములకంపి, వివిధ పుష్పఫల వృక్షములతో విరాజిల్లుచున్న ఉద్యాన వనమున కేగెడివాడు.

ఉద్యానవనమునందు సంచరించుచుండగా, ఒక చిలుక వచ్చి, రఘునాధుడు ఊరేగు సమయమున అతనిని జూచి చిత్రరేఖ అను వేశ్య అతని అందమునకు మోహపరవశయై బాధపడుచున్నదనియు, తనను రాయబారమంపినదనియు

తెలిపెను. అంత రఘునాథుడు 'బాధపడువారిని రక్షించుటయే మాపని, మేము తప్పక ఆమె గృహమునకు వచ్చెదమని'[31] చిలుకతో తెలిపెను. అనంతరమాతడు చిత్రరేఖా గృహమున కేగెను.

కొలువు ముగిసినపిదప చంద్రోదయానంతరము చలువచప్పరమున యౌవ నాంగులు గొలువ సంగీతములను వినుచు సఖియలతో సరసమాడుటను విజయ రాఘవుడు :

"జెంగట నొక్క రాజీవలోచనకు
విడెమిచ్చె పుక్కటి విడెము గైకొనుచు
జడబట్టి యొకతెను సారెకు జెనకు
బొట్రవేల గొని నీలిఁబోమీటి యొకతె
బటువు గుబ్బలు జీటి పలుమాఱు నవ్వు
మోవి యిమ్మనుచును మ్రొక్కు నొక్కతెకు
దావికుంకుమ బూయు దరుణి కొక్కతెకు
బిగువు గౌగిటనుంచు ప్రేమనొక్కతెను
జిగిమించు తొడలపై జేర్చు నొక్కతెను
ఒక్కతె పాటకు మెచ్చు నుత్సాహమొదవ
నొకతె యాటకు సొక్కునుల్లంబు లోన"[32]

అని వర్ణించెను. ఇది చదువుటకు నుత్సాహముగ నున్నను ఎంతటి రసికు డైనను, కుమారుని కడ తండ్రి యిట్టి పనులు చేయుట అసంభవము. మత్తుగ ద్రాగి తెలివిలేని వారటుల చేయగలరేమొగాని, రఘునాథనాయకునివంటి సకలగుణ సమన్వితుడైన వాడు చేయజాలడు. ఈ వర్ణనమంతయు విజయరాఘవుని స్వీయాను భవమై యుండును. కవి, సరసుడు, ప్రభువు. ఎట్టి వర్ణన చేయుటకైనను ఆక్షేపణము లేదుకదా అట్టివానికి.

ఇందు చిత్రరేఖావృత్తాంతము తప్ప తక్కిన దంతయును ఒక్క రఘునాథుని దిన చర్యయే గాక నాయకరాజుల దిన చర్యయని చెప్పవచ్చును.

### రఘునాథనాయకుడు — మతము :

నాయకరాజులందరును వైష్ణవమతావలంబులు. రఘునాథుడు ఈ గ్రంథములందలి వర్ణనము వలన వీరవైష్ణవమతావలంబిగ కన్పడుచున్నది.[33] ఇతని కులదైవము రాజగోపాలుడు. కులగురువు తాతాచార్యుడు.

---

31. రఘునాథనాయకాభ్యుదయము, pp. 65–66.

32. రఘునాథనాయకాభ్యుదయము, p. 72.

33. రఘునాథనాయకాభ్యుదయము, pp. 23–24.

"మాయవతారమై మహినుదయించి
మీ యయ్యయై ధైర్యమేరువైమించి"[34]

అని రాజగోపాలదేవుడు తనకు స్వప్నమున రఘునాథుడు రాజగోపాలుని అవతారమని తెల్పెనని విజయరాఘవుడు వర్ణించెను. ఇది అతిశయోక్తియైనప్పటికి వీరి వైష్ణవమతాభిమానమును వ్యక్తము చేయుచున్నది.

రఘునాథుడు నుదుట తిరు చూర్ణరేఖను ధరించి మేనద్వాదశ పుండ్రములను సవరించెడి వాడు. రామభద్రతాళి ధరించెడి వాడు. గురువు అనతి ప్రకారము ప్రతిదినము బంగారు తమ్మిపూలతో రాజగోపాలుని అర్చించెడి వాడు. అనంతరము పరమ భాగవతులు చదువగా భాగవతమును వినెడి వాడు.[35] ఈతని వైష్ణవ భక్తికి నిదర్శనమే ఈతడు రచించిన వాల్మీకి చరిత్ర, జానకీ కల్యాణము, రామాయణములు. నాయకరాజులు వైష్ణవులనుటకు వీరి సౌధములకు రామభద్ర శాల, అచ్యుతరంగ కూటము అను నామములిడుట మరియొక నిదర్శనము.

రఘునాథనాయకుడు — కవిపండితపోషణ — ఆస్థాన వైభవము :

నాయకరాజులు సారస్వత పోషణమునందు శ్రీకృష్ణదేవరాయల అడుగు జాడలనే అనుసరించిరి. శ్రీకృష్ణరాయని భువనవిజయ సభాప్రాంగణమున నూతనాలంకార భూషితయై పసిడిగజ్జెల సవ్వడుల నృత్యమాడిన తెలుగు బాషా లలామ విజయనగర రాజ్య అస్తమయముతో, తంజాపురమునకు తరలి వచ్చి నాయకరాజుల ఇందిరామందిరమున నూతన తేజస్సును సంతరించు కొన్నది. అంతియే కాక తంజాపురమున తెలుగువాణి, నెరజాణలు నీటుగా అలంకరించిన అభరణాలను ధరించి వినూతన పోకడలతో అలరారినది. దక్షిణాధీశుని కొలువు కూటములో కనకాభిషేకము చేయించు కొన్న ఆంధ్ర సరస్వతి మరల తంజా పురముననే ఆ ఘన గౌరవమునకు నోచుకొనినది. రఘునాథునకు తండ్రి అచ్యుతనాయకుడు కనకాభిషేకము చేసెను. రఘునాథుడు మధురవాణికి కనకాభిషేకము చేసెను. స్త్రీలకు కనకాభిషేక మొనర్చిన ఘనత రఘునాథునకే దక్కినది. స్త్రీలకు తమ కొలువు కూటమున సానమిచ్చి వారితో సాహిత్య చర్చలు గావించి, వారిని ప్రోత్సహించిన గౌరవ మొక్క నాయకరాజులదే. మన సాహిత్య చరిత్రలో స్త్రీల కింత గౌరవస్థానమును కల్పించిన రాజులు కనిపించరు. సాహిత్యమునే గాక సంగీతనాట్యాది లలిత కళలను ప్రోత్సహించిరి. ఈ కళల అభివృద్ధికి సుగమమైన రాజమార్గమును ఏర్పరచిన ఘనత రఘునాథనాయకునిది.

రఘునాథుని ఆస్థానము, కవులతో, కవయిత్రులతో, గాయకులతో, నటీ

34. రఘునాథనాయకాభ్యుదయము, p. 5.

35. రఘునాథనాయకాభ్యుదయము, pp. 23–24.

నటులతో, నాట్యగత్తెలతో అపూర్వ వైభవములతో అలరారు చుండెను. ఈతని ఆస్థాన విదుషీమణులు అష్టభాషా ప్రావీణ్యలు.

"ఇందిందిరాలక ఇందిరారమణి
కందళించిన వేడుకలఁ గటాక్షింప"[36]

రఘునాథుడు కొలువుతీర్చి కవులను కవయిత్రులను పోత్సహించి వారిచే సమస్యాపూరణమును గావించెడివాడు. ఈతని కొలువుకూటమున, గోవింద దీక్షితుడు, యజ్ఞనారాయణ దీక్షితుడు, వేంకటమఖి, రాజచూడామణి, మధురవాణి, రామభద్రాంబ, చేమకూర వేంకటకవి, కృష్ణాధ్వరి మొదలగు ఖ్యాతిగాంచిన కవులు కవయిత్రులు అలంకరించిరి. ఇందు మధురవాణి కనకాభిషేక మనగౌరవమును గాంచిన విదుషీమణి. రఘునాథుని పరిపాలనా కాలపు చివరి దశయందు సాహిత్యవ్యాసంగము పరాకాష్టనందినది. అప్పటికి యుద్ధములన్ని ముగిసి రాజ్యమున శాంతి భద్రతలేర్పడినవి.

రూపవతి, చంద్రరేఖ, శశిరేఖ, కీరవాణి మొదలగు స్త్రీలు, పదచాళి, పేరణి, జక్కిణి, పదకేళి మొదలగు నాట్యములను చేసెడి వారు. కొందరు స్త్రీలు అచ్యుతాభ్యుదయము, నలచరిత్రము, పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్రము, జానకీ కల్యాణ చాటు కావ్యములు వినిపించెడివారు.[37]

రఘునాథుడు స్వయముగ కవి, సంగీతవేత్త, సంగీతశాస్త్రపారంగతుడు. వీణావాదన కళామర్మజ్ఞుడు. ఈతడు సంస్కృతాంధ్రములందు కావ్యములను, ద్విపదలను, యక్షగానములను; చాటు కావ్యములను రచియించెను. ఈతడు రెండు యామములలో ఆశువుగా పారిజాతాపహరణము చెప్పగా ఉద్దండ పండితులతి ప్రయాసతో వ్రాయగల్గిరట. ఈతడు ఆంధ్రభాషలో పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్ర, రామాయణము (ప్రబంధములు), అచ్యుతాభ్యుదయము, గజేంద్రమోక్షము, నలచరిత్ర (ద్విపదలు), జానకీపరిణయము, రుక్మిణీ వివాహము (యక్షగానములు), సంస్కృతమున రామాయణ సారసంగ్రహము, భారతసారసంగ్రహము, సంగీత సుధ, సాహిత్యసుధ, భరతసుధయను గ్రంథములను రచించెను. ఇందు పెక్కు గ్రంథములు నేడలభ్యములు.

సంగీతమున ఈతడు జయంతసేన యను మధురమైన నూత్నరాగమును, రామానందమను నూత్నతాళమును, రఘునాథమేళయను విశిష్ట మేళాంతరమును సృష్టించెను.

తర్క వ్యాకరణాది శాస్త్రపారంగతుడు సకలశాస్త్ర ప్రావీణ్యుడు అయిన యజ్ఞనారాయణ దీక్షితునకు రఘునాథుడు గురువు. దీనిని బట్టి రఘునాథుని పాండిత్య ప్రకర్షను తెలుసుకొనవచ్చును.

36. రఘునాథనాయకాభ్యుదయము, ప్ర. ఆ. p. 19.

37. రఘునాథాభ్యుదయము, p. 16.

విజయరాఘవుడు రచించిన ఈ రెండు గ్రంథముల వలన రఘునాథ నాయకుని జీవిత విశేషములు సమరౌద్ధత్యము, కవిపండిత కళాపోషణము, నాట్యనాటక పోషణము, ఆనాటి రాజకీయ మత పరిస్థితులు, సమగ్రముగి కాకపోయినప్పటికిని పెక్కు తెలియుచున్నవి. ఈ విషయములే కాక నాటిరాజుల యొక్క ప్రజల యొక్క ఆహార విహారములు, వస్త్ర భూషణ విశేషములు, వారుపయోగించిన వాద్య విశేషములు, మొదలగు అంశములు కూడ తెలియు చున్నవి.

వస్త్రములు :

నాయకరాజులు ఎక్కువగా చలువలు ధరించెడివారు. పైఠిణీ చలువలు, మవ్వటములు, దువ్వలువలు, రంగురుమాలు, సరిగదుప్పటి, పీతాంబరములు, చలువచీరలు, బంగారు సరిగతో కుట్టిన పద్మరేఖలతో నున్న 'కీలురత్నముగండ్ల కెంబట్టి' రవికలు. ఆనాడు, పురుషులు స్త్రీలు ధరించెడి వస్త్రములు.

శయన, ఆసన సామాగ్రి :

బంగారు పీటలు, పచ్చలతో చేసిన పాదపీఠములు, బంగారు సరిగప్రతిమలు కుట్టిన కుడారములు, మెరుపుల మంచము, రత్నముల గద్దియలు, ముత్యముల దిండ్లు, జముఖానములు మొదలగునవి.

ఆభరణములు :

కంఠమాలికలు, కంఠసరములు, పచ్చలపథకములు, కెంపులపిడి, వజ్రముల ఉత్తరిగలు, వజ్రముల చేసరులు, కెంపుల కడియములు, నవరత్నములతో చేసిన బాహుపురులు, రత్నాంగుళీయకములు, వైడూరంపు జేయము, వజ్రముల చేసరుల హారములు, కట్టాణి ముత్యముల కంఠసరులు, సోగముత్యముల ఒంట్లు మొదలగు నవి నాయకరాజుల ఆభరణములు.

నాయకరాజుల ఆహారము :

పచ్చళ్లు, శాలితండులములు, బంగారు రంగుగల పప్పులు, శాకపు కూరలు, నువ్వుపొడి వేసిన కప్పురకోడి, కొబ్బరి తురుము, కరివేపపొడి వేసిన కుంకుమ కోడి, చణక చూర్ణము, మినప చూర్ణము వేసివండిన కస్తూరి కోడి, చక్కెరవేసి చేసిన పాలకోడి, లశున ఖండములు పలాండుఖండములు వేపుడు పొడులు వేసి చేసిన కట్టుకోడి, పన్నీరు పాయసము, వెన్న, చక్కెర వేసి వండిన చేపల యూర్పు, జాపత్రి కురాసాని మొదలగు సుగంధ ద్రవ్యములను వేసి చేసిన బిరంజి, వడియములు, వపవేసి చేసిన పొడికూరలు, చలువ యానం నిమ్మరసం వేసి పెరుగుతో కడిగి వండిన కందన గాయలు, కస్తూరి వేసి చేసిన ఉప్పురసం అప్పడములు, వడియములు, కర్పూరము వేసిన చిక్కుడు కాయలు, రొయ్యలు కలిపిన ఊర్పు మొదలగునవి.

పిండివంటలు :

పేణీలు, మండెగలు, లడ్వములు, పూర్ణ కలశములు, వెన్న కజ్జాయములు, మణుగుబూలు, అతిరసములు, సారసత్తులు, కరివడలు, దధివడలు, అద్రుపువడలు పప్పుకుడుములు, తెలికొక్కురొట్టె, టెంకాయరొట్టె, సంబారురొట్టె, తెరటుపాలు, తనిచాలు, టెంకాయపాలు, జీలకఱ్ఱపాయసము, చలువపాయసము, శిఖరిణులు మొదలగునవి.

ఫలములు :

రసదాడిపండ్లు, పనసతొనలు, తేనెలొవైచిన తియ్యమామిడి పండ్లు, ద్వీపాంతరమునుండి గొనివచ్చిన ద్రాక్షపండ్లు, ఖర్జూర ఫలములు, నేరేడు, రేగు, కిత్తడి, పాల, దోస, వెలగ పండ్లు, దానిమ్మ పండ్ల గింజలు మొదలగు ఫలములు.

ఇవికాక వెన్న, మీగడ, నిమ్మరసము, యాలకపొడివేసిన నీరు, మజ్జిగ మొదలగు పానీయములు, నాయకరాజుల ఆహారపదార్థములు.

ఆంధ్రవాఙ్మయమున, వంటకములను గూర్చి వ్రాసిన కవులు అరుదు. పలురకములయిన వంటలను వర్ణించిన ఖ్యాతి శ్రీనాధునిదే. కృష్ణదేవరాయలు, తెనాలి రామకృష్ణకవి మొదలగు వారు, మితముగా నొకటి రెండు వంటలను వర్ణించిరేతప్ప పలురకములయిన వంటకముల వర్ణనము గావింపలేదు. శ్రీనాధుని తరువాత ఆ ఖ్యాతి విజయరాఘవనాయకునిదే యని చెప్పవచ్చును.

వాద్యవిశేషములు :

వీణె, మురళి, రబాబు, తంబుర, కిన్నెర, ముఖవీణె, స్వరమండలము, రావణహస్తము, చెంగు, దండె, డక్కి, గట్టివాద్యములు, తాళము.

నాట్యవిశేషములు :

పదకేళి, కొరవంజి, శివలీల, గుజరాతి, దేశి. ఈ నాట్యములను చేయునపుడు, పైనపేర్కొనబడిన వాద్యములను ఉపయోగించెడివారు.

ఉత్సవములందుపయోగించెడి వాద్యవిశేషములు :

చిరుత మద్దియలు, కాహళలు, భేరులు, ఢక్కలు, నాగసరములు, నర గజములు, ధవళ శంఖములు మొదలగునవి.

ఈ అంశములేకాక తంజావుర వీధులందు జవ్వాది, కుంకుమ, మృగనాభి, పునుగు, కప్పురము, పూవుల సరములు, పగడములు, కెంపులు, పచ్చలు, మణులు మొదలగు వస్తువులు రాసులు పోసి విక్రయించెడివారని తెలియుచున్నది. మరియు ఆనాడు వేశ్యలు చందన, కుంకుమ, సంకుమదము మొదలగు సుగంధ ద్రవ్యము లతో నలుగుపెట్టుకొని గొజ్జంగి నీటితో స్నానమాడి, ఘనసార, కాశ్మీరగంధసారము

లను వొడలంతపూసుకొనెడివారని తెలియుచున్నది.[38]

మంత్రియైన గోవింద దీక్షితుని సారథ్యమున, సకల కళాపారంగతుడై, సకల విద్యావేత్తయై, గొప్పవీరునిగ, గొప్ప పరిపాలకునిగ పేరుగాంచిన రఘునాథనాయకుని జీవితవిశేషములను, దినచర్యను వ్యక్తముచేయు ఈ రెండు గ్రంథములు చరిత్ర కారులకు మిక్కిలి ఉపయోగములు. ఈ రెండు గ్రంథములు ఆనాటి సాంఘిక చరిత్రకు దర్పణమువంటివి.

రచనావిశేషములు :

ద్విపద, యక్షగానములైన ఈ రెండు గ్రంథములు విజయరాఘవనాయకుని రచనావైదుష్యమునకు, వర్ణనావైచిత్రికి ఆటపట్టులు. ఈతడుతండ్రియైన రఘునాథుని చరిత్రను దినచర్యను తెలుపు ఈగ్రంథములందు చిత్రరేఖాసమాగమము కథాసంవిధానము కొరకు పొందుపరచెనోలేక అదియును సత్యమగు అంశమోతెలియుటలేదు. తండ్రియొక్క అంతరంగిక విషయమును కుమారుడే వర్ణించుటచే సత్యమై యుండును. రాజులు భోగులు. వారెట్టి కార్యమొనర్చినను ఇతరులు ప్రశ్నింప వీలులేదుకదా ? అటులనే వారెట్టిరచనలు గావించినను అందరును మెత్తురేతప్ప విమర్శింపరు. విమర్శించిన దండనార్హులగుదురు. బహుదాప్రశంసలందుకున్న రఘునాథుడు ఒక వేశ్యయొక్క కోర్కెను తీర్చుటకై

"ఇక్షుశరాసనుడేచ మీచెలిని
రక్షించుటేమాకు రాజధర్మంబు"[39]

అని పలికి వేశ్యాగృహమునకేగుట రఘునాథుని రసికత్వమును వెల్లడిచేయుచున్నదే తప్ప, గొప్పతనమునకు తార్కాణమగుటలేదు. ఇది సత్యమగు సంఘటనమైనప్పటికి తండ్రియనుభవమునుగూర్చి కొడుకు వ్రాయుటకొంత అసమంజసముగ తోచుచున్నది. వేశ్యాలోలత్వము రాజధర్మముకాదు. కాని నాయకరాజులు వేశ్యాలోలురని, రసికాగ్రగణ్యులని ప్రతీతి. అదివారికొక విలాసము. వారిదృష్టిలో వేశ్యాలోలత్వము అనుచితముకాదనిపించుచున్నది. కనుకనే విజయరాఘవుడు, చిత్రరేఖారఘునాథనాయకులవిరహతాపమును, రఘునాథుని రసికత్వమును, వేశ్యల నెరజాణతనమును అతిరమ్యముగ వర్ణించెను. సందర్భానుసారముగ శృంగార రసమును చక్కగా పోషించెను.

తంజాపురవర్ణనము, రఘునాథుడు యుద్ధమునకేగునపుడు అలంకరించుకొను వర్ణన, అతని కొలువు సింగారము, చిత్రరేఖ కడకేగుతరి సింగారించుకొను విధము, అది యిది ఏమి ఈ గ్రంథములందలి ప్రతి వర్ణన వీనులకువిందు గొలుపుచు

38. రఘునాథనాయకాభ్యుదయము, p. 16.

39. రఘునాథనాయకాభ్యుదయము, ద్వి. ఆ. p. 64.

కనులముందు కదలాడునట్లుండును. ఆనాటి ద్విపద కవులలో విజయరాఘవుడు సాటిలేనివాడనుట అతిశయోక్తికాదు.

ప్రకృతివర్ణన యందీతనిది అందెవేసిన చేయి. అతిరమ్యమగు భావనను

"పద్మినీముఖపద్మ బాంధవంబెంచి
పద్మలోచన తనపతిగూడు వేళ
తానుండరావని తగవెంచినట్లు
భానుండు చనియెను పశ్చిమాంబుధికి"[40]

అని సూర్యాస్తమయమును, మృదుపదములలో శృంగార భావము వ్యక్తమగునటుల అందముగ వర్ణించెను.

విజయరాఘవుని వర్ణనలలో కొంత నవ్యత గోచరించును. ఈతని ప్రకృతి వర్ణనములలో ఉపమలు క్రొత్త రూపు సంతరించుకొన్నవి.

"గమకమౌచందువాకట్టించెననఁగ
నమరపథమున నమరెఁదారకలు"

అని తారకోదయమును,

"నవరంజిపళ్లెంబునందు నందముగఁ
గపురంపుటారతికైసేసెననఁగ
నుదయశక్తిమఁజాలనౌఅపుమీఱంగ
నుదయాద్రిపై జంద్రుఁడుదయించెనంత"[41]

అని చంద్రోదయమును వర్ణించెను.

శబ్దసృష్టియందు విజయరాఘవునిది అందెవేసినచేయి. గిలుకుమట్టెలు, కడియములు, సందిదండలు మొదలగు ఆభరణముల సవ్వడు లీతని రచనలో చోటుచేసుకొన్నవి. పాత్ర చిత్రణమునం దీతడు తక్కిన కవులకు మించెను. రఘునాథుని రూపచిత్రణ కనుల ముందు కదలాడును. ఆపాద మస్తకము రఘునాథుని రూపమును రమణీయముగ చిత్రించెను.[42] విజయరాఘవుని రచనా సామర్థ్యము చదివి ఆనందించదగినంత గొప్పది.

నాయకరాజుల వైభవ ప్రాభవములను, దినచర్యను, సాంఘిక స్థితిగతులను, మతపరిస్థితులను, రాజుల రాజకార్య నిర్వహణను, ముఖ్యముగ నాయకరాజులలో మేటియైన రఘునాథనాయకుని ఒకనాటి దినచర్యను, అనుభవమును, అతి విశదముగ, అలతి అలతి పదములతో రమ్యముగ రచించి, ఆనాటి చరిత్రను తెలిపిన విజయరాఘవనాయకుడు అభినందనీయుడు. తాను స్వయముగ చూచి,

---

40. రఘునాథనాయకాభ్యుదయము, p. 70.
41. రఘునాథనాయకాభ్యుదయము, p. 70.
42. రఘునాథ నాయకాభ్యుదయము, ప్ర.ఆ., pp. 24-25.

అనుభవించి రచించుటచే రచనయందు వాస్తవికత గలదు. ఈ గ్రంథములను చదివి ఆనాటి నాయకరాజుల చరిత్రను కనులకు కట్టునటుల చిత్రింపవచ్చును. తాను నిత్యము విలోకించుచు, అనుభవించిన విషయములగుటచే ప్రతి విషయమును ఛాయాచిత్రమునందువలె మన కనులముందు నిలిపినాడు విజయరాఘవుడు. ప్రతి విషయము మన కనులముందు జరుగుచున్నటుల భ్రమింపచేయునట్లు రచించు కవులు అరుదు. అట్టి కొద్దిమందిలో విజయరాఘవు డొకడనుట అతిశయోక్తికాదు.

చారిత్రకాంశములను ఏర్చి కూర్చి శృంగారకావ్యములుగా మలచి, రసరీతుల కెల్ల అనుగుణముగా తన కావ్యముల తీర్చిదిద్ది, రాజరికములోని రసికతను, పలుకు మెత్తందనమును, కవితలోని మాధుర్యమును జూపిన కవిరాజు విజయరాఘవుడు.

"ఒక్కొక్క యెడఁ జీని చక్కెర పానకం
 బానినట్లాహ్లాద మావహిల్ల
నొక్కొక్క యెడఁ దావి నెక్కొన విరజాది
 సరము లెత్తిన రీతి పరిమళింప
నొక్కొక్క యెడఁ జల్వలుప్పతిల్లఁగ మంద
 మారుతంబులు మించు మహిమ చెలఁగ
నొక్కొక్క యెడ మేనఁ జొక్కు సంపాదించు
 వెలఁది వెన్నెల తేఁట విధము మించ

కవిత రచియింప విజయరాఘవ విభుండె నేర్చు"నని ఆనాటి కవులే విజయరాఘవుని కవితను మెచ్చిరి. కావేటి నీటి తరంగములవలె పరుగులు తీయు శయ్యాసౌభాగ్యముగల ఈ రచనలు, సాహితీప్రియులకు, విమర్శకులకు, చరిత్రకారులకు అత్యంతము ప్రీతిపాత్రములు.

మన్నారు దాస విలాస ప్రబంధ యక్షగానములు - రంగాజమ్మ, విజయ రాఘవ కళ్యాణము - కోనేటి దీక్షిత చంద్రుడు, విజయరాఘవ చంద్రికా విహారము - కామరసు వేంకటపతి సోమయాజి

ఈ నాలుగు గ్రంథములు విజయరాఘవుని చరిత్రను, విజయరాఘవ నాయకుని వంశావళిని, ఆనాటి సాంఘిక స్థితిగతుల కొన్నింటిని, విజయరాఘవుడు కాంతిమతిని, మదనమంజరిని, లీలావతి యను వేశ్యను వివాహము చేసికొనిన అంశములను వివరించు గ్రంథములు.

ఈ గ్రంథముల వలన విజయరాఘవుని చరిత్ర యంతయు తెలియకపోయి నప్పటికిని కొన్ని చారిత్రకాంశములు తెలియుచున్నవి.

**రంగాజమ్మ :**

రంగాజమ్మ, విజయరాఘవనాయకుని ఆస్థాన కవయిత్రి. ఈమె రంగాజి అనియు వ్యవహరింపబడెడిది. ఈమె తండ్రిపేరు వేంకటాద్రి. తల్లిపేరు మంగమ్మ. ఇంటిపేరు పసుపులేటివారు.

ఈమె మన్నారు దాసవిలాసము (ప్రబంధము, నాటకము), ఉషాపరిణయము (ప్రబంధము), రామాయణ సంగ్రహము, భారత సంగ్రహము, భాగవత సంగ్రహము వ్రాసెను.

ఈమె విద్యావివేక సంపన్నురాలు. రాజనీతి విశారద. అష్టభాషా కవితా సర్వంకష మనీషా విశేష విశారద. సంగీతమున ఈమె లలిత మృదు పదములను రచించినటుల తెలియుచున్నది. ఈ విషయ మీమె తన ఉషాపరిణయమున తెలుపుకొనినది.

"వేంకటేంద్రుని పుత్రి వినుత సద్గుణధాత్రి
 ఘన యశోరాజి రంగాజి వినుమ
మాధుర్యమున మించు మన్నారు దాస
 విలాస ప్రబంధంబు లలితఫణితి
గావించి, మిగుల శృంగారంబు గన్పట్ట
 బదములు మృదు రసాస్పదములగుచు
రాణింప రచియించి రామాయణంబును
 భాగవతంబును, భారతంబు
సంగ్రహంబుగ రచియించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మదనర
బరగ హరివంశమున నుషాపరిణయ కథ
తెనుఁగు గావింపుమిక నీవు తేటగాగ"[43]

ఇందు మన్నారు దాసవిలాస నాటక ప్రబంధములు, ఉషాపరిణయము తప్ప తక్కిన గ్రంథము లేవియు నేడు లభించుట లేదు. ఈమె వైదుష్యము, ఈమె గ్రంథములందలి గద్యల వలన తెలియుచున్నది.

"ఇది శ్రీమద్రాజ గోపాల కరుణా కటాక్ష వీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారస్వత ధురీణయు, విచిత్ర తరపత్రికాశతలిఖిత వాచికార్థాన గాహన ప్రవీణయు, తత్ప్రతి పత్రికాశత స్వహస్త లేఖన ప్రశస్తి కీర్తియు, శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్టభాషా, కవితా సర్వంకష మనీషా విశేష విశారదయు, రాజనీతి, విద్యావిశారదయు, విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్కవిజన స్తవనీయ వివేకయు, మన్నారు దాన విలాసనామ

---

43. రంగాజమ్మ, ఉషాపరిణయము, p. 4

మహా ప్రబంధన కృతలక్షణయు, మహనీయ రామాయణ భారత, భాగవత కథా సంగ్రహ విచక్షణయు, పసుపులేటి వేంకటాద్రి బహు జన్మతపః ఫలమును, మంగమాంబా గర్భ శుక్తి ముక్తా ఫలంబును, రంగద్గుణ కదంబయునగు రంగాజమ్మ వచన రచనా చమత్కృతిం జన్నుమీఱు ఉషాపరిణయ ప్రబంధమునందు తృతీయాశ్వాసము."[44]

మన్నారు దాసవిలాస నాటకమునందలి గద్యయు నిట్టిదియే. ఈ గద్యవలన, విజయరాఘవు డీమెకు కనకాభిషేకమును చేసినటుల తెలియుచున్నది. ఈమె రాజగోపాలుని దయవలన కవయిత్రి యయ్యెననియు చిత్ర విచిత్ర శతలేఖినీ విద్యయందు ప్రవీణురాలనియు, శృంగార రస పద కవితా సర్వంకషయనియు, రాజనీతిజ్ఞురాలనియు, అష్టభాషా కవితా విశారదురాలనియు, విద్వత్కవులచే పొగడబడినదనియు తెలియుచున్నది. ఈమె సంగీత సాహిత్యముల యందే కాక వ్యాకరణమునందును ప్రావీణ్యురాలైనటుల మన్నారుదాసవిలాస నాటకమువలన తెలియుచున్నది.

నాయకరాజుల ఆస్థానమున కనకాభిషేక ఘనగౌరవమును పొందిన విదుషీ మణులలో ఈమె రెండవ వ్యక్తి. రఘునాథనాయకుడు మధురవాణి కవితా మాధుర్యమునకు మెచ్చి కనకాభిషేకము చేసెను. విజయరాఘవుడు రంగాజమ్మ పాండిత్యమునకు మెచ్చి కనకాభిషేకమ్మును చేసెను. మన కవులయందు, కవయిత్రు లలో, కనకాభిషేక గౌరవమును పొందినవారు అత్యల్పసంఖ్యాకులు. కవులయందు శ్రీనాథుడు, మల్లినాథసూరి, రఘునాథనాయకుడు ఈ గౌరవమును పొందిరి. స్త్రీలు ఇట్టి గౌరవమును పొందుట తంజాపురనాయకరాజుల ఆస్థానమునందు మాత్రమే కాగా నట్టి గౌరవమును పొందినవారిలో రంగాజమ్మ యొకతె.

ఈమె అష్టభాషలయందు కవిత్వము చెప్పగల దిట్ట. సంస్కృతము, ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశము, తెలుగు భాషల యందు కవిత్వము చెప్పెను.

"రంగాజమ్మ వేశ్యయని పూర్వచరిత్రకారు లభిప్రాయపడియున్నారు. వీరు జన్మముచే వేశ్యలుగా నుండియు, సంస్కారవిశేషముచేత జాణలై సాంఘిక జీవిత మాధుర్యము చవిజూపిన సరసురాండ్రై యత్యున్నతస్థానము నాక్రమించినవారు. రఘునాథరాయుల కాలమున రామభద్రాంబ, తిరుమలాంబ, మధురవాణి, విజయ రాఘవుని కాలమున రంగాజి, కృష్ణాజి మున్నగువారు కులమునకు వేశ్యలేయైనను, నేకచారిణీ వ్రతము ననుసరించినవారు. కావుననే వీరిలో కొందరు తమ నాయకుల ధర్మపత్నులుగా జెప్పికొన్నారు. రంగాజమ్మయు నట్టి యేకచారిణీవ్రతసంపన్నురాలై సాహిత్యసామ్రాజ్యము నధిష్టించిన పూజ్యురాలు. పరిశోధక శిఖామణులు,

44. రంగాజమ్మ, ఉషాపరిణయము, అశ్వాసాంత పద్యము.

విద్వద్వర్యులు మా రామకృష్ణ కవిగారు 'మధురవాణిని' గూర్చి వ్రాయుచు నీ విషయమున పైయభిప్రాయమునే వ్యక్తపరచినారు" అని నిడుదవోలు వేంకట రావుగారు[45] రాజగోపాల విలాస పీఠికనందు వ్రాసిరి.

ఈమె విజయరామవుని ఉంపుడుకత్తెయనియు, విజయరామవు డెప్పుడు ఈమెతో నుండుట చూచి, యాతని పట్టపురాణి ఆగ్రహము చెంది, ఒకచేటిద్వారా దూషణోక్తులతో వార్త పంపెననియు, దానికి ఆమె

"ఏవనితల్ మముందలఁ పనేమిపనో తమరాడువారుగా
రోవలపించు నేర్పెఱుగరో తమ కౌగిటిలోన నుండగా
రావదియేమిరా విజయరాఘవ యంచిలుదూరి బల్మిచే
దీవరకత్తెనై యిటుల తీసుకవచ్చితినా తలోదరీ."

అను పద్యము వ్రాసి పంపెననియు నొక కథ గలదు.

ఆమె వేశ్యకులసంజాత అయినప్పటికిని ఉంపుడుకత్తెయని చెప్పుటకు మనకెట్టి ఆధారములును లేవు సరికదా ఆమె రచనలవలన విజయరామవుని ధర్మపత్ని అని స్పష్టపడుచున్నది. మన్నారుదాసవిలాసనాటకమున 'నచ్యుత విజయరామవసార్వభౌమ ధర్మపత్నియైె రంగుమీఱు రంగాజమ్మ' అని వ్రాసికొనినది. దీనినిబట్టి ఆమె ఉంపుడుగత్తె కాదను విషయము స్పష్టపడుచున్నది. కేవలము ఉంపుడుగత్తెగనున్న స్త్రీ, తానెంత జాణయైనను, తాను రచించిన కావ్యమున ధర్మపత్నినని చెప్పుకొనునంతటి సాహసకార్యమును చేయనేరదు. ఆమెయనిన గల మక్కువకొలది విజయరామవుడు రంగాజమ్మను వివాహము చేసికొనియే యుండి యుండును.

**కోనేటి దీక్షితచంద్రుడు :**

ఈతడు విజయరామవుని ఆస్థానకవి. వైష్ణవుడు. ఇతడు సంగీత సాహిత్య, విద్యాధురీణధౌరేయుడు. భారత భాగవతాది శిక్షావైచక్షణ్య విజిత విబుధాచార్యుడు, గురురాజ శతక్రతు శ్రీనివాస దేశిక ప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యుడు, ప్రతిపక్ష కవి శిక్షణ విచక్షణుడు, సకల సద్గుణ సాంద్రుడు. రామానుజాచార్య తనయాగ్ర గణ్యుడు. ఈ విషయముల నీతడు గ్రంథారంభ, అంతములయందు చెప్పుకొనెను. ఇంతకంటెను ఈతని విషయములు తెలియుటలేదు.

**కామరసు వేంకటపతి సోమయాజి :**

ఈతడు విజయరామవనాయకుని పట్టపుకవి. విజయరామవ చంద్రికా విహార భరతవాక్యమున "ఇవ్విధంబున విజయరామవ పట్టభద్రుని పట్టంపుగవియైన కామరసు వేంకటపతి సోమయాజి హవణించిన విజయరామవచంద్రికావిలాస

45. చెంగల్వ కాళకవి, రాజగోపాల విలాసము, పీఠిక.

నాటక చాటుకావ్యంబునకు..." అని వ్రాసికొనుటవలన ఈ విషయము తెలియు చున్నది. ఇంతకుమించి ఈతని గూర్చి మనకు దెలియదు.

## చారిత్రకాంశములు

మన్నారుదాసవిలాసనాటక, ప్రబంధములు, విజయరాఘవచంద్రికా విహారము, విజయరాఘవకల్యాణముల వలన నాయకరాజుల వంశచరిత్ర తెలియుచున్నది. ఈ గ్రంథములు నాయకరాజులు నాల్గవజాతివారని ఆ వంశమున కృష్ణభూవరుడు జన్మించెనని తెలుపుచున్నవి. కృష్ణభూవరుని పుత్రుడు తిమ్మరాజు. తిమ్మరాజునకు గోపమాంబవలన తిమ్మనృపాలుడు జన్మించినటుల ఊహింపవలసివచ్చుచున్నది.

గోపమాంబకు......తలపతి యుదయించె అని, తరువాత అతులకీర్తి విశాలుడా తిమ్మనృపాలుడని మన్నారుదాన విలాస ప్రబంధమున గలదు. చుక్కలు పెట్టిన భాగము శిథిలమై తరువాత తిమ్మనృపాలునకు బయ్యాంబవలన అని వర్ణింప బడి ఉండుటచే తిమ్మరాజు పుత్రుడు తిమ్మనృపాలుడని ఊహించుట న్యాయము. తిమ్మనృపాలునకు బయ్యాంబవలన పెదమల్ల, పినమల్ల భూపాలురు, పెదచెవ్వ, పినచెవ్వ నృపతులు జన్మించిరి. వీరిలో పినచెవ్వ నృపతి తంజాపురమునకు పట్టాభి షిక్తుడయ్యెను. ఇతనికి మూర్తిమాంబయందు అచ్యుతరాయడు జన్మించెను. అచ్యుతరాయడు మన్నారు దేవాలయమునకు గోపురము కట్టించెను. పెక్కు కైంకర్యములు చేసెను. రామేశ్వరమున పెక్కు మహాదానములు చేసెను. విష్ణాలయములున్న పెక్కు తావుల కైంకర్యములొనర్చెను. ఆ స్థలములేవో తెలియుటలేదు. పాండ్యతుండీరపతులను జయించెను. ఇతనికి మూర్తిమాంబ యందు రఘునాథుడుదయించెను. రఘునాథుడు రామదేవరాయలను విజయ నగర సింహాసనమున నిలిపెను. నేపాళరాజు శరణుకోరగా అతని శత్రువులను జయించి రాజ్యము నిప్పించెను. చోళగుని సాధించి చోళదేశమున శాంతిభద్రతలు నెలకొల్పెను. షోడశదానములు చేసెను. ప్రతిదినము లక్షమంది బ్రాహ్మణులకు అన్నదానము చేసెడివాడు. వైష్ణవులకు అగ్రహారములనిచ్చెను. కవులకు విద్వాంసు లకు కనకాభిషేకము చేసెను.[46] ఈతడు పుత్రులకొరకు రాజగోపాలుని ప్రార్థింపగా విజయరాఘవనాయకుడుదయించెను. ఇవి ఈ గ్రంథముల వలన తెలియుచున్న విజయ రాఘవనాయకుని పూర్వీకుల చరిత్ర. ఈ అంశములు రఘునాథునిగూర్చి, రఘునాథాభ్యుదయ, రఘునాథనాయకాభ్యుదయ కావ్యములను పరిశీలించునపుడు చర్చించినవే.

## విజయరాఘవనాయకుడు

విజయరాఘవనాయకుడు క్రీ.శ. 1633 నుండి 1673 వరకు రాజ్యము

46. మన్నారుదాసవిలాసము, ప్రబంధము, p. 16. (D. 216. A.U. Library, 32).

చేసెను. రంగాజమ్మ, కోనేటి, దీక్షితచంద్ర, కామరసువేంకటపతి సోమయాజి, విజయరాఘవుని రాజకీయ జీవితమును వివరముగ తెలుపలేదు. కాని కొన్ని విషయములు మాత్రము వీరి గ్రంథములవలన తెలియుచున్నది. రఘునాథునకు విజయరాఘవనాయకుడొక్కడే కుమారుడని వీరుతెల్పిరి. కాని రఘునాథునకు అచ్యుత నాయకుడు, అచ్యుతరామభద్రనాయకుడు అను మరి ఇరువురుపుత్రులు కలరు. ఈ అంశమును ఈకవులు, కవయిత్రి పేర్కొనలేదు. వీరేకాక విజయరాఘవుని ఆస్థానము నుండినకవులుగాని కవయిత్రులుగాని పేర్కొనలేదు. దీనికి కారణము తెలియదు. కాని విజయరాఘవుడు తాను రచించిన రఘునాథనాయకాభ్యుదయ, రఘునాథాభ్యుదయములందు అచ్యుత నాయకుడు అగ్రతనయుడని తెలిపెను. తరువాత అచ్యుతరామభద్రుడు మొదలగు తనయులు రఘునాథునితో ఊరేగుటకు వెళ్ళినటుల వర్ణించెను.[47] విజయరాఘవుడు స్వయముగా తెలిపిన ఈ విషయమును తక్కిన కవులెవ్వరును తెలుపలేదు. విజయరాఘవుడు వీరిరువురి కన్నులు తీయించి కారాగారమున బంధించి తాను రాజ్యమును కైవసమొనర్చుకొనినట్లుతెలియుచున్నది.[48] కనుక విజయరాఘవునకు ఇద్దరు అన్నలున్నటుల స్పష్టము. కాని పెద్దవారు రాజ్యమునకు రాక చిన్నవాడు రాజగుటకు కారణము తెలియుటలేదు. కాని నాయకరాజులలో ప్రతి తరమునను చిన్నవారే రాజగుట కన్పించుచున్నది. రాజగోపాల విలాసమున రఘునాథునకు అచ్యుతరామభద్రుడను పుత్రుడున్నటుల తెలియుచున్నది.[49]

చరిత్రకారుల అభిప్రాయము ప్రకారము క్రీ.శ. 1633లో విజయరాఘవుడు రాజ్యమునకు వచ్చెను. రఘునాథుడు క్రీ.శ. 1630లో మరణించెను. రఘునాథుడు మరణించిన వెంటనే విజయరాఘవుడేల రాజ్యమునకు రాలేదో ఈ గ్రంథములు తెలుపలేదు. ఈ మూడు సంవత్సరముల కాలము విజయరాఘవుడు రాజ్యముకొరకు సోదరులతో కలహించి ఉండునని చరిత్రకారుల అభిప్రాయము. విజయరాఘవుడు రఘునాథనాయకుని పుత్రులలో చిన్నవాడనుటకు విజయరాఘవుని రచనలే సాక్ష్యము. రఘునాథుడు తోపూరువంమ గొబ్బూరు జగ్గరాజుతో గావించు యుద్ధమునకు రామభద్రుని తీసికొని వెళ్లినటుల విజయరాఘవుడు "రామభద్రగజాధి రాజంబునెక్కి, రామభద్రకుమారత్నంబుకొలువ' అని వర్ణించెను.[50] రణరంగమునకు అసమర్థుడైనచో తప్ప జ్యేష్ఠుని విడచి కనిష్ఠుని తీసుకుని వెళ్లుట అరుదు. కనుక విజయరాఘవుడు రఘునాథుని పుత్రులలో ఆఖరి వాడనుట స్పష్టము. తనకంటె పెద్దవారిరువురుండగా తానెట్లు రాజాయెనో తెలియుట లేదు. విజయరాఘవుని సోదరులను గూర్చి నాయకరాజుల గురువైన తాతాచార్యులు

47. రఘునాథనాయకాభ్యుదయము, ద్వి. ఆ. p. 32.
48. V. Vridhagirisan, The Nayakas of Tanjore, pp. 126-127, 53-54.
49. చెంగల్వకాళకవి, రాజగోపాలవిలాసము, అవతారిక, p. 22.
50. రఘునాథాభ్యుదయము, p. 23.

తెలుపలేదు. విజయరాఘవుడు తెలిపిన వంశావళియందును ఈ ప్రశక్తిలేదు. తాను వ్రాసిన గ్రంథములందు అచ్యుత, రామభద్రులను గూర్చి ప్రస్తావించిన విజయ రాఘవుడు వంశావళియందు తెలుపక పోవుట చిత్రము. సమకాలీన సాహిత్య కారులును ఈ అంశమును తెలుపకపోవుట చోద్యముగనున్నది. బహుశః రాజు తమ్ము దండించునను భయముతో చెప్పటమానిరేమో! కాని రాజ చూడామణి మాత్రము తన ఆనంద రాఘవనాటకమున భరతవాక్యమునందు రఘునాథనాయకు నకు అచ్యుతరామభద్రులను పుత్రులున్నటుల తెలిపెను. కనుక విజయరాఘవుడు రఘునాథనాయకుని పుత్రులలో చివరి వాడనుట స్పష్టమే. కనుకనే చరిత్రకారులు విజయరాఘవుడు రఘునాథనాయకునికి అధర్మయుక్తమైన వారసుడని అభిప్రాయ పడుచున్నారు.

విజయరాఘవనాయకుడు నేపాళభూపాల స్థాపనాచార్యుడు, పాండ్యతుండీరాధి సమరవిరోధియోధయూథభీకరుడు, ఉత్తమ రాజవరాళి, రణముల జగజెట్టి, బహు దానపరుడు, సహజకీర్తిస్ఫూర్తి, సర్వజ్ఞమూర్తి, రతులకు రతిరాజు, నిత్యాన్నదాత, ఏకవీరుడు, జగదేకవదాన్యుడు, భానుసమానుడు, వరతత్త్వవేది. ఈతడు పరాక్రమశాలి. శత్రురాజుల నిగూఢతంత్రములు తెలిసికొను ఇంగితజ్ఞత, వైరి రాజులను నిగ్రహించు శక్తి, పరిపంథి వర్గమును స్తంభింపచేయు మగటిమి, పర రాజులను యంత్రపు బొమ్మలవలె నాడించు బుద్ధిసూక్ష్మత ఈతనిలో మూర్తీభవించి ఉన్నవి. ఒకనాడే ఐదారు యోజనములమేర దాడి వెడలి తిరిగివచ్చు దండితనము, ఒక గుఱ్ఱముపైనుండి వేరొక గుఱ్ఱముపైకి లంఘించు లాఘవము, మావంతు నెది రించి ఏనుగు పైకి ఎగిరి దానినదలించు భుజశక్తి, ఎట్టిశూరునైన ఎదుర్కొని వాని మర్మముల నాటునట్లు సూటిగా కత్తిమీటు చాకచక్యము విజయరాఘవుని సొత్తని, విజయరాఘవుని ఆస్థానకవి విజయరాఘవుని పరాక్రమమును వర్ణించెను.[51] కాని విజయరాఘవుడు భీరుడు, అసమర్థుడు, రాజనీతి కుశలతలేనివాడని తెలియుచున్నది. తన వంశీయులందరు విజయనగర ప్రభువుల ఎడ భక్తికలిగి ఉండిరి. కాని విజయ రాఘవుడా పద్ధతిని విడిచెను. క్రి.శ. 1642 లో విజయనగర సింహాసన మధిష్ఠించిన మూడవ శ్రీరంగరాయలకు సహాయము చేయుటకు నిరాకరించి అతని శత్రువైన మధుర తిరుమలనాయకునకు తోడ్పడెదనని వాగ్దానముచేసి చివరకు మాట నిలబెట్టు కొనలేకపోయెను. అందులకు మధురనాయకు డీతనికి శత్రువాయెను. వీరవైష్ణవ మతావలంబియై స్త్రీలోలుడైన విజయరాఘవుని అసమర్థత గుర్తించి గోలుకొండ బీజపూరునందలి మహమ్మదీయు లీతని రాజ్యముపైకి దండెత్తివచ్చి కొల్లగొట్టిరి.[52] విజయరాఘవుడు వారికి అపారమైన ధనమిచ్చి తాత్కాలికముగ తన్నుతాను

51. చెంగల్వ కాళకవి, రాజగోపాల విలాసము. పీఠిక, pp. 26-27.

52. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి, p. 375.

రక్షించుకొనెను. మహమ్మదీయులకు లంచమిచ్చుటకై విజయరాఘవుడు ప్రజలను పీడించి పన్నులు రాబట్టుటచే ప్రజలలో అసంతృప్తి ప్రబలెను. అంతేకాక 1662 ప్రాంతమున కాటకమువచ్చి ప్రజల బాధ మరింత హెచ్చెను. ఈతడు తాతాచార్యుల శిష్యరికమున కేవలము వైష్ణవమతమునే ఆదరించి అన్యమతములను బాధించెను. ఈ అంశమును రంగాజమ్మకూడ

"యితర మతముల నిరసించి యిలను వెలయ
వైష్ణవమతంబె నిలిపె శాశ్వతముగాఁగ"

అని తెలిపెను.[53] దానితో ప్రజలు విజయరామవునియెడ అసంతుష్టులైరి. 1673 లో మధురనాయకుడు చొక్కనాథుడు తంజావురముపైకి సేనను పంపి దానిని స్వాధీనము చేసికొనెను. విజయరామవుడు, అతని కుమారుడు యుద్ధమున మరణించిరి.[54]

విజయరామవుని తరువాత అతని మనుమడు చెంగమలదాసు క్రీ.శ. 1674–1675 వరకు రాజ్యము పరిపాలించెను.[55] తరువాత నాయకరాజుల రాజ్యమంతరించి తంజావురమున మహారాష్ట్రుల ప్రాభవము పెరిగెను. నిజమునకు విజయరాఘవునితోనే నాయక రాజ్యమంతరించెనని చెప్పవచ్చును.

వీరుడు, శూరుడు, భక్తుడు, కవి, కవిపండితపోషకుడు, దానపరుడు అని సమకాలీన సాహిత్యములు పొగడుచున్న విజయరాఘవునిపట్ల చరిత్రకారులకు సదభిప్రాయము లేదనుట పై అంశములవలన స్పష్టపడుచున్నది. ఈతడు రాజు కాకమునుపే ప్రజలలోను మంత్రి సామంతాది రాజోద్యోగులలోను మంచి పలుకుబడి సంపాదించి రాజ్యము కైవసము చేసికొనియుండును. క్రమముగా స్త్రీలోలుడై రాజ కార్యములందు ఆసక్తి చూపక అసమర్థుడై ఉండును.

విజయరాఘవుని పట్టాభిషేక విషయమున అభిప్రాయభేదము కన్పడుచున్నది. ఈతడు క్రీ.శ. 1633 లో శ్రీముఖనామ సంవత్సర శ్రావణశుద్ధ ద్వాదశి బుధవారము నాడు పట్టము కట్టుకొనెను. ఆనాడే షోడశమహాదానములు చేసెను.[56] అనుట స్పష్టము. ఈతడు పట్టాభిషేకము చేసుకొనిన సంవత్సరమే దానములను చేసెను. ఈ అంశము రఘునాథాభ్యుదయమునందు గలదు. అనగా పట్టముకట్టుకొనిన తరువాతనే కావ్యరచన జరిగినదనుట స్పష్టము. కావ్యమును నాటకముగ మరల వ్రాసెను. నాటకము వ్రాసినతరువాతనే విజయరాఘవునకు పట్టాభిషేకము జరిగి నటుల 'నిజలీలావిలాస శృంగాటకంబుగా నాటకంబు హవణించిన తన ముద్దుపట్టి యగు విజయరాఘవ పట్టభద్రునకు పట్టంబు గట్టి' అని విజయరాఘవుడు రఘునాథా

53. మన్నారుదాస విలాసనాటకము, pp. 25–26.
54. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 375.
55. V. Vridhagirisan, The Nayakas of Tanjore, pp. 162-167.
56. రఘునాథనాయకాభ్యుదయము, ఆంగ్ల పీఠిక, p. 30.

భ్యుదయమున తెల్పెను.[57] రఘునాథనాయకుడు 1630 న మరణించుట చారిత్రక సత్యము. విజయరాఘవుడు 1633 న రాజ్యమునకు వచ్చుట సత్యమే. మరణించిన రఘునాథుడు విజయరాఘవున కెట్లు పట్టము కట్టెనో అనూహ్యము. విజయరాఘవుడు స్వయముగ ఇట్టి అసత్యములు వ్రాయుటకు కారణము కన్పట్టుటలేదు.

విజయరాఘవుడు చిన్నతనమునందే పెక్కుమంది శత్రువులను జయించినట్లు రంగాజమ్మ తెలిపెను.[58] ఈతడు రాయల సాహిత్యరాయ పెండేరమును శారదా ధ్వజమును సంపాదించెను.

విజయరాఘవనాయకుడు - మతము :

విజయరాఘవనాయకుడు రాజగోపాల భక్తుడు. వీరవైష్ణవుడు. ఈతని గురువు శతక్రతు శ్రీనివాస తాతాచార్యులు. ఈతడు భగవంతుని కొలిచినట్లే గురువును కూడా నిత్యము అతిభక్తితో కొలిచెడివాడు. ఈతనికి తండ్రియనిన మిక్కిలి భక్తి.[59] ఈతని దృష్టిలో తండ్రి రఘునాథుడు రాజగోపాలుని అపరావతారమే. విజయరాఘవుడు తాను వ్రాసిన పెక్కు గ్రంథములను రాజగోపాలదేవున కంకిత మిచ్చెను. దక్షిణ ద్వారకను ద్వారకాపురి కన్న అందముగ తీర్చి దిద్దెను. ప్రతి దినము భాగవతాది పురాణములను వినెడివాడు. రత్నములతో చేయబడిన జపమాలిక చేతబూని అష్టాక్షరీ మంత్రము, రాజగోపాల మంత్రము పఠించి తరువాత దానము లొనర్చెడివాడు. శఠగోపములను ఆరాధించెడివాడు. చెంగల్వ, చేమంతి, జాజి, తమ్మిపూవులతో, తులసిదళములతో సహస్రనామార్చన చేసెడివాడు. పూజాదికములు ముగిసిన తరువాతనే కొలువు తీర్చెడివాడు. ఈతడు కేవలము వైష్ణవ మతాభిమానముతో ఆగక పరమతములను ద్వేషించెను.[60] ఈతని తండ్రి తాత లందరును వైష్ణవ మతాభిమానులే. కాని వారు పరమతములను ఆదరించిరి. మతగురువులను సత్కరించిరి. రఘునాథుడు సురేంద్ర, సధీంద్రులను మధ్వగురువులను గౌరవించి, సధీంద్రునకు కనకాభిషేకము చేయించెను.[61] ఈతని మంత్రి గోవింద దీక్షితుడు స్మార్తుడు. విజయరాఘవుడు తాత తండ్రులవలె పరమతములను ఆదరించక ప్రజాభిమానమునకు దూరమాయెను. వైష్ణవ మతమనిన విజయరాఘవునకు గల వెర్రి అభిమానమే అతని సర్వనాశనమునకు కారణమనిపించుచున్నది. క్రీ.శ.

57. రఘునాథాభ్యుదయము, p. 56.
58. మన్నారుదాస విలాసప్రబంధము, p. 22. (D. 216 A.U. Library).
59. మన్నారు దాస విలాస ప్రబంధము, ప. 25, p. 221. (D. 216. A.U. Library 32)
60. మన్నారు దాస విలాస నాటకము, pp. 25-26,
61. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్రనాయక రాజచరిత్రము, p. 254.

1673 లో మధుర చొక్కనాథుడు తంజాపురముపైకి తన దళవాయిని పంపెను. మధుర సేనలు ఫిరంగులతో కోట తలుపులను బగులగొట్టినవి. ఆ సమయమున విజయరాఘవుడు పూజలో నుండి భటులు వచ్చి చెప్పినా పూజ విడువక శత్రువులు రానీ చూచుకొందుమని చెప్పెనట.[62] దీని వలన విజయరాఘవునికి మతమనిన గల పిచ్చి ఎంత వెర్రితలలు వేసినదో అర్థమగుచున్నది. చివరికా యుద్ధమున విజయ రాఘవుడు పుత్రునితో సహా వీరమరణము నొందెను. రాణివాసపు స్త్రీలందరు ఆత్మ హత్య చేసికొనిరి.

వీరునిగా రాజ్యము చేపట్టి వీరునిగా వీరమరణము పొందినప్పటికీ విజయ రాఘవుడు రాజకీయ పరిజ్ఞానమంతగా లేనివాడనుట అతిశయోక్తికాదు. రాజ్య మంతయు అల్లకల్లోలముగ నుండి, శత్రురాజులు మాటిమాటికి దాడిచేయుచున్నను, మధుర కవితలు చెప్పుచు, మదవతులతో కాలము గడుపుచు, రాజకీయములను సరిగ అవగాహన చేసికొనక, శత్రువులను మిత్రులుగ, మిత్రులను శత్రువులుగ మార్చుకొని, మత పారవశ్యముతోడు కాగ రాజ్యమును సర్వనాశన మొనర్చుకొనిన విచిత్ర వ్యక్తి. ఈతని రాజ్యమున వైష్ణవులు నేరము చేసినను దండించుటకు రాజాధికారులు భయపడెడివారట.[63] విజయరాఘవుడు తానాలోచించక గురువు చెప్పినట్లు పరమతములను ఆదరించకపోవుటయే అన్ని అనర్థాలకు మూలమైనది.

ఈతడు పదహారు దానములు చేయుటయేకాక నిరతాన్నదాత. తండ్రి వలె ప్రతి దినము వేలమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టించెడివాడు. బ్రాహ్మణులకు పెక్కు అగ్రహారములను కూడా దానమిచ్చెను. కాని ఎన్ని చేసినప్పటికి ప్రజాదరణ మును పొందలేక పోయెను. రాజకీయ చతురత లేకపోవుటచే అటు విజయనగర ప్రభువులకు, ఇటు మధుర చెంజిరాజులకు శత్రువాయెను. విజయనగర ప్రభువైన శ్రీరంగరాయల దాడికి తట్టుకొనలేక మధురరాజు గోల్కొండ సుల్తానులతో స్నేహము పెంపొందించు కొనెను.

విజయరాఘవుడు మోసగించుటచే కోపించి మధురరాజు గోల్కొండ సుల్తానులను తంజాపురముపైకి దండెత్త పురికొల్పెను. క్రీ.శ. 1653 లో తంజా పురముపై సుల్తానులు ముట్టడిజరిపిరి. తరువాత కొన్నాళ్లు ప్రశాంతముగ గడచినది. క్రీ.శ. 1659 లో మధురరాజు మరణించి ముత్తు వీరప్ప రాజ్యమునకు వచ్చిన తరువాత సుల్తానులు మరల తంజాపురమును ముట్టడించిరి. విజయరాఘవుడు ఎదిరించలేక స్త్రీజనమును తీసుకొని వల్లంకోటకు పారిపోయెను. శత్రుసేనలు తంజాపురమును కొల్లగొట్టినవి. మరల క్రీ.శ. 1660–61 కాలమున మధుర చొక్కనాథుడు విజయరాఘవుని ఓడించెను. ఈ యుద్ధములతో ప్రజలు అలజడి

62. వేటూరి ప్రభాకరశాస్త్రి సంపాదకత్వం, తంజావూరి యాంధ్రరాజుల చరిత్ర, p. 25.

63. విజయరాఘవనాయకుడు, విప్రనారాయణ చరిత్ర, p. 56.

పాఱిరి. అశాంతి ప్రబలినది. ఎన్నియో కుటుంబములు దోపిడికి గురియైనవి. విసుగెత్తిన ప్రజలు తంజాపురమును విడిచి మధుర, శాంతోం మొదలగు చోట్లకు పోయిరి. వచ్చినవారు వారిని ఆదరించినట్లే ఆదరించి విదేశములకు బానిసలుగ అమ్మిరి. విజయరాఘవు డివేమియు పట్టించుకొనక సాహిత్య సేవలోను, కాంతల సేవలలోను మునిగి ప్రజలకు అనిష్టుడై చివరకు క్రీ.శ. 1673 లో చొక్కనాథుని సేనలతో పోరాడి మరణించెను.

**విజయరాఘవనాయకుడు — ఆస్థానవైభవము, సారస్వతపోషణము :**

విజయరాఘవనాయకుడు ఎందరో కవులకు కవయిత్రులకు ఆశ్రయమిచ్చి ప్రశంసాపాత్రుడైనాడు. సంగీత సాహిత్యనాట్యాది విద్యలు విజయరాఘవుని కాలమున బహుదా విస్తరించినవి. తాను అనేక గ్రంథములను రచించుటయే కాక బహుగ్రంథకర్తల సాహిత్యకృషికి తన ఆస్థానమున దోహదము కల్పించినాడు. అతని ఏలుబడిలో తెలుగు సాహిత్యము మిక్కిలి అభివృద్ధి గాంచినది.

ఈతడు సాహిత్యరాయ పెండేరమను బిరుదందె ధరించెడివాడు. విద్యాగోష్ఠి నున్నపుడీ పెండేరమును ధరించెడి వాడు. ప్రక్కన శారదాధ్వజము ఒప్పుచుండెడిది.

ఈతని ఆస్థానమున చంద్రరేఖ, రంగాజి, కృష్ణాజి మొదలగు కవయిత్రులు, చెంగల్వకాళకవి, కామరసు వేంకటపతిసోమయాజి (పట్టపుకవి), కోనేటి దీక్షిత చంద్రుడు, పురుషోత్తమ దీక్షితుడు మొదలగు కవులుండిరి. క్షేత్రయ్య విజయ రాఘవుని దర్శించి విజయరాఘవునిపై పెక్కు పదములు చెప్పెను.

ఈతడు రంగాజమ్మ కవిత్వమునకు మెచ్చి ఆమెకు కనకాభిషేకము చేసెను. ఈతని ఆస్థానమున కవులు కవయిత్రులు సమస్యాపూరణములు, సాహిత్యచర్చలు చేయు చుండిరి. విద్యాప్రసంగములు, సమస్యాపూరణములు అష్టభాషలలోను జరుగుచుండెడివి. వ్యాకరణశాస్త్రవిషయ వివాద చర్చలు జరుగుచుండెడివి.

ఈతడు ఆంధ్రమున మంచికవిత్వమును చెప్పసమర్థుడు. ఈతడు రచించిన గ్రంథముల పట్టిక రఘునాథనాయకుని చరిత్రను తెలుపుతరి తెల్పితిని. కనుక ఇచట మరియొకమారు చెప్పనవసరము లేదు. ఒకతరి చీనిచక్కెర పానకమువలె మధురముగ, మరియొకతరి విరజాజి పూదండవలె పరిమళయుక్తముగ, ఒకయెడ మలయమారుతమువలె చల్లగ, ఇంకొకతరి నిండువెన్నెలవలె నిరతిశయాహ్లాదకర ముగ నుండునట్లు కవితచెప్పు చాతుర్యము విజయరాఘవునకే కలదని అతని రచనలవలన తెలియుచున్నది. ఇతడు యక్షగానములను వ్రాసి, నాటకములను ఆదరించి వాఙ్మయసేవ చేసినాడు.

విజయరాఘవుడు రాజగోపాలవిలాసభవనమున నూత్నరత్నకంబళముపై కొలువుతీరెడివాడు. కొలువుతీరుసమయమున వారిజాక్షులు ఈతనిని పరివేష్టించి యుండెడివారు. నగరిఅన్నగార్లు విన్నపములను, నంబులు మంగళాశాసనములను,

దేవాలయకరణీకులు లెక్కలను వినిపించెడివారు.[64] ప్రతిదినము వందిమాగదులు రాజాధిరాజులు, కైజీతంపుసాజులు, మన్నెదొరలు, హనమువారు, విద్వత్కవులు, కవయిత్రులు, వైణికులు, విదూషకులు తన్ను కొలువ విజయరాఘవుడు కొలువు తీర్చెడివాడు.

విజయరాఘవుడు శ్రీరామసౌధమున నూత్నరత్న సింహాసనముపై కొలువు తీరెడివాడని, సాహిత్య సంగీత నాట్యాది విద్యలయందు ఖ్యాతిగాంచిన నాట్యకత్తెల నాట్యము చేయుటతో సభాప్రారంభము జరిగెడిదని, అనంతరము అన్నగారల విన్నపములు వినెడివాడని 'విజయరాఘవకళ్యాణము' న గలదు. ఈ అంశముల వలన విజయరాఘవుడు రాజగోపాలవిలాసభవనమున కొలువు తీరెడివాడో లేక శ్రీరామసౌధమున కొలువు తీరెడివాడో స్పష్టపడుటలేదు. బహుశః రెండుసౌధము లందును కొలువు తీర్చెడి వాడేమో !

విజయరాఘవునకు చెంచుదొరలు పులిగోరులు, ఏనుగు దంతములు, చిలుకపంజరములు, జవ్వాదిపిల్లులు, వెన్నెల పులుగులు, చమరీమృగములు, డేగలు, సింహపుపిల్లలు, కారుకోళ్లు, పులిజున్ను, కర్పూరము, మంచిగంధపు మానులు, బదనికలు, గనగసాలు, పుట్టతేనె, చారపప్పు, ద్రాక్షపళ్లు, జీడిపప్పు మొదలగు వస్తువులు కానుకగా నిచ్చెడివారు.

కొలువుమర్యాదలు :

రాజు స్వామి శ్రీముఖమును అందుకొని తోయజముఖిహస్తమున నిడును. ఆమె రాయసమున కందిచ్చును. అతడద్దానిని జదువును. విన్నపములు చేయువారు స్వామి పరాకు అని ముందుగా నుడివి రాజుతో విన్నపములు చేయవలెను. గడియారమువాడు వచ్చి ముందుగా 'శ్రీరాజగోపాలస్సహాయః' అనిన పిమ్మటనే గడియలు చెప్పవలెను. రాజును దర్శింపవచ్చినవారు కానుకలు గొనిపోవలయును. రాజదర్శనము కాంక్షించువారు హెగ్గడి కత్తెతో తమరాక తెలుపవలెను. ఆమె రాజాజ్ఞకొనివచ్చిన పిమ్మటగాని రాజదర్శనము సంభవముకాదు. రాజునకు ముందుగా వినయమొప్ప నమస్కరించి కానుకలందించి తరువాత విన్నపము లొనరించుకొనవలెను. ఇవి అనాటి కొలువుమర్యాదలు.

విద్వత్కవులకు, పురోహితులకు, రాజాస్థానములలో మిక్కలి చనువుండెడిది. వారిలో వారికి తరచు వాక్కలహములు సంభవించు చుండెడివి. 'త్వమేవగార్దభః, త్వమేవ సూకరః, త్వమేవశునకః' అని తిట్టుకొనెడివారు. చిట్టేబళ సోమయాజులు, గోవిందభట్టు, సకలవిద్యాసార్వభౌముడు, అభినవమధురకవి మొదలగు విద్వాంసు లుండిరి. చెంచులు కాటమరాజుపైన కంబమురాయనిమీద పదములు పాడెడివారు. ధరమరాజు పదములను పాడెడివారు.

---

64. మన్నారుదాసవిలాసనాటకము, p. 3.

రంగాజమ్మ విజయరాఘవుని కొలువు కూటమును వర్ణించిన తీరు విజయ రాఘవుడు స్త్రీలోలుడన్న అంశమును స్పష్టము చేయుచున్నది. ఈతడు రాజగోపాల విలాస భవనమున కొలువు తీరునప్పుడు, అతని దగ్గర ఒక పడతి అడపము, మరొలలన కాళంజి. ఒక పువ్వుబోడి పావడ, ఒక సుందరి బెత్తము, మరో వాలు గంటి వాలు, ఇంకొక అండజయాన గిండి పట్టుకుని నిలబడెడివారట. నాజమ్మ, చంపకవల్లి అను ఇద్దరు భోగపత్నుల నడుమ కూర్చొనెడివాడు. అతని పుత్రులు, మనుమలు, పుత్రికలు వీక్షించుచుండగ, కస్తూరి, అంబుజవల్లి, శశిరేఖ, మోహన మూర్తి కృష్ణాజీ, అలిమేలు, సీత, మదనరేఖ మొదలగువారు వసంతకేళి వినిపింపగా విజయరాఘవుడు వినెడివాడు.

విజయరాఘవుడు – వివాహములు :

మన్నారు దాస విలాస యక్షగాన ప్రబంధములు, విజయరాఘవ చంద్రికా విహారము, విజయరాఘవ కల్యాణములు, విజయరాఘవుడు కాంతిమతి, మదన మంజరి, లీలావతి యను కన్యలను వివాహము చేసికొనిన అంశములను వివరించినవి. ఈ వివాహాంశములే ఈ గ్రంథము లందలి ముఖ్యాంశములు. ఈ వివాహములు చారిత్రకముగ ఎంత వరకు సత్యమైనవో తెలియుటలేదు కాని కవులును, కవయిత్రియును, విజయరాఘవుని వివాహ విషయములను శృంగార రసోపేతముగ వర్ణించిరి.

విజయరాఘవునకు ఎంతమంది భార్యలు కలరో తెలియుటలేదు. ఈతనికి 700 మంది భార్యలు, 3,500 మంది వేశ్యలు ఉండిరని తెలియుచున్నది.[65] సమకాలీన సాహిత్యము లన్నియు ఈతడు స్త్రీలోలుడని తెలుపుచున్నవి. అంతేకాక ఈతడు శ్రీకృష్ణుని అపరావతారమని సమకాలీన కవులు, కవయిత్రులు విజయ రాఘవుని పొగడిరి. రంగాజమ్మ మన్నారు దాస విలాస యక్షగాన, ప్రబంధము లందు విజయరాఘవుడు కాంతిమతిని "చంద్రమానే శుభకృన్నామ సంవత్సరే ఉత్తరాయణే వసంతుర్తౌ చైత్రమాసే శుక్లపక్షే ఆర్యపంచమా శుభతిథౌ, గురువాసర యుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ యుక్తాయాం అస్యాం శ్రీ రఘునాథ కుమార భూపాలస్య ఉద్వాహఖ్యం కర్మ కరిష్యమణ"[66] అని వర్ణించుటచే ఈ వివాహము కల్పితగాథ కాదనిపించు చున్నది. కాంతిమతి రాజచంద్రుడను రాజుయొక్క కుమార్తె. ఈ రాజచంద్రుడే రాజ్యమునకు రాజో రంగాజమ్మ తెలుప లేదు. ఈతడు రాజవంశీయుడు. ఇంతకంటెను రాజచంద్రుని విషయములు తెలియుటలేదు. ఈ విషయములను తెలుసుకొనుటకు చారిత్రకముగ మనకెట్టి ఆధారములు లభించుటలేదు.

65. Dr. K. R. Subrahmanyam, Maratta Rajas of Tanjore, pp. 9–10.
66. మన్నారు దాస విలాస నాటకము, p. 47.

రంగాజమ్మను గూర్చి వ్రాయుచు ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 'యక్షగాన శాఖకు చెందిన మన్నారు దాన విలాస నాటకమునందు పట్టమహిషి యగు కాంతిమతికి విజయరాఘవునకు జరిగిన వివాహగాథ వర్ణింపబడినది' అని వ్రాసిరి.[67] రంగాజమ్మ కాంతిమతి విజయరాఘవుని పట్టమహిషి యని తెలుపలేదు. సమకాలీన కవులుగాని, చరిత్రకారులుగాని ఈ అంశమును తెలుపలేదు. విజయరాఘవుని పట్టమహిషి రాజగోపాలాంబిక యని అందరి అభిప్రాయము. రాజగోపాలాంబికకు కాంతిమతి యను మరియొక నామ మున్నట్టుల కూడ తెలియుటలేదు. కనుక లక్ష్మీకాంతమ్మగారు చెప్పినట్టుల కాంతిమతి పట్టమహిషి కాదు. ఎన్నవ భార్యయో తెలియుటలేదు.

మదనమంజరి కళానిధి యను రాజుయొక్క కుమార్తె. విజయరాఘవ నాయకుడు మదనమంజరిని సౌమ్యనామ సంవత్సర వైశాఖమాస శుక్లపక్షమున వివాహము చేసికొనినట్లు విజయరాఘవ కల్యాణమున గలదు. అనగా క్రీ.శ. 1969 వ సంవత్సరమున జరిగినది. ఈ వివాహ విషయమున కూడ ఈ గ్రంథము తప్ప మనకు యితర చారిత్ర కాధారము లేమియు లేవు.

విజయరాఘవ లీలావతుల వివాహ విషయమునకూడ విజయరాఘవ చంద్రికా విహారము తప్ప ఇతర చారిత్ర కాధారములు లేవు. ఈ గ్రంథమున లీలావతి వేశ్య యని గలదు. వెన్నెల వేళయందు లలనామణులు తనను కొలువ వీధు లందు తిరుగుచున్న విజయరాఘవుని చూచి మోహించి, తన విరహబాధను చెలిచేత విజయరాఘవునకు తెలుప, విజయరాఘవు డామెను వివాహము చేసి కొనెను.

ఈ వివాహ గాథలను శృంగార రసభరితముగ వర్ణించిన ఈ గ్రంథముల వలన విజయరాఘవుని రాజకీయ జీవిత వివరముల కంటె, శృంగార జీవితమె వివరముగ తెలియుచున్నది. ఈ గ్రంథము లన్నియు శ్రీకృష్ణుడే కలియుగమున విజయరాఘవునిగ అవతరించెనని వర్ణించినవి.

ఈతడు కొలువునకు వెళ్లునపుడు స్త్రీలే సింగారించెడివారు.

"నెలత యొక్కతె చేరి నిలువుటద్దము పట్టెఁ
 చెలువ యొక్కతె యోరసిగ యొనర్చెఁ
 జంద్రాస్య యొక్కతె జాజిసరుల్ సుట్టెఁ
 జాన యొక్కతె రుమాల్ జాఱఁగట్టెఁ
 గలికి యొక్కతె దిద్దె గస్తూరితిలకంబుఁ
 గనకాంగి యొకతె చౌకట్లు వెట్టె

67. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, అఖిల భారత కవయిత్రులు, p. 67.

జాణ యొక్కతె బురుసాహి జారును బూన్చె
సకియ యొక్కతె యడచట్టదొడిగె
దరుణి యొక్కతె హరువుగా దట్టిగట్టె
వనిత యొక్కతె దుప్పటి వలెవాటువైచెఁ
బడఁతి యొక్కతె చెవుల జవ్వాదియుంచెఁ
గొమ్మ యొక్కతె కుంకుమ నెమ్మినలఁదె"[68]

అంతేకాక ఇతడు నిరంతరము స్త్రీలనడుమనే కాలము వెళ్లబుచ్చెడివాడని ఈ గ్రంథమువలన తెలియుచున్నది. నగరమునందలి పెక్కుమంది స్త్రీలు ఈతని ప్రభువుగ పరిగణించినటుల లేదు. వారి దృష్టిలో నీతడు ప్రియుడు, కాముకుడు అని ఈ రచనలవలన స్పష్టపడుచున్నది.

వాహ్యాళికి సఖీజన పరివేష్టితుడై వెడలిన విజయరాఘవనాయకుని, బంగారు మేడలపైనుండి గాంచిన శృంగారవతులలో ఒకతె చెలరేగి చెయిసాచి పిలచినదట, మరియొకతె 'బావ' రమ్మన్నదట, వేరొకతె 'నన్ను చేకోర' యన్నదట, ఇంకొకతె 'రావోయి రసికుండ రాపుసేయకనే' అన్నదట, "కొమ్మరమ్మని చీరరా కులుకు గుబ్బలు చీరరా కమ్మవిల్తుండు పగదాయరా కరుణ నీకేల లేదాయెరా"[69] అని ఇద్దరు గజయానలు విజయరాఘవుని వేడిరట. ఇది విజయరాఘవుని శృంగార జీవితమునకు నిదర్శనము. అనాటి కవులందరును ఎక్కువగా నిట్టి వర్ణనలనే చేసిరి.

ఈ గ్రంథకర్తల రచనావిశేషములను తెలుపుటకంటే ఆ శృంగార వర్ణనలను ఎవరికివారు చదివి ఆనందించుట మేలు. రంగాజమ్మ రచన లలితపదములతో స్త్రీహృదయమును ప్రతిఫలింపచేయుచున్నది.

ఈ గ్రంథములు విజయరాఘవుని సరసజీవితముతోపాటు కొన్ని సాంఘిక రాజకీయ స్థితిగతులను తెలుపుచు విజయరాఘవుని చరిత్రకు తోడ్పడుచున్నవి.

రఘునాథనాయకాభ్యుదయ, రఘునాథాభ్యుదయ ద్విపద యక్షగానములు రఘునాథుని చరిత్రను; మన్నారుదాసవిలాస ద్విపద నాటకములు, విజయరాఘవ చంద్రికావిలాసము, విజయరాఘవ కల్యాణము, విజయరాఘవుని వివాహ గాథలు వర్ణించుటయేకాక, వారి దైనందిన జీవితము, మతవిషయము, కళా పోషణము, కవితాపోషణము, రాజకీయ విషయములు కనులకు కట్టునటుల చక్కగా విశదీకరించు గ్రంథములు. శృంగారపరమైన వర్ణనలు ఎక్కువగా నున్నప్పటికి ఈ గ్రంథములు మనకు నాయకరాజులకు సంబంధించిన పెక్కు చారిత్రకాంశములను, అనాటి సమాజమునందలి ఆచారవ్యవహారములను తెలుపు చున్నవి.

---

68. మన్నారు దాసవిలాస నాటకము, p. 8.
69. మన్నారు దాసవిలాస నాటకము, pp. 10-12.

మహావీరుడు, కళాపోషకుడు, కవి, నాయకరాజులలో ఖ్యాతిగన్న మహారాజు, ప్రజానురంజక పరిపాలకుడునైన రఘునాథనాయకునియొక్కయు, కవి, కళాకోవిదుడు, రసికుడునై తంజావురమును నిరంతరపోరాటముల నడుమ ఒక కళామందిరముగ తీర్చిదిద్దిన విజయరాఘవనాయకునియొక్కయు జీవిత విశేషములను తెలుపు ఈ గ్రంథములు ఇటు చరిత్రకారులకు అటు సాహితీపరులకు తప్పక పఠనీయములు.

# 10. మతము – మతప్రవక్తలు

అనాదినుండి సంఘమున మతమునకు ప్రాముఖ్యము కలదు. ప్రపంచ సారస్వతమున ఆదినుండి మతమే ప్రాముఖ్యమును పొందినది. తెలుగు సారస్వతము కూడ ఆరంభమున మతప్రభావితమై జనించి మార్గదేశి పద్ధతులను సృష్టించినది. శివకవుల కావ్యములన్నియు మతప్రభావజనితములే.

వేదకాలమునాటి వైదికమతము కర్మపరమై కాలక్రమమున మార్పులను చెంది జ్ఞానపరమైనది. వేదమునందలి మంత్రములకు, బ్రాహ్మణములకు సమన్వయము కుదరక కర్మలు పరిహాసపాత్రములైనవి. ఋగ్వేదకాలమున లేని కులతత్త్వము క్రమక్రమముగ వ్రేళ్లూని బ్రాహ్మణాధిక్యము హెచ్చినది. కర్మదీక్షాపరులైన బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు మతలక్ష్యమునందు భేదదృష్టి కలిగినది. బ్రాహ్మణులు ప్రతిపాదించిన కర్మసిద్ధాంతము బ్రాహ్మణేతరులకు దురవగాహమై సామాన్య జనులందు అసంతృప్తి చెలరేగెను. ఇట్టి దశలో బ్రాహ్మణాధిక్యమును ప్రతిఘటించి క్షత్రియులైన వర్ధమానమహావీరుడు, సిద్ధార్థుడు జైన బౌద్ధమతములను స్థాపించి క్రూరమైన కర్మకాండను దురవగాహనమైన జ్ఞానమార్గమును నిరసించి జాతికులభేదములేని నూతన మతములను సృష్టించిరి. విగ్రహారాధనమును నిరసించుట, కులవివక్షత పాటింపకుండుట, యజ్ఞయాగాది కర్మకాండలను త్యజించుట మొదలగు నియమములతో స్థాపింపబడిన ఈ రెండు మతములు ఆదిలో బహుళ జనాదరణము నొందినవి. క్షత్రియులు స్థాపించిన ఈ మతములు రాజాదరమును, ప్రజాదరమును పొంది దేశవిదేశములందు వ్యాపించినవి. దేశమందంతట విహారములు, మఠములు, ఆరామములు వెలసినవి. విశ్వవిద్యాలయములు వెలసినవి. వాఙ్మయము అభివృద్ధి నొందినది. సుమారు వేయి సంవత్సరములు ఈ మతములు భారతఖండమున వ్యాపించి ఉన్నవి. కాని విగ్రహారాధనమునకు అలవాటుపడిన జనసామాన్యమునకు విగ్రహములేకుండ ఆరాధించు ఈ మతము లందు విశ్వాసము తగ్గినది. ఈ రెండు మతములు ప్రజాబాహుళ్యమున ప్రాచుర్యము కోల్పోవుచున్నట్టి తరుణమున వైదికమతోద్ధరణమునకై శంకరుడు కృషి చేసెను. ఈతడు జైన బౌద్ధమతములను ఖండించి, అద్వైతమును ప్రతిపాదించి శైవమునకు పునఃప్రతిష్ఠ గావించెను. క్లుప్తముగ భారతదేశమునందలి మతపరిస్థితి యిది.

ఆంధ్రదేశము కూడ శంకరునకు పూర్వము జైన బౌద్ధమతములకు ఆలవాలము. ద్వైతాద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతముల ప్రచారములతో జైన బౌద్ధ మతములు క్షీణింపదొడగినవి. అయినప్పటికిని పెక్కుమంది ప్రజలు రాజులును జైన బౌద్ధమతములను అనుసరించుచునే ఉండిరి. రాజరాజనరేంద్రుని కాలమున వైష్ణవ మతోద్ధరణము ప్రారంభమైనది. ఈ మతముల ప్రాచుర్యముతో శైవమతము క్షీణింప దొడగెను. ఒక ప్రక్క వైష్ణవము వీరవైష్ణవమై విజృంభింప మొదలిడెను. మరియొకవైపు జైన బౌద్ధమతములు రాజాదరణమును పొందుచునే యుండెను. క్రీ.శ. 11 వ శతాబ్దపు చివరి భాగమున ఆంధ్రదేశమున శైవమతము తన ప్రాచుర్యమును కోల్పోవుచుండుటచే, నిరంతరము మతవిషయికమగు కల్లోలములు చెలరేగుచుండెను. రాజరాజనరేంద్రుని తరువాత కుళోత్తుంగుని కాలమున ఆంధ్రదేశమున పెక్కు సామంతరాజ్యములు తలలెత్తి వారిలోవారు రాజ్యవిస్తరణకొరకు తగవులాడుకొనజొచ్చిరి. అట్టి తరుణముననే శైవ వైష్ణవమతముల నడుమ సంఘర్షణ సంభవించినది. క్రమక్రమముగ మతము రాజకీయములందు చోటు చేసుకొని యుద్ధములకు దారితీసినది. ఇట్టి మతకల్లోలములవలన సంభవించిన యుద్ధములలో ముఖ్యమైనది పలనాటి యుద్ధము. మహోన్నతమగు కాకతీయ సామ్రాజ్య పతనమునకుగూడ మతమే కారణమైనది. ఇట్టి మతకల్లోలముల నడుమ శైవమతము ప్రజాభిమానమును చూరగొని, సంఘమున వాఙ్మయమున చోటు చేసుకొన్నది. అదే కాలమున సంస్కృతభాషకు ప్రాభవము తగ్గి దేశభాషలకు ప్రచారము కలిగెను. శైవమతాభిమానముతో జాను తెలుగులో దేశి ఛందములో కవితాసృష్టి జరిగినది. ఇట్టి తరుణమున కర్ణాటకదేశమున బసవేశ్వరుడు, ఆంధ్రదేశమున పండితారాధ్యుడు శైవమతోద్ధరణమునకు కంకణము కట్టుకొనిరి.

క్రీస్తు శకము అయిదారు శతాబ్దములనుండి ఆంధ్రదేశమున శైవమతము శాఖోపశాఖలుగ వర్ధిల్లుచునే యున్నది. రాజాదరమును పొందుచునే యున్నది. చోళరాజు లందరును శైవమతానుయాయులే. కాలక్రమమున శైవమతమున కాలాముఖులు, పాశుపతులు, కాపాలికులు, కారుణిక సిద్ధాంతులు, గోరక్షనాథులు, రాసేశ్వరులు మొదలగు శాఖలు ఏర్పడినవి. కాకతీయుల కాలమునకు పాశుపత శైవము రాజమతమై ప్రజలను ఆకర్షించినది. కాని వీరిలో వీరికి ఐకమత్యము లేక, అన్యమతప్రాబల్యమువలన శైవమతము క్షీణింప మొదలిడెను. ఇట్టి తరుణమున క్రీ.శ. 1162 ప్రాంతమున చాళుక్యసామ్రాజ్యాధిపతియైన బిజ్జలుని మంత్రియైన బసవేశ్వరుడు కర్ణాటక దేశమున శైవమతోద్ధరణకు కంకణము కట్టుకొనెను. ఈతడు భక్తిమార్గము ననుసరించెను. ఆవేశపూరితమైన వీరశైవమును స్థాపించెను. వర్ణాశ్రమధర్మమును నిరసించి సంప్రదాయముల కట్టుదిట్టములను నడలించి 'శివప్రసాయితమను' ఖడ్గమును ధరించి వీరశైవ మతప్రచారమునకు పూనుకొని బసవేశ్వరుడు దేశమును ఉఱ్ఱూత లూగించెను. ఈతడు ప్రతిపాదించిన కులరహిత

మగు జంగమ సంప్రదాయము సామాన్య జనులను ఎక్కువగా ఆకర్షించినది. శైవ మతావేశము ముందు ఇతర మతములు అణగారి పోయినవి. బసవేశ్వరుడు నందీశ్వరుని అవతారముగ వీరశైవుల హృదయము లందు చోటుచేసుకొనెను. బసవేశ్వరునే అనుసరించినప్పటికి, వర్ణభేదమును త్యజింపలేక ఆరాధ్య శైవమను మరియొక శాఖను స్థాపించి పండితారాధ్యుడు ఆంధ్రదేశమున శైవమతోద్ధరణము నకు పూనుకొనెను. ఈతడు కేవలము ఉపదేశములతో ఆగక శివపరమైన రచనలు చేసెను. వీరి మతప్రబోధమునందు సంఘసంస్కరణము చోటుచేసుకొన్నది. వీరశైవ మతప్రవక్తయైన బసవేశ్వరుని యొక్కయు, అతని అనుయాయియైన పండితారాధ్యుని యొక్కయు, జీవిత విశేషములను, ఆనాటి మతసాంఘిక పరిస్థితు లను వివరించుచున్న పాల్కురికి సోమనాథుని 'బసవ పురాణ,' 'పండితారాధ్య చరిత్రము'లీ ప్రకరణమున పరిశోధించుట జరిగినది.

బసవ పురాణ, పండితారాధ్య చరిత్రములు - పాల్కురికి సోమనాథుడు

పాల్కురికి సోమనాథు డెప్పటివాడు? అతని నివాస స్థలమేది? కుల గోత్రము లెవ్వి యను విషయముల గూర్చి పలువురు పండితులు తమఅభిప్రాయము లను వెలిబుచ్చిరి.[1] సోమనాథుడు వీర మాహేశ్వరాచారుడు. వీరశైవుల వలెనే ఈతడును

"ధర నుమామాతా పితారుద్ర యనెడి
వరపురాణోక్తి నీశ్వర కులజుండ
శరణగతాశ్రయ సకల స్వరూప
గురులింగ వరకరోదర జనితుండ"[2]

అని తనను గూర్చి తెలుపుకొనెను. కాని

"భ్రాజిష్ణుఁడగు విష్ణు రామి దేవుండుఁ
దేజిష్ణువగు శ్రీయాదేవి యమ్మయును
గారవింపగ నొప్పుగా దివి సుతుఁడ
వీర మాహేశ్వరాచార వ్రతుండ
ఖ్యాత సద్భక్తి యైఁగల కట్టకూరి
పోతి దేవర పదాంబుజ షట్పదుండ
సకృపాత్ముఁడగు కరస్థలి విశ్వనాథు
ప్రకటవర ప్రసాద కవిత్వయుతుఁడ

1. వివరముల కొరకు చూడుడు. బసవ పురాణ పీఠిక. "పాల్కురికి సోమనాథుడు" బండారు తమ్మయ్య, సమగ్ర ఆంధ్ర సాహిత్యము, ఆరుద్ర, ఆంధ్ర కవితరంగిణి, చాగంటి శేషయ్య.

2. బసవ పురాణము, p. 3.

వడగాము రామేశు వరశిష్యుఁడనఁగ
బడు చెన్న రాముని ప్రాణ సఖుండ
సంభావితుఁడ భవిజన సమాదరణ
సంభాషణాది సంసర్గ దూరగుఁడ
నలిఁబాల్కురికి సోమనాథుఁడనంగ
వెలసినవాఁడ నిర్మల చరిత్రుండ."[3]

అని బసవ పురాణమునందు తన విషయములు తెలుపుకొనెను. ఈతడు చతుర్వేద, వష్ట్వశాస్త్ర పారంగతుడు. ఈ విషయ మీతని రచనల వలన దెలియుచున్నది. ఇతడు బహు భాషావేత్త. తన రచనలయందు పెక్కు భాషల నుపయోగించెను. పెక్కు కృతులను రచించెను. బసవ పురాణము, పండితారాధ్య చరిత్రము, అనుభవ సారము, చతుర్వేద సారము, బసవ రగడ, చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము, రుద్రభాష్యము, బసవాధ్య రగడ, సద్గురు రగడ, గంగోత్పత్తి రగడ, పంచప్రకార గద్య, నమస్కార గద్య, అక్షరాంక గద్య పద్యములు, అష్టోత్తర శతనామ గద్య, బసవోదాహరణయుగ్మము (ఒకటి తెలుగు, మరియొకటి సంస్కృతము), బసవాష్టకము, బసవ పంచరత్నములు, త్రివిధ లింగాష్టకము మొదలగునవి ఈతని కృతులు.

ఇవికాక మల్లమదేవీ పురాణము అను నాలుగాశ్వాసముల ద్విపద గ్రంథమును రచించినటుల తెలియుచున్నది. దీని తాళపత్ర ప్రతి యొకటి నంది కొట్కూరు నందు సుబ్బయ్య యను నొక లింగాయతుని ఇంట తాను స్వయముగా చూచితినని శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, 'నా కర్నూలుమండల సంచారము – సారస్వత సర్వస్వము' అను వ్యాసమున వ్రాసిరని,[4] డా॥ నాగయ్యగారు తెల్పిరి.

పై విషయముల వలన పాల్కురికి సోమనాథుడు వీరశైవు డనియే తప్ప అతని కులగోత్రము లేవియు తెలియుట లేదు.

ఇతడు కరస్థలి విశ్వనాథయ్య శిష్యుడు. మల్లికార్జునుని మతమైన వీరశైవావలంబి. గురులింగార్యుని కడ శివదీక్షను పొందెను. శివమతమునందు ఈతనిని ఎక్కువగా ఆకర్షించినవారు పండితారాధ్యుడు, బసవడు. కనుకనే బసవ పురాణ, పండితారాధ్య చరిత్రములు సోమనాథుని కలమునుండి ఉద్భవించినవి.

సోమనాథుని గూర్చి, సోమనాథుని కాలమును గూర్చి పలువురు పండితులు పెక్కభిప్రాయములను వెలిబుచ్చి వివరముగ చర్చించిరి. అవే విషయములను మరల తెలుపుట చర్వితచర్వణమగును. కనుక సోమనాథుని విడచి బసవ పురాణ పండితారాధ్య చరిత్రములందలి మత సాంఘిక చరిత్రలను తెలిసికొందము.

---

3. బసవ పురాణము, ప్ర.ఆ., p. 4.

4. డా॥ జి. నాగయ్య, ద్విపద వాఙ్మయము, p. 119.

## చరిత్ర-బసవపురాణము, పండితారాధ్యచరిత్ర

వీరశైవ మతప్రవక్తయగు బసవన చరిత్ర అతని అనుయాయులైన కొందరు శివభక్తుల చరిత్రలు, శివభక్తుడు బసవారాధకుడు నైన పండితారాధ్యుని, మరి కొందరు శైవభక్తుల గాథలు ఈ గ్రంథములందు వర్ణితములైనవి. ఈ గ్రంథము లందలి శివభక్తుల గాథలను వారొనర్చిన మహిమలను సోమనాథుడు 'ఉరుతర గద్య పద్యోక్తుల కంటె సరసమై పరగిన జాను తెనుగులో' చక్కగా వర్ణించెను.

ఈ గ్రంథములందు వర్ణితమైన శివభక్తులందరును చారిత్రక పాత్రలా లేక కల్పిత పాత్రలా అని నిశ్చయించుటకు వీలుకాకున్నది. ఇందు తమిళ, కన్నడ దేశములకు చెందిన భక్తులు పెక్కుమంది కలరు. సోమనాథుడు, బసవన పండితా రాధ్యుల చరిత్రలను తెల్పుచు నడుమ నడుమ శైవ భక్తులైన పెక్కుమంది గాథ లను కూర్చి బసవపురాణ, పండితారాధ్య చరిత్రలను కూర్చెను. వీరశైవ మత ప్రవక్తలు సంస్కర్తలు నైన బసవన పండితారాధ్యులు చారిత్రక పురుషులనుట నిస్సంశయము. కాని వీరి చరిత్రలతోపాటు కుదిగుచ్చిన శైవభక్తులలో చాలమంది చరిత్ర మనకు తెలియుటలేదు. వారు కేవలము శివపురాణములందు భక్తుల కథ లందు వర్ణింపబడిరి. వారి జీవిత సత్యాసత్యములు చర్చించుటకు చారిత్రకముగ ఆధారములు కనిపించుటలేదు. ఈ భక్తులలో పెక్కుమంది కన్నడ, తమిళ దేశము లకు చెందిన వారు. తమిళ పెరియ పురాణము, నూతన పురాణము, కన్నడ చెన్నబసవ పురాణము శైవభక్తుల గాథలకు నిలయములు. కనుక ఆ యా భాష లందలి గ్రంథములు పరిశీలించిన వారి చరిత్రలేమైన తెలియువచ్చును. కనుక ఈ గ్రంథములందలి ప్రతిఒక్క శివభక్తుని గూర్చిన సత్యాసత్యములు చర్చించుట చాల కష్టమగుపని, అది చరిత్రకారులు ప్రత్యేకముగ చేపట్టవలసిన విషయము. కాబట్టి ఈ గ్రంథములందలి నాయకులైన బసవన, పండితారాధ్యుల చరిత్రలను మాత్రమే విశదముగ చర్చించుట జరిగినది. వీరి చరిత్రలతోపాటు మరికొందరి చరిత్రలు కూడ చర్చించుట జరిగినది.

## బసవేశ్వరుడు

శైవమతమున కొక క్రొత్తరూపమును కల్పించి వీరశైవ మతమును స్థాపించి ప్రఖ్యాతి గాంచిన శివభక్తుడు బసవన. శ్రీశైల పర్వతమునకు పశ్చిమదిక్కున గల కర్ణాటక దేశమున హింగుళేశ్వరభాగవాటి అను అగ్రహారము గలదు. అందు మండెగ మాదిరాజను శివభక్తుడు కలడు. అతని భార్య మాదాంబ. పుత్రులు లేక పోవుటచే మాదాంబ పుత్రుల కొరకు నందికేశ్వరనోము నోచి నందికేశ్వరుని వంటి పుత్రుడు జన్మించిన వాని పేరిడెదనని మ్రొక్కుకొనెను. నోము ఫలించెను. శివుని ఆదేశము ప్రకారము నందికేశ్వరుడు బసవేశ్వరునిగ జన్మించెను. బసవనకు విద్య

లన్నియు సహజముగ వచ్చెను. ఈతడు చిన్నతనము నుండి పూర్వాచారముల పట్ల అనాదరము చూపుచుండెను. ఉపనయనము చేయతలంచిన తండ్రిని ఈశ్వరునికొలిచి మూర్ఖుడవైతి వెటులని ప్రశ్నించెను.[5] వడుగు చేసికొనుటకు నిరాకరించెను. అంతేకాక 'వీరమాహేశ్వర దీక్షితుని నిర్మితోభయ కర్మ నిర్మాలు. నన్ను గర్మాబ్ధిముంచుట ధర్మమే నీకు'[6] అని తండ్రిని ప్రశ్నించి, వీరశైవులకు జాతిమతములు లేవని తెలిపి, తండ్రితో తనకు సంబంధము లేదని తన సహోదరి యైన నాగమాంబను తీసికొని ఇల్లువదలి వెడలిపోయెను.

కల్యాణపురాధిపతియైన బిజ్జలుని కడ మంత్రియైన బలదేవదండనాయకుడు బసవన మేనమామ. తనకుమార్తె నిట్టివానితోనే వివాహము చేయవలెనని నిశ్చయించి, ఇల్లు విడిచిన బసవన కడకేగి అతనిని బ్రతిమాలి తన కుమార్తె గంగాంబ నిచ్చి వివాహము చేసెను. బసవేశ్వరుడు సోదరితో తండ్రిఇల్లు విడచి పణిహారి ఇంటికి వెళ్ళెనని బసవపురాణమున గలదు.[7] సోదరితో పాటు ఇల్లువదలిపోయి కూడలి సంగమేశ్వర దేవుని కొరకు తీవ్రతపమొనర్చినటుల లక్ష్మీరంజనంగారు తెల్పిరి.[8] బసవేశ్వరునికి గంగాదేవి కాక నీలలోచని యను భార్యకూడ ఉన్నటుల తెలియు చున్నది.[9]

వివాహానంతరము బసవేశ్వరుడు సోదరితోను, భార్యతోను కప్పడి సంగమేశ్వరమున కేగి అట నివాసమేర్పరచు కొనెను. బసవనను అచటి భక్తులందరు "బాపురా! మాయన్న బసవకుమరా! బాపురా! మాతండ్రి భక్తివర్ధనుడు, నల్లవో బసవన్న నందీశ మూర్తి! నల్లవో! బసవయ్యా! ముల్లోకవంద్య!"[10] అని పొగడుచు కొలుచు చుండిరి. ఈ అంశము వలన వీరశైవ ప్రవక్తయైన బసవన యనిన మొదటి నుండియు ప్రజలలో భక్తిశ్రద్ధలు ఉన్నటుల స్పష్టమగుచున్నది.

బసవేశ్వరుని మామయైన బలదేవదండనాయకుడు మరణింప, బిజ్జలుడు బసవేశ్వరుని తనకు మంత్రిగ, దండనాధునిగ నియోగించుకొనెను. మత ప్రాచుర్యమునకు అధికారమొక చక్కని సాధనము. ఆ విషయమును గ్రహించి బసవన బిజ్జలుని కడ మంత్రిత్వమున కంగీకరించెను. అదియును గాక బసవన బిజ్జలుల నడుమ బంధుత్వమున్నటుల తెలియుచున్నది. జైనులు రచించిన బిజ్జలరాయ చరిత్రమున బసవేశ్వరునకు అందకత్తెయగు పద్మావతియను సోదరి కలదని, బిజ్జలుడామెను వివాహము చేసికొనెననియు కలదు.[11] బిజ్జలుడు తన

5. బసవపురాణము, p. 16.
6. బసవపురాణము, p. 16.
7. బసవపురాణము, p. 19.
8. ఖండవల్లిలక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, p. 226.
9. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 20.
10. బసవపురాణము, p. 22.
11. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 20.

సోదరియైన నీలలోచనిని బసవనకిచ్చి వివాహము చేసినటుల తెలియుచున్నది.[12] ఈ గాథలందలి సత్యాసత్యము లెటులున్నను బిజ్జల, బసవన్నల నడుమ బంధుత్వము కలదని తెలుపుచున్నవి.

బసవన రాజకార్యములందంతగా ఆసక్తి చూపక, శివదీక్షాపరుడై శివభక్తులను నిరంతరము పూజించుచు, అడిగినవారికి లేదనకుండ అడిగినదెల్ల నిచ్చుచు, శివదూషణాదుల వినక శివాచార నిరతిని కాలము గడుపుచుండెను. బసవేశ్వరుని భక్తినిరతిని, మహిమలను గాంచి, ఆలించి పెక్కుమంది ప్రజలు ఈ మతమును అనుసరించిరి. ఈ మతమునందు ప్రజల నాకర్షించిన ముఖ్యాంశము జాతిభేదము లేకపోవుట. కనుకనే నిరంతరము అసంఖ్యాకముగ శివభక్తులు బసవేశ్వరుని దర్శించుట కరుదెంచుచుండిరి. బసవేశ్వరుని దర్శింప వచ్చినభక్తులలో స్త్రీలును గలరు. శివభక్తులైన ఈ స్త్రీపురుషులలో పెక్కుమంది మహిమాన్వితులుగ వర్ణింప బడిరి.

శైవులు తప్పతక్కిన చరాచరములన్నియు మరణించునట్లు చేయు కిన్నెర బ్రహ్మయ వంటి వీరావేశులు, తంగెడుపూలను ధనముగా, వడ్లను పసిడిగా మార్చు అద్భుత శక్తులున్న కలకేత బ్రహ్మయ్య వంటి మహిమాన్వితులు, గంధర్వులను మృగములుగా మార్చు శక్తిమంతులు, మృగములకు శాపవిమోచనము గావించు తెలుగు జొమ్మయ్య వంటి భక్తులు, జైనులతో వాదమొనర్చి వారినోడించి అందరు చూచుచుండగనే తన శిరమును ఖండించుకొని మరల మొలిపించు కొని జైన వసతులను పాడుచేయించి శైవమతమును నెలకొల్పిన ఏకాంతరామయ్య, కట్టెలను బంగారు కట్టెలుగ మార్చి భక్తులకు పంచిన మోళిగ మారయ్య వంటి మహిమాన్వితులు, బిజ్జలుడు శివరాత్రికి సౌరాష్ట్రమునకు పోనీయక ఆటంకపరుప, సౌరాష్ట్ర నాథునే కల్యాణ పురమునకు రప్పించిన పోడ్డల దేవు బాచయ్యవంటి మహాభక్తులు బసవనకు అండదండలుగ నుండిరి. వీరందరి సహాయ సహకారములతో బసవేశ్వరుడు శైవమతోద్ధరణగావించి శైవమతము ఆంధ్ర కన్నడ దేశములందు బహుదా వ్యాపించుటకు పాటు పడెను. బసవన మహిమలు విని కొందరు భక్తులు బసవేశ్వరుని కడ కరుదెంచిరని, కొందరి భక్తుల అతిమానుష చర్యలను విని బసవేశ్వరుడే, వారికడకేగెనని, అట్టి భక్తుల మహిమాన్వితములైన పెక్కు గాథలు బసవపురాణమున వర్ణింప బడినవి. ఈ గాథలవలన కొందరు శైవమత ప్రచారమునకు పూనుకొని, పదవి యందున్న బసవని అండదండల కొరకు వచ్చిరనుట, తనకడకు రానివారి ప్రాపకమును సంపాదించుటకు బసవన స్వయముగా వెళ్ళి వారిసహాయ సహకారములను సంపాదించెననుట స్పష్టము. ఈ గాథలు శైవ ప్రచారకుల ఐకమత్యమునకు నిదర్శనములు.

---

12. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 20.

బసవేశ్వరుడు—మహిమలు :

బసవన కేవలము వీరశైవ మతాచార్యుడే కాదు, మహిమాన్వితుడు. ఈతడు పెక్కు మహిమల నొనర్చి ప్రజలను ఆశ్చర్యచకితులను గావించి ఆకర్షించుకొనుచుండెను. కొందరు దొంగలు బసవని బందిపెట్ట తలంచి, వంగకాయలను లింగకాయలుగ ధరించి శైవులవలె బసవన కడకరుదెంచి మ్రొక్కిరి. వారి మోసమును గ్రహించిన బసవన తన మహిమచే వారి వంగకాయలను లింగకాయలుగ మార్చెను.[13] ఒకనాడొక జంగముడరుదెంచి ముగ్గుపెట్టుకొనుటకు ముత్యముల పొడి కావలయును కనుక పది పుట్ల ముత్యముల నిమ్మని బసవని కోరెను. బసవన తనమహిమచే జొన్నలను ముత్యములుగ మార్చిఇచ్చెను. ఒకనాడు సంగమేశ్వరుడే స్వయముగా జంగమ రూపమున బసవన కడ కరుదెంచి మూడవ కన్నిమ్మని కోరెనట. బసవన అతని ఫాలమును చూచి నీకు సహజముగనే మూడవ కన్ను కలదని తెల్పెనట.

మరియొకసారి బసవన కొలువు కూటమున ఉండి హటాత్తుగ 'ఓడకోడకు' మని కడవెత్తుచున్నట్లు చేతులను పైకెత్తెను. అది చూచి బిజ్జలు డదియేమియని ప్రశ్నించెను. అంత బసవన, "కపిలేశ్వరమున తాపసి యొకడు లింగమును ఆరుపుట్ల పాలతో పూజించుచున్నాడు. ఆపాల వలన వీధులన్నియు బురదయైనవి, ఆ వీధులందు చల్ల అమ్ముకొను గొల్లెత కాలు జారి 'బసవరో' యనినది, కనుక ఆమె కడవ పడకుండ పట్టుకొంటిని' అని చెప్పెను. ఎచ్చటనోయున్న గొల్లెత కడవ సభలోనున్న బసవన పట్టుకొనుట ఏమని రాజు గొల్లెతను రప్పించి ప్రశ్నించెను. ఆమె బసవని మహిమను తెలిపె, అంతతో నూరుకొనక తిరుచిట్టంబలుని హస్తమునందలి పుష్పములను పడిపోకుండ పట్టుకొనిన చిట్టంబలాధీశునికథను, సిద్ధరామయ్య అను భక్తుని కథను రాజునకు వివరించి, బసవన నందికేశ్వరుని అవతారమని పొగడెను.[14]

ఒకనాడు ఒక జంగముడరు దెంచి బసవన కడనున్న ద్రవ్యమంతయు తనకిమ్మని కోరెను. బసవన చేయునది లేక తనకడ పెట్టెలతోగల రాజ ద్రవ్యమును జంగమున కిచ్చెను. ఇదిగాంచి ఇతరమంత్రులు రాజుకడకేగి ఆవిషయమును తెల్పిరి. రాజు బసవని రావించి 'పరధనంబపహరింపని బాసయంద్రు పరధనం బేలకో బసవ! కైకుంటి' వని ప్రశ్నించి 'మా బండారమునందలి ధనముమాకు తెచ్చిమ్మ'ని అడిగెను. అంత బసవన కోశాగారమునందలి ధనమును లెక్కింపుమని రాజుతోపలికెను. రాజు లెక్కింపగా బసవని మహిమ వలన ధనము లెక్క కెక్కువుగ కన్పడెను. బిజ్జలుడు ఆశ్చర్యపడి బసవన మీద కొండెములు చెప్పిన

13. బసవ పురాణము, p. 37.

14. బసవ పురాణము, pp. 41–44.

"కుక్కలఁ జెండి నాలుకల్గోసి సున్నము సాలఁ బూసి, పోలవేఁచిన యిస్ము పోయింతనోళ్ళ"[15] అని ఆజ్ఞాపించెను.

మరియొకనాడు, ఒక జంగముని అతని వేశ్య బసవన భార్య గంగాంబ ధరించిన చీర తెమ్మని కోరగా, ఆ జంగము కొలువు కూటమున నున్న బసవన కడ కరుదెంచి, గంగాంబ ధరించిన చీరనిమ్మనెను. బసవన భార్యను కొలువునకు రప్పించి చీర విప్పించెను. బసవన మహిమచే ఒక చీర విప్పిన మరియొక చీర ఆమె దేహమున వెలయుచుండెను. అది గాంచి అందరును ఆశ్చర్యపడిరి[16].

బసవన ఇట్టి మహిమలు చూపుచు శైవులను సత్కరించుచు, వారేమడిగిన నది యిచ్చుచు వీరశైవమత ప్రచారమునకు పాటు పడెను.

## బసవేశ్వరుడు—బిజ్జలుడు

బసవేశ్వరుడు బిజ్జలుని మంత్రియని ముందుగనే తెలుసుకొంటిమి. క్రీ శ. 12 వ శతాబ్ది ఉత్తరార్ధమున పశ్చిమ చాళుక్యుల ప్రాభవము తగ్గిపోజొచ్చెను. పశ్చిమ చాళుక్యరాజుల క్రింద నున్న సామంతమండలేశ్వరులు, పెద్ద ఉద్యోగులు స్వతంత్రమును ప్రకటించుకొన జొచ్చిరి. వారు క్రమముగా నిరంకుశాధికారులైరి. అందు కాకతీయులు అందరిని ఓడించి మహా సామ్రాజ్యమును స్థాపించిరి. ఈ సమయముననే హైహయాన్వయుడు కాలచురి వంశీయుడు నైన బిజ్జలుడు తక్కిన మండలేశ్వరులతో స్నేహము చేసికొనెను. ఈతడు పశ్చిమ చాళుక్య రాజైన త్రైలోక్య మల్లునికడ యుద్ధ మంత్రిగను, దండనాయకునిగను నుండెను. త్రైలోక్య మల్లుని అసమర్థత వీనిలో రాజ్యకాంక్షను మేల్కొల్పెను. ఈతనికి కాకతి ప్రోలరాజు, కొల్లాపురాధిపతి, విజయార్కుడు తోడ్పడిరి. కాకతి ప్రోలరాజు త్రైలోక్య మల్లుని ఓడించి చెరలో పెట్టించెను. క్రీ.శ. 1157 వ సంవత్సరమున బంధ విముక్తుడైన త్రైలోక్య మల్లుడు కళ్యాణపురమును విడిచిపెట్టి ధార్వాడ మండలములోని యన్నిగేరికి తరలి పోయెను. ఈ విధముగ కళ్యాణపురమునకు క్రీ.శ. 1157 లో బిజ్జలుడు రాజయినటుల ఒక శాసనము గలదు. కాని అందీతడు క్రీ.శ. 1161 వరకు రాజ బిరుదులు వహింపక మహా మండలేశ్వరునిగనే యున్నట్లు తెలియు చున్నది.[17] కాకతి ప్రోలరాజు మరణించి రుద్రదేవుడు రాజాయెను. రుద్రదేవుని కాలమున కూడ కాకతీయులకు కాలచుర్యులకు నడుమ స్నేహ సంబంధములు కొనసాగు చుండెను. ఈతడు మూడవ తైలపుని ప్రాపును సంపాదించి క్రమ క్రమముగా రాజాధికారమును చేజిక్కించు కొనినట్లు నీలకంఠ శాస్త్రిగారు వ్రాసిరి.[18]

15. బసవ పురాణము, pp. 47–48.
16. బసవ పురాణము, p. 48.
17. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 16.
18. K. A. Nilakanta Sastry, A History of South India, pp. 197–198.

బిజ్జలుడు క్రీ.శ. 1162 నుండి 1166 వరకు కళ్యాణి పాలకులైన పశ్చిమ చాళుక్యుల దళవాయిగా నుండి, వారిని తొలగించి తానే రాజయ్యెనని ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తెలిపిరి.[19] క్రీ.శ. 1151 నాటి బిజాపుర శాసనమున బిజ్జలుడు, కల్యాణి ప్రభువైన మూడవ తైలపుని సామంతుడని, మహా మండలేశ్వరుడని గలదు. క్రీ.శ. 1156 నుండి బిజ్జలుడు స్వతంత్ర ప్రతిపత్తి నవలంభించి, త్రిభువన మల్ల భుజబల చక్రవర్తి, కలచుర్య చక్రవర్తి అను బిరుదములు వహించి శాసనములు వేయించెను.[20]

హైహయాన్వయమని శాసనములలో చెప్పబడిన కలచురి వంశములోనివాడు బిజ్జలుడని పెక్కు శాసనములు దెలుపుచున్నవి. ఈ బిజ్జలరాజు క్రీ.శ. 1150 మొదలు 1161 వరకు రాజ్యము చేసిన చాళుక్య త్రైలోక్య మల్లుని సేనాధిపతిగా నుండి, క్రీ.శ. 1161 లో కళ్యాణ పురాధీశ్వరత్వమును దానే అపహరించి 1167 లో చంపబడుట సుప్రసిద్ధమైన చరిత్రాంశమై యున్నదని చిలుకూరి వీరభద్రరావుగారు నుడివిరి.[21]

బిజ్జలుడు జైనుడని తెలియుచున్నది.[22] జైనుడైన బిజ్జలుడు వీరశైవ మతానుయాయియైన బసవనని మంత్రిగ ఏల నియమించెనో కారణము తెలియుట లేదు. అనాడు సంఘమున జైన బౌద్ధమతములకు వైదిక శైవ మతములకు నడుమ నిరంతరము పోరాటములు జరుగుచుండెను. అన్ని మతముల కంటె శైవమతము అగ్రస్థానము నాక్రమింప దొడగినది. ఈ మత విప్లవములు యుద్ధములకు దారితీయుట వలన రాజ్యములు నాశనమైనవి. రాజవంశములు నాశనమైనవి. ఇట్టి తరుణమున జైన మతావలంభియైన ప్రభువు వీరశైవ మత ప్రచారకుని మంత్రిగ నియమించుట ఆశ్చర్యముగ నున్నది. బసవేశ్వరునకు పద్మావతి యని మిక్కిలి అందమైన సోదరి కలదని ఆమెను బిజ్జలుడు వివాహము చేసుకొనెనని జైనులు వ్రాసిన బిజ్జలరాయ చరిత్రలో కలదు.[23] అందమునకు పరవశుడై వివాహ మాడిన రాజు, ఆ వివాహమునకు ఒప్పందముగ బసవనకు మంత్రి పదవి నిచ్చెను. ఈతడు జైనుడైనప్పటికి వీరశైవమత సహిష్ణువని, వారియెడ ఆదరమును కనపరచు చుండెనని నిజాము మండలములోని నిడుగల్లు శాసనము వలన తెలియుచున్నది.[24] బిజ్జలుడు జైనుడు. అనాడు సంఘమున జైనమతమునకు ఆదరము లేదు. తాను మండలేశ్వరునిగ నుండి ప్రభుత్వమును చేజిక్కించుకొనెను. ప్రజాదరము పొంద

19. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, p. 226.
20. నందూరి రామకృష్ణమాచార్య, ప్రాచీన దక్షిణ భారత చరిత్ర, p. 462.
21. చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, p. 4.
22. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 20.
23. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 20.
24. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 25 (foot note.)

వలెనన్న వారి కిష్టమగు పనులను చేయవలెను.' కనుకనే వీరశైవుడైన బసవనను మంత్రిగ నియమించి అతని సోదరిని వివాహము చేసికొని బంధుత్వమును చేకూర్చుకొని యుండును. ఆనాడు శైవమత సహనము చూపనిచో ప్రజాదరము దుర్లభమగు పరిస్థితి సంఘమున నుండెను. శైవమతము సంఘమున సుస్థిరమగు స్థానమును సంపాదించుటయేకాక జైన బౌద్ధమతములను కూకటివ్రేళ్లతో పెళ్లగించు చుండెను. కనుకనే బసవన బొక్కసము నందలి ధనమును వ్యయపరచినను, జైనులను తన అనుయాయులచే చంపించినను, బిజ్జలుడు, బసవనను దండింపక విడువవలసి వచ్చెను. బసవన, బిజ్జలుని భార్య సోదరుడగుట మరియొక కారణము కావచ్చును.

ఉన్నతమైన మంత్రిపదవి, రాజుతో బాంధవ్యము బసవన మతప్రచారమునకు చక్కగా తోడ్పడినవి. మేనల్లుడగు చెన్న బసవన, బసవనకు మతప్రచారమున తోడునీడగ నుండెను. చెన్న బసవన కూడ బసవనవలె చాల అద్భుతమగు పనులు చేయుచుండెను.

బిజ్జలునకు బసవన అనిన మొదట భక్తి విశ్వాసము లున్నప్పటికి, బసవన, అతని అనుయాయులు చేయు పనులు సహింపరానివిగ నుండుటచే బిజ్జలునకు క్రమక్రమముగ బసవన యెడ అసంతృప్తి ప్రబలెను.

బసవన కులభేదము పాటింపక శైవులందరిని పూజించి సత్కరించెడివాడు. అది బ్రాహ్మణులకు కంటక ప్రాయముగ నుండెను. అసరాల శివనాగుమయ్య అను పంచమ కులజుడైన భక్తుని బసవన భక్తితో కొలిచెడివాడు. అది చూచి కొందరు బ్రాహ్మణులు, బసవన వర్ణసంకర మొనర్చుచున్నాడని రాజుతో చెప్పిరి. బిజ్జలుడు కోపించి బసవనను కొలువునకు రమ్మని కబురంపెను. బసవన శివనాగుమయ్యను అందలముపై నెక్కించి కొలువున కరుదెంచెను. బసవనను చూచి బిజ్జలుడు :

"నాదిఁ దలంప వర్ణాష్టా దశముల
భేదంబు లవి నేఁడు పేర్కొన్న యవియె
కుల సంకరము సేయఁ గూడునే మాలఁ
గలిపితి కల్యాణ కటక మంతయును
నీ తల బుట్టెనే నిటలాక్షు భక్తి
నీతి హీనుఁడ తుర్యనే వర్షమింకఁ
బండునే యింక మీరుండిన భూమి ?"[25]

అని ప్రశ్నించెను. దానికి బసవన, జాతులు రెండు. ప్రవర్తకము, నివర్తకము. భవకర్మ సంస్కారి భువిప్రవర్తకుడు. శివకర్మ సంస్కారి భువి

25. బసవ పురాణము, pp. 180—181.

నివక్తకుడు. వేదార్థచరితంబులుండ మొన్న పుట్టిన కులములమాట లేల? అని రాజును తిరిగి ప్రశ్నించి, శివనాగుమయ్యతో కోటి బ్రాహ్మణులైన సరిరారనియు, అటుల జరిగిన తననాలుకను కోసికొందునని సవాలుచేసెను. అంతియేకాక పెక్కుమంది శివభక్తుల గాథలు తెల్పి, ఎట్టి దుర్జాతిలో పుట్టినా శివభక్తుడిల పవిత్రుడని తెల్పి, వ్యాసవసిష్ఠాది ఋషుల జన్మరహస్యములను తెలిపి శివభక్తులకు జాతిభేదము లేదనెను. రాజు అవన్నియు పనికిమాలిన మాటలని నిరసించి 'బత్తులఁ జిదిమినఁ బాలుగారెడినె నెత్తురు గాఱెడినే యొడ్లఁ జిదుమ' అని ప్రశ్నించెను. అంత బసవన శివనాగుమయ్య హస్తమును పిండి పాలుతీసి చూపెదననియు, అచటనున్న బ్రాహ్మణులలో ఎన్నతగ్గవాని చేతిలో నీళ్ళను చూపుదనియు పల్కి, శివనాగుమయ్య కాళ్లకుమ్రొక్కి చేతిని పిండ పాలు ఆకాశమునకు దారకట్టెను. అదిగాంచి బిజ్జలుడు శివనాగుమయ్యకు మ్రొక్కెను. బసవన శివనాగుమయ్యను ఏనుగుపై నెక్కించుకొని వెడలిపోయెను.

బిజ్జలుని రాజ్యమున వీరశైవుడైన మాచయ్య అను మడి వాలుండెను. అతడు భక్తులందరికి వస్త్రములను దానముచేయుచుండెను. మాచయ్య ఒకనా డొక తెరువరిని చంపెను. ప్రజలావిషయమును రాజుకు తెలిపిరి. రాజు బసవనను పిలచి కారణమడిగెను. బసవడు మాచయ్య సాక్షాత్తుశివుడే అని చెప్పెను. బిజ్జలుడు కోపించి ఇట్టిహత్యలు జరుగుచుండిన తన రాజ్యమునకు పరదేశీయులు వచ్చుటకు భయపడెదరని మాచయ్యను చంపుట కొక ఏనుగునుపంపెను. మాచయ్య ఆ ఏనుగును చంపి,

"ఎవ్వండు నామీఁద నేనుంగుఁ గొలిపె
నవ్వానుధేశు గ్రొవ్వడఁతుఁ బొమ్మని"[26]

పల్కెను. ఆ విషయము వినిన బిజ్జలుడు ఖిన్నుడాయెను. అంత బసవన బిజ్జలునితో మడివాలు మాచయ్య గొప్పతనమును చెప్పి, కొంతమంది భక్తులగాథలను వినిపించి, బిజ్జలుని మాచయ్య కడకు గొనిపోయి తాను మాచయ్యకు సాష్టాంగ పడి రాజు తప్పును సైరింపుమని వేడుకొనెను. అంత మాచయ్య బిజ్జలుని ఏనుగును బ్రతికించెను.

ఈ విధముగా బసవన భక్తులు చాలమంది కల్యాణ కటకమున తమ మహిమలను చూపుచు, తమకు అనుయాయులు కాని వారిని చంపుచు వీరశైవ మతమును ప్రచారము చేయుచుండిరి. ఆ కాలమునందలి వీరశైవ భక్తులందరకు నాయకుడు బసవన. మేనల్లుడగు చెన్నబసవనితో శైవమత ప్రచారము చేయుచున్న బసవన ఒకనాడు శైవభక్తులు కోరగా తనకడనున్న రాజ ధనమును వారికి పంచిపెట్టెను. ఆ విషయము మంచనయను మరియొక మంత్రి బిజ్జలునికి

26. బసవ పురాణము, pp. 87 90

తెలిపెను. రాజు బసవనను పిలచి రాజధనమేల వ్యయపరచితివని ప్రశ్నించెను. బసవన ధనమును లెక్కింపుమని రాజుతో పల్కెను. రాజు ధనమును లెక్కింపగా ధనము లెక్కకుమించి యుండెను. అదిగాంచి రాజు బసవనపై తనకు కొండెములు చెప్పిన వారిని దండింతునని చెప్పి, బసవనను సత్కరించి పంపెను.

ఒకనాడు కల్యాణ పురమునందలి బోయలు, శివభక్తులు తమకు ప్రసాదము నిచ్చుట లేదని బిజ్జలునితో మొర పెట్టుకొనిరి. అదితెలిసి బసవన ఈశ్వరున కానాడు కాలకూట విషమును ప్రసాదముగ పెట్టి దానినే వారికిచ్చెదననెను. బోయలు తమకు విషమిచ్చి చంపుటకే అట్లనుచున్నాడని, ముందు బసవన తినిన తాము తినెదమని రాజుకడ ఒప్పందము చేసికొనిరి. బసవన శివునకు కాలకూట విషమును ప్రసాదముగ పెట్టి తాను తనభక్తులు విషమును అరగించిరి.

ఆ విధముగ బసవన తన మహిమలను ప్రదర్శింపుచు, తన అనుయాయు లచే ప్రదర్శింపజేయుచు, ప్రజలందరి చేతను పొగడబడుచుండెను. ఆతడొనర్చిన మహిమలకు ముగ్ధులైనప్పటికి పెక్కుమందికి బసవన మత ప్రచార పద్ధతులు నచ్చలేదు. బసవన, ఆతని అనుయాయులు చేసిన అమానుష కృత్యములకు వెరచి రాజుకు తెల్పుచుండిరి. రాజు బసవనను ఎన్ని విధముల పరీక్షింపదలచి నను తన మహిమలనుచూపి రాజును, అచటనున్న ప్రజలను అబ్బురపరచు చుండెను. రాజేమియు చేయలేక మిన్నకుండ వలసివచ్చెను. బసవన తన మహిమలతో బిజ్జలుని ఎంతగ లోబరచుకున్నప్పటికి క్రమక్రమముగ ఇరువురి నడుమ వైరమేర్పడ జొచ్చెను.

ఒకనాడు బిజ్జలుడు అల్లయ్య మధుపయ్యలను పరమ శివాచార్యుల కన్ను లను పెరికించెను. కారణమేమియు లేకయే తీయించెనని బసవపురాణమున గలదు. మతవిషయమున తగవువచ్చి వారి కన్నులు తీయించెనని పండితారాధ్య చరిత్రమున గలదు. బిజ్జలుడు తనమతస్థులగు జైనులను ఆ ఇరువురు దూషించగవిని సహింపనోపక వారి కన్నులనూడ బెరికించెనని తెలియుచున్నది.[27]

బిజ్జలుడు అల్లయ్య మధుపయ్యల కనులు తీయించక మునుపు బసవనితో యుద్ధము చేసినటుల తెలియుచున్నది. బసవన చేయు పనులు నచ్చక బిజ్జలుడు బసవనను చెరపట్టదలచెను. అది తెలిసి బసవన తన అనుచరులతో పారిపోయెను. కాని రాజు అతని వెంట భటులను పంపెను. బసవన వారిని తరిమెను. రాజు స్వయముగా సైన్యము తీసికొని వెళ్లెను. వీరశైవులు చాలమంది రాజుతో యుద్ధము చేసి రాజు నోడించిరి. రాజు చేయునది లేక బసవనను యథా ప్రకారముగ అతని పూర్వపదవి యందుంచెను.[28] కాని ఆ స్నేహము ఎక్కువ కాలము నిలువ

27. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 23.

28. Journal of Royal Asiatic Society, Vol. IV, p. 21 & Bombay Branch of Royal Asiatic Society, Vol. VIII, p. 89.

లేదు. తన అనుచరుల కన్నులను పెరికించిన బిజ్జలునిపై బసవన పగతీర్చుకొన నిశ్చయించు కొనెను. వీరశైవులందరును బసవన ఇంట సమావేశమైరి. బసవన బిజ్జలుడు బ్రతికి యుండిన తన మతాభివృద్ధికి ఆటంకమని తలచి తన ప్రియశిష్యుడైన జగద్దేవుని బిజ్జలుని చంప నియమించెను. జగద్దేవుడు బిజ్జలుని చంపుటకు మొదట నిరాకరించెను. కాని అతని తల్లి అతనిని ప్రోత్సాహించెను. తల్లి ప్రోత్సాహముతో తన మిత్రులైన మల్లయ్య బొమ్మయ్యలతో అంతఃపురము ప్రవేశించి బిజ్జలుని సంహరించిరి.

బిజ్జలుని హత్యాకాండ క్షణములలో నగరమంతట వ్యాపించెను. నగరమునందలి జైనులకు, వీరశైవులకు ఘోరముగ యుద్ధము జరిగి నగరమంతయు శవములతో నిండిపోయెను. నెత్తుటి వరదలతోను మాంసఖండములతోను నగరము భయంకరముగ నయ్యెను. ఈ కలహమునుగూర్చి బసవపురాణము పేర్కొనలేదు.

రాజు అల్లయ్య మధుపయ్యలను శిక్షింప, బసవన కోపించి ఆ ఊరియందుండరాదని, "తునుము శివద్రోహి ననుచు బిజ్జలుని నొనలిరేఖలు గజిబిజి చేసి, బాడగుఁగటకంబు వాడగుఁగూడఁబాడగు" ననుచు శాపంబిడి, మడివాలు మాచయ్య, చౌడరాయ, ఏకాంతరామయ్య, కిన్నర బ్రహ్మయ్య, కేశి రాజయ్య, కన్నడ బ్రహ్మయ్య, కక్కయ్య, మాచి రాజయ్య మొదలగు భక్తులందరిని కూర్చుకొని కప్పడి సంగమేశ్వరమునకు వెడలిపోయెను. అనంతరము కల్యాణకటకమున పెక్కు ఉత్పాతములు సంభవించి ప్రజలు భయపడిరని బసవపురాణమున గలదు.[29]

బిజ్జలుని మరణానంతరము కల్యాణ కటకము సర్వనాశనమాయెనని బసవపురాణమున గలదు. కాని బిజ్జలుని తరువాత బిజ్జలుని సంతతివారైన సోమేశ్వరుడు, సంకాముడు, ఆహవమల్లుడు పరిపాలించిరి. అనంతరము పశ్చిమచాళుక్య రాజైన నాల్గవ సోమేశ్వరుడు, కాలచుర్యుల నుండి తన పూర్వులు కోల్పోయిన రాజ్యమును మరల స్వాధీనము కావించు కొనెను. మరికొంతభాగము దేవగిరి యాదవులు, కాకతీయులు ఆక్రమించుకొనిరి. బిజ్జలుని రాజ్యము అంతరించెను.[30]

బిజ్జలుడు చంపబడిన సంవత్సరమును బసవపురాణము తెలుపలేదు. ఈతడు క్రీ.శ. 1167 వ సంవత్సరమున చంపబడెనని చరిత్రకారుల అభిప్రాయము.[31] బిజ్జలుని మరణానంతరము బసవన కప్పడి సంగమేశ్వరమునకేగి అచట లింగైక్యము నొందెను. బిజ్జలుని చంపించిన కొలది దినములకే బసవన లింగైక్యము నందుట

29. బసవపురాణము, pp. 208-209.

30. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 26, Recording of the Deccan History Conference, First Session, 1945.

31. చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్రము, p. 26, చిలుకూరి వీరభద్రరావు, అళియ రామరాయలు, p. 4, Bhandarkar's, Early History of the Deccan, p. 165.

చే బసవన క్రీ.శ. 1167 వ సంవత్సరముననే మరణించెననుట స్పష్టము. జైనుడైన బిజ్జలుని పరమత సహనగుణమును, తన వీరశైవ మతప్రచారమునకు ఉపయోగించుకొని వీరశైవ మతోద్ధరణము చేసిన మతప్రవక్తయగు బసవేశ్వరుని గూర్చిన చారిత్రక ఆధారములంతగా లభించుట లేదు. బసవేశ్వరుని పేర్కొనిన కొన్నిశాసనములు మాత్రము గలవు. హిరయూరు శాసనము,[32] అర్జునగిరి శాసనము,[33] చౌడదామపుర శాసనము,[34] కల్లదేవరపుర శాసనము,[35] మండీపుర శాసనముల[36] యందు బసవన పేర్కొనబడి యున్నాడు. ఈ శాసనములందు బసవని పేరు మాత్రమే పేర్కొనబడి యున్నది. బీజాపూరు జిల్లాలోని మనగోలి గ్రామమున గల క్రీ.శ. 1161 నాటి శాసనమువలన మాత్రము బసవన జీవిత విశేషములు తెలియుచున్నవి. ఈతడు సాటిలేని మహేశ్వర భక్తుడని ఈ శాసనమున కలదు.[37]

బాగవాడికి పదునొకండు మైళ్ళ దూరమున గల మనగ్గోలి యందు బిజ్జలుడు తను రాజ్యమునకు వచ్చిన ఆరవ సంవత్సరమున వేయించిన ఒక శాసనమున, బసవన ఒక దేవాలయమునకు దానమిచ్చినటుల గలదు. అందు బసవన తలిదండ్రుల నామములున్నవి. అందు బసవన గొప్పతనము కీర్తింపబడినది. అతని మించిన శివభక్తుడు లేడని, ప్రపంచమంతటిచే పూజింప తగ్గవాడని కలదు.[38]

బసవన పరమ వీరమహేశ్వరుడు. కర్ణాట దేశమున వీరపద్ధతిని వీరశైవ ప్రచారము చేసెను. ప్రజలలో చైతన్యమును కలిగించి, సంఘమున మతవిప్లవమును లేవదీసిన మతప్రవక్త యనుట నిస్సంశయము. కాని కాలక్రమమున బసవన చరిత్రకు అనేక అభూత కల్పనలు చేర్చబడినవి. బసవన నందికేశ్వరుని అపరావతారమని, పెక్కు అద్భుత కార్యములను చేసెనని కథలు సృష్టింప బడినవి. కన్నడ భాషలో బసవపురాణము, మలబసవరాజ చరిత్ర, వృషభేంద్ర విజయము, చెన్న బసవ పురాణములు, జైనుల బిజ్జలరాజ చరిత్ర మొదలగు గ్రంథములు బసవని మహిమలను, శివభక్తి నిరతిని వర్ణించినవి.

## పండితారాధ్యుడు

పాశుపత శైవశాఖతో పాటు వర్ధిల్లినది ఆరాధ్య శైవశాఖ. ఈ శాఖకు చెందిన ద్వాదశాచార్యులలో పండితారాధ్యుడొకడు. వీరిలో రేవన, మరుల, ఏకోరాయులు,

32. Epigraphia Carnatica, Vol. V, p. 109.
33. Epigraphia Indica, Vol. XXI, p. 9.
34. బసవపురాణము, పీఠిక, p. 36.
35. Epigraphia Carnatica, Vol. XI. p. 60
36. Epigraphia Carnatica, Vol. III, p. 33.
37. Epigraphia Indica, Vol. V, 1898-1899.
38. Edward, P. Rice, A History of Kanarese Literature, p. 53.

సిద్ధత్రయము. ఆరాధ్యత్రయము ఉద్భటారాధ్య, వేమనారాధ్య, విశ్వారాధ్యులు. నీలకంఠాచార్య, హరదత్తాచార్య, భాస్కరాచార్యులు ఆచార్యత్రయము. శ్రీపతి పండిత, మల్లికార్జున, మంచన పండితులు పండితత్రయము. వీరందరు గృహస్థులు. వేదవేదాంగ పారంగతులు. లింగధారులు. పండిత త్రయములో ప్రశస్తి గడించిన వాడు పండితారాధ్యుడు. ఈతడు ద్రాక్షారామ మల్లికార్జునుని ఆలయ పురోహితుడైన భీమన పుత్రుడు. భీమన పుత్రులులేక ఈశ్వరుని ప్రార్థింపగా పండితారాధ్యుడు జన్మించెను. ఈతనిలో నందీశ్వరుని సర్వజ్ఞత, భృంగీశ్వరుని సహజనిష్ఠ, దుర్వాసాది మునుల శాపశక్తి, యక్షపాదుడు ఆదిగాగల వారి వాగ్విచక్షత, ప్రథమ గణాధిపుల కున్న సహజ స్వకీయ ప్రసాదైక రతి, వీరభద్రుని శౌర్యము ఉన్నవి. మల్లికార్జునుని అనుగ్రహము వలన జన్మించుటచే మల్లికార్జున పండితారాధ్యుడను నామము స్థిరపడెను. ఇతడు ద్రాక్షారామమున గల కోటిపల్లి ఆరాధ్యునికడ శివదీక్ష గైకొని, ఒడలంతా విభూతి పూసుకొని, శిరస్సుకు, చెవులకు, చేతులకు, రొమ్మున, మెడలో రుద్రాక్షలు కట్టుకొని, శివలింగమును మెడలో ధరించి వీరమహేశ్వర దీక్షను స్వీకరించి, వీరవ్రతమును పాలించుచుండెను. పండితుని వీరశైవ వ్రతాచారమును గాంచి అచటి బ్రాహ్మణులు నివ్వెరపడి, 'పండితయ్యా నువ్వు పౌరాణికుడవు, సద్విజుడవు, సచ్చరిత్రుడవు, విద్వాంసుడవు, వేదవిదుడవు, ఈ విధముగా విభూది పూసుకొని, రుద్రాక్షలను, లింగమును ధరించుట, పాదోదకమును త్రాగుట ఎందులక'ని ఆక్షేపించిరి. అంత పండితుడు వారికి విభూతి మహిమ, పాదోదక మహిమ, లింగార్చన లింగధారణ మహిమ, ప్రసాద స్వీకార మహిమ, రుద్రాక్ష మహిమ తెలిపి, ఘంటాకర్ణ, భీత, దుర్వాస, సుకేశి, సూరసాని, సామవేది, తిరునాళ్లప్పొవ మొదలగు భక్తుల కథలు, ముక్కంటి గణ మహిమ మొదలగు గాథలను తెలిపి శైవమత ప్రాశస్త్యమును, మాహాత్మ్యమును తెలిపి తన పాండిత్యమును ప్రకటించుకొనెను. బ్రాహ్మణులాతని పాండిత్యమునకు అబ్బురపడి అతనిని పొగడుచు వెడలిపోయిరి.

పండితారాధ్యుని భక్తి నిరతి ఎన్నదగ్గది. ఈతడు ఇష్ట లింగపూజ చేయుచు, శివుని చూచుటకు దశకోటి కోట్ల కన్నులు, నుతించుటకు శతకోటి కోట్ల జిహ్వలు, పూజించుటకు కోటి కోట్ల హస్తములు, తలచుకొనుటకు మనోముఖములనంత కోట్లు నిమ్మని శివుని కోరుచూ, 'సదానంద గురులింగా' అని నుతించెడివాడు. అటుల కాదేని చూచుటకు ఒడలంత కన్నులు చేయమని ప్రార్థించెడివాడు. నిరంతరము శివునియందే చిత్తము నిల్పి, శివుని కీర్తించుచు, శివుని దర్శనము కాంక్షించుచు, గణనాథులకు మ్రొక్కుచు, బహిరంగముగను అంతరంగముననను ప్రాణలింగమును పూజింపుచు కాలము గడిపెడివాడు. పండితుడు శివుని ఎంత భక్తియుక్తులతో పూజించెడివాడో శివభక్తులను గూడ అంతకంటె భక్తితో పూజించెడివాడు. పెక్కు మంది శివభక్తుల పొగడ్తల నందుకున్న వీరమహేశ్వరుడు పండితుడు.

శివభక్తులందరును మహిమాన్వితులుగనే చెప్పబడిరి. వారు పెక్కు మహిమ లొనర్చినట్లు గల పెక్కు గాథలు మనకు ప్రచారమున గలవు. పండితారాధ్యుడు ఆశ్చర్యకరమగు పెక్కు మానవాతీత కార్యములు చేసెను. పండితారాధ్య చరిత్రమున పండితుని మహిమలు పెక్కు గాథలందు వర్ణితమైనవి.

భక్తుడైన వెల్లగుండ మహాదేవయ్య ఒకనాడు నిదురలేచి చూచుకొనక పొరపాటున శివార్చన చేయు పాత్రలను తన్నెను. అతడది మహాపరాధముగ భావించి వెంటనే తన కాళ్లను నరికివేసికొని ప్రాయశ్చిత్తము చేసికొనెను. ఇది గాంచిన పండితారాధ్యుడు శివునకు దీపారాధన చేయు నూనెతీసి మహాదేవయ్య కాళ్లకు రాసి చికిత్స చేసెను. ఆ చికిత్స వలన మహాదేవయ్యకు కాళ్లు వచ్చెను. పండితుని కీర్తి దశదిశలా వ్యాపించెను. ఇతర ప్రాంతములలో అనేకులు వీర శైవ మతమును అవలంభించిన వారుండిరి. అందు స్త్రీలును గలరు. ఆనాడు శైవులను బ్రాహ్మణులు, జైనులు, బౌద్ధులు బాధించు చుండిరి. అయినప్పటికి శైవులు మహిమలను చూపుచు శివభక్తుల గాథలను వినిపించుచు శైవమత ప్రచారము చేయుచుండిరి. అట్టి భక్తులు పెక్కుమంది పండితుని చూచుటకు వచ్చు చుండిరి. అట్టి భక్తులలో సూరసానమ్మ ఒకతె. ఈమెది పోరండ్ల అగ్రహారము. ఏతంతువు. ఈమె జాతి బేధము పాటింపక పంచములను సహితము ఆదరించెడిది. ఒకనాడామె మాలవానికి భోజనము పెట్టగా బ్రాహ్మణులు ఆమెను బాధించిరి. ఆమె వారందరికి శైవ భక్తుల కథలను వినిపించి, ఈశ్వరుని మహిమలు తెలిపి వారు తనకు సాష్టాంగ పడునట్లు చేసినది. ఈమె పండితుని కీర్తి విని, బెలిదేవి వేమనారాధ్యుడను మరియొక భక్తునితో పండితుని దర్శించుటకు వెళ్లినది. వారు వచ్చుసరికి పండితుడు శివపూజ చేయుచుండెను. వారిని చూచి పండితుడు శివుని కంటె శివభక్తులే గొప్పవారని వారిని పూజించెను. అదివరకే బసవేశ్వరుని మహిమలు తెలిసిన సూరసానమ్మ వేమనారాధ్యులు, పండితుని మతావేశమునకు అబ్బురపడి బసవేశ్వరుని మించిన వాడని తలచి పండితుని నుతించిరి. సూర సానమ్మ బసవేశ్వరుని మహిమలు, అతని భక్తుల గొప్పతనము వివరముగ పండితు నకు తెలిపినది. బసవడు 'శివ ప్రసాయితము'ను ఖడ్గమును ధరించి వీరపద్ధతిని మతమును బోధించుచున్నాడని తెలిపెను.

కర్ణాటక దేశమున బసవేశ్వరునివలె తెలుగు దేశమున పండితయ్య శైవ మతమును స్థాపించదలచెను. మతస్థాపన కొరకు దేశసంచారము చేయమొదలిడెను. బసవన వలె వీరపద్ధతిని మత ప్రచారమునకు పూనుకొని తన జీవితమును శైవ మతవ్యాప్తికే వినియోగించెను. కర్ణాటక దేశమునందు వీరశైవమతస్థాపన చేయుచున్న బసవేశ్వరుని సందర్శించుటకై శిష్యగణముతో బయలుదేరి, మార్గమున వెలనాటి చోళుల ఆస్థానమును సందర్శించెను.

**పండితారాధ్యుడు — వెలనాటి చోళులు :**

శిష్యసమేతముగ పండితుడు వెలనాటి చోళుల రాజధాని యైన ధనదు పురమునకు వెళ్లెను. పండితుడు కూడ మత ప్రచారమునకు రాజాశ్రయము ముఖ్యమని తలచియుండును. అది వాస్తవముకూడ. ఆనాడు తెలుగు దేశమున వెలనాటి చోళులకొక ప్రత్యేక స్థానమున్నది. వెలనాటిచోళుల రాజధాని యైన ధనదు పురమునకు చందవోలు, నదనవోలు అను పేర్లును కలవు. ఈ ధనదుపురము ఇప్పటి గుంటూరు జిల్లా తెనాలి తాలూకా లోని చందవోలు. వెలనాటి చోళులు పూర్వాంధ్రదేశమును రమారమి ఒక శతాబ్దం పరిపాలించిరి. వీరి కాలమున దేశమున చాలా మార్పులు వచ్చినవి. అందుముఖ్యమైనది మత విప్లవము. ఆనాడు శైవవైష్ణవ మతములు విజృంభించుచుండెను. వెలనాటి చోళులు బౌద్ధులనాదరించిరి. చందవోలు రాజునకు గురువు బౌద్ధమతాచార్యుడు. పండితుడు శిష్యసమేతముగ చందవోలునందు శైవమత ప్రచారము చేయమొదలిడెను. ఈ చర్య రాజ గురువైన బౌద్ధ పండితునకు కోపకారణమాయెను. ఆతడు పండితుని ఓడింప నిశ్చయించుకొని సభను ఏర్పరచమని రాజును కోరెను. రాజు సభ నేర్పరచెను. ఆసభకు బౌదులు, జైనులు, చార్వాకులు, అద్వైతులు, సాంఖ్యులు, లోకాయతులు మొదలైనవారరు దెంచిరి. ఆ సభలో పండితుడు శైవమత ప్రాముఖ్యమును ఉదాహరణములతో వివరించెను. వివరించుటయే కాక బౌద్ధాది ఇతరమతములను ఖండించి శివుని మించిన దైవము లేడని, ఉన్నటుల ఎవరైన నిరూపించిన తనతల నరకు కొనెదనని, నిప్పుతొకెదనని, శివుని కంటె గొప్పవాడెవడైన కలడని, ఎవడైన తెల్పిన వానిని తన అరికాలెత్తి తన్నెదనని ప్రతిజ్ఞచేసెను.[39] పండితుడు వేసిన ప్రశ్నలకు బౌద్ధ పండితుడు తగువిధముగ సమాధానము చెప్ప నేరక పండితుని ధిక్కరించి సభ విడచిపోయెను. బౌద్ధపండితుడు పండితారాధ్యుని ధిక్కరించుట పండితుని శిష్యులకు కోపకారణమాయెను. రేమయ్య, దేవయ్య అను ఇరువురు శిష్యులు, బౌద్ధ పండితుడు ప్రతిదినము చందవోలు సమీపమున గల బౌద్ధారామమునకు ప్రార్థనార్ధ మేగుట తెలసికొని మారువేషములతో రహస్యముగ అచటి కేగి దాగి బౌద్ధపండితుడు అరుదెంచినంతనె వానిని దారుణముగ చిత్రవధచేసి ఆతని యురమున 'అసంఖ్యాత మహేశ్వరుల పంపనుచు' లేఖవ్రాసి పెట్టి వెడలి పోయిరి[40]. ఈహత్యవిషయము తెలిసి రాజు పండితుని రావించి ప్రశ్నించ తానే ఆ హత్య చేయించినటుల పండితుడంగీకరించెను. రాజు కోపించి పండితుని కండ్లుపెరికించెను. కాని పండితునికి కండ్లువచ్చెను. రాజంత పండితుని కండ్లలో జిల్లేడు పాలు పోయించి కండ్లుపెరికించెను. పండితుడు రుద్రుడై

39. పండితారాధ్య చరిత్ర, p. 711.

40. పండితారాధ్య చరిత్ర, p. 21.

"శాపాదపి—శరాదపి యనంగఁ బెనుద్రోహిఁద్రుంచు నంతకు కన్నులిచ్చితివేని నీభక్తులాన"[41] యని ఒట్టుపెట్టి ఆ దురాత్ముడు భూమిపై నుండరాదని పలికి అచటి నుండి అమరావతికేగెను.

పండితుడు అమరావతి కేగినవెంటనే పట్టణమంతయు పాడుపడెను. పట్టప గలె చుక్కలగపడెను. భూమి కంపించెను. రాజునకు బంధు మిత్ర పరివారము తో కారణము లేకనే విరోధమేర్పడెను. ఈ ఉత్పాతము లన్ని పండితుని నిందిం చినందునే కలిగెనని ప్రజలు భావించిరి. ఒకనాడు, బూడిదనలదుకొని, కపాలము ధరించి త్రిశూలధారి యైన ఒక సంయమి అరుదెంచి తనవక్షమున పొడచినట్లు రాజు స్వప్నముగాంచెను. కాని యదార్థమున రాజు వక్షమున ఒక వ్రణముండెను. రాజదిగాంచి శివభక్తుని నిందించుటయే దీనికి కారణమని తలచి, సపరివారముగ పండితుని కడకేగి క్షమింపవేడుకొనెను. కాని పండితుడు క్షమింప నిరాకరించెను. విచారముతో రాజునగరమున కొచ్చెను. రాజ్యముకొరకు యుద్ధము చేసి అతని సంతానము మడిసెను. వ్రణబాధ మిక్కుటమై రాజు మరణించెను.

చందవోలు విడచిన పండితుడు అమరావతికేగెను. అచట కృష్ణలో ఒడ్డోలగమేర్పరచి భక్తులతో 'మనము వెలనాటినుండి వెడలివచ్చితిమి. వాడు మరణించెను. నాకు కండ్లువచ్చున'ని తెలిపెను. అంతలోనె ఫణిహారి యను నాతడరు దెంచి, 'అద్రోహినంతకు ప్రోలికి ననిపితినని' భక్తులకు విన్నవించెను. పండితునకు కండ్లువచ్చెను అని పండితారాధ్య చరిత్ర తెలుపుచున్నది. ఫణిహారి అను నాతడు అనిన మాటలను బట్టి రాజును చంపివచ్చెనని తెలియుచున్నది. రాజు వ్రణబాధతో మరణించెనా లేక ఫణిహారి హత్యచేసెనా అను అంశమును నేలటూరి వెంకటరమణయ్యగారు విమర్శనాత్మకముగ చర్చించిరి.[42]

పండితుడు అమరావతి యందున్నపుడే బసవన జందెమును తీసివైచి, జాతినివిడచి తనతో కలియుమని పండితునకు కబురంపెను. పండితుడు తన సమాధానమును తన అనుచరుల ద్వారా పంపెను. వారు బసవన సందేశమును, అతడిచ్చిన విభూతిని గొనివచ్చిరి. బసవన పంపిన విభూతి ధరించి పండితుడు కన్నడ భాషయందు కవిత్వము చెప్పెను. బసవనను కలియుటకు కళ్యాణ కటకమునకు ప్రయాణమై నడుమ పానుగల్లు చేరెను.

పానుగంటిపురమును ఉదయ చోడుడను రాజు పరిపాలించు చుండెను అతని కోశాధికారి గోవింద ప్రెగ్గడ. గోవింద ప్రెగ్గడ పండితుని శిష్యుడు. అతడు పండితునకు ఉచితమైన సేవలుచేసెను. క్రమముగా పెక్కుమంది ఉద్యోగులు పండితుని శిష్యులైరి. రాచకార్యములు మాని పండితునకు సేవలు చేయుచుండిరి.

41. పండితారాధ్య చరిత్ర, p. 54.

42. నేలటూరి వెంకటరమణయ్య, సోమనాథు డెప్పటివాడు, p. 16.

రాజు దవళేసు నామయ్య అను నాతనిని విధులు సక్రమముగ నిర్వర్తింప లేదని నిందించెను. నామయ్య ఆగ్రహించి తనబొందె రాజుది కాని ఆత్మ కాదని చెప్పి, రాజు హస్తమున గల ఖడ్గమును గ్రహించి హర్మ్యగోపురము పైకెక్కి ఆ రాజవంశము నిర్మూల మగుగాక యని శపించి శివార్పణ చేసి తన శిరమును ఖండించుకొని కైలాసమున కేగెను. ఆ విషయము తెలిసి పండితుడు కోపించి సపుత్ర కళత్ర మిత్రబాంధవ సహితముగ ఉదయ చోళుడు నశింపవలెనని ఉదకము నెత్తి శపించి, ఆ పురమును విడిచి కల్యాణ కటకమునకు ప్రయాణమాయెను. ఉదయ చోడుడు పుత్రమిత్ర కళత్ర బంధు సహితముగ నాశనమాయెను.

ఈ ఉదయ చోళుడెవరనునది విశదముగ ఈ గ్రంథమున లేదు. మనకు చరిత్రలో ముగ్గురు ఉదయ చోళులు కన్పించు చున్నారు. హొయసళ మొదటి బల్లాళుని సోదరుడొక ఉదయాదిత్యుడు కలడు. ఇతడు రాజ్యము చేయలేదు. పశ్చిమ చాళుక్యుల సామంతులైన నొళంబ పల్లవులలో ఒక ఉదయాదిత్యుడు కలడు. ఈ వంశీయులు బళ్ళారి కడప మండలములను క్రీ.శ. 1017 ప్రాంత మున పరిపాలించిరి. సోమదేవునకు, కొంచెలాదేవికి జన్మించిన ఉదయావనీశు డొకడు కలడు. ఇతనిది క్రీ.శ. 1120 నాటి శాసన మొకటి తాడిపత్రి రామేశ్వ రాలయమున కలదు. ఈతడు జైనుడు. కనుక ఈతడే పానుగంటిపుర ఉదయా వనీశుడై యుండును.[43]

పండితారాధ్యుడు మరల కల్యాణ కటకమునకు ప్రయాణమాయెను. బసవన బొక్కసము నందలి ద్రవ్యమును అందరికి సమముగ కాక శైవులకే పంచిపెట్టుటచే బిజ్జలుడు ఆగ్రహించెనని, బసవన భక్తులు బొమ్మయ్య, జగదేవులు బిజ్జలుని చంపిరని, బసవన సంగమేశ్వరమున కేగి, కొద్దినాళ్లకే సంగమేశ్వరుని గర్భమున జొచ్చెనని మార్గమున వినెను. బసవన మరణమునకు మిక్కిలి దుఃఖించి, చేయునది లేక శ్రీశైలము దర్శించుట కేగెను. బసవన మరణము పండితుని కృంగ దీసెను. దుఃఖముచే శ్రీశైలము నెక్కలేక తనకు మారుగ శ్రీశైలనాథుని దర్శింప తన శిష్యులను పంపెను. శిష్యులు శ్రీశైలనాథుని దర్శించి వచ్చిన తరువాత, ఇంక తాను జీవించి యుండుట యనవసరమని తనువు చాలించెను. పండితారాధ్యచరిత్ర యందలి పండితుని గాథవలన బసవన పండితారాధ్యులు సమకాలికులని, బసవన మరణించన కొలది కాలమునకే పండితారాధ్యుడు మరణించెనని తెలియుచున్నది. పండితుని జీవిత చరిత్ర తెలిసికొనుటకు పండితా రాధ్య చరిత్రయే మనకు ముఖ్యాధారము. చందవోలు కైఫియతునందు మల్లి కార్జున పండితారాధ్యుడుగ పేర్కొనబడి యున్నటుల తెలియుచున్నది.[44] బసవేశ్వ

43. పండితారాధ్య చరిత్ర, పీఠిక.

44. వంగూరి సుబ్బారావు, శతక కవుల చరిత్ర, p. 8.

రుడు క్రీ.శ. 12వ శతాబ్దము వాడని, అతడు క్రీ.శ. 1157 లో శివైక్యమును పొందెనని నిర్ణయించుట జరిగినది. బసవన మరణించిన కొలది కాలమునకే వృద్ధుడైన పండితుడు క్రీ.శ. 1170 ప్రాంతమున శివసాయుజ్యము పొందెను.[45] ఈతడు 1100-1170 సంవత్సరముల నడుమ జీవించెనని తెలియుచున్నది.

పండితారాధ్యుడు కేవలము మతప్రచారకుడే కాదు గ్రంథకర్త కూడ. పండితారాధ్య చరిత్ర వలన పండితుడు నలుబది నాలుగు రచనలు చేసినట్లు తెలియు చున్నది. అందు శివతత్త్వసార మొక్కటే మనకు లభించు చున్నది. ఈ గ్రంథము వీరశైవుల క్రమశిక్షణ గ్రంథమనవచ్చు. అతివాద పార్టీ క్రమశిక్షణ స్మృతిలాంటి దనిరి ఆరుద్రగారు. శైవులు శైవేతరులు ఏమేమి చేయవలెనో పండితుడు వివరముగ వివరించెను. శివభక్తులను జాతిని గూర్చి అడుగరాదని, వారికి జబ్బు చేసినను, లేమి కలిగినను ఆదుకోవలెనని, కులమేదైనా శివభక్తుడు గొప్పవాడని, బ్రాహ్మణుల వలె శివభక్తులు వధానర్హులని, భర్త శివభక్తుడు కాక పోయినచో భార్య అతనిని మార్చవలెనని, మారనిచో త్యజింప వలెనని, శివభక్తుడుకాని భర్త చెప్పినట్లు భార్య నడచుకోనవసరము లేదని, శివభక్తులు కాని వారెంతగొప్ప వారైనను వారికి నమస్కరించరాదని, శివభక్తులు కాని వారితో ఆనందముగ గడుప రావని, వారికి అప్పిచ్చుటగాని పుచ్చుకొనుటగాని తగదని, వారితో సమముగ ఒకే ఆసనముపై కూర్చొనరాదని, శయనింపరాదని, వారి సహవాసము చేయరాదని, శివ నింద చేయువారిని చంపవలెనని, శివనింద గావించిన గ్రంథములను తగులపెట్టవలె నని, ఆ గ్రంథములను రచించిన వారిని చంపవలెనని, శివభక్తుడేమి చేసినను పాపము కాదని, శివభక్తుల దుర్గుణములను వెదకినవాడు చండాలుడని పండితుడు తన గ్రంథమున వివరించెను. ఈతడు వేదవేదాంగ, సకలశాస్త్ర పారంగతుడు సంస్కృత వ్యాకరణమును చక్కగ అభ్యసించినవాడు. శ్రుతిస్మృతి పురాణముల లోని సంస్కృత సమాసములను పండితుడు చక్కగ తన గ్రంథములలో పొందు పరచెను. ఇతడు సంస్కృతమున ఎంతటి పండితుడో, తెలుగు నుడి కారము నంతటి సరసముగ వ్యక్తీకరించగల నేర్పరి.

సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు బసవేశ్వర పండితా రాధ్య చరిత్రలనే కాక పెక్కుమంది శివభక్తుల గాథలను వర్ణించినవి. ఈ గ్రంథము లందు ఈ మతప్రవక్తల గాథలు, పూర్వీకుల గాథలు, సమకాలికుల గాథలు గలవు. వీరి చరిత్రలను తెలిసి కొనుటకు ఈ గ్రంథములు, కన్నడాది బాష లందలి కొన్ని శివభక్తులగాథల వర్ణించు గ్రంథములు తప్ప ఇతర చారిత్రకాధారములు లేవు. శ్రీపతి పండితుడు, వీర చోడుడు, ఉదయ చోడుడు, కరికాళ చోడుడు, కరయూరు చోడుడు ,సింధు బల్లహుడు మొదలగు వారి గాథలు ఈ రెండు

45. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రులచరిత్ర-సంస్కృతి, p. 225.

గ్రంథములందును గలవు. వీరు చారిత్రక పురుషులు. కాని వీరిలో పెక్కుమంది చరిత్రలు తెలియుట లేదు.

శ్రీపతి పండితుని గూర్చి పెక్కు వాదములు గలవు. ఈతని చరిత్రను గూర్చి పండితారాధ్య చరిత్ర పీఠిక యందు వివరముగ కలదు. వీరచోళుడు మొదటి కులోత్తుంగుని కుమారుడు. ఇతడు క్రీ.శ. 1074 నుండి 1077 వరకు పరిపాలించెను. కరికాళచోళుడు క్రీ.శ. 5 వ శతాబ్దమున కావేరీ పట్టణమును పరిపాలించెను. చోళరాజులలో ప్రసిద్ధిగాంచినవాడు. ఈతనిని గూర్చి చోళులను ప్రకరణమున వివపముగ చర్చించితిమి. కరయూరు చోళుని చరిత్ర తెలియుట లేదు. వీరుకాక రమారమి నూట అరువది శివభక్తుల గాథలు ఈ రెండు గ్రంథములందును గలవు. వీరిలో చాలమందిని గూర్చి పండితారాధ్య చరిత్ర పీఠికయందు వివరింపబడి యున్నది.

## బసవపురాణ, పండితారాధ్య చరిత్రములు - మతము

ఈ రెండు గ్రంథములును శైవమతము నందలి ఒక శాఖయైన వీరశైవ మతమును ప్రతిపాదించు చున్నవి. శైవమతము క్రొత్తగా పుట్టినదికాదు. ఆర్యులు మన దేశమునకు వచ్చునప్పటికే అనార్యులు శైవమతానుయాయులై యుండిరి. ఆర్యు లెంత ప్రయత్నించినను అనార్యులా మతమును విడనాడలేదు. అంత ఆర్యులు శివమతమును ఒక మతముగా స్వీకరించిరి. మహెంజదారో, హరప్పా త్రవ్వకముల వలన శైవమతము అతి ప్రాచీనమైనదని స్పష్టపడినది. వేద కాలము నాడు కూడ శైవమతమున్నటుల తెలియుచున్నది. "భారతదేశమున శైవమత మనాదిగ వర్ధిల్లు చుండినది. దీనికి ఋగ్వేదము నుండి, ఇతర వేదముల నుండి, స్మృతీతిహాస పురాణముల నుండి అనేక ప్రమాణములను ఇవ్వవచ్చును. ఆ ఆ గ్రంథముల నుండి శైవులైనవారు అనేక ప్రమాణములను నిరూపించు చున్నారు." అని తిరుమలనాథ కవిగారి అభిప్రాయము.[46]

అనాదిగా భారతదేశమున వర్ధిల్లిన శైవమతము క్రీ.శ. 5, 6 శతాబ్దముల నాటికే దక్షిణదేశమున ప్రముఖస్థానము వహించినది. క్రీ.శ. 5, 6 శతాబ్దముల కాలమున ఆంధ్రదేశమును పరిపాలించిన చోళరాజులందరు శివభక్తులు. వీరు పెక్కు శివాలయములను నిర్మించిరి. ఆ ఆలయ పోషణము కొరకు పెక్కు దానము లను చేసిరి. శివభక్తులను ఆదరించిరి. ఆనాటికే శైవమతమునందు పెక్కు శాఖలు వర్ధిల్లినవి. మొదటి నుండి ఈ మతమును సామాన్య ప్రజలు ఆదరించిరి. అయినప్పటికి క్రీ.శ. 11, 12 శతాబ్దములలో బౌద్ధ జైనమతములకు ప్రాముఖ్యము హెచ్చెను. భిన్నశాఖలుగ నేర్పడిన శైవమతమున ఐక్యత లేకపోవుట, వీరశైవ

---

46. తిరుమలనాథ కవి, శైవాచార సంగ్రహము, ఉపోద్ఘాతము, p..1.

మతావిర్భావమునకు నాందిపలికినది. కన్నడదేశముననున్న బసవేశ్వరుని యందీ మత పరిస్థితి సంచలనము కలుగచేసినది. శివునిపట్ల మూఢవిశ్వాసము, పరమత ద్వేషము, కులాచార నిరసనము అనెడి సూత్రములపై ప్రభావించి కర్ణాటకాంధ్ర దేశములందు వీరశైవము సంచలనము కలుగచేసినది. కన్నడ దేశమున భిన్న భిన్న శైవ శాఖలను కూర్చి వీరశైవమను నూతన శైవశాఖను బసవేశ్వరుడు నెలకొల్పు సమయమునకు వీరశైవము ఆంధ్రదేశమున మరొక రూపమున ప్రారంభమైనది. శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితుడు ఆంధ్ర దేశమున శైవమత పునరుద్ధరణకు పూనుకొనిరి. వీరందరిలో వీరశైవ మతప్రవక్తగ బసవేశ్వరుడు ఖ్యాతిగాంచెను. అతడు తన మార్గమునకు ప్రమాణ ప్రతిపత్తిని చేకూర్చుటకు పాటుపడెను.

శైవమతము శ్రుతిస్మృతి మూలకమని బసవపురాణ పండితారాధ్య చరిత్ర ములు తెల్పుచున్నవి. వీరశైవ మతముయొక్క ముఖ్యలక్షణములు ఈగ్రంథము లందు ప్రతిపాదింప బడినవి.

వీరశైవులకు జాతిభేదముండరాదు. లింగధారణము అతిముఖ్యమైన ఆచారము. విభూతి పూసుకొని రుద్రాక్షలు ధరించవలెను. పంచాక్షరీ మంత్ర పఠనము చేయవలెను. స్త్రీ పురుష పండిత పామర భేదము పాటింపరాదు. శైవులు తమ సమస్తము జంగములకు, శివభక్తులకు సమర్పించవలెను. శివుని కంటెను శివభక్తులనే మిక్కిలి ఆదరించవలెను. జంగములను శివుని అవతారముగ భావింపవలెను. వీరశైవులు శత్రువులైనను వారిని మిత్రులుగనే భావింపవలెను. శివుని కర్పింపనిదే ఏ వస్తువును భుజింపరాదు. పరధనాపేక్ష ఉండరాదు. సత్యమునే పలుకవలెను. శివుని తప్ప ఇతర దేవతలను పూజింపరాదు. శివుని నిందించిన వారిని క్షమించి వదలక చంపవలెను. శైవ గ్రంథములు తప్ప అన్య మత గ్రంథములను పఠింపరాదు. శైవులు నిరంతరము శస్త్రధారణము చేయ వలెను. శివభక్తురాండ్రు తమ భర్తలు భవులైనచో వారిని శైవులుగ మార్చవలెను. వారు మారనిచో వారిని విడిచిపెట్టవలెను. శైవుడు కాని భర్త చెప్పిన విధముగ భార్య నడుచుకొన నవసరము లేదు. వారికి ఎట్టి పాపము అంటదు. ఇవి వీర శైవమునందలి కొన్ని ముఖ్యమైన సూత్రములు.

పురుషులు, స్త్రీలు, పండితులు, పామరులు, బ్రాహ్మణులు, మాలలు, మాదిగలు, దొంగలు, దొరలు అను భేదము పాటింపక అందరినీ శైవమతమునందు చేర్చుకొనిరి. ఈ అంశమును నిరూపించుటకు ఈ గ్రంథములలో పెక్కుమంది శివభక్తుల గాథలు వర్ణితమైనవి. శివభక్తులకు తామసాహంకారాదు లుండరాదనిరి. ఇందులకు నిదర్శనముగ కొందరు భక్తుల గాథలీ గ్రంథములందు గలవు. కాని ఈ గ్రంథముల వలన శైవులకు తామసాహంకారాదులు ఎక్కువ అని స్పష్టపడు చున్నది. అన్యమతములను సహించు తత్వము వీరిలోలేదు. సవాలుచేసి వాదోప

వాదములు పెట్టుకొని తమ్మెదిర్చిన వారిని సంహరించుట తామసాది గుణములకు నిదర్శనమే కదా! శివభక్తులు ఏది కోరిన అది చేయవలెను. అది కుమార్గమైనను శివభక్తులు అనుసరించుటచే సన్మార్గమే అగునని బసవని మతము. వారు దొంగతనము చేసినను, ఇతరులను నిందించినను, ఇంకేమి చేసినను జనులు సహింపవలెను. లేనిచో వారిని చిత్రహింసలపాలు చేయుట వీరిపద్ధతి. భవులు అనగా శైవమతేతరులు, శైవులతో దర్శనాలాప సంస్పర్శనశయన సంపర్క భోజనాసన దానములకు తగరన్నది వీరశైవుల నీమము.

బసవేశ్వరుడు కర్ణాటక దేశమున శైవమతవ్యాప్తి గావించుచున్న కాలముననే పండితుడు ఆంధ్రదేశమున శైవమతవ్యాప్తికై కంకణము కట్టుకొనెను. పండితుడును బసవన ప్రతిపాదించిన సూత్రములనే ప్రతిపాదించెను. అతడు రచించిన శివతత్త్వసారము శైవసూత్రములను ప్రతిపాదించు గ్రంథము. బసవన భక్తిమార్గమును శివపరముగా ప్రతిపాదించి వీరశైవమతోద్ధరణకు పూనుకొనినాడు. పండితారాధ్యుడీమతమునకు ప్రమాణ ప్రతిపత్తిని రచనలద్వారా చేకూర్చినాడు. వీరి ప్రచారమునకు తోడైనవి శైవమత ప్రతిపాదికములైన గ్రంథములు.

బసవన పండితారాధ్యు లిరువురు మహిమాన్వితులుగ వర్ణింపబడిరి. వీరితో పాటు పెక్కుమంది శివభక్తులు కూడ మహిమాన్వితులుగ వర్ణింపబడిరి. ఇందలి సత్యాసత్యములు నిరూపించుట దుర్లభము. ప్రతి మతగ్రంథమునందు, మతప్రవక్తలు, మతానుయాయులు వారి శిష్యప్రశిష్యులు మహాద్భుతములు, మహిమాన్వితములునైన పెక్కు కార్యములొనర్చినటుల పెక్కుగాథలు ప్రచారమునందున్నవి. విజ్ఞానమింతగా పెరిగిన నేడును ఇట్టిగాథలను నమ్ముచున్నారు. సాధువులను సన్యాసులను కొలుచుచున్నారు. కనుక అందలి సత్యాసత్యములను చర్చించుట అనవసరము. అది వ్యక్తిగతాభిప్రాయమునుబట్టి ఉండును.

బసవన పండితారాధ్యులిరువురును తమ మతప్రచారము కొరకు ఎట్టిదుష్కరమైన కార్యమైనను చేయుటకు వెనుదీయలేదు. శైవమతమును వ్యతిరేకించి తమ్మెదిరించిన వారినందరిని వీరు నిర్దాక్షిణ్యముగ సంహరించిరి. మతోద్ధరణమునకు హత్యచేయుట దోషము కాదని వీరి వాదము. తలలు తరుగుకొనుట, కాళ్ళుచేతులు నరుకుకొనుట, ఆత్మార్పణ చేసికొనుట వీరశైవమతము నందొక భాగము. శైవమత ప్రవక్తలు, మతానుయాయులు, శరీరమునందలి ఏ భాగము నరకికొనినను మరల మొలపించుట, కండ్లు తీయించిన మరల కండ్లువచ్చునట్లు చేయుట, మరణించిన జీవములను మరల బ్రతికించుట, సస్యములను ధనముగ మార్చుట, రుగ్మతలను నయము చేయుట మొదలగు పెక్కు అతిమానుష కార్యములను చేయుచుండిరి. బసవన పండితారాధ్యులిరువురకు జంగములు వచ్చి ఏదికోరిన నది లేదనక ఇచ్చు నియమము కలదు. బసవన బిజ్జలుని కోశాగారమునందలి ధనమంతటిని శివభక్తులకు పంచిపెట్టెను. వీరి వీరావేశమునకు వర్ణభేదము పాటింప నక్కరలేదన్న బోధన

తోడై పెక్కుమందిని ఆకర్షించినది. వీరిరువురి కాలమున, అనంతర కాలమున పెక్కుమంది ప్రజలు, ప్రభువులు శైవమతానుయాయులైరి. శైవమతపరమగు రచనల కూడ కన్నడాంధ్ర దేశములందు వెలువడినవి. బసవన స్థాపించిన ఈ వీర శైవము దేశమందంతట వ్యాపించి దేశమును ఉర్రూతలూగించినది.

వీరశైవ మతానుసరణమున బసవననే అనుసరించిన పండితారాధ్యుడు బసవన మరణవార్తవిని సర్వస్వమును కోల్పోయినట్లు కృంగిపోయెను. వీరిరువురు ను ఒకరినొకరు కలసి కొననేలేదు. కేవలము ఉత్తరప్రత్యుత్తరముల ద్వారా వీరు గురుశిష్యులైరి. కాని వీరిరువురకు ఒక్క అంశమున మాత్రము ఏకతాభావము కుదురలేదు. బ్రాహ్మణ కుటుంబమున జన్మించి, ఉపనయనాది కర్మసంస్కారాదు లను విడనాడి, వర్ణవ్యవస్థను నిరసించి, వైదికకర్మలను త్యజించి శైవమతమును చేపట్టి, వీరశైవమతమును స్థాపించిన బసవేశ్వరుడు తన్ననుసరింపమని పండితు నకు జాబువ్రాసెను. దానికి పండితుడు

"భక్తిమీద వలపు బ్రాహ్మంబుతోఁ బొత్తు
బాయలేను నేను బసవలింగ"

అని జవాబు వ్రాసెను. వర్ణాశ్రమ ధర్మమును త్యజించు ఈ ఒక్క అంశము తక్క పండితుడు బసవని అడుగుజాడల యందే శైవమతోద్ధరణకు పాటుపడి వీరశైవము నందు ఆరాధ్య సంప్రదాయమును స్థాపించినాడు. ఈతడు శిఖాయజ్ఞోపవీతములను విసర్జించుట తనకిష్టము లేదని 'శివతత్త్వసారమున' తెలిపెను.

ప్రపంచమున ఒక మహాపురుషుడు గాని, ఒక మతప్రవక్త గాని జన్మించు టతో సంఘమున కొన్ని మార్పులు వచ్చుననుట నిర్వివాదాంశము. ఆ మార్పులు సంఘమున కొంత అలజడికి కారణభూత మగును. అటులనే బసవన పండితా రాధ్యుల కారణముగ ఆనాటి సంఘమున మతపరముగ అనేక మార్పులు సంభవించినవి. అలజడులు కలిగినవి. తత్ఫలితముగ వీరశైవ మతము ప్రజాదరణము పొందినది. బసవన పండితారాధ్యులు మత ప్రవక్తలేకాక సంఘ సంస్కర్తలు నైరి. కాని వీరి మతోన్మాదము నందలి వీరావేశము ప్రజలలో చైతన్య మును కలిగించి నప్పటికి రెండు వందల ఏండ్ల కంటె నెక్కువ కాలము నిలువలేక పోయినది. అన్యమత సహనము లేకపోవుట, శైవేతరులను దండించి, హింసించుట, చిత్రవధలు చేయుట, అన్యమత గ్రంథములను తగలపెట్టించుట, జైనుల గుళ్లను పడగొట్టించుట, అన్య మతస్థులతో వాదనలుచేసి, చివరికి వారిని వధించుట మొదలగు విద్వేష పూరితమగు పనులు ఈ మతము ప్రాచుర్యమును కోల్పోవుటకు గల కారణములు. వీరి నిర్దాక్షిణ్య దృక్పథమే వీరశైవము త్వరగా నమసిపోవుటకు కారణమైనది. విద్వేషపూరితమగు ఉద్యమములు పెక్కు రోజులు నిలువవనుటకు నిదర్శనము వీరశైవ మతము.

## సాంఘిక చరిత్ర - కొన్ని ఆచార వ్యవహారములు

బసవపురాణ పండితారాధ్య చరిత్రలవలన సుమారు రెండు మూడు శతాబ్దముల సాంఘిక చరిత్ర కొంత, కొన్ని ఆచారములు, అలవాటులు, ఆనాడు ప్రజలు ఉపయోగించు వస్త్రాదుల నామములు, నాడు వాడుకలో గల రాగములు, ప్రజలు పాడుకొనెడి పదములు, ఆడుకొనెడి ఆటలు మొదలగు కొన్ని అంశములు తెలియు చున్నవి.

సంఘముపై మత ప్రభావమునకు ప్రాముఖ్యము కలదు. నాడు మతము పెక్కు మార్పులకు లోనైనది. వైష్ణవ, వీరవైష్ణవ, బౌద్ధ, జైన, శైవ మతము లందు శైవముదే పై చేయిగ నుండి వీరశైవ మత స్థాపన జరిగినది. ఆనాడు శైవులు రాజులను వశపరచుకొని వారికి శివదీక్ష నిచ్చి, తాము పదవులను చేపట్టి తమ పదవులను మత ప్రచారమునకు వినియోగించుకొనిరి. కులతత్త్వ నిర్మూలనము చేసి సర్వ వర్ణములవారిని ఏకవర్ణులుగ చేయుటకు జరిగిన ప్రయత్నము లీ రెండు గ్రంథములు వర్ణించినవి. శైవులు నిరంతరము జైనులతోడనే పోరాడు చుండిరి. క్రీ.శ. 11, 12 శతాబ్దములలో ఆంధ్ర కర్ణాటక దేశములందు జైనమతము ప్రబలి యుండెను. పెక్కుమంది రాజులు జైనమతావలంబులైరి. కనుక శైవులు జైనులను హింసించి చిత్రవధలపాలు చేయుచుండిరి. శైవులు జైనులను రాళ్లతో కూడ కొట్టి హింసించినట్లు తెలియుచున్నది.[47] "వసుధలో జనులను వారి నందరిని నేలపాలుగఁ జేసి"[48] శైవమత స్థాపనకు పూనుకొనుట జరిగినది. శైవులకు బ్రాహ్మణులకు నిరంతరము కలహములు సంభవించు చుండెను. మత విషయమగు వాదము లెల్లప్పుడు జరుగుచుండెను. రాజాస్థానములందు జైనులకు, వైదికులకు, శైవులకు నడుమ వాదోపవాదములు జరుగుచుండెను. వీరు వాదములతో ఆగక తిట్టుకొనుట, కొట్టుకొనుట జరుగుచుండెను. చివరకు హత్యలును జరుగుచుండెను. శైవులు అన్యమతస్థులను నిందించుట నాడు సామాన్యమగు విషయము. "అనమాక్షు గొలువని అగ్రజుడైన వసుధలో మాల"యని, "నామాల కుక్కల నర్చింప దగునె," "వేద భరాక్రాంతుల నగబడిన బ్రాహ్మణ గార్దభంబుల తోడ" యని తిట్టుచుండిరి. శైవు లంతటితో నాగక బ్రాహ్మణులను కర్మచండాలురని, వ్రతభ్రష్టులని,దుర్జాతులని, పశుకర్ములని, బాపనకూళలని నిందించుచుండిరి. శైవులు మతము పేరిట పెక్కు హత్యలు చేయుచుండిరి. హత్యచేయుటయే గాక నిర్భయముగ తామే ఆ హత్య చేసినటుల అంగీకరించుచుండిరి.

కాని కుల నిర్మూలనము కొరకు జరిగిన ఈ ప్రయత్నములో లింగాయతులు, ఆరాధ్యులు, బలిజలు, జంగములు, తంబళ్లు మొదలగు మరికొన్ని కులముల

47. బసవ పురాణము, p. 180.

48. బసవ పురాణము, p. 191.

సృష్టి జరుగుట విశేషము. మతము పేరిట బసవనపేర స్త్రీలకు వివాహములు చేయక విడచి బసివిరాండ్రని పేరుపెట్టి వారిని వ్యభిచారిణులుగా మార్చిరి. వైష్ణవుల దేవదాసీలును ఇట్టివారే. ఈ పద్ధతి వీరు జైన బౌద్ధమతములను చూసి అనుకరించినట్లున్నది.

అనాడు అద్వైతులు, బ్రహ్మవాదులు, అభేదవాదులు, శూన్యవాదులు, కుల వాదులు, కర్మవాదులు, నాస్తికులు, చార్వాకులు, ప్రకృతివాదులు, శబ్దబ్రహ్మ పరులు, పురుషత్రయైకవాదులు, లోకాయతులు మొదలగు వారుండిరి.[49]

ఆంధ్ర దేశమున అగ్రవర్ణములవారు స్థాపించిన వీరశైవము, కర్ణాటక దేశమున కులవ్యవస్థపై ధ్వజమెత్తిన వీరశైవము కలసిపోయి తీవ్రమగు సాంఘిక కల్లోలమును సృష్టించినవి. కులవ్యవస్థ పాటించని జైనమతమానాడు ప్రజా సామాన్యమున విశేషముగ వ్యాపించి యుండెను. ఆ మతమును నాశనముచేసి, మతగురువులను హింసించి, వారి దేవాలయములను ధ్వంసము చేసినది వీరశైవము. అద్వైత సిద్ధాంతములుగాని, వైదికమతముగాని నాడు ప్రజలను జైనమత మంతగా అకర్షింప లేదు. కనుక వీరశైవులు బ్రాహ్మణులను విమర్శలతో వదలి జైనులను మాత్రము చిత్రహింసలపాలు చేసిరి. అదియును కాక బ్రాహ్మణులకు రాజుల ప్రాపుండెను, కనుక వీరు జైనులను హింసించిరి. ఈ మతకలహములు రాజకీయ కలహములకు, రాజ్యవినాశనమునకు కూడ దారితీసినవి.

సామాన్య నైతికసూత్రములను సహితము ఉల్లంఘించి కులరహిత సంఘ మును సృష్టించి మతవ్యాప్తికి పూనుకొన్న వీరశైవము మొదట గొప్ప కల్లోలమును సృష్టించి నప్పటికి, క్రమముగ ఆర్థిక, రాజకీయాది శక్తులకు లోబడి ప్రాచుర్య మును కోల్పోయినది. ఈ మతమునకు చిహ్నముగ నేడు ఆంధ్రదేశమున, బ్రాహ్మణులలో ఆరాధ్యులు, బ్రాహ్మణేతరులలో జంగములు మిగిలిపోయిరి. కన్నడ దేశమున లింగాయతులిట్టివారే.

వీరశైవ మతప్రచారము శైవసాహిత్యమును తెలుగు సాహిత్యమున ప్రవేశ పెట్టినది. మతప్రచారమే ప్రధానోద్దేశముగ గ్రంథములు వెలసినవి. వీరశైవమత గ్రంథములు బ్రాహ్మణాధిక్యతను నిరసించినవి. వైదిక కర్మసిద్ధాంతములను నిశిత ముగ విమర్శించినవి.

అనాడు శివాలయములందు తంబళ్లు పూజారులుగ నుండిరి. భక్తకూటము లుండెడివి. పాటలుకట్టి పాడుచుండిరి. వాటిని రోకటిపాటలనెడివారు. నాడు కోలాటము, నందికోల అను ఆటలుండెను. బాత్రగొండ్లి, పేరణి, కేళిక మొదలగు నృత్యములుండెను. గొండ్లి అనగా గర్భనృత్యము. పేరణియన కుంభముపై నృత్యము. రంగుల రాట్నములున్నటుల తెలియుచున్నది.

49. బసవ పురాణము, p. 173.

ఆనాటి సంఘమున చోరులు, కత్తి, బలపము, కావిచీర, కత్తెర, యినుప నక్షత్రములు, ముండ్లబంతి, నీలకప్పడము, మంత్రపుకాటుక, చందవేది, సెలగోల, ఒంటట్టిచెప్పులు, కుక్కలవాకట్టు కొంకివానసము, కంకటి రజ్జువు మొదలగు పరికరములను ఉపయోగించు చుండిరి.[50]

వెట్టి చేయుపద్ధతి నాడును కలదు. ప్రజలయందు యాత్రాసందర్శనాభిలాష మిక్కుటముగ నుండెడిది. యాత్రలందు, నేటి ఏకపాత్రాభినయము వంటి వేషము లుండెను.

వాపులకు వావిలి చివుళ్లు, ఉమ్మెత్త, అముదము ఉపయోగించుచుండిరి. జిల్లెడాకులు మొదలగు వాటితో కాపడము పెట్టుకొను చుండిరి. వాయు తైలము లనుపయోగించు చుండిరి.[51]

క్షీరోదకముపట్టు, రత్నంపుపట్టు, మరకతపట్టు, పాంబట్టు, నెరపట్టు, వెలిపట్టు, తవరాజంబు, ఆందోళరవి, చంద్రాతపము, సాంధ్యరాగము, ఇంద్రనీలము, మహేంద్రభూషణము, శరధి, మేమవన్నె, రుద్రాక్షవన్నె, కాంభోజి పులిగోరుపట్టు, భూపతిరుద్రతిలకము, నరిపట్టు, మలయజసిరి, కొలనిమేమము, గజావళి, హయావళి, నరికమ్మితెలుపు దివ్యాంబరము, ఉదయరాగము, దేవాంబరము పొత్తి గుజరాష్ట్రంబు పట్టు మొదలగు నామములు, వర్ణములుగల వస్త్రములను నాటిప్రజలు వాడుచుండిరి.[52]

దేశాక్షి, దన్నాసి, దేశి, మలహరి, సకలరామక్రియ, లలిత సాళంగనాట, గుజ్జరి, మేమరంజి, మేళావుళి, జిత్రమేళావుళి, మాళవి, సిరి, వరాళి, కాంభోజి, నారంగ, గుండ్రక్రియ, కౌశిక, దేవక్రియ, మధ్యమావతి, తోడి, వసంత మొదలగు రాగములు,[53] తుమ్మెదపదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనంద, శంకర, నివాళి, వాలేసు, గొబ్బి, వెన్నెల సంజవర్ణన, గణవర్ణన పదములు[54] పాడుకొనెడివారు. పుత్రుల కొరకు నందికేశ్వరనోము నోచుకొనెడివారు. యుద్ధమునకు పోవునపుడు వీర తాంబూలము తీసికొనెడి ఆచారము గలదు.

ఇవి బసవపురాణ, పండితారాధ్య చరిత్రల వలన తెలియుచున్న కొన్ని సాంఘిక స్థితిగతులు.

**రచనావిశేషములు :**

పాల్కురికి సోమనాథుడు ఆంధ్రభాషలో దేశీయచందమైన ద్విపదలో రచన

50. బసవపురాణము, pp. 154-165.
51. పండితారాధ్య చరిత్ర, పర్వతప్రకరణము.
52. బసవపురాణము, p. 49.
53. బసవపురాణము, p. 79.
54. పండితారాధ్య చరిత్ర, p. 513.

గావించిన మొదటి తెలుగు కవి. తన రచనను గూర్చి

"ఉరుతర గద్యపద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపంగా సర్వ సామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కిఁదైవాఱ"[55]

అని చెప్పుకొనెను. అంతియేకాక ఈతడు అల్పాక్షరముల అనల్పార్థమొచ్చు నటుల రచన గావించెదననెను. నిజమునకీతని కవిత్వమందు జానుతెనుగెంత కలదో సంస్కృతమును అంతియే కలదు. ఈతడు పెక్కు సంస్కృత పదములను, సమాసములను శ్రుతి వాక్యములను పొందుపరచెను. ఈతని గ్రంథములందు సమస్తశాస్త్రాగమ జ్ఞానము, పురాణధర్మములు ప్రతిఫలించుచున్నవి.

పాల్కురికి సోమనాథుని గూర్చి, అతని రచనావిధానములను గూర్చి, రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు, బండారు తమ్మయ్యగారు, తిమ్మావజ్జల కోదండరామయ్యగారు, దివాకర్ల వేంకటావధానిగారు, చాగంటి శేషయ్యగారు, ఆరుద్ర మొదలగు వారు వివరముగ చర్చించిరి.

తెలుగు ఛందమైన ద్విపదలో,

"తొలికోడి కనువిచ్చి నిలిచి మైవెంచి
జలజల రెక్కలు సడలించి నీల్గి
గ్రక్కున గాలార్చి కంఠంబు విచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
నిక్కించి, మెడసాచి, నిక్కి మున్సాచి
కొక్కొరో క్కుర్రని కూయక మున్న"—[56]

అనుచూ సహజ సిద్ధముగ తెలుగువారి కొరకు కావ్యగానము చేసెను పాల్కురికి సోమనాథుడు. ఈతని గ్రంథములైన బసవపురాణ పండితారాధ్య చరిత్రములు, ఇరువురు ప్రవక్తల గాథలను వర్ణించుటయే కాక, కాకతీయుల కాలమునాటి మత సాంఘిక పరిస్థితులకు అద్దము పట్టుచున్నవి. బసవన, పండితారాధ్యుల వీరశైవ మతావేశ గాథలతోపాటు, పెక్కుమంది తెలుగు, తమిళ, కన్నడ శివభక్తుల గాథలను చేర్చి తెలుగులో కావ్యమును వ్రాసి సోమనాథుడు జాతీయ సమైక్యత కొరకు పాటుపడెనని చెప్పవచ్చును.

సోమనాథుడు శైవుడు. గురు లింగార్యునివద్ద శివదీక్షను పుచ్చుకొనినాడు. పండితారాధ్యుని రచనలు చదివి ఆకర్షితుడై శైవమత ప్రచారమునకు పూనుకొనెను. గోడగి త్రిపురారి అను శివభక్తుని ప్రోత్సాహముతో రచనకు పూనుకొనెను.

---

55. బసవపురాణము, p. 4.

56. బసవ పురాణము, p. 4.

వర్ణనలు చేయుట యందు ఔచిత్యము నెరిగిన కవులలో సోమనాథు డొకడు. ఈతని వర్ణనలు కనులముందు కదలాడినట్లుండి స్వభావ సుందరముగ నుండును. సూరసాని కథయందలి మాలవాని వర్ణన, సామవేది కథయందలి మాలెత వర్ణన, నాట్యనిమిత్తండి కథయందలి శివతాండవము, ఇంకను పెక్కు వర్ణనలు సోమనాథుని మూర్తి చిత్రణమునకు చక్కని నిదర్శనములు. మానవ స్వభావమును, అతి సున్నితమైన భావములను అందముగ వర్ణించుట సోమనాథుని సొత్తనవచ్చును. స్త్రీల ఊహలను, స్త్రీ హృదయమును బెజ్జమహాదేవి కథయందు అతి సున్నితమగు భావములతో మనస్సునకు హత్తుకొనునట్లుగ చక్కగ వర్ణించెను. ఈతని రచనల యందు, హాస్య, కరుణ, రౌద్ర, అద్భుత, వీర, భీభత్స, భయానక, శాంత రసములు గలవు. ప్రకృతి వర్ణనములు, వస్తువర్ణనములు, అంగ ప్రత్యంగ వర్ణనములు సోమనాథుని హస్తమున కొత్తమెరుగులు దిద్దుకొన్నవి.

సోమనాథుడు వీరశైవుడగుటచే అతని రచనలలో మతావేశము వ్యక్తమగు చున్నది. ఈతడు బ్రాహ్మణాధిక్యతను నిరసించి, వైదిక కర్మ సిద్ధాంతములను,

"అసమాక్షు గొలువని అగ్రజుండైన
వసుధ మాలల మాలవాడ కాకెట్లు"[57]
వేద భరాక్రాంతు లనగ బడిన
బ్రాహ్మణ గార్దబంబుల తోడ
బ్రతి సేసి యాడిన పాపంబు వచ్చు[58]

గాడిద చాకలి మూటలను మోయునట్లు బ్రాహ్మణులు వేదములను మోయుచు వల్లెవేయుచుందురని అతి నిశితముగ విమర్శించి అవహేళనము చేసెను. కర్మసిద్ధాంతమును విమర్శించెను. ఈతని రచనలో ఎంతటి వీరావేశ మున్నప్పటికిని, హేతువాద దృష్టి కలదు.

"కుటిలుడై జాతినాగుల జంపుచుండి
ప్రతిమ నాగులకు పాల్వోయునట్లు"

అంటూ చక్కని విమర్శనాత్మక దృష్టిని వ్యక్తపరచెను.

బసవన పండితారాధ్యుల శైవ సంప్రదాయములను కవిత్వము ద్వారా ప్రచారము చేయుటకు పూనుకొనిన సోమన ఆవేశపూరితముగ రచించుట ఆశ్చర్య కరము కాదు. ఆవేశపూరిత మైనప్పటికిని ఈతని కవిత్వము సహజ సుందరమగు వర్ణనలతో, మృదు మధురములగు భావములతో నొప్పుచున్నది. ఈతడు ప్రతిభా వంతుడగు కవి యనుట అతిశయోక్తికాదు. చక్కని రచనా శిల్పముతో, సహజమగు కవితాధారతో నొప్పు సోమనాథుని రచనా నైపుణ్యము ఎన్నదగ్గది.

57. బసవ పురాణము, p. 217.

58. బసవ పురాణము, p. 225.

సామాన్య జనులకు అర్థమగుటకై మార్గపద్ధతిని విడచి దేశిపద్ధతిని అనుసరించి దేశీయుల గాథలను కవితావస్తువుగ గ్రహించి నూతనమార్గమును సృష్టించిన ప్రజాభ్యుదయవాది సోమనాథుడు. చారిత్రక పురుషులైన బసవన, పండితారాధ్యుల చరిత్రలను కథావస్తువులుగ గ్రహించి వీరశైవ మత ప్రాముఖ్యమును తెలిపి, నాటి మత సాంఘిక పరిస్థితులను తెలియచెప్పిన సోమనాథుడు చిరస్మరణీయుడు. ఈతని కవితావేశమునకు మతావేశము అగ్నికి వాయువు తోడైనటుల ఒకదాని కొకటి తోడ్పడి ఈతని కవిత్వమునకు నూతనత్వమును ఆపాదించినవి.

# 11. జీవిత చరిత్ర

ప్రఖ్యాతిగాంచిన ప్రముఖవ్యక్తుల జీవితకథలను వర్ణించు చరిత్రలు, వ్యక్తులకు సంబంధించినవైనప్పటికిని, చారిత్రక రచనా విభాగమునకు సంబంధించినవై యుండును. చరిత్రలయందు ప్రముఖ వ్యక్తులగూర్చి వ్రాయుట మనమెరుగుదుము. కాని చరిత్రలు ఆయాప్రముఖుల జీవిత విశేషములను సంపూర్ణముగ వర్ణించవు. లోకోత్తరములు, ఆకర్షణీయములునైన మహనీయుల జీవితములు ప్రజానీకమునకు ఆదర్శముగ నుండునటుల వ్రాయవలయునన్న ఆకాంక్ష జీవిత చరిత్రల ఆవిర్భావమునకు కారణము.

జీవితచరిత్ర (Biography) రచనావ్యాసంగములో నూతన ప్రక్రియయని, దీని ఆవిర్భావము 20వ శతాబ్దములో ప్రారంభమైనదని, ఇది పాశ్చాత్యుల ప్రభావమని అనేకుల అభిప్రాయము. పాశ్చాత్యుల ప్రభావమువలన ఇరువదవ శతాబ్దమున జీవితచరిత్రలు విరివిగా వచ్చినప్పటికిని ప్రాచీనకాలమున కూడ మనకు జీవితచరిత్రలు కలవు. బసవపురాణము, పండితారాధ్య చరిత్ర, అన్నమాచార్య చరిత్ర మొదలగు దేశికావ్యములు గలవు. బసవపురాణ పండితారాధ్య చరిత్రములు మతము–మతప్రవక్తలను ప్రకరణమున పరిశీలించుట జరిగినది. ఆ రెండు గ్రంథములును జీవితచరిత్రములైనప్పటికిని వానియందు మతమునకు ప్రాముఖ్యము మెండు.

అన్నమాచార్య చరిత్ర, తెలుగు కవితాశాఖలో పదకవులని ప్రత్యేకముగ ఖ్యాతిగడించిన తాళ్లపాక వంశీయుడైన అన్నమాచార్యుని జీవితమును తెలుపు చున్నది. అన్నమయ్య పదకవితా పితామహుడు. 'చందమామ రావె, జాబిల్లిరావె' అని తమ పాపలను ఊరడించుటకు తల్లులు పాడెడికమ్మని పాటను, 'జో అచ్యుతానంద జోజో ముకుందా' అని తమ బిడ్డలను నిద్రపుచ్చు లాలి పాటను విననని తెలుగువాడుండడనుట అతిశయోక్తి కాదు. వేలకొలది సంకీర్తనములతో పాటు తరతరములు ఇది తెలుగువారి సంస్కృతియని చాటిచెప్పు లాలిపాటలను రచించిన తాళ్లపాక అన్నమాచార్యుని జీవితకథను ఈ ప్రకరణమున పరిశీలించుట జరిగినది.

## అన్నమాచార్య చరిత్ర-తాళ్లపాక చిన్నన్న

చిన్నన్న ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున ప్రఖ్యాతిగాంచిన తాళ్లపాక వంశీయుడు. పదకవితా పితామహుడను బిరుదుగాంచిన అన్నమాచార్యుని మనుమడు. ఈతడు క్రీ.శ. 1498-1561 సంవత్సరముల నడుమ జీవించియుండెనని తెలియుచున్నది.[1] ఇతడు 'అష్టమహిషీ కల్యాణము,' 'పరమయోగి విలాసము,' 'ఉషా పరిణయము,' 'అన్నమాచార్య చరిత్రము' అను నాలుగు ద్విపద ప్రబంధములు రచించెను. ఇతని తండ్రి పెదతిరుమలాచార్యుడు. తల్లి తిరుమలమ్మ.

## అన్నమాచార్యుని జీవిత చరిత్ర

పొత్తపినాడు నందుగల తాళ్లపాకయందు అన్నమయ్య జన్మించెను. నందవరీక బ్రాహ్మణుడు, భారద్వాజ గోత్రజుడు. తండ్రి నారాయణసూరి. తల్లి లక్కమాంబ. పుత్రులు లేనందున లక్కమాంబ తిరుపతివెళ్లి గరుడస్తంభమును పూజింపగా, వేంకటేశ్వరుని కటాక్షమున, వైశాఖ మాసమున విశాఖనక్షత్రమున అన్నమయ్య జన్మించెను.[2] ఇతడు క్రీ.శ. 1424 వ సంవత్సరమున జన్మించినటుల తెలియుచున్నది.[3]

ఈ గ్రంథమున, అన్నమాచార్యుడు జన్మించిన మాసము, నక్షత్రము చెప్పబడినవిగాని, ఏ సంవత్సరమున జన్మించెనో చెప్పబడలేదు. ఈతని జన్మసంవత్సరమును గూర్చి అభిప్రాయ భేదములు గలవు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీ.శ. 1424 వ సంవత్సరమనియు, శ్రీ చాగంటి శేషయ్యగారు 29 ఏప్రిలు 1409 వ సంవత్సరమని పెక్కు ఉదాహరణములతో తెల్పిరి.[4]

అన్నమాచార్యులు, వేంకటేశ్వరుని ఖడ్గాంశమున జన్మించెనట. ఈ అంశము—

"వరదుడై వేంకటేశ్వరుడు తాబూను
బిరుదు గజ్జియల మువ్విడి కఠారంబు
కలలోన నొసగ నక్కజమంది తపము
ఫలియించెననుచు దంపతులేగిరంత"[5]

అను పదములవలన తెలియుచున్నది. అన్నమాచార్యుడు పసితనమునుండియు, వేంకటేశ్వరుని భక్తుడు. చిన్నతనమున, వేంకటేశ్వరునిపై గీతము లాలపించిననేగాని

1. చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపు. 8, p. 146.
2. అన్నమాచార్య చరిత్ర, p. 9.
3. అన్నమాచార్య చరిత్ర, p. 9.
4. అన్నమాచార్య చరిత్ర, పీఠిక, p. 3.
5. అన్నమాచార్య చరిత్ర, p. 9.

నిదురపోయెడివాడు కాడు.[6]

ఐదవయేట తలిదండ్రులన్నమయ్యకు అక్షరాభ్యాస మొనర్చిరి. వేంకటేశ్వరుని వరప్రసాది యగుటచే అన్నమయ్యకు, విద్యలన్నియును, అనతి కాలముననే పట్టుబడెను. చిన్నతనముననే "ఆడిన మాటెల్ల అమృత వాక్యముగ పాడిన పాటెల్ల బరమగానముగ"[7] వేంకటేశ్వరునిపై గీతము లాలపించెడువాడు.

తలితండ్రులకు, అన్న వదినలకు బదులు చెప్పక ఏ పని చెప్పినను చేసెడివాడు. తండ్రియు, వదినెయు, పశువుల కొరకు కసవు తెమ్మనగా వెళ్లిన అన్నమయ్య, వేలు తెగకోసికొని, కోపము తెచ్చుకొని, "హరిచరాచర దేహియని పెద్దలనగ నిరుపొంద నెఱిగియు నిటుచేయదగునె"[8] అని తలంచి కొడవలి పారవైచి—

"ఎన్నటి చుట్టంబు లిటువంటి వార
లెన్నటి బంధుండ నేను వారలకు
నీవట్టి వెట్టి నాకేల కావింప
భావింప నాలోన బాయ కెల్లపుడు
తల్లియు దండ్రియు దైవంబు గురువు
నెల్ల సంపదలు నైయెల్ల చందముల
నన్నుబోచు శేషాద్రి నాథుని గొలిచి
మనియెద ననుచు"[9]

ఎవ్వరికిని తెలుపక వేంకటేశ్వరుని సేవించుటకై తిరుపతికి వెళ్లి అట కొన్నినాళ్లు నివసించెను. తిరుపతికి వెళ్లునపుడు అన్నమాచార్యుడు మార్గమధ్యమున దిగువ తిరుపతి కడ గల ఒక గొల్లపల్లె యందలి శక్తిని పూజించి తిరుపతికి ప్రయాణమాయెను. దిగువ తిరుపతి పొలిమేరలలో తాళ్లపాక గంగమ్మ యను గ్రామదేవత కలదు. ఈమె ప్రాచీన దేవత యట. తిరుపతికి యాత్రార్థము వచ్చువారందరును ఈ గంగమ్మను దర్శింపనిదే క్షేత్ర ప్రవేశము చేయరట.[10] కనుక అన్నమాచార్యుడును ఈ దేవతను దర్శించి యుండును.

అన్నమయ్య వేంకటేశ్వరుని దర్శించుటకు ముందుగనే మోకాళ్ల పర్వతము కడ దేవిపై నొక శతకమును ఆశువుగ చెప్పెను. ఎండ కన్నెరుగక ఇంటిపట్టుననే యుండు అన్నమయ్య మోకాళ్లపర్వతము వరకు వచ్చి అలసిపోయి చెప్పులను సహితము విడువక అట నొక వెదురు పొద నీడలో నిదురించెను. అంత

6. అన్నమాచార్య చరిత్ర, p. 9.
7. అన్నమాచార్య చరిత్ర, p. 10.
8. అన్నమాచార్య చరిత్ర, p. 12.
9. అన్నమాచార్య చరిత్ర, p. 12.
10. అన్నమాచార్య చరిత్ర, పీఠిక, pp. 6-7.

అన్నమయ్యకు దేవి ప్రత్యక్షమై చెప్పులతో పర్వతము నెక్కరాదని తెలిపి ప్రసాదమిడి అంతర్ధాన మాయెను. అన్నమయ్య అది కలయో, యథార్థమో అని సంశయించి, చివరికది సత్యమే యని తలంచి ఆశువుగ దేవిపై నొక శతకమును చెప్పెను.[11] సరస కవిత్వ వాచా ప్రౌఢితో చెప్పిన ఈ శతకము మధుర శృంగార భరితమైనది.

అన్నమయ్య స్వామి పుష్కరిణిని సేవించి గరుడస్తంభమును చంపక ప్రదక్షిణమును, ప్రసాదము లొసగు ప్రదేశమును, ప్రసాదములను, గోపురమును, భాష్యకారులను, నరసింహుని, జనార్దనుని, అలమేలు మంగను, యాగశాలను, బంగారు గరుడుని, శేషుని, పునుగు చట్టలను కాచి తైలము వడియకట్టు స్థలమును, శ్రీ బండారమును, స్వామిని స్తుతించు చిలుకను, బంగారు గాదెలను, బంగారు వాకిలిని స్తుతించెను.[12] వేంకటేశ్వరుని దర్శించి—

"కంటి నయ్యఖిలాండ కర్తనేనధికు
గంటి నాయఘము నిక్కము వేడుకొంటి
పావనంబైన పాప వినాశనమ్ము
కోవిదుల్ కొనియాడు కోనేరు గంటి
నావంటి దీను విన్నప ముద్ధరించు
శ్రీ వేంకటేశు సేవించ గంటి"[13]

అని కీర్తించెను. ఇతని కీర్తనమును విన్న వారందరును మెచ్చిరి.

మరునాడు అమర తీర్థము, ఆకాశగంగ, పాపవినాశనము, పాండవ నామ తీర్థము మొదలగు తీర్థములందు స్నానము చేసి, తాను కట్టుకొనిన పుట్టము నొక రాతిపై నారవేసి అది అరులోపల వేంకటేశ్వరునిపై నొక శతకమును చెప్పెను.[14] తరువాత హరి పరివారమును కొలిచి, ద్వార సమీపమునకు వచ్చి మ్రొక్కి, బంగారు వాకిలికి తాళము వేసి యుండుట గాంచి అచట నిలచి వేంకటేశ్వరునకు వివరముగ వేంకటేశ్వర శతకమును విన్నవించెను. అంత అచట నున్న అర్చకులందరు ఆశ్చర్యపడునటుల వేసియున్న తాళములు వీడిపోయెను. అంత అర్చకులతనిని సంభ్రమముతో లోనికి తీసుకొని పోయిరి. అన్నమయ్య భక్తి ప్రపత్తులతో దేవుని పూజించెను. అచటి అర్చకులు అతనిని వరప్రసాదుడని గుర్తించి చందన తీర్థ ప్రసాదముల నిచ్చిరి. ఆ దినము నుండియు బాలుడగు అన్నమయ్య, వేంకటేశుని కొలుచుచు, రాగయుక్తముగ నారాయణ నామ స్మరణము చేయుచు కాలము గడపుచుండెను.

---

11. అన్నమాచార్య చరిత్ర, pp. 17-18.
12. అన్నమాచార్య చరిత్ర, pp. 18-22.
13. అన్నమాచార్య చరిత్ర, p. 23.
14. అన్నమాచార్య చరిత్ర, p. 24.

తిరుపతికి వచ్చిన అన్నమయ్యకు ఎనిమిదేడులు.[15] అన్నమాచార్యుడు ఎనిమిదవ ఏట నుండియే కవిత్వము చెప్పినటుల పై అంశములు స్పష్టపరచు చున్నవి. ఎనిమిదవ ఏటనే దేవిపై శతకమును, వేంకటేశ్వర శతకమును రచించెను. ఇతడు తిరుపతియందే వైష్ణవ మతమును స్వీకరించెను. తిరుపతియందు స్వామిని సేవించుచు నివసించుచున్న అన్నమయ్య భక్తికి మెచ్చి వేంకటేశ్వరుడే మన విష్ణువను వైష్ణవ యతిచేత అన్నమయ్యకు వైష్ణవమత మిప్పించెనని ఈ గ్రంథము వలన తెలియుచున్నది.[16] వేంకటేశ్వరస్వామి అన్నమయ్య భక్తికి మెచ్చి వైష్ణవ యతికి స్వప్నమున కనిపించి అన్నమాచార్యుని రూపురేఖాదులను తెలిపి ఆ బాలుడు యతియొక్క గృహమున కరుదెంచునని తెలిపి, ఆ బాలునకు ముద్రా ధారణము గావించి వైష్ణవ మత మిప్పింపుమని తెలిపి తన ముద్రిక నిచ్చెనట.[17] ఆ మరునాడాయతి స్వామి ఆజ్ఞానుసారము నిత్యకర్మలను తీర్చుకొనిన తరువాత శంఖచక్రపు ముద్రలను తీసుకొని బయటకు వచ్చి వాకిట భగవంతుని కీర్తనము చేయుచున్న అన్నమయ్యను గాంచి పేరేమని ప్రశ్నించి ఆ బాలుడే అన్నమా చార్యుడని నిర్ధారణ చేసికొని ముద్రధారణము చేయించుకొమ్మని కోరెను. అన్నమయ్యయు 'కృతార్థుడ నైతినని' సంతోషముతో నొప్పుకొనగా, ఆ యతి అన్నమయ్యకు వేదమార్గాను సారముగ శంఖ చక్రాంకితుని చేసెను. అనంతర మాయతి అటగల వైష్ణవులతో భోజన మొనర్చి వారితో తనకు వచ్చిన స్వప్న వృత్తాంతమును వివరించెను.[18] ఆ తరువాత అన్నమయ్య తనను వెదకికొనుచు వచ్చిన తల్లితో స్వగ్రామ మేగెను. ఇచట గ్రంథపాతమైనది. వైష్ణవ యతి తన స్వప్న వృత్తాంతమును చెప్పుచున్న విషయము నగములోనే ఆగిపోయినది. ఆ తరువాత అన్నమయ్యకు స్వప్నమున వేంకటేశ్వరుడు కనపడి తల్లి మాటను త్రోసిపుచ్చరాదనియు, 'నీకు మేలు కలుగును. తల్లితో పొయిరమ్మని' తెలిపె ననియు కలదు.[19] కనుక ఈ రెండు అంశములకు నడుమ కొంత భాగము పోయి ఉండును.

వైష్ణవ మతమును స్వీకరించిన తరువాత అన్నమయ్య తిరుపతి యందు కొన్ని సంవత్సరములుండి యుండును. తల్లితో వెళ్లిన అన్నమయ్య 'నెలజవ్వనము మేన నిగురొత్తు'వాడు. తిరుపతికి వచ్చిన అన్నమయ్య ఎనిమిదేండ్ల బాలుడు. ఈ నడుమ కాలము తిరుపతిలో గడపిన అన్నమయ్యను వెదకికొనుచు తల్లి

15. అన్నమాచార్య చరిత్ర, p. 23.
16. అన్నమాచార్య చరిత్ర, p. 27.
17. అన్నమాచార్య చరిత్ర, p. 27.
18. అన్నమాచార్య చరిత్ర, p. 28.
19. అన్నమాచార్య చరిత్ర, pp. 28-29.

తిరుపతికి వచ్చి అన్నమయ్యను తనతో రమ్మని పిలచిన అంశము ఈ గ్రంథమునే పోయినటుల కనబడుచున్నది.

తల్లితో ఇంటికి మరలి వచ్చిన అన్నమయ్యకు తలిదండ్రులు వివాహ ప్రయత్నము చేసిరి. కాని ఎల్లప్పుడును హరినామ స్మరణమే తప్ప అన్య మెరుగని అన్నమయ్యకు తమ పిల్లల నిచ్చుటకు పెక్కుమంది తలిదండ్రులు నిరాకరించిరి.

'నేవేళ జూచిన నితడు శ్రీరామ
గోవింద హరి యను కొనుచుండుగాని'

ఆతడెక్కడ సంసారము చేయునని తమ పిల్లల నీయ మనిరి.

తన భక్తుని వివాహము కొరకు వేంకటేశ్వరుడే స్వయముగ ప్రయత్నించి నటుల కనపడుచున్నది. స్వామి ఆడపిల్లల తలిదండ్రులకు స్వప్నమున కనపడి అన్నమయ్య తన భక్తుడనియు, అతనికి పిల్లల నిమ్మని తెలిపెను.[20]

అన్నమయ్య కిరువురు భార్యలు. అతని తలిదండ్రులు, తిరుమలమ్మ అక్కమ్మ అను ఇద్దరు కన్యల తెచ్చి వివాహము చేసిరి.[21] ఈ గ్రంథము వలన అన్నమయ్యకు రెండు వివాహములును ఒక్కసారియే జరిగినట్లు తెలియుచున్నది. యోగియని తమ పిల్లల నివ్వ నిరాకరించిన వారొకేసారిరువురి నిచ్చి వివాహము చేయుట సంశయాస్పదముగ నున్నది. తిరుమలమ్మ మరణించిన తరువాత అక్కమ్మను వివాహము చేసికొని యుండును. ఈ విషయమున మనకెట్టి ఆధారములును లేవు.

అన్నమయ్య శఠకోపముని శిష్యుడు.[22] శఠకోపముని అహోబల మఠ ప్రతిష్ఠాపకుడు. వాల్మీకి రామాయణమును చదివిన అన్నమయ్యకు రామాయణ సంకీర్తనలు వ్రాయవలెనను బుద్ధి పుట్టి, రామాయణ సంకీర్తనములను రచించెను.[23] ఆ సంకీర్తనములు అన్నమయ్య కాలముననే బహుళ ప్రజాదరణము పొందినది.

ప్రజలచే పొగడబడుచున్న అన్నమయ్యను గూర్చి తెలిసికొని, టంగుటూరు పాలకుడును, సాళ్వ బాంధవాన్వయుడును అగు నరసింహరాయలు కానుకలతో అన్నమయ్యకడ కరుదెంచి, 'మాకు బుద్ధులు సెప్పి మా చేయు పూజ చేకొని మమ్ము రక్షింపరే'యని[24] ప్రార్థించి, టంగుటూరునకు గొనిపోయెను.[25] అన్నమయ్య గావించిన హితోపదేశములను శిరసావహించుచు దీవనలను గాంచుచున్న నరసింహ

20. అన్నమాచార్య చరిత్ర, p. 29.
21. అన్నమాచార్య చరిత్ర, p. 29.
22. అన్నమాచార్య చరిత్ర, p. 30.
23. అన్నమాచార్య చరిత్ర, p. 30.
24. అన్నమాచార్య చరిత్ర, p. 31.
25. అన్నమాచార్య చరిత్ర, p. 31.

రాజు పెక్కు విజయములను గాంచెనట.[26]

మహానుభావునిగ గుర్తించి రాజే స్వయముగా నరుదెంచి భక్తిప్రపత్తులతో కొలిచి తనతో గొనిపోయి. సకలోపచారములు చేయుచు సకల సంపదలతో నున్న భవనము నిచ్చి, తన సంపదలు సమస్త మన్నమయ్యా వనియు,

'ఏపని గలగిన నెఱిగించి గాని
చేపట్టి తనయంత జేయక'

గౌరవించెనన అన్నమయ్యాకు అప్పటికి ప్రజలయందు మంచి పేరు ప్రఖ్యాతులుండి యుండును. తానెక్కడికి వెళ్లిన అక్కడికే అన్నమయ్యాను గొనిపోయెను రాజు. పెక్కు విజయములు గాంచిన తరవాత నరసింహరాజు టంగుటూరు నుండి తన రాజధానిని పెనుగొండకు మార్చుకొని, అన్నమయ్యాను గూడ పెనుగొండకు రప్పించుకొనెను.[27]

నరసింహరాజు అన్నమయ్యాను దైవ సంకీర్తనములను వినిపింపుమని కోరుచు, అన్నమయ్యా రంగైన రాగవర్ణములు రసస్ఫూర్తిగ వినిపంప, వినుచు ఆనందించుచు, అన్నమయ్యాకు కానుకల నిచ్చుచు గౌరవించు చుండెను.[28] అన్నమాచార్యుడు నివసించుటకై తన నగరి కడనే ఒక నగరు నిచ్చెను. నరసింహరాయల ఆదరము లభించిన అన్నమయ్యా రాజ సభామందిరమున కవి, గాయక, భూమీశుల నడుమ, స్వామిపై శృంగార కీర్తనములు పాడుచు అందరిని ఆనంద పరచు చుండెను.

భక్తి సంకీర్తనములు పాడుకొనుచు భగవంతుని భజింపుచు కాలము గడుపు చున్న అన్నమయ్యాను నరసింహరాయలు సభకు రావించి

'చెలులార వేంకట శిఖరి నాయకుని
కలికి గడగంట గనుపట్టు నెఱుపు
చెలువ యేగతి నుండె జెప్పరే'

అనిన—

"నలుపున బ్రాణేశు నాటిన చూపు
నిలువున బెఱుక మానిన శోణితంబు
తలపోయగాదు గదా"[29]

అను పదమును పలుమారు పాడించి, విని కవిత్వమన నిదియే కవిత్వమని మెచ్చి వేంకటపతి మీద నుడువు పదములరీతి తనపై నొక్క పదము చెప్పుమని కోరెను.

తన్నాదరించి స్నేహితునివలె మన్నించి గురువుగ గౌరవించిన నరసింహరాజు

26. అన్నమాచార్య చరిత్ర, p. 32.
27. అన్నమాచార్య చరిత్ర, p. 32.
28. అన్నమాచార్య చరిత్ర, p. 32-34.
29. అన్నమాచార్య చరిత్ర, p. 37.

పలికిన పలుకులను విని, హరి కీర్తనయే తప్ప అన్యులను కీర్తించని, హరినే తప్ప మరియొకరిని వేడుకొనని అన్నమయ్య, ప్రభువైనప్పటికిని భయపడక హరి హరీ యని చెవులు మూసికొని

"హరి ముకుందుని గొనియాడు నా జిహ్వ
నినుగొని యాడంగ నేరదెంతైన
నను నెట్లు పలికితి నైచ్యంపు బలుకు
నాయచ్యుతుని దక్క నన్యుల వినుతి
సేయుట"[30]

అని రాజు కోరికను నిరాకరించెను. అంతియే కాక—

"నినునొల్ల నిటువంటి నీ పొందు నొల్ల
జనియెద వేంకటేశ్వరు గొల్వనేను"[31]

అని పలికి సభనుండి లేచి వెడలిపోయెను. అన్నమాచార్యుని భక్తి తత్పరతను గ్రహింపలేని నరసింహరాజు గర్వాంధుడై భటులచే అన్నమయ్యను పట్టించి తెప్పించెను. పట్టి తెప్పించి

"తన బాల్య సఖ్యంబు దలచి సంపదల
దనయంత వానిగా దనర జేసితిని
గర్వియై యొకమాట కావలెనన్న
గొబ్బున గోపించు కొన నేల వచ్చె
నీవేమి సేయుదు నిను నింత సేయు
నావల్ల నేరము నను నింత సేసి"[32]

అని కనులెఱ్ఱజేసి, భటులను పిలిపించి 'మూరు రాయర గండ' అను సంకెలను వేయించి చెఱసాల యందు పెట్టించెను. కాని వేంకటేశ్వర భక్తుడయిన అన్నమయ్య—

'సంకెల విడువేళ జంపెడు వేళ
సంకిలి ఋణదాత లాగెడు వేళ'[33]

అని వేంకటేశ్వరునిపై నొక సంకీర్తనమును చెప్పగనే సంకెలలు వీడిపోయెను. ఈ విషయమును వినిన రాజు అట కరుదెంచి—

"మాయురె నీవెంత మాయ పన్నినను
నేనేల పోనిత్తునిది నిక్కమైన

30. అన్నమాచార్య చరిత్ర, p. 37.
31. అన్నమాచార్య చరిత్ర, p. 37.
32. అన్నమాచార్య చరిత్ర, p. 37.
33. అన్నమాచార్య చరిత్ర, p. 38.

నేనుండి తిరుగ వేయించెద నిపుడు
కిదుకక నీదు సంకీర్తనంబునకు
నది వీడెనా నిజంబని యెన్నవచ్చు
నీపాలి దైవంబు నిన్ను నీ మహిమ
బాపురె యని మెచ్చి పాటింప దగును"[34]

అని పలికి అన్నమయ్యకు మరల సంకెలలు వేయించెను. అంత అన్నమయ్య తొల్లిటి వలెనే సంకీర్తనము చేయ సంకెలలు వీడిపోయెను. రాజు అన్నమయ్య మహాత్మ్యమునకు అచ్చెరువొంది తన మూర్ఖత్వమునకు పశ్చాత్తాపపడి అన్నమయ్య కాళ్లమీద పడి తన అపరాధమును క్షమింప వేడుకొని—

"నీవల్గిన నల్గు నీల వర్ణుండు
నీవు మెచ్చిన మెచ్చు నీరజోదరుడు
నాయర్ధమంతయు నన్నమాచార్య
నీయందె కంటిమి నిక్కంబు గాగ"[35]

అని పలికి భార్యాద్వితీయుడై బంగారు విరులతో అన్నమయ్యను పూజించి బంగారు పల్లకిపై నెక్కించి తానే స్వయముగ పల్లకికొమ్ము మోసెనట.[36] అంత అన్నమయ్య రాజు నను్గ్రహించి—

"అనుతాపమును జెంది తది కారణమున
మనుకొన్న యపరాధమును తొలుకొనియె
దనుజారి యింక నింతటి నుండి నీవు
నరహరి సంకీర్తనము సేయువారి
బరసమానులుగాగ బరికింప వలదు
మురవైరి కృతయుగమున సర్వజనుల
నిరత నిజధ్యాన నిష్టచే మెచ్చు
క్రతువుల త్రేతాయుగమున నర్చనల
బ్రతిలేని యట్టి ద్వాపరమున నలరు
నామూడు యుగముల ధ్యానాది విధుల
నేమేమి నరులకు నిచ్చు నన్నియును
జలజోదరుడు నిజ సంకీర్తనమున
గలియుగంబున నిచ్చు గావున నీవు
ప్రతిలేని వేంకటపతి మీద భక్తి

34. అన్నమాచార్య చరిత్ర, p. 38.
35. అన్నమాచార్య చరిత్ర, p. 39.
36. అన్నమాచార్య చరిత్ర, p. 39.

మహమ్మదీయులను ఓడించెననియు, ఈ గ్రంథమున వర్ణింపబడి యున్నది.

ఇతడు తిరుపతి దేవునకు పెక్కు గ్రామములను దానము చేసినట్లుల తెలియు చున్నది. చంద్రగిరి రాజ్యము నందలి 'వంజిప్పాక్కం,' 'మల్లియత్తై,' 'నెరులక్కుర్,' 'భిమాపురం' అను గ్రామములను ఇచ్చినటుల సత్రము నొక దానిని నిర్మించి నటుల తెలియుచున్నది.[41] వేంకటేశ్వరుని డోలోత్సవము ఐదు దినములు జరుగుటకగు ఖర్చుల నిమిత్తము 'దొమ్మర పత్తి' అను గ్రామమును కూడ ఇచ్చెను.[42] తన పేరున తన రాణి పేరున ఉద్యాన వనములను రెంటిని వేయించెను. దేవునకు ప్రతిదినము తన రాణి యైన రంగాంబపేర నాలుగు మారులు నైవేద్యము సమర్పించుటకు ఏర్పాటులను గావించెను.[43]

తిరుపతి దేవాలయమును బాగుచేయించు నిమిత్తమై, 'దుర్గసముద్ర' మను గ్రామమును, క్రీ.శ. 1472 వ సంవత్సరమున యిచ్చెను.[44] మెట్లదారికడ, (మొదట) శ్రీ నరసింహస్వామి ఆలయమును నిర్మించెను.[45] ఇతడింకను పెక్కు దానములను చేయించినటుల, మంటపములను నిర్మించినటుల తెలియుచున్నది. ఈ అంశము లీతని భక్తితత్పరతను వెల్లడిచేయు చున్నవి. ఈ సాళువ నరసింహరాయల కాలముననే, తాళ్లపాక అన్నమాచార్యులు తిరుపతి క్షేత్రమునందుండి సంకీర్తనములు రచించినటుల చరిత్ర వలన తెలియుచున్నది.[46] పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు 'జైమినీ భారతము' ని రాజున కంకిత మిచ్చెను.

**అన్నమాచార్యుని రచనలు :**

అన్నమయ్య, తిరుపతినాథుని సేవింపుచు 'శృంగార మంజరి' అను కావ్యమునురచించి వేంకటాచల వాసునకు అంకితమిచ్చెను. ఆ గ్రంథమును జూచి స్వామి—

"నాడుచు బతకమా కన్నుల జోల
పాడగ నాడెల్ల బసిబిడ్డనైతి
నాకృష్ణమాచార్య నాథ్యాత్మ వినుతి
రాకగొన్నాళ్లు విరక్తుండనైతి
జగతి నీశృంగార సంకీర్తనముల
కగపడిమంచి ప్రాయపు వాడనయితి"[47]

అని మెచ్చు కొనెనట.

---

41. S. Krishna Swamy Aiyangar, History of Tirupathi, pp. 9–11.
42. S. Krishna Swamy Aiyangar, History of Tirupathi, p. 12.
43. S. Krishna Swamy Aiyangar, History of Tirupathi, p. 29.
44. S. Krishna Swamy Aiyangar, History of Tirupathi, p. 31.
45. S. Krishna Swamy Aiyangar, History of Tirupathi, p. 32.
46. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, p. 345.
47. అన్నమాచార్య చరిత్ర, pp. 41-42.

పై వాక్యములందు పేర్కొనబడిన కృష్ణమాచార్యులు, కాకతి రెండవ ప్రతాప రుద్రుని కాలమునందుండెను. ఇతడు మహిమాన్వితునిగ వర్ణింపబడినాడు. ఇతడు సింహాచలక్షేత్రనివాసి. వచన వాఙ్మయ కర్తలలో మొదటివాడు. సంకీర్తన వాఙ్మయమును సృష్టించిన మొదటి కవి. సింహాచల వరాహ నరసింహస్వామి పేర అనేక సంకీర్తనములను రచించెను. ఇతడు 'చూర్ణికలను,' 'సింహగిరి నరహరి వచనములను,' 'శఠకోప విన్నపములను' రచించెను. ఇతడు గావించిన మహిమలకు ప్రతాపరుద్రుడు ఆశ్చర్యపడెనని ప్రతాప చరిత్రమున వర్ణింపబడియున్నది.[48]

మాకన్నల జోలను గూర్చి కృష్ణమాచార్యుల కంటెను ప్రాచీనమయి యుండు నని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "అది యెట్టిదో, యెక్కడేది కలదేమో తెలియ జాలకున్నారు. వాక్యము సరిగా నున్నదో లేదో కూడ తెలియదు. పతకమాక ఊరి పేరేమో ! అది పతాకమాకో లేక పతకమూరో, పాతకమూరో ఇంకేవో, ఆ యూరి వాడయిన అన్నలు అను గేయకవి జోలపాట రచించి యాడుచు నొండె స్వామి బాలుడై యాడగా నొండె బాడెడివాడని యర్థము కాబోలును. పతకమాక యన్నల జోల సుప్రఖ్యాత మయి తాళ్లపాక వారు మెచ్చినదయి యుండును"[49] అని వ్రాసిరి.

అన్నమాచార్యుడు యోగ వైరాగ్య శృంగార మార్గములలో ముప్పదిరెండు వేల సంకీర్తనములు రచించెను. రామాయణమును ద్విపద ఛందమున వ్రాసెను. ఈ గ్రంథము నేడలభ్యము, సంస్కృతమున 'వేంకటాద్రి మహాత్మ్యము' ను రచించెను. ఈ గ్రంథము విషయమై "వరాహ పురాణాదులలోనిదిగా సంఘటిత మయి పదునేడు పదునెనిమిది శతాబ్దముల పిదప తెల్గు పరివర్తనము వడసి ప్రాచీన తాళపత్ర ప్రతులు గలిగి యిప్పుడు నాగరాంధ్రాక్షరములలో ముద్రితమై వ్యాప్తి గాంచియున్న వేంకటాచల మహాత్మ్యము, నాడు తాళ్లపాక యన్నమాచార్యుడు రచించినది యయినను గావచ్చును."[50] అని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ అభిప్రాయమును వ్యక్తపరచిరి.

ఈ గ్రంథములు కాక 'శృంగార మంజరి' శతకములను పండ్రెండింటిని వ్రాసెను. సకల భాషలయందును ప్రతిలేని నానా ప్రబంధముల్ చేసెనట. ఇతడు సంస్కృతమున సంకీర్తన లక్షణము రచించినటుల, దానికి కుమారుడయిన పెద తిరుమలా చార్యుడు వ్యాఖ్య చెప్పినటుల, దానిని అనుసరించి తాను తెలుగు రచన చేసినటుల అన్నమయ్య మనుమడగు చిన తిరుమలాచార్యుడు చెప్పుకొనెను. ఈ గ్రంథము కానవచ్చుట లేదు.

---

48. కాసె సర్వప్ప శ్రీ సిద్ధేశ్వర చరిత్ర, pp. 159-160, ఏకామ్రనాథుడు, ప్రతాప చరిత్ర, p. 65.

49. అన్నమాచార్య చరిత్ర, పీఠిక, p. 57.

50. అన్నమాచార్య చరిత్ర, p. 46.

అన్నమాచార్యుని మహిమలు :

వేంకటేశ్వర భక్తుడయిన అన్నమయ్య పెక్కుమహిమల గావించినటుల వర్ణింపబడియున్నది. 'మరులుంకు' అను అగ్రహారమునందుగల మామిడి చెట్ల పండ్లను వేంకటేశ్వరస్వామికి నివేదించి అన్నమయ్య తానారగించెను. అవి పుల్లగా నుండుటచే పండ్లు పులిసెను. పండ్లు పుల్లనివైనందులకు స్వామిని తీయమామిడి పండ్ల చెట్లగ మార్చుమని ప్రార్థింప స్వామి అనుగ్రహమున నవి తీయమామిడిపండ్ల చెట్లాయెనట.[51] ఈ విషయమును విని ప్రజలును తమతమ కోర్కెలను తీర్పవేడు కొనెడివారు.

ఈ అంశమును తెలుపు అన్నమాచార్యుని సంకీర్తనమొకటి గలదు.

పరమాత్మ నిన్నుగొల్చి బ్రదికేము
నిరసపు జాలిజిక్కి వెతబడనోపము
మగడు విడిచినా మామడిదువని యట్లు
నగినా మనసు రోసినా లోకులు మానరు
తగిలేరు, పొగిలేరు, దైన్యమే చూపేరు
మొగమోటలను నేను మోసపోవ నోపను
పొసగ దేవుడిచ్చినా పూజారి వరమీడు
విసిగి నేవిడిచినా విడువరు లోకులు
కొసరేరు మూసరేరు కోరిక దీర్చుమనేరు
పసలేని పనులకు బడలనే నోపను
నుదుగుట తప్పినా నోముఫల మిచ్చినట్లు
కడగి వేడుకొన్నా గానిమ్మనరు లోకులు
తడవేరు తగిలేరు తామెశ్రీ వేంకటేశ
బుడిబుడి సంగాతాల బొరల నేనోపను.[52]

పై అంశమునీ సంకీర్తనము స్పష్టము చేయుచున్నది.

## అన్నమయ్య-పురందరదాసు

పురందరదాసు కర్ణాటభాషయందు వేలకొలది సంకీర్తనములు రచించెను. ఇతడు వ్యాసతీర్థుల వారి శిష్యుడని ప్రతీతి. అన్నమాచార్యుని విషయములు విని ఆతనిని దర్శింప వచ్చి అన్నమయ్య పాడగా సంకీర్తనములను విని, అన్నమయ్య వేంకటేశ్వరుని అవతారమే అని సన్నుతించెను. పురందరదాసు కీర్తనములను విని అన్నమయ్య, పురందరదాసు పాండురంగని అవతారమే యని సన్నుతించెనట.[53]

51. అన్నమాచార్య చరిత్ర, pp. 43-44.
52. అన్నమాచార్యుల ఆధ్యాత్మ సంకీర్తనలు, 232 రేకు.
53. అన్నమాచార్య చరిత్ర, pp. 44-45.

అన్నమాచార్యుని వార్ధక్యమున పురందరదాసు చాలా చిన్నవాడయి దర్శింప వచ్చి యుండును.

ఈ అంశములే కాక అన్నమాచార్యుని సంతానము విషయము కూడా ఈ గ్రంథము వలన తెలియుచున్నది. అన్నమాచార్యునకు నరసమాచార్యుడు, తిరుమలాచార్యుడు, అనుపుత్రులు గలరనియు, వారు విద్యా విశారదులనియు తెలియుచున్నది.[54] ఈ అంశముతో గ్రంథము ముగియుచున్నది. ఇది అన్నమాచార్య చరిత్ర.

అన్నమాచార్యుడు, అతని కుమారుడు రచించిన గ్రంథములు, రాగిరేకులపై వ్రాయబడి తిరుపతి దేవస్థానము నందు గలవు. ఈ కవి వంశీయులందరును కవులు, భార్యయగు తిరుమలాంబయును కవయిత్రియే. ఈ వంశీయులందరును వేంకటేశ్వరుని భక్తులు. అన్నమయ్య తనజీవితమంతయు వేంకటేశ్వరుని సేవయందును, సంకీర్తమునందును గడపెను. ఇతని జీవితచరిత్ర వలన ఈతనికి వేంకటేశ్వర స్వామి ప్రత్యక్షమయ్యెడి వాడని తెలియుచున్నది. ఇట్టి విషయములు మనకు అసంభవములనియే తోచును. ఇట్టి అంశములందలి సత్యాసత్యములను చర్చించుట కంటెను అది వ్యక్తిగతాభిప్రాయమునకు వదలివేయుట ఉత్తమము.

తిరుపతి యందు సంకీర్తన భండారము గలదు. ఇందు తాళ్లపాక వారి రచనలు గలవు. ఈ భండారము ద్వారమున కెడమ ప్రక్క అన్నమాచార్యుల విగ్రహము గలదు. కుడిప్రక్క పెదతిరుమలాచార్యుల విగ్రహమును గలదు.

మంగాపురమునందు చిన తిరుమలాచార్యుడు ఒక వేంకటేశ్వరస్వామి ఆలయమును నిర్మించి, అందు అన్నమయ్య విగ్రహమును నెలకొల్పెను.

కథాపురుషుని మనుమడే అన్నమాచార్య చరిత్రకు కర్తయగుటచే ఈ గ్రంథము నందలి అంశములయందు అతిశయోక్తులుండిన నుండవచ్చునుగాని అసత్యములుండుటకు అవకాశము లేదని చెప్పవచ్చును. సమగ్రముగ అన్నమాచార్యుని చరిత్రను సులభశైలిలో చెప్పబడిన ప్రామాణిక గ్రంథమిది. వర్ణనాధికము లేవియును లేక చరిత్రవలె సూటిగా కథమాత్రమే చెప్పబడిన గ్రంథమిది. దీనిని ప్రామాణికమైన చారిత్రక గ్రంథమని చెప్పవచ్చు. ఈ గ్రంథము వలన చిన్నన్న రచనా శిల్పమేమియు వ్యక్తమగుటలేదు.

తెలుగు నానుడులతోను, పలుకుబడులతోను, వైష్ణవభక్తి భరితములైన శృంగార సంకీర్తనములను రచించి 'పదకవితా పితామహుడని' బిరుదము గాంచిన అన్నమాచార్యుల జీవితవిశేషములను తెల్పిన తాళ్లపాక చిన్నన్న అభినందనీయుడు.

54. అన్నమాచార్య చరిత్ర, p. 46.

# 12. సాంఘిక చరిత్ర

సామాన్య ప్రజల అలవాట్లు, ఆచారములు, ఆలోచనలు, నమ్మకములు, జీవిత విధానము యిత్యాది అంశములకు సంబంధించిన వివరణమే సాంఘిక చరిత్ర. మనకు గల చరిత్రలలో రాజులకు, వారి పరిపాలనా విధానములకు, రాజ్యములకు, రాజకీయములకు సంబంధించినవే అధికముగ నున్నవి. కేవలము సాంఘిక చరిత్రను దెలుపు గ్రంథములు మిక్కిలి తక్కువ. ఇంక కావ్యముల మాట చెప్పనక్కరలేదు. అటులని మన కావ్యముల వలన ఆయా కాలముల యందలి సాంఘిక పరిస్థితులు తెలియుట లేదనరాదు. ఆదికవి నుండి ఆధునిక కవుల వరకు రచింపబడిన కావ్యములన్నిటి యందు నెంతయో కొంత కవి కాలము నాటి సాంఘిక స్థితి గతులు ప్రతిఫలించు చున్నవి. రాను రాను చరిత్ర యందు సామాన్యుని స్థానమునకు ప్రాముఖ్యము హెచ్చినది. రాచరికములు నేలకొరిగి ప్రజాస్వామ్య ప్రభుతలు నెలకొల్పబడుటతో 'దేశమంటే మనుజుల'న్న భావం, 'తాజమహలు నిర్మాణానికి రాయెత్తిన కూలీ యెవ్వడ'న్న భావం, మరింత వేరూను కొని సామాన్యుని జీవన విధానము ఒక ప్రత్యేకతమ నంతరించు కొన్నది.

గాలించి వెదకినను వల్లభరాయని క్రీడాభిరామము తప్ప, క్రీ.శ. 1700 వరకు, సామాన్యుల జీవన విధానమునకు అద్దము పట్టిన తెలుగు కావ్యము మరొకటి లేదనుట అత్యుక్తి కాదు. పదునైదవ శతాబ్దమునాటి ఓరుగంటి ప్రజా జీవితమును కవితా వస్తువుగ స్వీకరించిన క్రీడాభిరామము తెలుగువారి ఏకైక సాంఘిక చారిత్రక కావ్యము. ఈ కావ్యము నందలి విశేషములు ఓరుగల్లునకే పరిమితములు కావు. అవి నాటి తెలుగు దేశపు ప్రజా జీవన విధానము లనుట సముచితము. ఆంధ్రుల జీవన విధానమును అక్షర రూపమున మన కందించిన తొలి సాంఘిక చరిత్రకారుడు వల్లభరాయడు.

క్రీ.శ. 15 వ శతాబ్దపు ఓరుగంటి వైభవమును, నాటి సమకాలీన జీవనమును, సంచలనాత్మక చలన చిత్రము పగిది మన కనులముందు కదలునట్లు జేసిన వల్లభ రాయని క్రీడాభిరామము ఈ ప్రకరణమున చర్చనీయాంశము.

### క్రీడాభిరామము — వల్లభరాయడు

క్రీడాభిరామ కర్తృత్వమును గూర్చి పలువురు పెద్దలు పండితులు పలు

రకములైన అభిప్రాయములను వ్యక్తపరచి యున్నారు.[1] గ్రంథము వల్లభరాయ కృత క్రీడాభిరామ మనియే అచ్చువేయబడి యున్నది. నేనును ఇది వల్లభరాయ కృతముగనే గ్రహించు చున్నాను.

క్రీడాభిరామము వలన మనకు తెలియుచున్న చరిత్రాంశములు – వల్లభ రాయని వంశ వర్ణన, కాకతీయులనాటి ఓరుగంటి సాంఘిక జీవనము. ఓరుగంటి సంఘ జీవన మనుటకంటె ఆంధ్రదేశపు సాంఘిక చరిత్ర యని చెప్పవచ్చును.

## వల్లభరాయని వంశ చరిత్ర

క్రీడాభిరామ కృత్యవతారిక యందు వల్లభరాయని వంశ వర్ణన గలదు. కవి తన వంశ మూలపురుషుడు గాధిసుతుడైన విశ్వామిత్రుడని చెప్పుకొనెను. విశ్వామిత్ర గోత్రజుడు మంచన. మంచన పుత్రుడు చంద్రామాత్యుడు. ఇతడు కర్ణాటక దేశాధీశుడైన పెదబుక్కరాయల మంత్రి. ఇతని భార్య పోచాంబ. వీరి పుత్రుడు మంచనార్యుడు. మంచన భార్య తిప్పమ్మ. వీరికి సింగన, తిప్పన, మల్లన, చెన్నమంత్రి అను నలుపురు పుత్రులుదయించిరి. అందు సింగన కుమారుడు చంద్ర మంత్రి. రెండవ కుమారుడు మల్లన. మిరుతూరి పిట్ట మంత్రి పుత్రికయైన త్రిపురమను వరించెను. వారికి వల్లభ, లింగన, తిప్పన, సింగన, భైరవులను పుత్రులుదయించిరి. వీరిలో వల్లభన్నకు బైచమంత్రి, మల్లన, పోచన్న, తిప్పన అను నలుగురు పుత్రులుదయించిరి. రెండవ కుమారుడగు లింగన రెండవ హరిహర రాయల సైన్యాధిపతి. మూడవ కుమారుడు తిప్పన హరిత గోత్రుడయిన తిప్పనార్యుని కుమార్తె పెద్దమాంబను వివాహము చేసికొనెను. ఇతడు హరిహర రాయల రత్న భాండాగారాధ్యక్షుడు. సత్యవ్రతుడు. సత్కీర్తి వడసినవాడు. వినుకొండ దుర్గాధ్యక్షుడు. ఇతనికి బైచన, మల్లన తిప్పన అను పుత్రులుదయించిరి. అందు యోపూరునకు (ములికినాడు) తిప్ప మంత్రి వల్లభుడాయెను. అతని భార్య చందమాంబిక. ఇతడు రాయల నవరత్న భాండాగారాధ్యక్షుడు కూడ. ఈతని కూర్మిసుతుడు వల్లభుడు. ఆ వల్లభుడే ఈ గ్రంథకర్త. ఈ గ్రంథమున వల్లభుడు తండ్రి గుణగణములను పది పద్యములందు వర్ణించెను.

---

1. ఈ విషయమును వివరముగ తెలిసికొనగోరువారు రామకృష్ణ కవిగారి క్రీడాభిరామ పీఠిక, చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర మూడవ భాగము, వీరేశలింగము గారి కవుల చరిత్ర, బండారు తమ్మయ్యగారి శ్రీనాథ మహాకవి గుణతత్త్వ విచారము, డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి శ్రీనాథుఁడు (సిద్ధాంత వ్యాసము) ఆంధ్ర పత్రిక 1922 సంచిక, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగార శ్రీనాథము, క్రీడాభిరామ పీఠిక, కాకతీయ సంచిక, విజయనగర సామ్రాజ్యము నందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర చూడవచ్చును.



గ్రంథకర్త వంశ వృక్షము
విశ్వామిత్రుడు
మంచన
చంద్రామాత్యుడు (పెదబుక్కరాయల మంత్రి) భార్య పోచమ్మ
మంచన భార్య తిప్పమ్మ
సింగన
చంద్రమంత్రి
తిప్పన
మల్లన భార్య త్రిపురమ
చెన్నమంత్రి
వల్లభుడు
లింగన రెండవ హరిహర రాయల సేనాని
తిప్పన-భార్య పెద్దమాంబ వినుకొండ దుర్గాధ్యక్షుడు రెండవ హరిహరరాయల భాండారి
సింగన
భైరవులు
బైచన
మల్లన
పోచన
తిప్పన
బైచన
మల్లన
తిప్పన – చందమాంబ యోపూరు పాలకుడు రాయల నవరత్న భాండాగారాధ్యక్షుడు
వల్లభామాత్యుడు

పై అంశముల వలన వల్లభామాత్యుడు విశ్వామిత్ర గోత్రజుడగుటచే నియోగి బ్రాహ్మణుడని తెలియుచున్నది. ఇతని తాతలు తండ్రులు విజయనగర ప్రభువుల కడ భాండాగారాధ్యక్షులుగను, సేనాధ్యక్షులుగను ఉండిరనియు, వినుకొండ, యోపూరు దుర్గముల పాలించిరనియు తెలియుచున్నది. ఆ గ్రామ నామమే వీరికి తరువాతకాలమున గృహనామముగ నేర్పడి యుండవచ్చునని బండారు తమ్మయ్యగారు నిర్ణయించిరి. ఈతడు క్రీ.శ. 15 వ శతాబ్దపు ప్రథమ భాగమున నున్నట్లు చరిత్రకారుల అభిప్రాయము.

వల్లభరాయని పెదతండ్రులలో ఒకరైన సింగనమంత్రి హరిహరరాయల సేనాని. తండ్రి వినుకొండ దుర్గాధ్యక్షుడు. యోపూరు పాలకుడు. వీరు క్రీ.శ. 1377 నుండి 1404 వరకు విజయనగరమును పరిపాలించిన రెండవ హరిహరరాయల కడ నుండిరి. వల్లభుని కాలమున విజయనగరమును ప్రౌఢదేవ రాయలు పరిపాలించు చుండెను. ఇతని పరిపాలనాకాలము క్రీ.శ. 1423–1446. ఇతడే రెండవ దేవరాయలు. ఇతని కాలముననే శ్రీనాథుడు విజయనగరము సందర్శించెను.

## క్రీడాభిరామము

రావిపాటి త్రిపురాంతకుడు రచించిన ప్రేమాభిరామమును అనుసరించి రచింపబడిన ఈ క్రీడాభిరామము ఆంధ్రుల తొలి నాటకము. రెండవ ప్రతాప రుద్రుని కాలమువాడైన త్రిపురాంతకుని ప్రేమాభిరామము నేడలభ్యము. సంస్కృతమున రచింపబడిన ప్రేమాభిరామము కాకతీయుల సాంఘిక చరిత్రను తెలుపు వీధినాటకము. దశరూపకములలో ఒకటైన వీధి లక్షణములుగల దృశ్య కావ్యమిది. ఈ రూపకము ననుసరించి కావ్యపద్ధతిని వంశ వర్ణనాదులతో రచింప బడిన గ్రంథ మీక్రీడాభిరామము. తొలి తెలుగునాటకమైన ఈ ఏకాశ్వాస ప్రబంధము తొలి తెలుగు సాంఘికచరిత్రగా నలరారుచున్నది. ఈ గ్రంథమును గూర్చి పండితుల మధ్య జరిగిన తర్జన భర్జనలు మరే గ్రంథమును గూర్చి జరుగ లేదనుట అతిశయోక్తి కాదు.

ఈ గ్రంథమున క్రీ.శ. 15 వ శతాబ్దమునాటి ఏకశిలానగర స్థితిగతులు, నగర నిర్మాణ పద్ధతులు, ప్రజల ఆచార వ్యవహారములు, వృత్తి విశేషములు, ఆహార విహారములు, విద్యా వినోదములు, స్త్రీల విలాస విభ్రమములు, పాములాటలు, కోళ్ల పందెములు, పొటేళ్ల పందెములు, మైలారభటుల సాహస కృత్యములు, పలనాటి వీరుల గాథ, జూదగాండ్ర చర్యలు, వేశ్యాగృహములందలి విద్యా వినోద ములు, ఆచారములు మొదలగు పెక్కు విషయములు ప్రతిఫలించుచున్నవి. అంతియకాక ఆనాటి ప్రజల మూఢ విశ్వాసములు, దురాచారములు, సంప్రదాయ ములు వ్యంగ్యధోరణిలో విప్పిచెప్పినాడు వల్లభరాయుడు.

ఈ వ్యంగ్య వీధి నాటకమునకు రంగస్థలము 15 వ శతాబ్దపు తొలి భాగము నందలి ఏకశిలానగరము. నటులు కానల్నాటి బ్రాహ్మణ శ్రేష్ఠుడయిన గోవింద మంచనశర్మ. అతని వేడుక చెలికాడు టిట్టిభసెట్టి. కథావస్తువు ఓరిగంటి ప్రజా జీవితము.

"గతి పసికుండ! షట్చరణ! గానకళా కమనీయ! యోమధు
వ్రత! వికచారవింద వనవాటిక నేమిటికిం బరిత్యజిం
చితి వటవీ ప్రదేశమునఁ జెట్టులఁ జేమల నేమిగల్గునన్
రతి నిటు సంచరించెదవు? ప్రాఁబడిపోయెనె నీ వివేకమున్?
చేరవచ్చి వచ్చి దూరంబుగాఁ బోదు,
దాయవత్తు దవ్వు పోయి పోయి
మాటలింక నేల? మాపాలిటికి నీవు
మాయలేడి వైతి మంచిరాజ"[2]

అను కామమంజరి యొక్క ప్రేమలేఖను టిట్టిభసెట్టి చదివి వినిపింపగా, కామ మంజరిని కలిసికొనుటకు మంచనశర్మ సఖునితో పయనించును.

ప్రక్కలు వంచి, మునిపండ్లును బండ్లును రాచికొను చలికాలము. వేకువ జామునే గన్నేరు పూచాయ నీర్కావి దోవతి కట్టి గొజ్జంగి పూలరసముతో కలపిన గంగ మట్టితో లలాటమున బొట్టుపెట్టి, జరీగల పట్టు కండువా వలెవాటుగా ధరించి, తెల్లగా మెరయుచున్న జన్నిదముతో, అందమైన శిఖతో, చిరునవ్వు మోమున చిందులాడ సఖునితో ఏకశిలానగర ప్రవేశము గావించును మంచనశర్మ. ఉషోదయమును గాంచి, 'కామమంజరి నెమ్మోము కాంతివోలె' నున్నదని వర్ణించి, ఏకశిలానగరమున గల వెలిపాళెమున ప్రవేశించును. మిత్రునితో దినమంతయు నగరమున పరిభ్రమించి, వింతలు వినోదములు తిలకించి, రాత్రి కామమంజరితో సుఖముగ గడపును. ఇది ఇందలి కథాంశము. ఈ గ్రంథమున కథకు ప్రాముఖ్య మంతగా లేదు. కాని కథను మలచిన తీరునందు విలక్షణత గలదు. చలన చిత్రమును చూచు పగిది, కాకతీయుల ఏకశిలానగరమును టిట్టిభసెట్టి, మంచన శర్మలతో మనమును చక్షుఃప్రియముగ తిలకించి ఆనందింపవచ్చును. ఏకశిలా నగరము నందలి సర్వ చరాచర వస్తువర్ణితమైన ఈ క్రీడాభిరామము అనాటి జనుల నిత్య జీవిత విధానమునకు ప్రతిబింబము.

ఏకశిలానగరము - నిర్మాణ వైభవము - వింతలు - విశేషములు

"సప్తతాళ విష్టప మహా ప్రస్థాన
ఘంటా పథంబైన గనప పరిఖ,

2. క్రీడాభిరామము, ప. 39-40, p. 7.

తారకా మండల స్తబకావ తంసమై
కనుచూపు గొనని ప్రాకార రేఖ,
పుంజీభవించిన భువనగోళము భంగి
సంకులాంగణమైన వంకదార,
మెఱుఁగు ఱెక్కలతోడి మేరు శైలముఁ బోలు
పెను బైఁడి తలుపుల పెద్ద గవని—

మఱియును,

రాజమార్గంబు వారణ ఘటా ఘోటక
శకటి కాభట కోటి సంకులంబు
ధరణీ స్థలీ రజస్త్రస రేణు బహుళంబు[3]—

అయిన ఏకశిలానగరము, మైలసంత, మడిసంత, వెళిపాళెము, మేదరవాడ, మొహరివాడ, హాలికవాటిక, రాజవీథి, వేశ్యవాటిక, అని విభజింపబడినది. ఊరికి చివర వెలిపాళెముండెను. వేశ్యవాటిక మధ్య నుండెను. నిత్యము జనసమ్మర్ద ములగు రాజమార్గములుకాక కంతత్రోవలునుండెను. వెలిపాళెమున మైలసంత యుండెను. అందు దంతపుపెట్టెలందు పెట్టి సురభేత్రను రోమసంహారిణివంటి ఔషధములు విక్రయించెడివారు. విపణివీధులందు పుష్పలావికలు పుష్పములు విక్ర యించెడివారు. పురవీధులందు కరణకాంతలు సంపెంగనూనె నమ్ముచుండిరి. మొహరివాడయందు (సైనికులనివాసము) సౌచికులు (దర్జీపనివారు) ఉండెడివారు.

ఆంధ్రోర్వీశుని కోటపై ఆకాశమున కంటునాయనిపించు పెద్దగడియారము గలదు. ఈ అంశమువలన మన దేశమునను Tower Clock ల నుపయోగించు అలవాటుండెడిదని స్పష్టమగుచున్నది.

ఓరుగంటి నగరమున, ఏకవీరాదేవి, కాకతమ్మ, పోలేరమ్మ, భైరవుడు, మైలారదేవుడు, చముడేశ్వరి, మసానమ్మ, కొమరసానమ్మ (కుమారస్వామి) కాక తీయుల కులదైవతములైన కేశవస్వయంభూవులు, వీరభద్రేశ్వరులకు ఆలయములు గలవు. ఈ కేశవస్వయంభూ ఆలయముల మహాగోపురములు బంగారు కలశము లతో నిర్మింపబడినవి. కాకతీయులు పరమతసహిష్ణువులనుటకు నిదర్శనముగ, బౌద్ధులకొరకు ఒక విహారమును, తురుష్కుల కొరకొక మసీదును గలవు. తురుష్కుల ప్రాభవము కాకతీయుల నాటికే ఆంధ్రదేశమున మొలకెత్తినదనుటకు ఈ మసీదు నిదర్శనముగ నున్నది. ఈ ఆలయములేకాక పాండవులకొక గుడిగలదు. పలనాటి వీరులగాథ చిత్రింపబడిన భవనమొకటిగలదు. నాటి వీరపూజాప్రాముఖ్యము నివి తెల్పుచున్నవి.

ఏకవీరాదేవి, కాకతమ్మ, పోలేరమ్మ మొదలగు దేవతలకానాడు జాతరలు

---

3. క్రీడాభిరామము, ప. 112-114, p. 20.

చేసెడివారు. బవనీలు, మాలెతలు, కాపుస్త్రీలు, జక్కులపురంధ్రులు, అక్కలు, మైలారభటులు, మొదలగువారు చిందులు త్రొక్కుచు, తప్పెటలు తాళములు మ్రోయించుచు పాటలుపాడుచు వారి భక్తిని వ్యక్తముచేయుచుండిరి. పరవశముతో చేసిన వారినృత్యములు, పాడినపాటలు చూచువారికి సహితము వీరావేశమును కల్గించెడివి. జాతరలను చేయుటకు ముందు, పట్టణమధ్యభాగమున సింహధ్వజము నెత్తి, వేపకొమ్మలతో తోరణములుకట్టి అలంకరించెడివారు.

దేవతలకు జాతరలు జరుగుసందర్భమున పెక్కుచిత్రవిచిత్రములైన వినోదములు జరుగుచుండెడివి. మైలారదేవుని ఉత్సవమునాడు—

"అవఅవమందునెత్తిని చంద్రమల్లెల
చోద్యంపుగుండాలు చొచ్చువారు,
కరవాఁడియలుఁగుల గవపపాఁతల్లలో
నుట్టిచేరులుగోసి యుఱుకువారు
గాలంపుఁగొంకి ఁగంకాళచర్మముఁగ్రుచ్చి
యుడువీధినుయ్యెలలూఁగువారు,
కటికి పెన్నాళంబుగండగత్తెరపట్టి
మిసిమింతులునుగాక మ్రింగువారు,
సందులనుసాహసంబులు సలుపువారు
యెడమ కుడిచేతనారతులిచ్చువారు
సాహసమమూర్తిగైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలారవీరభటులు"[4]

ప్రజలకు వినోదము కూర్చుచుండిరి. ఈ ఉత్సవములందేయొక గొరగపడుచు—

"వెనుకకు మొగ్గవాలి కడువిన్ననువొప్పఁగఁదొట్టినీళ్లలో
మునిఁగి తవంతరస్థమగు ముంగర ముక్కునఁగ్రుచ్చుకొంచు లే
చెను, రసనాప్రవాళమున శ్రీమముగ్రుచ్చెను నల్లపూసపేరనుపమలీల."[5]

గొండ్లి యాడినదట, ఇట్టి ప్రదర్శనములానాడు సర్వసాధారణములు. ఇట్టి ప్రదర్శనములేగాక పర్వదినములందు, మేషయుద్ధములు, కోళ్లపందెములు, జరుగుచుండెడివి. ద్యూతముకూడ నాటిప్రజలు వినోదములలో ముఖ్యమైనది.

ఈ సజీవనిర్జీవద్యూతములు, అనాటి ప్రజలకు పర్వదినములందేకాక, నిత్యవినోదములుగ కన్పట్టుచున్నవి. తెల్లవారుటయే మొదలు వారీద్యూతములను నడివీధులలో ఆడుచుండిరి. జూదపుపిచ్చితో వీరు తమ సర్వస్వమును (పచ్చడములను సహితము) పోగొట్టుకొనుట జరుగుచుండెడిది. ద్యూతము వారికి వినోదముగ కాక

4. క్రీడాభిరామము, ప. 142, pp. 26-27.
5. క్రీడాభిరామము, ప. 144, p. 35.

వ్యసనముగ కన్పట్టుచున్నది. పర్వదినములందే కాక, ప్రతినిత్యము వీధులందు, పెక్కువినోదములు వింతలు జరుగుచుండెడివి: పాములాటలు, మేషయుద్ధములు, కోళ్లపోరు, గారడీవిద్యలు, పల్నాటివీరులగాథ గానము చేయుచు నాట్యముచేయుట, మొదలగునవి నిత్యము జరుగు వినోదములు. 'కూటికోసము కోటివిద్య' లన్నట్లు ఇవన్నియు ధనార్జనము కొరకు చేయుపనులు. ఓరుగంటి నగరమున పూటకూళ్ల ఇళ్లుండెడివి. అందు—

సందివిగ్రహయానాది సంపుటనల
బంధకీ జారులకు రాయబారియగుచు,
పట్టణంబుననిత్యంబు పగలురేయి
పూఁటకూటింట వర్తించుఁబుష్పశరుఁడు.[6]

అంతేకాదు ఆ పూటకూళ్లఇళ్లు ఆహారమునకు విహారమునకు కూడ పనికి వచ్చెడివి. ఆహారమనగా ఒక్కరూకకే—

"కప్పురభోగివంటకము, కమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెఁడు పంచదారయును, గ్రొత్తగఁగాఁచిన యాలనే, పెస
ర్పప్పును, గొమ్మునల్లనఁటిపండ్లును, నాలుగునైదు నంజులున్
లప్పలతోడఁగ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝలయింట."[7]

పెట్టెడివారు. తక్కిన పూటకూళ్లఇండ్లలో ఎట్టి భోజనమోధరవరలేవియో తెలియదు. విహారమునకు లక్ష్మనవజ్ఝల వారిఇంట మాత్రము—

"అఱుఁగౌను గుబ్బచన్నులు
మెఱుఁగుం గన్నులును గలుగు మెచ్చులనవలా
కుఱు బోదముండ రత్నము"[8]

లభించెడిది. ఈనాడును మన హొటళ్ళయందు పుష్పశరుడు వర్తించుచున్నాడనుట అతిశయోక్తికాదు.

మాచల్దేవి మధుమావతివంటి గొప్పవేశ్యలానగరమున నుండిరి. వారు ధనికు రాండ్రు. ఉత్సవసమయములందు, వారి గృహప్రాంగణములందు చందనముతో కలయంపిజల్లి, కాశ్మీరము ముగ్గులుపెట్టి, ఇందురజముతో రంగవల్లికలు దిద్దెడి వారట. పద్మములతోరణములు కట్టెడివారట. పట్టణమునగల పురుషులు సరసులు వేశ్యాలోలురు అయినప్పుడు, వేశ్యలు ధనికురాండ్రగుటయందు ఆశ్చర్యమేమున్నది. ఖ్యాతిగాంచిన వేశ్యఅయిన మాచల్దేవికొరకు ప్రతాపరుద్రచక్రవర్తి చిత్రమగు చిత్ర శాలనే నిర్మించి ఇచ్చెను. ఆచిత్రశాలయందు, దారుకావనమున శివుడు మునిపత్నుల చేరుట, కమలాసనుని రతిక్రీడావిశేషము, యమునానదీసైకతములందు గోపికలతో

6. క్రీడాభిరామము, ప. 157, p. 29.
7. క్రీడాభిరామము, ప. 166, p. 30.
8. క్రీడాభిరామము, ప. 168, p. 30.

గోపాలుని రాసలీలలు, పర్ణశాలయందు అహల్యాసంక్రందనుల సంగమము, తారాచంద్రులు, సత్యావతీపరాశరులు, మేనకావిశ్వామిత్రులుగల చిత్తజునిశౌర్య మెరిగించు చిత్రములు అలంకరింపబడినవి. మాచల్దేవి కళాభిమానము, సౌందర్య పిపాసమెచ్చదగ్గవి. ధనవంతురాండ్రయిన వేశ్యల గృహము లందు అద్దాలగదులును ఉండెడివి. వేశ్యలు వారివృత్తి ప్రారంభించుటకుముందు అద్దముచూచుట అను నియమమును పాటించెడివారు. మంచనశర్మకు, కామమంజరికి జన్మించిన మదనరేఖముకుర వీక్షావిధాన మీఅంశమును విశదపరచుచున్నది.[9]

ఈ గ్రంథమున ఓరుగంటినగరవిశేషములేగాక, తెలుగువల్లభుడైన శ్రీకాకుళేశ్వరుని క్షేత్రమున జరిగిన కొన్ని విశేషములు తెలియుచున్నవి. కామమంజరి 'ఇన్ని నాళ్లెటకేగితివ' ని మంచనను ప్రశ్నింప, శ్రీకాకుళమున జరిగిన తిరునాళ్ల విశేషములను తెలిపినాడు. అచట జరిగెడి తిరునాళ్లు కామక్రీడలకాటపట్టులు. పర్వకాలము లందు పరనారీసంగమాదుల్ భగవదనుమతింబాపముల్ కావట. ఈ క్రీడయందు పైచేయి విప్రవితంతువులది. ముఖ్యముగ వెలనాటి స్త్రీలు. వీరు వేశ్యలను మించిన వారట.[10]

అంతేకాక అట—

"జవరాలిఁబొడగన్న సన్న్యాసిపై నేయుఁ
దులసిలేఁ జిగురాకుఁదూపుమరుఁడు
వేదవిప్రునిఁగన్న విధవపై ఝుళిపించు
దర్భపల్లవహేతి దర్పకుండు
కటకారకులకన్యఁగనినహాళికుమీఁదఁ
బొదుచుఁ బూమునికోలఁబుష్పశరుఁడు
నాడింధమునిఁగన్ననాతిపైనేయును
నలరుఁజిచ్చుఅకోలనంగభవుఁడు.
బెరసివెన్నెలకాయంగఁబేరకమ్మ
పులినతలముల నాయాయికోలములెఱిఁగి
తాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
ననమ బాణుండు, తిరునాళ్లనన్నినాళ్ల"[11]

ఏకశిలానగరమున జారధర్మాసనముండెడిది. వేశ్యలొనర్చెడి అత్యాచారములకు కఠినమగు శిక్షలుండెడివి. "జుట్టుగొరిగించుట, ముక్కుసొణంబువరకు చెక్కుట, బోసినోరుగ పండ్లూడబొడుచుట, గూబలంటగచెవులగోయుట అనాదు

9. క్రీడాభిరామము, ప. 194-200, p. 34.

10. క్రీడాభిరామము, ప. 210-211, p. 36.

11. క్రీడాభిరామము, ప. 212, p. 37.

మోసముచేసిన వేశ్యలకు విధించిన శిక్షలు"[12] వేశ్యలవిషయమున నివి కఠినమగు శిక్షలేకదా! వారకాంతను తల్లి, దాసి, అక్క, చెల్లి అని పరిహరించుట విటధర్మము కాదట. యోగులును వేశ్యలతో సంపర్కము పెట్టుకొనెడివారు. సంతానార్థులైన యజమానులు, యక్షకన్యల అరాధనా నృత్యములను ఏర్పాటు చేసెడివారు.[13]

నూతనవ్యక్తులతో మాటలాడునపుడు తమగోత్రనామాదులను తెలిపి మాటలాడు ఆచారముండెడిది. సర్వదేవతారాధన ఉండెడిది. శకునములను పాటించెడివారు.

అనాడు కొందరు పురుషులు నిర్కావిమడుగుధోవతులు ధరించెడివారు. గొజ్జంగి పూనీటితో కలపిన గంగమట్టి లలాటమున కొందరు ధరింప, కొందరి కస్తూరి తిలకము తీర్చెడివారు. హస్తమునకు సన్నని పట్టుతోరము కట్టుకొనెడివారు. శిఖ వేసికొని, కేతకిపుష్పము తురుముకొనెడివారు. కిర్రుచెప్పులు తొడిగెడివారు.

కరణస్త్రీలు లోతొడలుమెరయునట్లుగ ఒంటిపొర చీరకట్టెడివారు. మొరవంక కడియములు, విచ్చుటాకుల దుద్దుకమ్మలను అలంకరించుకొనెడివారు. కర్ణాట కాంతలు ముసుగువేసికొనెడివారు. ముత్యాల కమ్మలుధరించెడివారు. కాపుస్త్రీలు తొగరుపుష్పముధరించి, గంధపుబొట్టుపై సింధూరము ధరించెడివారు. స్త్రీలుకంచెలు (రవికలు) వేసికొనెడివారు.

అనాడు పాములనాడించు వారుకూడ కస్తూరిబొట్టు పెట్టుకొనెడివారు. ఉరస్థలమున చందనము వ్రాసికొనెడివారు. చంద్రికవన్నెపాగ వెంద్రుకలతో కలపి చుట్టుకొనెడివారు. పాములను జన్నిదములుగ ధరించెడివారు.

వెలిపాకెమునందు, మేదరవాడయందు పసుపునూరుట, పిడకలు చేయుట, ఈళ్లనీర్చుట, బుట్టలల్లుట మొదలగు పనులు వీధులందు చేసెడివారు. వైభవోపేతముగ విరాజిల్లెడిఓరుగంటిలో పేదతనమును విరాజిల్లుచున్నదనుటకు, మాఘమాసమయినాలెక్కచేయక, శాలువను అమ్మిఎద్దును కొనుటనిదర్శనము.[14]

క్రీడాభిరామము క్రీ.శ. 15వ శతాబ్దమునాటి ఓరుగంటి జనజీవిత విధానమునకు దర్పణము. మొత్తముమీద ఈ గ్రంథము వలన అనాటి పురుషులలో నెక్కువ మంది జారులు, వేశ్యాలోలురు అనియు, విప్రవితంతువులు జారిణులనియు స్పష్ట పడుచున్నది. విప్రవితంతువుల ప్రసక్తి ఆనాడు విప్రులలో బాల్యవివాహములు విరివిగా జరిగెడివను అంశమును స్పష్టపరచుచున్నది. జారత్వము విరివిగా తిరునాళ్లలో జరుగుచుండెడిది. నాటిజనజీవితమునందుగల లోపములను, శకునములను పాటించుటను, ఎత్తిచూపు వ్యంగ్యాత్మకకావ్యము (Satire) క్రీడాభిరామము. ఇందు శకునములపట్ల, శీలముపట్ల, మతముపట్ల, గల విరుద్ధ భావములు వ్యక్తమగుచున్నవి. నంఘమును విమర్శించి, సంస్కరించునుద్దేశముతో ఈ గ్రంథమువ్రాసినట్లు

12. క్రీడాభిరామము, ప. 271, p. 49.
13. క్రీడాభిరామము, ప. 139, p.26.
14. క్రీడాభిరామము, ప. 262, p. 47.

కన్పట్టుచున్నది. శిష్టాచారసంపన్నమైన బ్రాహ్మణకులమున పుట్టి నీతిబాహ్యులై కాముకవ్యాపారమున నగ్రస్థాన మధివసించు కొందరిచర్యలు ఈ హేళన కావ్యావిర్భావమునకు హేతువుగ కన్పట్టుచున్నది. కాముకవ్యాపారులానాడు సంఘమున నియమోల్లంఘనములుచేసి నటుల స్పష్టపడుచున్నది.

ఒకవ్యక్తియందలిగాని, సంఘమునందలిగాని, సంస్థయందలిగాని లోపములను వ్యంగ్యరీతిని, హాస్యముజోడించి తెలుపుట వ్యంగ్యకావ్యకర్తలముఖ్యోద్దేశము. వల్లభరాయడును తన కావ్యమును అదేపద్ధతియందు మలచెను. కాకతీయులనాటి సామన్యజీవితము ఈతనికావ్యవస్తువు. నిజమునకు ఆనాటి సంఘమునందలి లోపములే నేటి సంఘమునందును గలవనుట నిర్వివాదాంశము. ఈ లోపములు ఎన్నిశతాబ్దములు గడచినను, ఎవరెన్నివిధముల సంస్కరించినప్పటికిని సర్దుబాటు కావేమో ! ఏదేశమైనను, ఏకాలమైనను మానవమనస్తత్త్వమొక్కటియే.

శకునాదుల నుల్లంఘించుటానాడును గలదు. నేడును కలదు. శకునాదులను పాటించుటయు నాడు కలదు. నేడును కలదు. యాత్రాస్థలములందు ఆత్యాచారములు జరుగుట ఎప్పుడునుగలదు. చూచుటకు పెద్దమనుష్యులవలె నగపడి, నిత్యముకాముకాది వ్యాపారములందు కాలము వెళ్లబుచ్చు, మంచనశర్మ, టిట్టిభసెట్టి, కరణబ్రాహ్మణులవంటి పెద్దలు, మానవులున్నన్నినాళ్లు ఉండెదరు. దైవనామస్మరణముతో, నిష్ఠానియమములతో కాలమువెళ్లబుచ్చవలెనని నంఘముచే నిర్దేశింపబడిన విప్రవితంతువులానాడు వేశ్యలకన్న మిన్నగ కాముక వ్యాపారము చేసినటుల ఈ గ్రంథమున విమర్శింపబడినది. అందరును అట్టివారనుట అనుచితము అట్టివారానాడేకాదు నేడును కలరు. వితంతువులానాడును నేడును పరనిందాపాత్రలే.

ఇక ఆనాటి పూటకూళ్ల ఇండ్లకు నేటి మన Boarding & Lodging హొటళ్లెంతమాత్రమును తీసిపోవుటలేదు. ఆనాటి సజీవనిర్జీవ ద్యూతములు, పాములాటలు, నేటికిని మనకు వినోదములే. ముఖ్యముగ కోళ్లపోరులు, గొఱ్ఱెయుద్ధములు పర్వదినములందు నేడును వినోదములేకదా !

సంతలు, బజారులు, మేదరవాడలు, వెలిపాళెములు నేడును గలవు. పేళ్లను చూచుకొనుట, పసుపునూరుట, పిడకలుచేయుట, వీధులలో నూనెనమ్ముట, కవి వర్ణించిన విధముగ నేడును మనకు ఏకశిలానగరముననేకాక ప్రతి ఊరియందును కనబడును.

"పరివేష్టించి ప్రజాకదంబకముపై పై వ్రాలివీక్షింపఁగాఁ
బరహస్తంబున నొత్తుకాంగ్రుడునపలాపప్రౌఢిబోధింపఁ బా
మరులై పన్నిదమాడి యోడిమతిదుర్మానంబుతోనాటగో
ల్పరి.... ..."[15]

ఇట్టిజూదరులు,

15. క్రీడాభిరామము, ప. 97, p. 17.

"నీకు నౌ నీకు నౌనంచు నెమకి నెమకి
ముగుదలగువారి భ్రమియించు మోసపుచ్చు"[16]

దళారులు నేడును మనకు బజారులందు దర్శన మిత్తురు.

నాడును నేడును మానవులలో కొన్ని విషయములందు మార్పేమియును కన్పించుట లేదు. ఎన్ని సంస్కరణములు జరిగినను, ఎన్ని విమర్శనములు ఎదురైనను మార్పులేక యుండుట మానవ జీవిత అంతర్లక్షణము.

విలక్షణమైన ఇతివృత్తముగల ఈ గ్రంథమునకు ఆంధ్ర వాఙ్మయమున విశిష్టస్థాన మీయవచ్చును. పచ్చి శృంగార వర్ణనములు గల ఈ గ్రంథమును చదువరాదని కొందరి అభిప్రాయము. శృంగార వర్ణనములు శ్రుతిమించినప్పటికిని (కావ్య ప్రబంధములలో శృంగార వర్ణనములు లేవా) నవ్య భావములతో, చక్కని చిక్కని వర్ణనా వైచిత్రితో, విలక్షణమైన ప్రయోగములతో, పలుకుబడులతో, రసవంతముగ రచింపబడిన ఈ క్రీడాభిరామము ప్రతివారు చదువదగ్గది.

ఇంపగు పద నిర్మాణముతో రమ్యముగ నున్న వల్లభరాయని వర్ణనములు, సొంపగు వర్ణచిత్రముల పగిది మన కనులముందు సాక్షాత్కరించి మనస్సునకు హత్తుకొని పోవును. ఇది కేవలము వినోదము కలిగించు గ్రంథము కాదు. పదునైదవ శతాబ్దమునాటి సాంఘిక వ్యవస్థను తెలియజేయు చరిత్ర గ్రంథము, ఒకటి రెండు పాత్రలతో నడుపబడిన కథ గల ఈ వీధి నాటకము, ఆంధ్ర వాఙ్మయమున ప్రథమ సాంఘిక చారిత్రక కావ్యము.

అటు దేవతలకడ నుండి ఇటు వేశ్యల వరకు అది ఇది యననేమి వాడలు, మేడలు, సంతలు, శాలలు, జూదములు, పందెములు, జాతరలు, వీరులు, విధవలు, ఆటలు, పాటలు, వర్ణనా వస్తువులుగ గ్రహించి, 500 ఏండ్లకు పూర్వపు సంఘమును మన కనులముందు నిలుపు ఈ గ్రంథమునకు చారిత్రక గ్రంథములందు ప్రథమ స్థానము నీయవచ్చును.

ఈ గ్రంథ రచనయందు కవి ఆశయము సాంఘిక విమర్శ. ఇట్టి గ్రంథమున, నైష్ఠికుడును పరమ శృంగార పురుషుడైన మంచనశర్మ నాయకుడగుట, అతని వ్యంగ్య వర్ణనా వైచిత్రి, వల్లభరాయని పాత్రపోషణౌచితికి పరాకాష్ఠ. ఈ కవి విమర్శకు గురికాని అంశములు బహు స్వల్పములు. కావ్యనాయకుడైన మంచన శృంగార పురుషుడు. అతని దృష్టియందు ప్రతి అంశము శృంగార మయముగనే కనపడును. కాని ఆ శృంగారముతో మేళవింపబడి సూక్ష్మ పరిశీలనా క్రమము, వ్యంగ్య విమర్శనాదృష్టి ప్రతి వర్ణన యందును కనపడును.

సర్వ సాధారణముగా మంచి పనులను చేయుటకై శకునములను చూచుట మంచి ముహూర్తముల నిర్ణయించుట మన పూర్వ సంప్రదాయము. మంచన,

16. క్రీడాభిరామము, ప. 99, p. 18.

వేశ్యయగు కామమంజరి కడ కేగుటకై

"గార్గ్య సిద్ధాంత మతముషః కాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనః ప్రసాదాతిశయము
విప్ర జనవాక్య మరయంగ విష్ణుమతము"[17]

అని మంచి శకునముల చూచుట వలన ఇతనికి సంప్రదాయములనిన గల విముఖత్వము హేళన వ్యక్తమగు చున్నది. ఈ పద్యము శ్రీనాథుని భీమఖండము నందలి పద్యమునకు Parody కూడ. ఇట్టి Parody లు (హాస్యానుకరణములు) ఈ గ్రంథమున పెక్కులు గలవు.

రణరంగమున మరణించినవారు వీరస్వర్గము నందెదరనియు, వారి కట రంభాద్యప్సరసల సంభోగము లభించుననియు ప్రాచీనుల విశ్వాసము. ఆ విషయ మును పరిహసించుచు కోళ్ల పోరును వర్ణించుచు—

"హా! ఖగేంద్రంబులార కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతా భువనమునకు
మీరు రంభా తిలోత్తమా మేనకాది
భోగ కార్యార్థమై కోడిపుంజులార"[18]

అని ఉపమించి, హాస్యరసమునకు పతాక నెత్తినాడు.

ఈ కవికి గల నంఘ సంస్కరణాభిలాష, విప్రవితంతువుల జారక్రీడలు వర్ణించుట యందును, కరణ బ్రాహ్మణుని రసికత్వమును వివరించినపుడును కర్ణాటాంగన చేష్టలను విమర్శించినపుడును, శ్రీకాకుళమున తిరునాళ్లలో జరిగెడి విశృంఖల వ్యభిచారమును అభివర్ణించునపుడును, వ్యక్తమగుచున్నది. జూదమును చక్కగా వర్ణించిన వల్లభరాయనికి, జూదమనిన గల ఏహ్య భావము—

"………పాపద్యూత మీపన్నిదం
బంగీకారము సేయువారి మొలలం బ్రాపించు గౌపీనముల్"[19]

అనుటతో స్పష్టమగు చున్నది.

మన్మథ క్రీడను యుద్ధముగను కోడికూతను ధర్మదారగను ఉపమించిన ఈ కవి రచనా చమత్కృతి మెచ్చదగ్గది. ప్రౌఢమగు వర్ణనలతో స్వభావోక్తి సుందర ముగ, శృంగార రసపూరితమై, మనోజ్ఞమగు ఈతని ప్రతి పద్యమును చదివి ఆనందించుట బహుదా ప్రశస్తము. ఇతని రచన యందు ప్రతి వర్ణన ఒక నవ్యత్వము నాపాదించు చున్నది. కథావస్తువును గ్రహించుట యందు నూతనత్వ

17. క్రీడాభిరామము, ప. 66, p. 17.
18. క్రీడాభిరామము, ప. 236, p. 43.
19. క్రీడాభిరామము, ప. 98, p. 18.

మును పాటించిన వల్లభరాయుడు, కథను—

“దాననపుఁ బువ్వు చాయతోఁ బ్రస్తరించు
చుదయమయ్యె నదె చూడు మొదలి సంజ
సొబగు వీడినఁ గట్టెఱ్ఱ సోఁకినట్టి
కామమంజరి నెమ్మోము కాంతివోలె”[20]

అని సూర్యోదయ వర్ణనముతో ప్రారంభించి,

కలశ పాథోరాశి గారాపు నందన
కల్యాణములు మాకుఁ గలుగజేయు
కుసుమ కోదండుని కూరిమి మామ సౌ
ఖ్యాభ్యుదయంబు మా కాచరింపు
రాకావిభావరీ రమణీ మనోహర
సంతోషములు మాకు సవదరింపు
శౌరి పట్టపుదేవి కూరిమి సయిదోడ
యైశ్వర్యములు మాకు నాచరింపు
మనుచు గొజ్జంగి నీరను నర్ఘ్యమిచ్చి
పచ్చ కప్పుర మందంద బడసివైచి
మ్రొక్కి రనురాగ సంపద మీఱఁ బోవ
జార జాయాపతులు నిండు చందురునకు”[21]

అని చంద్రపూజా వర్ణనముతో ముగించుట యందును నవ్యత్వమును కనపరచినాడు.

“జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందుఁ దెనుఁగు లెస్స,
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాఁడు బిడ్డ మేలుగాదె”[22]

అని ‘దేశ భాషలందు తెలుగు లెస్స’ అని చాటి చెప్పిన వల్లభరాయుని విలక్షణ రచనా వైదుష్యమును, తెలుగు నుడికారపు ఇంపు సొంపులను, వ్యంగ్య రూప చిత్రణమును, వ్యంగ్యానుకరణమును, హాస్యానుకరణమును, ఎవరికివారు చదివి ఆనందించుట మేలు.

క్రీడాభిరామ ప్రాశస్త్యమును గూర్చి చెప్పవలెనన్న నిది ఆంధ్ర వాఙ్మయమున మొదటి సాంఘిక చారిత్రక గ్రంథము. మొదటి తెలుగు నాటకము. మొదటి వ్యంగ్య రూప చిత్రణము. మొదటి వ్యంగ్య హాస్యానుకరణ రచనము. వేయేల క్రీడాభిరామము పాఠకులకు మనోభిరామము.

20. క్రీడాభిరామము, ప. 62, p. 11.
21. క్రీడాభిరామము, ప. 292, p. 53.
22. క్రీడాభిరామము, ప. 37, p. 7.

# 13. ఉపసంహారము

ఇంతవరకు చరిత్రయొక్క పుట్టుపూర్వోత్తరములు, స్వరూపస్వభావములు, భారతీయుల చారిత్రక దృక్పథము, సంస్కృతాది భాషలలోని చారిత్రక కావ్యముల వివరణము, చారిత్రకకావ్య లక్షణములు మొదలగు అంశములను తెలిసికొంటిమి. క్రీ.శ. 17వ శతాబ్దము వరకు మనకుగల చారిత్రక కావ్యములందలి చారిత్రకాంశము లను, చరిత్రకారుల చరిత్రలతో పోల్చి తులనాత్మకముగ చర్చించుట జరిగినది. వీనితో పాటు ఆయా కవుల రచనావైదుష్యము, కవితావిశేషములు ; వారు వెల్లడించిన సాంఘికస్థితిగతులు, పరిపాలనాపద్ధతులు, ఆచారవ్యవహారములు మొదలగు పెక్కు అంశములు ఈ సిద్ధాంతవ్యాసమున చోటు చేసుకొన్నవి.

అనంతమైన సాహితీస్రవంతి కాలగతిలో క్రొంగ్రొత్త మార్పులను సంతరించు కొనుట సహజము. కావ్యరచనావ్యాసంగమున తెలుగుకవులు పెక్కుపోకడలు పోయిరి. వారు స్పృశించని కవితాప్రక్రియ లేదనుట అతిశయోక్తికాదు. ఇతివృత్త స్వీకరణమునందేకాక భాషయందు, ఛందమునందు అనేకములగు ప్రయోగములు చేసిరి. అట్టి ప్రయోగములలో చారిత్రకకావ్యసృష్టి యొకటి. చారిత్రక కావ్యరచన మున తెలుగు వారెవ్వరికిని తీసిపోరనుట నిస్సంశయము. ఇందుచర్చించిన చారిత్రక కావ్యములే దీనికి తార్కాణములు. ఇతివృత్తములు చారిత్రకములైనప్పటికిని రస పోషణము కొరకు కవులు, ఆయా కాలముల కవిత్వలక్షణములకు అనూచానముగ పెక్కు కల్పనలను చేర్చిరి. చారిత్రక పురుషుల వంశక్రమమును సూర్యునికో, చంద్రునికో, విష్ణువుకో, శివునికో, ముడిపెట్టిరి. కొందరు దేవతలను, మానవాతీత శక్తులను ప్రవేశపెట్టిరి. మరికొందరు చారిత్రక పురుషులను భగవంతుని అవతారములుగ వర్ణించిరి. అసంభవ విషయములను సంభవములుగను, సంభవ విషయములను ఉత్ప్రేక్షలతోను కొందరు తెల్పిరి.

చారిత్రకవస్తువును కావ్యవస్తువుగ స్వీకరించినప్పటికిని కొందరు పూర్వాపరము లను క్రమముగ తెలుపలేదు. ఈ క్రమలోపమునకు కావ్యరచనమునందే కాని చారిత్రక ప్రాముఖ్యముపట్ల శ్రద్ధలేకపోవుట కారణము కావచ్చును. కొందరి విషయమున చారిత్రకాంశములను సమగ్రముగ తెలిసికొను ఆసక్తిలేకపోవుటయో లేక ఆధారములు లభింపకపోవుటయో కారణమైయుండవచ్చును. తొలినుండిక్రమబద్ధమగు చారిత్రక కావ్య

రచనాప్రణాళిక లేకపోవుట మరియొక కారణము. రాజపోషణమునందున్న అనాటి కవులు స్వతంత్రించి తమదృక్పథమును చెప్పలేకపోవుట ఇంకొక కారణము. ఏది ఏమైనప్పటికిని తెలుగు సారస్వతమున చారిత్రక కావ్యములు ప్రత్యేకశాఖగ నేర్పడి తెలుగువారి చరిత్రను కావ్యరూపమున మనకందించినవి. క్రీ.శ. 17వ శతాబ్దము వరకు మనకుగల పెక్కు చారిత్రక కావ్యములందు ప్రామాణికత్వము లోపించినది. అయినను ఇవి విస్మృతమైన ఆంధ్రుల చరిత్రను తెలుపుటయేగాక చరిత్రకారులకు సహితము తెలియని కొన్ని నూతనాంశములను వ్యక్తపరచుచున్నవి.

జాతిచరిత్రచే ప్రభావితులై సాహిత్యముద్వార తిరిగి చరిత్రను కమనీయ కావ్యములుగ సృష్టించిన కవులు కడుంగడు ప్రశంసనీయులు. వారు సృజించిన చారిత్రకకావ్యములలోని చారిత్రకప్రామాణికత్వము కూలంకషముగ పరిశీలింప బడినది. అయా కావ్యములలోని విశేషముల వలనకొన్ని చారిత్రక సత్యములను వెలికిదీయు ప్రయత్నము జరిగినది. ఈ ప్రయత్నమున ఈ సిద్ధాంతవ్యాసము యెంత వరకు కృతకృత్యమైనదో సహృదయులు నిర్ణయింతురుగాక.

"విమలసాహససౌకుమార్యములు వెలయ
దిఙ్నితంబంబులందు చిత్రించినారు
తమ చరిత్ర విచిత్రపత్రములనాడు
తలపవెట్టులాజాతిచైతన్యమాంధ్ర."

(రాయప్రోలు)

# BIBLIOGRAPHY

A. Books of Special Study :


| | | | |
|---|---|---|---|
| అన్నమాచార్య చరిత్ర | : | చిన్నన్న, తాళ్లపాక<br>తిరుమల తిరుపతి దేవస్థాన<br>ముద్రణాలయము | 1966 |
| కాటమరాజు కథ | : | పిన ఎల్లయ్య, గంగుల<br>గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్<br>లైబ్రరీ, మద్రాసు | 1953 |
| కృష్ణరాయ విజయము | : | కుమార ధూర్జటి<br>వి. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్,<br>మద్రాసు | 1930 |
| క్రీడాభిరామము | : | వల్లభరాయుడు, వినుకొండ<br>వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్,<br>చెన్నపురి | 1953 |
| నవచోళ చరిత్ర | : | లింగన కవి, పోశెట్టి<br>ఆంధ్ర పత్రికా కార్యాలయము | 1923 |
| పల్నాటి వీరచరిత్ర | : | శ్రీనాథుడు, కొండయ్య, మల్లయ<br>విశాలాంధ్ర ప్రచురణాలయం,<br>విజయవాడ | 1961 |
| ప్రతాప చరిత్రము | : | ఏకామ్ర నాథుడు<br>శ్రీ నరేంద్ర సాహిత్యమండలి,<br>తణుకు | 1969 |
| పండితారాధ్య చరిత్ర | : | సోమనాథుడు, పాల్కురికి<br>వైజాగ్, పి.ఆర్.పి. | 1914 |
| బసవపురాణము | : | సోమనాథుడు, పాల్కురికి<br>ఆంధ్ర పత్రికా ముద్రణాలయము,<br>చెన్నపురి | 1952 |

| | | | |
|---|---|---|---|
| మన్నారు దాస విలాస నాటకము | : | రంగాజమ్మ, పసుపులేటి<br>ఆంధ్ర సాహిత్య పరిషత్తు, చెన్నపురము | 1926 |
| మన్నారు దాస విలాస ప్రబంధము | : | రంగాజమ్మ, పసుపులేటి<br>పే. మే. 246 డి. 216, ఎ. యు. లైబ్రరీ | |
| రఘునాథ నాయకాభ్యుదయము, ద్విపద, రఘునాథాభ్యుదయము యక్షగానము | : | విజయరాఘవ నాయకుడు<br>టి. ఎమ్. ఎస్. ఎస్. ఎమ్. లైబ్రరీ, తంజాపూరు. | 1951 |
| రామరాజీయము లేక నరపతి విజయము | : | వెంకయ్య, అందుగుల<br>వి. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు | 1923 |
| రాయవాచకము | : | విశ్వనాథ నాయకుని స్థానాపతి<br>కాకినాడ ముద్రాక్షర శాల | 1933 |
| వల్లభాభ్యుదయము | : | కోదండరామ కవి, భట్లపెనుమర్తి<br>యూనివర్సిటీ ఆఫ్ మద్రాస్ | 1940 |
| విజయరాఘవ కల్యాణము | : | దీక్షిత చంద్రుడు, కోనేటి<br>ఆంధ్ర విశ్వకళా పరిషత్తు | 1956 |
| విజయరాఘవ చంద్రికా విలాసము | : | వేంకటపతి సోమయాజులు, కామరస<br>ఆంధ్ర విశ్వకళా పరిషత్తు | 1956 |
| శ్రీ సిద్ధేశ్వర చరిత్రము | : | సర్వప్ప, కాసె<br>ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు | 1960 |

B. Books consulted :

| | | | |
|---|---|---|---|
| అఖిల భారత కవయిత్రులు | : | లక్ష్మీకాంతమ్మ, ఊటుకూరి | 1960 |
| అమరకోశము | : | పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారిచే పరిశోధితము<br>వావిళ్ల రామస్వామి శాస్త్రులు సన్స్, చెన్నపురి | 1912 |
| అళియ రామరాయలు | : | వీరభద్రరావు, చిలుకూరి<br>నాళం అప్పలనరసింహం అండ్ కో., రాజమహేంద్రవరము | 1931 |

| | | | |
|---|---|---|---|
| అముక్తమాల్యద | : | శ్రీకృష్ణదేవరాయలు<br>వేదం వేంకటరాయ శాస్త్రి అండ్ సన్స్,<br>మద్రాసు | 1964 |
| ఆంధ్రకవి తరంగిణి | : | (సం. 11 నుండి 12) శేషయ్య, చాగంటి<br>హిందూ ధర్మశాస్త్ర గ్రంథాలయం,<br>కపిళేశ్వరపురం | 1948 |
| ఆంధ్ర కవి సప్తశతి | : | వేంకటరమణయ్య, బులుసు<br>మద్రాసు | 1956 |
| ఆంధ్ర కవుల చరిత్ర | : | వీరేశలింగం, కందుకూరి | |
| ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము | : | సోమశేఖర శర్మ, మల్లంపల్లి<br>మద్రాసు | 1948 |
| ఆంధ్ర పత్రికలు | : | సంవత్సరాది సంచికలు<br>ఆంధ్ర పత్రికా ముద్రణాలయము,<br>మద్రాసు | |
| ఆంధ్ర ప్రభలు | : | సంవత్సరాది సంచికలు<br>ఆంధ్ర పత్రికా ముద్రణాలయము,<br>మద్రాసు | |
| ఆంధ్ర పరిషత్పత్రికలు | : | ఆంధ్ర సాహిత్య పరిషత్తు,<br>కాకినాడ | |
| ఆంధ్ర వాఙ్మయ చరిత్ర | : | నాగేశ్వరరావు, కాశీనాథుని<br>ఆంధ్ర గ్రంథమాల,<br>మదరాసు | |
| ఆంధ్ర వాఙ్మయ చరిత్ర | : | వేంకటావధాని, దివాకర్ల<br>హైదరాబాదు | 1967 |
| ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము | : | వెంకట నారాయణరావు<br>మద్రాసు | 1965 |
| ఆంధ్ర వాఙ్మయముపై శైవమత ప్రాబల్యము | : | సూర్యనారాయణశాస్త్రి, మల్లాది<br>విశాఖపట్టణము | 1941 |
| ఆంధ్ర విజ్ఞానము | : | మొదటి సంపుటము<br>భూపాలుడు, ప్రసాదరాయ<br>కాకినాడ | 1938 |
| ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము | : | సంపుటము 3, తెలుగు భాషా సమితి | |

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రుల చరిత్ర | : | వీరభద్రరావు, చిలుకూరి<br>విజ్ఞాన చంద్రికా బుక్ డిపో | 1912 |
| ఆంధ్రుల చరిత్ర సంస్కృతి | : | లక్ష్మీరంజనం, ఖండవల్లి<br>బాలేందు శేఖరం, ఖండవల్లి<br>మద్రాసు | 1965 |
| ఆంధ్రుల సాంఘిక చరిత్ర | : | ప్రతాపరెడ్డి, సురవరం<br>హైదరాబాదు | 1950 |
| ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర | : | బలరామమూర్తి, ఏటుకూరి<br>విశాలాంధ్ర ప్రచురణాలయం,<br>విజయవాడ | 1966 |
| ఆంధ్రులు – చరిత్ర | : | వెంకటరమణయ్య, నేలటూరి<br>హైదరాబాదు | |
| ఇందిరా మందిర సందర్శనము | : | జోగయ్య శర్మ, కె.<br>సరస్వతీ పవర్ ప్రెస్,<br>రాజమండ్రి | |
| ఉషా పరిణయము | : | రంగాజమ్మ, పసుపులేటి<br>తంజావూరు | 1955 |
| కాకతీయ సంచిక | : | రామారావు, మారేమండ<br>ఆంధ్ర హిస్టారికల్ రిసెర్చ్ సొసైటీ,<br>రాజమండ్రి | 1935 |
| కావ్యాత్మ | : | రాఘవ అయ్యంగారు, శే.వెం.<br>ఆంధ్ర గ్రంథమాల,<br>మదరాసు | 1934 |
| కావ్యాలంకార సంగ్రహము | : | సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం<br>మద్రాసు | 1969 |
| కొందరు తంజావూరు తెలుగు కవులు | : | సీతారామయ్య, కె. | |
| గృహలక్ష్మి | : | కేసరి కుటీరము,<br>మద్రాసు | 1956 |
| చరిత్ర రచన (పార్టు I) | : | వెంకటరమణయ్య, నేలటూరి<br>మద్రాసు | 1948 |
| తంజాపురాంధ్ర నాయక చరిత్ర | : | సీతారామయ్య, కురుగంటి<br>తంజావూరు | 1932 |

| | | | |
|---|---|---|---|
| తంజాపురాంధ్ర సాహిత్య చరిత్ర | : | సత్యవతి, కొక్కొండ<br>జయంతీ ప్రింటర్స్,<br>రాజమండ్రి | 1965 |
| తెలంగాణా శాసనములు | : | లక్ష్మణరాయ పరిశోధక మండలి,<br>హైదరాబాదు | |
| తెలుగు జానపద గేయ సాహిత్యము | : | రామరాజు, బిరుదురాజు<br>ఆంధ్ర రచయితల సంఘం,<br>హైదరాబాదు | 1968 |
| దక్షిణాత్యాంధ్ర సాహిత్యము | : | వేంకట రమణయ్య, నేలటూరి<br>మదరాసు | 1967 |
| దక్షిణాంధ్రయుగ వాఙ్మయ చరిత్ర (ప్ర.భా.) | : | వెంకటరామ నరసింహం, కాకర్ల<br>యమ్.యస్.ఆర్. మూర్తి అండ్ కో.,<br>విశాఖపట్నము | |
| ద్విపద వాఙ్మయము | : | నాగయ్య, జి.<br>యూనివర్సిటీ బుక్ సెంటర్,<br>తిరుపతి | 1967 |
| నిర్వచనోత్తర రామాయణము | : | తిక్కన<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ,<br>హైదరాబాదు | 1968 |
| ప్రబంధములు — అవతరణ వికాసము | : | వేంకట రామనరసింహం, కాకర్ల<br>ఆంధ్రా యూనివర్సిటీ,<br>వాల్తేరు | |
| పారిజాతాపహరణము | : | తిమ్మన, నంది<br>వావిళ్ల, మద్రాసు | 1910 |
| పాల్కురికి సోమనాథుడు | : | తమ్మయ్య, బండారు<br>సికిందరాబాదు | 1948 |
| భారతి | : | ఆంధ్ర పత్రిక ముద్రణాలయం,<br>మద్రాసు | 1926, 1955 |
| మన సంస్కృతి — చరిత్ర | : | నవోదయ సమితి,<br>హైదరాబాదు | 1960 |
| మన మతము — ప్రవక్తలు | : | సత్యనారాయణ, కప్పగంతుల<br>కథామాల ప్రచురణలు,<br>మద్రాసు | 1958 |

| | | |
|---|---|---|
| మనుచరిత్ర | : పెద్దన, అల్లసాని<br>మద్రాసు | 1926 |
| రాజగోపాల విలాసము | : కాళకవి, చెంగల్వ<br>మద్రాసు గవర్నమెంట్ ఓరియంటల్<br>సీరీస్, మద్రాసు | 1951 |
| వసుచరిత్ర | : రామరాజ భూషణుడు<br>మద్రాసు | 1946 |
| విజయనగర చరిత్రము | : రాఘవ చంద్రయ్య, దుగ్గిరాల | |
| విజయనగర చరిత్రము | : పేర్రాజు, నూతలపాటి<br>మద్రాసు | |
| విజయ విలాసము | : వేంకట కవి, చేమకూర<br>విశాలాంధ్ర బుక్ హౌస్,<br>హైదరాబాదు | 1968 |
| వీర రసము | : సుబ్రహ్మణ్యము, జి. వి.<br>సికిందరాబాద్ | 1961 |
| వీర శైవాంధ్ర<br>వాఙ్మయము | : రామకృష్ణశాస్త్రి, శిష్టా<br>శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్<br>ఇన్‌స్టిట్యూట్ స్టడీస్, నం. 6 | |
| శారదా ధ్వజము | : సత్యనారాయణరావు, యండమూరి<br>ఉత్తమ సాహితి, పున్నమతోట<br>విజయవాడ—2 | |
| శైవాచార సంగ్రహము | : తిరుమలనాథ కవి (సం) జి.జె. సోమయాజి<br>గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్<br>లైబ్రరీ, మద్రాసు | |
| సమగ్ర ఆంధ్ర<br>సాహిత్యము | : సంపు. 1–12, ఆరుద్ర<br>మద్రాసు | 1967 |
| సాహిత్య శిల్ప సమీక్ష | : లక్ష్మీకాంతం, పింగళి<br>తిరుపతి | 1966 |
| స్రవంతి | : దక్షిణ భారత హిందీ ప్రచారసభ,<br>హైదరాబాదు | 1969 |
| సంస్కృత కవుల<br>చరిత్ర | : సూర్యనారాయణశాస్త్రి, మల్లాది<br>మద్రాసు | 1933 |

Appadorai : The Substance of Politics. Oxford University Press. (Ninth Edition). 1961

Banerjee, R.D. : History of Orissa, Vol. I. R. Chatterjee, Calcutta. 1930

Bhandarkar, R.D. : Indian Culture, Vol. 6, The Indian Research Institute, Calcutta. 1939

Bhandarkar, R.G. : Early History of the Deccan Down to the Mahomedan Conquest, Chuckerverthy, Chatterjee & Co. Ltd., Calcutta. 1928

Bhandarkar, R.G. : Vaishnavism, Saivism and Minor Religious Systems, Verlg-von Karl J. Trubner, Strassburg. 1913

Bhargava, P.L. : India in Vedic Age, The Upper Indian Publishing House Ltd., Lucknow. 1956

Bhaskar Anand, S. : Ancient Karnataka, Oriental Book Agency, Poona. 1936

Bhaskar Anand, S. : Social and Political Life in Vijayanagara Empire Vol. II, Madras. 1934

Bhatnagar, K.B. : Advanced English Essays, Malhotra Brothers, Delhi. 1960

Bombay Gazetteer

Bulletin of the Govt. Oriental Manuscript Library Vol. XIII, Madras.

Butter Worth, A. : Formation of Madras, Hickmott & Co., Camberley, England 1937

Butter Worth, A. : Chetty Venugopal, V. Nellore Dist. Inscriptions 3 Vols., Madras. 1905

Carr, E.H. : What is History Penuin Books Ltd., Harmondsworth, Middlesex, England. (Reprinted) 1968

Collingwood, R.G. : The Idea of History Clarendon Press, Oxford. 1948

Desai, Dinkar : Mahamandaleswaras under the Chalukyas of Kalyani, Indian Historical Research Institute, Bombay. 1951

Dikshitar, V.R.R. : Nayaks of Tanjore.

Dunbar, (Sir) George : A History of India from the Earliest Times to the Present Day, I. Nicholson, London. 1936

Encyclopaedia Americana Vol. 14 : Americana Corporation, New York. 1944

Encyclopaedia Poetry and Poetics : Ed. Alex Preminger Princeton University Press. 1965

Epigraphia Carnatica Vol. III : Government Publication. 1923

Epigraphical Report No. 72 of the year 1929–30

Foster, William : Early Travels in India, Oxford. 1921

Foster, William : The English Factories in India, Oxford. 1913

Galbraith, V.H. : An Introduction to the Study of History, C.A. Watts & Co. Ltd., London. 1964

Gopalachari, K. : Early History of the Andhra Country, Madras University Historical Series No. 16. 1941

Gribble, J.D.B. (Ed.) : A History of the Deccan, London, Luzac. 1896

Gustavson, Carl G. : Preface of History McGraw Hill Book Company, New York. 1955

Heras, (Rev) Henry : Aravidu Dynasty of Vijayanagara, B.G. Paul, Madras. 1927

Heras, (Rev) Henry : Beginnings of Vijayanagara History, Indian Historical Research Institute, Bombay. 1929

Heras (Rev) Henry : Studies in Pallava History, B.G. Paul & Co., Madras. 1933

Hunter, W.W. (Ed.) : Imperial Gazetteer of India Vol. XIII, Clarendon Press, Oxford. 1908

Indian Epigraphy : Government of India Press, Calcutta.

Jewish Encyclopaedia Vol. VI, Funk & Wagnalls Company, New York.

Journal and Proceedings of the Asiatic Society of India, Third Series, Vol. V. 1939

Journal of Andhra Historical Research Society, Vol. VI, Ratan Press, Rajahmundry.

Journal of Indian History Vol. XVII, Part I to III, G.S. Press, Madras. 1938

Jouveau – Dubrevil, G : Ancient History of the Deccan Pondicherry. 1920

Kosambi, D.D. : An Introduction to the Study of Indian History, Popular Book Depot, Bombay. 1956

Krishnamachariar, M. : History of Classical Sanskrit Literature, Motilal Banarasidas, Delhi. 1970

Krishna Rao, B.V. : Early Dynasties of Andhra Desa.

Krishnaswamy, S. : The Tamil Country under Vijayanagara, The Annamalai University, Annamalai Nagar. 1964

Krishnaswamy Aiyangar, S. : Gangaikonda Cholas.

Krishnaswamy Aiyangar, S. : History of Tirupathi Vols. I & II, Madras. 1941

Krishnaswamy Aiyangar, S. : Manimakalai in its Historical Setting, London, Luzac. 1928

Krishnaswamy Aiyangar, S. : Sources of Vijayanagara History, Madras. 1919

Little, W., Fowler, H.W., Coulson, J. (Prepared by) : The Shorter Oxford English Dictionary, Clarendon Press, Oxford. 1933

Lukcas, George : Historical Novel, Trans. from German by Hannah & Stanley, Mirchell, Merlin Press, London. 1962

Mahatab, H.K. : History of Orissa, Vol. I (up to 1568), Prajatantra Prachara Samiti, Cuttack. 1959

Majundar, R.C. (Ed.) : Dynasties of Eastern Deccan Chap. VIII, The Cholas Chap. X, in (The struggle for Empire); The Kingdom of Vijayanagara Chap. XII in (The Delhi Sultanate) in the History and Culture of Indian People, Bharatiya Vidya Bhavan, Bombay. 1967

Malasekera, G.P. : (Trans.) Mahavamsa Pali Text Society, London. 1935

Meredith, George : Diana of Crossways Chap. I, Rev. Ed. Westminister A. Constable & Co. 1897

Muller, Max : History of Ancient Sanskrit Literature, B. D. Basu, Allahabad. 1859

Nilakanta Sastry, K.A. : A History of South India, Oxford University Press. 1966

Nilakanta Sastry, K.A. : The Colas, Madras. 1936

Nilakanta Sastry, K.A. : Sources of Indian History with Special Reference to South India, Asia Publishing House, Bombay. 1964

Nilakanta Sastry, K.A. and Ramanna, H.S. : Historical Method in Relation to Indian History, University of Madras. 1941

Nilakanta Sastry, K.A. and Venkata Ramanayya, N. : Further Sources of Vijayanagara History University of Madras. 1947

Powell, J.C. : A History of India, Thomas Nelson & Sons Ltd., London. 1955

Proceedings of the Deccan History Conference first (Hyderabad) Session. 1945

Puri, B.N. : A study of Indian History, Bharatiya Vidya Bhavan, Bombay. 1979

Qanungo, K.R. : Historical Essays, Shivalal Agarwala & Co., Agra.

Quarterly Journal of the Andhra Historical Research, The Part I.

Radha Kumud Mukherji : Glimpses of Ancient India, Bharatiya Vidya Bhavan, Bombay.

Ramachandrayya, O. : Krishnadevaraya of Vijayanagara, Andhra University, Waltair. 1953

Ranjit Singh, Satyasray. : Origin of the Chalukyas, Calcutta. 1937

Rice, E.P. : History of Kanerese Literature, Oxford University Press. 1921

Rice Lewis, B. : Mysore and Coorg from the Inscriptions, A. Constable & Co., London. 1909

Ross Denison (Sir) and Eileen Power : Ibn batuta, London. 1929

Sahu, N.K. (Ed.) : History of Orissa Vols. I & II Susil Gupta (India) Ltd., Calcutta, 1956. 1956

Sankaranarayana, P. : Values in History, Bharatiya Vidya Bhavan, Bombay.

Satyanadha Aiyar, R. : History of the Nayaks of Madura, Madras. 1924

Sewell, Robert : A forgotten Empire, (Vizayanagara) National Book Trust of India, New Delhi. 1962

Siddanta, N.K. : The Heroic Age of India, Alfred A Knopf, London. 1929

Sinha, S.K. : Medieval History of the Deccan, Government of Andhra Pradesh, Hyderabad. 1964

Sircar, D.C. : Successors of Satavahanas in Lower Deccan, Calcutta University. 1939

Smith, V.A. : Oxford History of India, Oxford. 1923

Somasekhara Sarma, M. : A forgotten Chapter of Andhra History, Madras. 1945

South Indian Inscriptions Vol. VI No. 248, A.R. No. 272 of 1897

Srikantaya, S. K. : Founders of Vijayanagar, Banglore. 1937

Srinivasanm, R. : Facets of Indian Culture, Bharatiya Vidya Bhavan, Bombay. 1962

Srinivasachari, P. (Ed.) : A Corpus of Inscriptions in the Telangana Districts of H.E.H. The Nizam's Dominions, Calcutta. 1940

Subrahmanya Aiyar, K.V. (Ed.) : Annual Report on South Indian Epigraphy, Government of India Central Publication Branch, Calcutta. 1930

Subrahmanyam, K.R. : The Maratha Rajas of Tanjore, Published by the author, Madras. 1928

Subrahmanyam, N. : The Administrative and Social Life of Sangam Tamils, Asia Publishing House, Bombay. 1916

Subrahmanyam, R. : The Suryavamsi Gajapathis of Orissa, Andhra University. 1957

Tagore, Rabindranath : Nationalism, Macmillian & Co. Ltd., London. 1924

Temple, (Sir) R.C. and Bhandarkar, R.D. (Ed.) : Indian Antiquary Vol. XLVII, Bombay. 1919

Theadore De Bary, Wm. (Ed.) : Sources of Indian Tradition Vol. I. 1964

Thomas, E.J. : Origin and Early History of Saivism in South India.

Thompson, J.W. : History of Historical Writing, Macmillan & Co., New York. 1962

Thurston, Edgar : Casts and Tribes of South India Vol. IV, Madras. 1909

Trevelyan, G.M. : History and the Reader, National Book League, London. 1945

Vaidya, C.V. : Epic India, Mrs. Radhabai Atmaram Sagoon, Bombay. 1907

Venkataramanayya, N. : Kampili and Vijayanagara, Christian Literature Society's Press, Madras. 1929

Venkataramanayya, N. : Studies in the History of the third Dynasty of Vijayanagara, Madras. 1935

Vriddagiresan, V. : Nayaks of Tanjore, Annamali Nagar. 1942

Yazdani, G. (Ed.) : The Early History of the Deccan Parts I–VI & VII–XI, Oxford University Press. 1960

Yule, (Sir) Henry : Travels of Marcopolo Vol. II, London, Murray. 1929